అభ్రక ప్రయోగము—శేషము ... వాతమునకు.
డిటో ... రక్తప్రమేహమునకు.
డిటో . బహుమూత్రమునకు.
డిటో ... మూత్రకృఛ్రకు
డిటో . క్షయకు
డిటో . . వీర్యవృద్ధికి.
డిటో ... వాంతికి.
డిటో ... మలగ్రహణికి.
డిటో ... అతిసారమునకు.
డిటో శీతవేకికి.
డిటో ... శీతజ్వరమునకు
డిటో ... శరీరము లెస్సగా నుండుటకు.

రసభస్మము.
పాదరసభస్మము.
రససిందూరము.
సౌభాగ్యరసము.
ప్రళయకాలరుద్రరసము.
బడబానలరసము.
అగ్నికుమారము.
ప్రాణేశ్వరరసము.
ప్రాణసంజీవనీరసము.
మృతసంజీవనీరసము
కాలకూటరసము.
కాలాగ్నిరుద్రరసము.
పంచవక్త్రరసము.
స్వచ్ఛందభైరవరసము.
సన్నిపాతభైరవము.
వాలుకాయంత్రలక్షణము
కాలాగ్నిరుద్రరసము.
నాగార్జునరసము.
ప్రతాపమార్తాండరసము.
రాజచండీశ్వరరసము.

శీతాంశుకరసము.
చాతుర్థికబడబానలరసము.
చాతుర్థిక కషాయము.
నారాచరసము.
సన్నిపాత విధ్వంసరసము.
లోకోత్తరరసము.
వాంతికి చికిత్స.
దాహతృష్ణకు.
ఛర్దితృష్ణకు.
దుర్బలదేహులకు, గర్భిణీస్త్రీలకు
కషాయము
సన్నిపాతములకునస్యము.
సన్నిపాతాంజనము.
నారాయణతైలము
చేయియెండినందుకు చికిత్స.
కణితికి చికిత్స.
కుమారీతైలము.
అశీతివాతములకు చికిత్స.
శిరోవాతములకు చికిత్స.
ఊడెం వెంట్రుకలకు చికిత్స.

అర్ధావర్తమునకు చికిత్స.
అర్ధావభేదమునకు చికిత్స.
కూశ్మాండరసాయనము.
కుండల్యాదిలేహ్యము.
ఊర్ధ్వశ్వాసములకు.
పాలపాపజ్వరములకు చికిత్స.
రక్తపిత్తమునకు చికిత్స.
ధాత్ర్యాదిఘృతము.
శుక్లప్రమేహమునకు చికిత్స.
జలమేహమునకు చికిత్స.
పెద్దరోగమునకు చికిత్స.
కపాలవాతమునకు చికిత్స.
సంజీవినీరసము.
మూలవ్యాధికి చికిత్స.
కామిలకు వంగభస్మము.
తెల్లప్రమేహమునకు చికిత్స.
వత్సనాభిభేదములు.
వత్సనాభివర్గములు.
రసయోగ్యాయోగ్యములైన నాభులు.
నాభి యెకిరించు విధము.
ఎలుక, వెఱ్ఱినక్కకుక్క, పాము, కాటులకు చికిత్స.
ఉదరగుల్మ చికిత్స.
పారుటకు మందు.
గ్రహణికి మందు.
తామ్రభస్మము.
వెండిభస్మము.
గర్భము నిలుచుటకు చికిత్స.
కాసరోగమునకు చికిత్స.
స్త్రీసంగదోషమునకు చికిత్స.
గళరోగములకు చికిత్స.
అగ్నిస్తంభన.
పైత్యపాండువుకు చికిత్స.
చిరుముడుకు చికిత్స.
ఎలుకకాటుకు చికిత్స.
రోసపుంటికి చికిత్స.
అంటునాలుకకు చికిత్స.
చెవిలో నొప్పికి, చెవుడుకు చికిత్స.
ఛర్దికి గంజికాచే లక్షణము.
పంచగుల్మములకు చికిత్స.
(పా) పారివేకికి చికిత్స.
పాండువుకు చికిత్స.
బలుఘకు చికిత్స.
శూలలకు చికిత్స.
కోరివాతమునకు చికిత్స.
పారివేకికి చికిత్స.
కుంచేటి వెట్టికి చికిత్స.
రక్తకాసకు చికిత్స.
కడుపునొప్పికి చికిత్స.
వెఱ్ఱికుక్క నక్కలకాటులకు.
ఉగ్రపాండువుకు చికిత్స.
ఎండిపోయేపాపలకు చికిత్స.
వాతపుండ్లకు చికిత్స.
పెద్దరోగపు మచ్చలకు చికిత్స.
సర్వాంగవాతమునకు తైలము.
పెద్దరోగమునకు చికిత్స.
శోభలకు చికిత్స.
శ్లేష్మంతెగిపడుటకు చికిత్స.
పైత్యగుల్మమునకు చికిత్స.
కుష్టమచ్చలకు చికిత్స.
బహుమూత్రమునకు చికిత్స.
పురాణజ్వరతైలము.
చనుబాలకు చికిత్స.

చనుకుదురుకు చికిత్స.
ఒడలుపుష్టికి చికిత్స.
తేలుమందు.
స్త్రీవశ్యము.
తాళకశుద్ధి.
తాళకభస్మము.
స్వర్ణభస్మము.
ఉకుకభస్మము.
వంగ భస్మము.
ఇనుము భస్మము.
నేపాళశుద్ధి.
వీర్యవృద్ధి స్తంభన చికిత్స.
యోనిబిగువుకు చికిత్స.
నెరతిరుగుటకు.
శీత భేదికి.
పాముమందులు.
ఉర్లుపాముకు మందు.
చరాచర విషములకు మందు.
పొడకు అంజనము.
పెనుపొడకు మందు.
పొడపామువావుకు మందు.
పొడకు నస్యము.
పెంజెరవిషమునకు మందు.
ఆదివారము కరచినపాముకుమందు
సోమవారము కరచినపాముకు మందు.
మంగళవారము కరచినపాముకు మందు.
బుధవారము కరచినపాముకు మందు.
గురువారము కరచినపాముకు మందు.
శుక్రవారము కరచినపాముకు మందు.
శనివారము కరచినపాముకు మందు.
స్థావరజంగమ విషములకు మందు.
విషముకక్కినవారికి మందు.
తేలుకు మందు.
ఎలుకకు మందు.
లోహసింధూరము మందు.
ఛర్దికి చికిత్స.
వాతఛర్దికి చికిత్స.
పైత్యఛర్దికి చికిత్స.
శ్లేష్మఛర్దికి చికిత్స.
దోషఛర్దికి చికిత్స.
సువర్ణమారణము.
పిప్పల్యాది ఘృతము.
శర్కరాది ఘృతము.
క్షుద్రాది లేహ్యము.
ఉల్లి లేహ్యము.
అష్టగుల్మ చూర్ణము.
నీలకంఠరసము.
స్త్రీసన్నికి చికిత్స.
హిరణ్యాగర్భరసము.
మదనోద్రేకమునకు చికిత్స.
ఇచ్ఛాభేది రసము.
హికరలకుధూవము.
నారసింహరసము.
నాభిశుద్ధి.
బాలాతిసారములకు చికిత్స.
ప్రాతపుండ్లకు.
అభ్రకనవనీతవస్తువు.
ఆదివైద్యప్రభావము.

మదనసన్నిపాతమునకు చికిత్స.
శులికోచకు చికిత్స.
స్త్రీదోషమునకు చికిత్స.
ముఖశ్రీకి చికిత్స.
రక్తప్రమేహమునకు చికిత్స.
ఒడలివాపునకు చికిత్స.
శుక్లస్తంభనమునకు చికిత్స.
కప్పసొనతీయువిధము.
బొట్టెలుబ్రదుకని స్త్రీకి చికిత్స.
రక్తబాడెలకు చికిత్స.

(వి-వి.)—

సంపూర్ణము. వ్రాఁత చక్కఁగా నున్నది. తప్పులు కలవు. క్రొత్తది.

ఇందు, రసరత్నాకరము, వైద్యచింతామణి, నాడీతత్త్వజ్ఞానము మొదలైన యనేకవైద్యగ్రంథములలోని రోగలక్షణములు, తత్తద్రోగనివారకములగు నౌషధయోగములును నేర్చి కూర్పఁబడినవి. సంస్కృత శ్లోకములు ; తెనుఁగు తాత్పర్యము. కొన్నియెడలఁ దెనుఁగు పద్యములును గలవు. ఇట్టి సంకరవైద్యగ్రంథము నెవరుకూర్చిరో యెఱుఁగ రాదు.

---

(b) చికిత్సాసారసంగ్రహము.

ÇIKITSĀSĀRASAṄGRAHAMU.

Foll. 169*b*—240*a*.

A treatise in medicine consisting of Sanskrit stanzas with Telugu meaning and of Telugu prose without Sanskrit original. The name of the author is not given.

Incomplete.

**Beginning :**

శ్లో. సారమేవ సమాహృత్య చికిత్సితమహోదధేః,
క్రియతే బాలబోధార్థం చికిత్సాసారసంగ్రహః.

టీక. చికిత్స లనియెడి సముద్రమువల్లను సారమును బుచ్చుకొని బాలులకు దెలిసేటట్టుగాను చికిత్సాసారసంగ్రహము చెప్పబడెను.

"తత్రప్రథమం హిత మాహారవిహారముచ్యతే"

ఆ చికిత్సాసారసంగ్రహమందు హితమైన యాహారవిహారములు చెప్పబడెను.

**End :**

రక్తప్రదరానకు :—

సురపన్నె పువ్వు తు ౧, మిరియాలు, తు ।, ఆవునేత వేది చినా పంచదార శే । (పావుశేరు) వేసి లెస్స మరించి పూట ౧ కి ఉసిరిక కాయ చొప్పున పుచ్చుకునేది.

పథ్యం :—

పచ్చిపెసరపప్పు పెండలం ఆవునెయ్యి ఆవుమజ్జిగ పులుసు అట్లకద్ద లియ్యవు అన్నము పుచ్చుకునేది. మిగలావేడి కారం మొదలయినవి మా వేది. పాత ఉసిరికపచ్చడి పుచ్చుకోవచ్చును.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాంత మంచిది తప్పులు కలవు. నూతనము గ్రంథపాత మొండొకయెడ జూపట్టుచున్నయది. ఇందు సంస్కృత శ్లోకములును వానికిఁ దెనుఁగు తాత్పర్యమును తెనుఁగున నె కొన్ని యోగములును గలవు. ఎవరుకూర్చిరో చెప్పట కాధారములు లేవు.

---

## R. No. 303.

Paper. $10\frac{7}{8} \times 9\frac{1}{4}$ inches. Fol. 52. Lines, 20 on a page. Mode of writing good but erroneous. In good condition.

Transcribed in 1916-17 from a manuscript of M.R.Ry. Lingam Venkata Rao Gāru of Ramabhadrapuram, Vizagapatam district.

ద్రౌపదీపరిణయము.

DRAUPADĪPARIṆAYAMU.

This Prabandha narrates the story of the marriage of Draupadī with the Pāṇḍavas. The author is Tirumalarāju Sūraparāju, son of Veṅkamāmba and Gaṅgarāju, and brother of Timmarāju and Sarvarāju of Dhanañjayagōtra. The author belonged to the kings of the lunar race and had five sons His capital was Gaṅgarājapaṭṭaṇamu. The work was dedicated to the author's teacher Kāṇḍūri Vēṅkaṭācārya, son of Kṛṣṇamāmbika and Telgāoārya of Bhāradvājagōtra, and a follower of Rāmānuja. The author's cousin brother Timmarāju is said to be a great poet

Complete in four Āśvāsas. On the 74 th page of this manuscript, it is stated that some leaves were missing in the original manuscript from which this had been copied.

**Beginning :**

శా. శ్రీకాంతాస్తనమండలీకలితకాశ్మీరాంగరాగార్పణ
ప్రాకట్యం బొకచేఁ ద్రపోత్తరపటప్రచ్ఛాదితత్వాణియు
స్వాకర్షం బొకచేఁ గపోలయుగళీకస్తూరికాపత్రికా
వ్యాలోచక్రియ రెంటఁ గాఁ గరయుగద్వంద్వాప్తసౌఖ్యాఢ్యుఁడై
మా కిచ్చుఁ గా హరి తొండురీగురుపదామందార్చనానందముల్

*   *   *   *

ఉ. చెన్నుగ భారతాగమ మశేషము నాంధ్రకవిత్వలీలలన్
మున్ను ఘటించి భావికవిముఖ్యుల కాత్మవిధంబు . . జబం
. . గడించునన్నయును దిక్కనకవీంద్రుని నెఱ్ఱప్రెగ్గడన్
వన్నెనజేతు మత్కృతి కవార్యశుభోన్నతి విస్తరిల్లఁగన్.

శా. శ్రీనాథార్యునిఁ బోతరాజకవిఁ బేర్మిన్ సోమునిన్ భీమునిన్
ధీనిస్తంద్రు ననంతు భాస్కరు వచోధిన్ బెద్దయామాత్యు ని
త్యానందంబున ముక్కుతిమ్మఘను రాధామాధవున్ మున్నుగా
నీనానావనిఁ గల్గునాంధ్రకవితాహేలాఢ్యులం గొల్చెదన్.

*   *   *   *

వ. అనియిష్టదేవతాప్రార్థనంబును . . . . గావించి యేనొక్కసత్కృతి . . . తెనుఁగునరచియింపం బూనియున్న ఘమయమంబున.

చ. తిరుమలరాజవంశజలధిస్ఫుటచంద్రుఁడు రాజనీతివి
స్తరపరిశీలి చారుకవి(తా)కవి(లి)తోన్నతిమేదినీ (?)
వరుఁడె యటంచు బంధుబుధవర్ణన లొప్పఁగఁ జారుకీర్తివి
స్ఫురణఁ జెలంగునాకు నొకబుద్ధి జనించెను పుణ్యసంపదన్.

సీ. ఉభయవేదాంతవిఖ్యాతితార్థరహస్య
భావనుఁ డత్యంతపావనుండు
చరమార్థసుద్వయతిరుమంత్రజాపప్ర
(వ)ర్తనుం డతిపుణ్యకీర్తనుండు
అఖిలదివ్యప్రబంధానుసంధానధు
రంధరుం డార్జవామంధరుండు
సంశ్రితానూనవిజ్ఞానదానకటాక్ష
వీక్షణుం డతిశుభలక్షణుండు

కలుషపరవాదిమండలాఖిలతమిస్ర
ఘస్రకరజాలవాక్ప్రౌఢికలితశాస్త్ర
బోధనాధాసుధాధికాపూర్ణశిష్య
జాలి కాండూరివేంకటాచార్యమౌళి.

ఉ. దేశికమౌళిరత్న మతిధీనిధి మానసపంకజాతసం
వేశిత ద్ధుజారమ (సింధుజావర) నవీనపదద్వయభృంగవల్లభుం
డాశుభమూర్తి వైష్ణవకులాగ్రణి సద్గురుఁడై దయార్ద్రభ
వ్యాశయభాసురాశిషము లన్వహముం దయసేయుచుండఁగన్.

* * * *

వ. ఇట్లు . . . వెలయుచు మదీయక్రియమాణమానిత ప్రబంధంబు సఫలంబుగా నస్మదాచార్యవర్యాంకితంబు సేయందలంచి తదనుగ్రహంబు వడయుటకై యున్నతాసనసుఖాసీనుం డైనయస్మహాత్ము పాదారవిందసమీపమ్మునం జేరి సవినయనిభృతుండ నై యిట్లంటి.

శా. స్వామీ తావకపాదపంకజయుగాత్తా(సక్తా)శ్రితశ్రేణి కా
సామర్థ్యంబు దురూహ్య మెట్లనిన యుష్మద్భూరికారుణ్యపీ
యూషమాహాత్మ్యంబుననే కదా యిపుడు మత్సామ్రాజ్యలక్ష్మీకవి
త్వామందోన్నతిసంప్రదాయగతిసంప్రాప్తంబు నైయొప్పెడున్.

* * * *

తరళ. తెనుఁగుపద్ధతి నే నెఱింగినతీరునం గృతి యొక్కటిం
గృతి రచింపఁగఁ బూని మీ కట పొల్పు మీఱఁగ నంకితం
బొనరఁ జేయఁగఁ గోరినాఁడఁ గృపోపశోభిత దీనికిన్
మొనయువేడ్కన్ ననుజ్ఞ యీవలె ముఖ్యమౌ గృతి యందుచేన్.

చ. అనవిని . . . . . . .
. . . యిట్లనిరి . . . ముమ్మరమ్ముగన్.

క. పరమోన్నతార్జునయశో
భరితుం డగునర్జునజనపతియన్వయమం
దిరవొందఁగ జనియించిన
నరవర నీ కీర్తిశోభనము లద్భుతమే.

వ. అదియునుంగాక భవదీయవంశసంజాతు లగుధరణీనేతలచరిత్రంబు లతివిచిత్రంబు లాకర్ణింపుము.

సీ. పాలమున్నీటిలోపల . . .

. . . . . .

. . . . . రేలరాజా.

* * * *

క. జనమేజయజనపతి నా
తనివంశము వెలసె ధరణితలమునబహుధా
జనవినుతకీర్తులచేతన్
ధనంజయసుగోత్రమున నితాంతప్రతిభన్.

వ. ఇవ్విధంబునఁ బ్రవర్తిల్లుచున్న యన్నరనాథునన్వయంబున.

సీ. ఏనరేంద్రునికీర్తి నానాదిశాంగనా
చికురమల్లీదామనికరశాలి
. . . తిరుమలరాజవంశ
పద్మవనహేళి తిమ్మభూపాలమౌళి.

* * * *

క. ఆరాజునకును బుత్రులు
శూరిబలుల్ తిమ్మరాజు కృష్ణరాజున్
ధారాళఖడ్గధారా
వారితదుర్వారవైరివారులుగల్గిరి.

వ. అందు . . . . .

* * *

శా. ఆతిమ్మక్షితిపాలమౌళికిని దిమ్మాంబన్యధీశుండుమి
ఖ్యాతిన్ సూరపరాజు గంగధరణీకాంతుండు రంగన్నయున్
బ్రీతిం గల్గిరి నల్వు రాత్మజులు నారీకాంతులై రాజవి
ద్యాతంత్రుల్ తనువు లహించిన యుపాయానీక (మో) గాయనన్

* * * *

గీ. వారిలో నగ్రజుండు దుర్వారశౌర్య
శాలి లాలితకీర్తివిస్తారయుతుఁడు
దండితారాతిధరాజక్ష్యమండలుండు
రాజనిభవైభవుండగు తిమ్మరాజు వెలయును.

సీ. ఆరాజు గనియె సింగావనీకాంతునిఁ
దిమ్మరాజేంద్రునతిప్రగల్భు
నందు సింగక్షితీశాగ్రణికిని గంగ
భూపతి తిమ్మభూభుజులు తనయు
లాగంగరాజు సింగాచలాధిపుఁ గాంచె
నిదిసింగధరణీతలేంద్రువంశ
మాతనియనుజన్ముఁ డైనతిమ్మనృపాల
కునకును ముగ్వురుకొమరులైరి
తిమ్మరాజును పెద్దధాత్రీవిభుండు
వేంకటమహీశుఁడును నన విపులయశులు
తిమ్మరాజాన్వవాయప్రదీప్తరాజ
లోక మీక్రియ నెగడె భూలోకమునను.

మ. తననామంబున గంగరాజపురినాఁ ద్రైలోక్యసౌభాగ్యమో
హనలక్ష్మీవిలసన్నికేతనతగణ్యప్రౌఢి జెన్నొందఁ బెం
పొనరంగా నిజరాజధానిగ సమగ్రోదారుఁడై వేడ్కఁ జే
సె నిలామండలి గంగభూవిభుఁడు కేలీనిర్జితారాతి యై.

శా. శ్రీరామాధరణీతలోదరులతోఁ జెన్నొందునమ్మాధవ
శ్రీరాజిల్లఁగ వేంకమాంబయును లక్ష్మీదేవియున్ వేడ్కఁ దే
వేరుల్గా నిజబాహుపీఠదృఢసంవేశావనీభారుఁడై
యారూఢోన్నతిఁ గాంచెఁ దిమ్మవిభుగంగాధీశుఁ డశ్రాంతమున్.

సీ. ఆమహీపతికి వెంకాంబికయందును
మువురుపుత్రులు జయోత్సవులు గల్గి
రతులసత్యప్రతిష్ఠాఢ్యవాక్పతురాన
నాకృతి తిమ్మభూలోకనేత
విక్రమాన్నత్యనిర్విష్టబలిప్రాజ్య
రాజ్యుండు సర్వధరావిభుండు
ఆర్యానురంజనార్థాంగసంశోభితై
రాజిల్లు సూరపరాజవరాళి

యనఁగ . . . .

. . . . . .

సమరుమూర్తిత్రయం బనా సమితగుణులు.

సీ. లావణ్యవతి యైనలచ్చమాంబికయందుఁ
దనయు లేవురు గల్గి రనఘయశులు
దుర్వారగర్వితాఖర్వారిపర్వత
గీర్వాణపతి పెద్దసార్వభౌముఁ
ర(డ)ంగభూలీలుండు రంగభూపాలుండు
అప్పలరాజు ధైర్యాద్రిరాజు
అతులితధృతిశాలి యైనవేంకటపతి
గురునందితవిహారిగోపశౌరి
యిట్టు తిరుపురుసతులం దహీనమతుల
సుతుల నెనమండ్ర దిగ్గజోన్నతులఁ గాంచి
యష్టపుత్రకబహుధనావాప్తి వెలయ
జగతిఁ బాలించె గంగరాజన్న శౌరి.

* * * *

ఉ. వారలయందుఁ దిమ్మనృపవర్యునికీర్తి

. . . . . . . . .

సీ. ఈ తిమ్మరాజున కెనయు సింగమయందు
సార్వజ్ఞ్యనిధి పెద్దజగ్గరాజు
రమణీమణీరతిరాజు వేంకటరాజు
కాంతినిశారాజు గంగరాజు
వరకీర్తికాంతుండు నరసభూకాంతుండు
ప్రకటసద్గుణతతి రామనృపతి
మహనీయశౌర్యసంపన్నుండు సూరన్న
గుణరత్నవారాశి గోపశౌరి
ప్రకటరంగద్భుజాస్ఫూర్తి రంగనృపతి
యనఁగ నెనమండ్రుసుతులు రూపాభిరాము
లార్యసమ్మతు లకలుషహారిమతులు
విదళితారాతిపీదు లభ్యుదితు లైరి.

వ. అందు.

ఉ. చక్రిఁ దనంబు

. . . దలరుఁ బెదజగ్గనృపాలుఁ డెంతయున్.

క. అతనికి సుతుఁడై వేంకట
పతి వితతనియతబాహార్జవని (?)
ర్జితవిమతనృపతి యింద్ర
ప్రతిముఁడు జనియించె నమితభాగ్యోన్నతుఁడై.

* * * *

క. ఈకరణి నాత్మభుజవం
శాకరము చెలంగ సత్యసంకల్పుఁడు ధ
ర్మైకరతి తిమ్మభూమీ
లోకాధిపుఁ డలరుఁ దన్నులోకము పొగడన్.

సీ. మాటలాడఁగ నేర్చు

. . . గంగరాజ

సర్వరాజు విలాసినీచారునయన
భాసురచకోరికాపూర్ణపర్వరాజు.

సీ. ఆసర్వభూజాని కాత్మజుల్గల్గిరి
కృష్ణమ్మయందును . . . రాయశాలు
శాంతిదాంతిక్షమాశౌర్యధైర్యసుధీవి
వేకాధిధుర్యుండు వేంకటపతి
అసమానరాజవిద్యాపరిశ్రమకళా
భంగవైభవుఁడైనగంగనృపతి
నిజరూపవైఖరీనిర్జితపంచాస్త్ర
రమణీయతకమూర్తిరామరాజు

. . . . . . . . . .

లగుచుమువ్వురుఁ గణ్యపుణ్యగుణఘనులు.

? క. ఆతిమ్మ(?) సర్వథీ
రాతలవల్లభులకును గరము ననుజుఁడవై
ఖ్యాతగతిన్ సూరధరి
త్రీతలవల్లభ తనించితివి భాగ్యనిధీ.

ఉ. శ్రీయును భూమిదేవి యు
. . . . బోలిరి యైననా
రాయణదేవి వేడుక కులాంగనగా వరధర్మవైఖరుల్
వేయువిధంబుల న్వెలయ విశ్రుత . . . సమ్మతా.

ఉ. ఆరమణీయశీలవతియందు జనించిరి "నీకు నందనుల్"
పౌరుషశాలి వేంకటనృపాలుఁడు ధీరుఁడు రామచంద్రుఁడున్
వీరగుణావతారుఁ డగు వేంకటరామవిభుండు తిమ్మధా
త్రీరమణుండు నయ్యజగతీపతిపంచనయాంగవైఖరిన్.

* * * *

క. మీసవతితల్లి లక్ష్మిసు
వాసిని సుతు లేవురును నవారితశౌర్యుల్
వాసిగ వారలలోపల
భాసిల్లును పెద్ద భూమిపాలుఁడు శ్రీలన్.

* * * *

క. ఆ పెద్దనృపాలునకును
దీపితశాత్రవవిఘాలదృఢశీలునకున్
రూపింప గఁ జినజగ్గ
క్ష్మాపతియును రాయనృపుఁడు గల్గిరి వేడ్కన్.

క. రంగన్న వారిజాక్షి
రంగన్నవమదనమూర్తి రాజిలు సిరులన్
శృంగారరసము తను వమ
రంగ న్నటియించులీల రాజోత్తముఁ డై.

ఉ. వారివివాహి యై వరఁగె నప్పలరాజు తదీయపుత్రులై
చారుయశుండు గంగనృపచంద్రుఁడు చార్తనమనోజ్ఞరూపవి
స్తారుఁడు పెద్దశౌరియును ధన్యతముల్ జనియించి రిర్వురున్
వారలశౌర్యవైభవము వర్ణన సేయ నశక్య మెంతయున్.

ఉ. వేంకటరాజశౌరికిని విశ్రుతకీర్తులు గల్గి రాత్మజుల్
పంకము మీఱ నిర్వు రతిపుణ్యుఁడు వేంకటరాజశౌర్యని
శ్శంకుఁడు గంగరాజు [illegible] సరసీజబాంధవై
ణాంకులు నామహీశతిలకాన్వ(యశత్వ)ములై ప్రశస్తిగన్(?).

క. గోపాలరాజు వైభవ
గోపాలుఁడు వెలయు రాజగోపాలకృపా
గోపాయితనిజసాంద్ర
శ్రీపరితోషితబుధప్రసిద్ధుండగుచున్.

* * * *

ఉ. ఏపున మీపురాతనమహీతలనాయకు లెల్ల రాజ్యల
క్ష్మీపరిణాహవైభవవిశేషవిలాసకళాసమస్తవి
ద్యాపటిమాభిరాములె కదా మఱి యందఱిలోన మిక్కిలిన్
మీపెదతండ్రిపుత్రకుఁ డమేయుఁడు తిమ్మనృపాలుఁ డన్నిటన్.

క. అనుపమకవిత్వవిద్యా
ఘనతయు మహనీయరాజకార్యోన్నతియున్
వినుతశ్రీసామ్రాజ్యము
పెనుపుగ విలసిల్లుఁ దిమ్మపృథివీపతికిన్.

* * * *

వ. అనియిట్లు . . . నాశ్రీవేంకటాచార్యరత్నం బను
గ్రహించి నియోగించిన నేను . . . నస్మదీయగురుచరణసర
సీరుహస్మరణపరిణాహంబుగా వింపుచు నుపక్రాంతప్రబంధనిర్మాణంబునకుం
దొడంగితి.

సీ. గరిమభారద్వాజవంశముని గోత్రవి
స్తారుఁడౌ కృష్ణమాచార్యమణికి
శ్రీపెరిందేవికిఁ జెల్మి లక్ష్మీకృష్ణ
మాంబికల్ భార్యలైనట్టి వేంక
టాచార్యమణియుఁ గృష్ణాంబికపతి లెల్లు
రాయదేశికుఁడును రమణఁ గల్గి
రాత్మజు లందుఁ దెల్లాచార్యవరునకు
ధృతిఁ గల్గె వేంకటదేశికమణి
సకలవిద్యాకళాపరిశ్రమవిశాలు
లుభయవేదాంతవిదులు దయోపశోభి
హృదయు లాశ్రితజనరక్షణేచ్ఛు లెపుడు
వరలుదురు మామకాచార్యవరులు గురులు.

* * * *

క. శ్రీకరభారద్వాజ
ప్రాకటగోత్రునకు ఘనకృపాపాత్రునకున్
శ్రీ కాండూరీకులర
త్నాకరవిధునకును వేంకటాచార్యునకున్.

వ. సమర్పితంబుగా నాయొనర్పంబూనిన ద్రౌపదీపరిణయం బను మహాప్రబంధంబునకుం గథాక్రమం బెట్టిదనిన.

చ. పరమమునీంద్ర నీవదనపద్మమునం జనియించుభారతా
పరిమితసత్కథామృతము బాగుగఁ గర్ణపుటాంజలిన్నిరం
తరమును గ్రోలఁ దీరదుగదా తనివైనను నందు ద్రౌపదీ
పరిణయలాలితోత్సవశుభంబు వినన్ మది యూరు సారెకున్.

* * * *

**End :**

వ. అని వైశంపాయనుండు జనమేజయునకుం జెప్పె నని సూతుండు శౌనకాదిమహామునులకుం జెప్పియిట్లనియె.

* * * *

క. ఎంబెరుమానారుకృపా
డంబరసంవర్ధితస్ఫుటశ్రీహరిపా
దాంబుజభక్తిసుధోదయ
శంబరరిపుతులితహరి చారుశరీరి.

* * * *

**Colophon :**

గద్యము. ఇది శ్రీమదిందిరాసుందరీసుందరసుందరచరణారవిందవందనామందానందభాగవతప్రసాదాసాదితసామ్రాజ్య కవితాభోజ ధనంజయగోత్రజలధిరాజ గంగరాజతనూజ తిరుమలరాజసూరవరాజప్రణీతంబైనద్రౌపదీపరిణయం బనుమహాప్రబంధంబునందు సర్వంబును చతుర్థాశ్వాసము.

(వి-వి.)—

సంపూర్ణము. నాల్గాశ్వాసములు. వ్రాంత సొంపుగా నున్నది. తప్పులున్నవి. నూతనము. మూఁడవయాశ్వాసమునఁ బాతము గలదు.

ఇందు శ్రీమహాభారతమునందలి ద్రౌపదీస్వయంవరపర్వము ప్రబంధరూపమున వర్ణింపఁబడియున్నది. ఇయ్యది తిరుమలరాజసూరవరాజు చే

రచియింపఁబడినది. ఇతనితండ్రి గంగరాజు ; తల్లి వేంకమాంబ ; తోఁబుట్టువులు తిమ్మరాజు, సర్వరాజు, వీరిది ధనంజయగోత్రము. చంద్రవంశీయరాజులఁట. ఈకవి కేసురు పుత్రులు గలరు వీరికి గంగరాజపట్టణము రాజధాని. ఈనూరపరాజు పెదతండ్రికుమారుఁడగు తిమ్మరాజును కవిత్వమందసమానప్రతిభ గలవాఁడఁట. ఇది కాండూరి వేంకటాచార్యులకుఁ గృతి చేయఁబడినది. ఏతద్గ్రంథకర్త యాయాంచార్యుని శిష్యుఁడు. ఈ యాచార్యునికి భారద్వాజగోత్రుం డగు తెల్లాచార్యుఁడు తండ్రి. తల్లి కృష్ణాంబిక; ఇతఁడు విశిష్టాద్వైతి.

---

## R. No. 304.

Paper. 11 × 9⅝ inches. Foll. 30 Lines, 20 on a page. Mode of writing, good but incorrect. In good condition

Transcribed in 1916–17 from a manuscript of M.R.Ry. Jayanti Jōganna Gāru of Hamsavaram, Tuni Taluk, Godavari District.

శ్రీరమణీమనోహరశతకము.

ŚRĪRAMAṆĪMANŌHARAŚATAKAMU.

Three hundred stanzas in praise of God Visnu who is addressed in each stanza as "Śrī-ramanīmanōhara". They are herein proposed to be written by the author whose name is not given.

Incomplete, containing 276 stanzās.

**Beginning:**

ఉ. శ్రీరమణీయపూజ్జలజసేవితము గ్నగమార్గపూరముఁగా
ఘోరితరంగమంగళనభోధునిజెల్లనునాలవాలముఁగా (?)
సారమరందవిస్ఫురితసారసముఁగా భవదంఘ్రియుగ్మముఁగా
గోరి భజింతు నెమ్మదిని గూరిమి శ్రీరమణీమనోహరా.

* * * *

చ. శతకము నూటపద్యములసంఖ్యను జెప్పితి సత్కవీంద్రు లో
వితతగుణాఢ్య నామదికి వేడుక పుట్టె శతత్రయంబు బెం
పతులితభక్తిఁ జేసి ముద మారఁగ నీకు నిత్తు (?)
నావెత లతివేగఁ ద్రుంచు మని వేఁడుదు శ్రీరమణీమనోహరా.

* * * *

**End :**

ఉ. పుత్రులు లేనివారలకుఁ బుణ్యగతుల్ పడయంగ లే దనన్
బుత్రులు లేని శ్రీశుకులు పుణ్యగతుం బడయంగఁ జాల రా? I
చిత్రము నీచరిత్రములు చెప్పఁగ నెవ్వఁడు నేర్చు నీదయే
పుత్రులుఁ బౌత్రులున్ ధనముఁ బుణ్యము శ్రీరమణీమనోహరా.

(వి-వి.)—

అసమగ్రము. ౨౭౬ పద్యము లున్నవి. వ్రాఁత యందమైనది. తప్పులు కలవు. గ్రంథపాతము లేదు.

"శ్రీరమణీమనోహరా" యను మకుటము గలవృత్తశతకత్రితయము రచియింపసమకట్టిన ట్లీ శతకకవి చెప్పికొన్నాఁడు. ఇతని పేరేదియో తెలియరాదు. ఇది విష్ణుస్తుతిరూపము.

---

## R. No. **305**.

**Paper.** $10\frac{3}{4} \times 9\frac{1}{4}$ inches. Foll. 12. Lines, 20 on a page. Mode of writing, fair but not quite correct Good.

Transcribed in the year 1916–17 from a manuscript of M.R.Ry. Venkatāchalam, Bhaṭlapenumarti, Divi Taluk, Kistna District.

(*a*) ధీరధీశతకము.

DHĪRADHĪŚATAKAMU.

Foll. 1*a*—8*b*.

A centum of stanzas containing Rēphaprāsa addressed in praise of God Rāma by Mōḍukūri Śaṅkarakavi.

Complete.

**Beginning :**

చ. సరసనిధీవిధీశబలశోషననిత్యసమాగసన్నిధీ
స్థిరసుకధీప్రధీకృతవిచిత్రబలాఢ్యదుర్యామహోహాదధీ
మురధి(రి)వధీదధీధన్నుతమష్టనివర్తనకృన్మనోరధీ
ధరశరధీరధీశనుతదాశరథీధరధీరధీరధీ.

* * *

చ. సుధవిస్మృతీర్ధతీంధ్రశత్రునూదర్ధదివ్యశ్వరీద్రధీధతీ
ధర్మణిక్షతీక్షతీప్తితతారకభామనుషుంత్రకక్షతీ

చిరసుగతిశ్రుతిచరితశ్రీమదనాంగతవైభవోన్నతీ
ధరశరధీరశీశనుత దాశరథీధరధీరధీరధీ.

**End :**

చ. సురుచిరసత్వదార్థముఁత్వత్ప్రతిపాదిత స్తవో (?)
తక్కరములు జెప్పినట్టిశతకంబుప్రసిద్ధిగ మోదుకూరి శం
కరకవివాంఛితంబు పాసంగఁ గృపఁజేసి వరం బొసంగుమీ
ధరశరధీ . . . . . . . .

(వి-వి.)—

౧౦౦ పద్యములు సంపూర్ణముగానున్నవి. వ్రాఁతయొకతీరుగను
న్నది. తప్పులు లేక పోలేదు. గ్రంథపాతము లేదు.

"ధరశరధీరధీశనుత దాశరథీధరధీరధీరధీ" యనుమకుటముగల
యీచంపకమాలావృత్త శతకము శ్రీరామస్తుత్యాత్మకము. దీనిని మోదు
కూరిశంకరకవి చేసెను. ఇదియంతట రేఫప్రాసము గలిగియున్నది.

---

(*b*) పదపంచవింశతి.

PADAPAÑCAVĪMŚATI.

Foll. 9*a*—12*a*.

Twentyfive stanzas in praise of the lotus-like feet of Śrī-Rāma, each stanza consisting of five feet instead of four, and containing at the end the words Mahāprabhū.

Complete.

**Beginning :**

ఉ. శ్రీకరమై సమస్తశుభచిహ్నాలతోడ విజృంభమాణమై
మాకరసారసంబులసమానసరాగసరూపయుక్తమై
యాకరణిం బ్రకాశిలుమదిచ్చ యొంటింగినకన్నతండ్రి వీ
వోకరుణాసముద్ర నయనోత్సవ మొందెద నయ్య పూర్ణభా
గ్యాకర మైనయట్టిభవదంఘ్రులు చూపఁగదే మహాప్రభూ.

* * * *

**End :**

ఉ. ఆమునిసర్వధర్మఫల మాత్మను లెస్స పరిత్యజించుచుఁ
వేమఱు నెవ్వఁడే నితరవేల్పుల వేఁడక మిమ్ముఁ గొల్చువాఁ

ధీమహిలోఁబవిత్రుఁ డతఁ డెంతదురాగతుఁడైన వెంతుమి
ష్యాహానువార లిప్పుడు ప్రసన్నులె. రైతిరి నమ్మవచ్చు మీ
దాముసు బౌరుషంబు భవదంఘ్రులు చూపఁగదే మహాప్రభూ.

(వి-వి.)—

సంపూర్ణము.

వ్రాఁతబాగుగనేయున్నది. తప్పులునుకలవు. పాతము లేదు.

"మహాప్రభూ" యనుమకుటము కల యీయిరువదియైదుపంచపాదవృత్తములచే శ్రీరాముపాదపద్మములు వర్ణింపఁబడినవి. కవియెవ్వరో తెలియరాదు.

---

## R. No. 306.

Paper. 11 × 9⅝ inches. Foll. 20. Lines, 20 on a page. Mode of writing, good but fairly correct. In good condition.

(a) భావసారసంగ్రహము.

BHĀVASĀRASAṄGRAHAMU.

Foll. 1a—14a.

Transcribed in 1916–17 from the manuscript of M.R.Ry. Tējōmūrtula Rāmamūrti Gāru of Srīrāmapuram, Vizagapatam District.

An astrological treatise in Prabandha form dealing with the influences of planets in their various conditions and aspects. It is said to have been compiled from various astrological works. The topics dealt with are given in the introductory portion of the work extracted below.

Incomplete.

**Beginning:**

క. జామిత్రకుఁ డగు రవి కుల
భామినులకు బ్రతుకు కొరతపఱచును మిగులన్
గాముకునిఁ జేయు జాతకు
నీమహి శాస్త్రజ్ఞు లెల్ల నేర్పడఁ దెలియన్.

మ. అలరున్ సప్తమరాశిభార్గవుఁడు సత్స్త్రాశ్వాత్మజాలోకయు
క్తులచే నున్నఁ గులాంగనారతుఁడు మందుం డున్నఁ జంద్రాత్మజుం
డెలమిన్ గల్గఁ ఖరాంగనారతుఁడు దేవేశార్యుఁ డారూఢుఁడై
లలితం బౌనిపుణత్వ మిచ్చు జగతిన్ లక్షింప నక్షాంతమున్.

* * * *

వ. సమగ్రంబుగా నాయొనర్పం బూనిన భావసారసంగ్రహం బను జ్యోతిషగ్రంథంబునకుం బ్రారంభం బెట్టిదనిన సర్వంసహావిస్తృతంబులగు జ్యోతిషగ్రంథంబు లనేకంబులుం గావునం దత్ఫలాఫలశోధనంబు దురవగాహం బగుటం జేసి ఏకగ్రంథార్థగ్రహణసంతుష్టత్వంబు నన్యగ్రంథంబులవిడిచి శుభాశుభనిర్దేశాభావం బని నిరసింతురు. తన్నిరసనంబు వాపుటకై స్వమతిపరిణామపర్యంతం బైనకృతప్రయత్నంబు నిర్దోషం బనితలంచి నా నేర్చువిధంబున ననేకగ్రంథార్థంబుల భూతలవ్యాప్తక (?)జాతకయుక్తిశుభాశుభంబు లేకీభవింపం జేసి యందు నిరూఢదృశ్యంబు లగుసకలభావఫలాఫలసంగ్రహణంబునకై రచియింపం బూనినదిగావున భావసారసంగ్రహం బనునామాంకితం బిడి యిందు సంక్షిప్తంబుగా రవ్యాదిగ్రహస్వక్షేత్ర నిర్ణయంబును దత్తిత్సహోదశాదిపరిమాణంబులును జరస్థిరద్విస్వభావోచ్చ నీచమూలత్రికోణరాశినిర్ణయంబులును శుభగ్రహ క్రూరగ్రహనిర్ణయములును దత్తదవలోకనాదికంబులును సకలభావస్థ్యత్యాధిపత్యగ్రహశుభాశుభ ఫలంబులును మనుధనభ్రాతృవాహనపుత్రశత్రుకళత్రాయుర్భాగ్యరాజ్య లాభవ్యయభావఫలాఫలంబులును, మేషవృషభయుగ్మకుళీరమృగేంద్రాంగ నాత్రాళీసరీసృపశరాసననక్రకుంభమీన రాశిసంభవయోగంబులును నిర్ణయించెద.

గీ. ఎత్తువన్నె మొదలుగాఁ బరీక్షసేయ
వలతి మణిహేమమూల్యముల్ దెలియురాఁడి
నభిరుచియు నిఘంటుముఖ్యజ్ఞతగల
యార్యులీకృతి యరయుట యుస్త్రదిచ్ఛ.

* * * *

**End:**

గీ. భాగ్యనాయకుఁ డష్టకభవనమునను
నున్న నాతనిదశలోన యోగహీన
మౌను దేవగురుఁడు భాగ్యపతి యగుచు
నష్టమంబున నున్నయోగంబు దెలియ.

(వి-వి)—

అసమగ్రము. వ్రాఁత బాగుగానే యున్నది. తప్పులును గలవు. గ్రంథపాతము లేదు.

ఇది యొక జ్యోతిషఫలగ్రంథము. పద్యకావ్యము. రచయిత యెవ్వఁరో తెలియరాదు. విశేషవిషయములు ఆద్యంతభాగములవలన

(b) ఖగోళస్వరూపము.

KHAGŌḶASVARŪPAMU

Foll. 15a—19b.

Transcribed in 1916-17 from a manuscript of M.R Ry. Vādrēvu Vīranna Gāru of Pātakōṭa, Ramachandrapuram Taluk, Godavari District.

An astronomical treatise dealing with the relative position of the planets and the lunar mansions, the orbit of the earth, the conjunction of the planets &c. The author is not known.

Incomplete

**Beginning:**

ఆధారకక్ష్యలు.

భూచక్రము రెండు ఆధారకక్ష్యలతోఁ జేరికొని యున్నది.

ఆకక్ష్యలలో నొకటి యూర్ధ్వాధోధ్రువల సంబంధించి చక్రవాళపర్వతము యొక్క పూర్వపశ్చిమదిక్పార్శ్వములగుండా నిర్గమించి చేరియున్నది.

రెండవదియు నూర్ధ్వాధోధ్రువల సంబంధించి చక్రవాళపర్వతము యొక్క దక్షిణోత్తరపార్శ్వములగుండ నిర్గమించి, చేరియున్నది.

నిరక్షదేశమునఁబట్టి వ్యవహరించినపక్షమందు ధ్రువలు దక్షిణోత్తరులౌటవల్ల నక్షత్రకక్ష్య పూర్వపశ్చిమాయత మౌచున్నది. ఇదేతీరున నితరస్థలములయందు నూహింపదగ్గది.

* * * *

**End:**

మేరువునకు బశ్చిమదిశలో నున్న జనలోకమునందునుండు వృత్తము అంభోవతీపురము మేరువునకుఁ బశ్చిమదిగ్భాగమున నున్న యీ అంభోవతీపురము సనందనాదులకును, ఊర్ధ్వరేతస్కులకును రాజధాని. వరుణదేవుఁడు ప్రభువు. శీతోష్ణాదిద్వంద్వసహులకును బరస్త్రీవర్జితులకును యీలోకప్రాప్తి.

మేరువునకు వాయవ్యదిగ్భాగమునఁ దపోలోకమునందుండువృత్తము అంజనావతీపురము మేరువునకు వాయువ్యదిగ్భాగమున నున్నయీయంజనావతీపురమునకు వాయుదేవుఁ డధిపతి

* * * *

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత యంతగా బాగుగ నుండలేదు. తప్పులు కలవు. క్రొత్తది.

ఇందు ఆధారకక్ష్యలు స్వస్తికములు, నక్షత్రకక్ష్య, అహోరాత్ర వృత్తములు, క్రాంతి, పరమపక్రమము, భూగోళము, వ్యోమకక్ష్య, జ్యోతిశ్చక్రము మున్నగునాకాశగోళముయొక్క విషయములు చెప్పఁబడినవి. కర్త యెవ్వరో తెలియరాదు. విశేషములు తెలియరావు.

---

R. No **307.**

**Paper. Size, 11 × 9⅜ inches. Foll. 26 Lines, 20 on a page. Mode of writing, good and not quite faulty. New.**

Trascribed in 1916–17 from a manuscript of Srī Rāja Vatsavāya Vēnkaṭasūryanārāyana Rāju Gāru of Bhīmavarapukōta, Tuni Taluk, Godavari District.

(*a*) హరిశతకము.

HARIŚATAKAMU

Foll. 1*a*—9*b*.

This is the same work as the one described under R. No. 269 (c) of the Triennial Catalogue of MSS., Volume II, Part III, with an additional stanza in the beginning.

Contains 102 stanzas of Kanda metre.

**Beginning:**

క. శ్రీకరముగఁ జెలువొందిన
సాకేతపురీశుఁ డైనజానకిపతినిన్
జోకతొఁ గొల్చెద నే నో
పాకారినుత ప్రసన్న ఫణిశయన హరీ.

* * * *

(వి.వి.)—

సంపూర్ణము. వ్రాఁత యొకతరబడిగా నున్నది. తప్పు లంతగా లేవు. శైథిల్యపాఠములు లేవు.

ఇది త్రై. క్యా. నెం. 269 న వర్ణితమైనదే. పొరఁబాటున నకలునందు ౮౯ వ పద్యము ప్రారంభపద్యముగా నుదాహరింపఁబడినది.

---

(*b*) కేశవశతకము.

KEŚAVAŚATAKAMU.

**Foll. 10*a*—20*a*.**

**Transcribed in 1916–17 from a manuscript of Śrī Rāja Vatsavāya Rājagōpāla Rāju Gāru of Bhīmavarapukōṭa, Godāvari District.**

**Aḍidamu Sannyāsikavi, son of Narasiṁhakavi, composed a centum of stanzas in praise of God Kēśava as given below.**

**Complete in 101 stanzas.**

**Beginning :**

ఉ. శ్రీరమణీముఖాబ్జసరసీరుహబాంధవ శక్రముఖ్యబృం
దారకవార్ధివార్ధిజ ముదంబున నిన్ను భజించెదన్ ననున్
గారవ మొప్పఁగన్ గరుణఁ గావుము భక్తసుఖప్రదాత రా
వారిరుహాయతేక్షణ కృపాయుతవీక్షణ కృష్ణ కేశవా.

* * * *

**End :**

ఉ. మంగళ మబ్ధిజారమణ మంగళ మాతతవిస్ఫురద్దయా
మంగళ మవ్యయా పరమమంగళదివ్యచరిత్ర శ్రీహరీ
మంగళ తూర్యసేవ్య రవిమండలమండితదివ్యభూషణా
మంగళ మాదిదేవ జయమంగళ మోపరమేశ కేశవా.

ఉ. దాసజనప్రమోద యడిదమ్ముకులమ్మునఁ జందురుండు నా
భాసిలు నారసింహకవివర్యునిపుత్రుఁడ నీభటుండ స
న్న్యాసిసమాహ్వయుండ వికచాంబుజనేత్ర భవత్పదాంబుజా
వాసితమానసుండ నఘభంజన నన్గరుణింపు కేశవా.

(వి-వి.)—

సమగ్రము వ్రాఁతబాగుగానున్నది తప్పులంతగా లేవు శైథిల్యగ్రంథపాతములు లేవు. క్రొత్తది.

"కేశవా." యనుమకుటముగలిగి విష్ణుస్తుత్యాత్మకమైనయీశతకము నడిదమ్ముసన్యాసికవి రచియించెను. ఈతనితండ్రి నారసింహకవి. ఇందు ౧౦౨ పద్యము లున్నవి.

---

(c) రుద్రశతకము.

RUDRAŚATAKAMU.

Foll. 21a—26a.

Contains a centum of stanzās of Kanda metre in praise of God Śiva and having "Rudra" as Makuta was composed by Adidamu Sannyāsikavi, son of Narasiṁhakavi.

Complete.

**Beginning:**

క. శ్రీమద్గిరికన్యానన
తామరససరోజమిత్ర ధరణీధరస
ద్ధామ శరజ్జలదార్జున
వామాంగా భక్తదత్తభద్రా రుద్రా.

క. అక్షీణదయాసంయుత
వీక్షణ నిజచరణకమలవిన్యస్తమనః
ప్రక్షీణకలుషజనసం
రక్షణ నను( బ్రోవ వేగ రమ్మా రుద్రా.

* * * *

**End:**

క. సేవించితి నీపదములు
భావించితి దేవు(డ వని పరమాత్మక సం
భావించితి నినునామది
వేవేగము వచ్చి కావు కృప నను రుద్రా.

క. ఆడిదము నృసింహకవి తన
యు(డ సన్యాసి యను నాఖ్య యొప్ప నీకు భృ
త్యు(డ నన్ను దయామతి వై
యెడపక కరుణించుచుండు మీశ్వర రుద్రా.

(పి-వి.)—

సంపూర్ణము. వ్రాంత యందము గానే యున్నది. తప్పులు లేవు. శైథిల్యపాతములు లేవు. క్రొత్తది.

ఇదియు నడిదముసన్న్యాసి కవి విరచితమే. ఈ కందపద్యశతకము "రుద్రా" యనుమకుటము గలిగి శివస్తుత్యాత్మకమైయున్నది.

---

## R. No. 308. (In two volumes.)

Paper, 11 × 9½ inches. Foll. 322. Lines, 20 on a page. Mode of writing, good and apparently correct. Good.

Transcribed in 1916–17 from the MS. of M.R.Ry. Kappagantula Rāmaśāstri of Cocanada.

(*a*) రామకృష్ణోపాఖ్యానము.

RĀMAKRṢṆŌPĀKHYĀNAMU.

**Foll.** 1 *a*–71 *a*.

A Prabandha so composed that the stanzas may narrate at the same time the stories of Rāma and of Kṛṣṇa. The author is Śrīpāda Vēṅkaṭācalakavi, son of Laccama and Buccana of Kauśikagōtra and of Velnāti sect of Telugu Brahmins. The author in conjunction with his uncle Vāraṇāsi Lakṣmīpati (who is said to have been the author of a Telugu Rāmāyaṇa) wrote a commentary on the work. The author was a disciple of Jayanti Vēṅkaṭa-Rāma and appeared to have lived at the time of Pūsapāṭi Vijayarāma Gajapati of Vijayanagaram. The work was dedicated to God Varāhanṛsiṁha of Simhācalam.

Complete in three Āśvāsas.

**Beginning:**

శా. శ్రీలక్ష్మీలలనామణీసహితుఁడై సింహాచలేంద్రంబునన్
హేలం దంష్ట్రినృసింహరూపమునఁ దా నీరేడులోకంబులన్
బాలింపం భువి నుద్భవించినమహాభవ్యుండు భూదారసం
జ్ఞాలీలావహుఁ డాత్మభక్తు నను వార్ధస్ఫూర్తితోఁ బ్రోవుతన్.

* * * *

క. కొలుతున్ గురుని జయంతిసు
కులకలశాంభోధిసోము గురుతరయోగా

స్థలితోగ్రతపస్స్వామున్
విలసద్విద్యాభిరాము వేంకటరామున్.

మ. తలఁతుం బ్రాకృతసంస్కృతాంధ్రకవితాధారాసుధామాధురీ
కలనాభ్యంచితకుక్కుటేశ్వరలసత్కారుణ్యసంజాతపు
ష్కలశోభావిభవాభిరామనవశశ్వత్సారలీలాసము
జ్జ్వలకీర్త్యున్నతు వారణాసివరవంశశ్రేష్ఠు లక్ష్మీపతిన్.

సీ. మఱియుఁ దలంచి వేమాఱు నుతించెద
నమ్మేటి నస్మదీయప్రబంధ
సింధువు జనియించి చెలువొందుకవితాబి
లాసిని నకలంకభాసమాన
వాణీనిచయవారవల్లులచేత న
లంకరించి సభాస్థలంబులందు
వెలయంగఁ జేసినవిద్వన్మకుటరత్న
సంతతస్తవనీయచారుశీలు.

నాదికవివిరచితకావ్య మాది(బు)కాండ
ములకథఁ దెలుంగుబాసచే లలిఁ బ్రబంధ
మాదరముతోడఁ గూర్చిననాదుమేన
మామను సదాపఠితమేనమామను మది.

సీ. ఆసేతుకాశీతలాంతరాఖ్యాతపం
డితనుతనిబిడనిర్ణిద్రపూర్ణ
విద్యావిశేషాతిహృద్యుఁ డౌ శ్రీపర
వస్తువంశ్యశ్రీనివాససుధికిఁ
బుత్రు లై సభలలోఁ బూజ్యత గలరు రా
మానుజాచార్య రంగాభిధాన
వైష్ణవాగ్రేసరుల వరకీర్తిసందోహ
దినదినరాజితదిగ్విసరుల

మత్ప్రిభధచమత్క్రియామహిమలరసి
కడుఁ బ్రశంసించి యిందులోఁ గల్గుపద్య
వితతి కర్థంబు లెస్సఁ గావించినసుమ
తిమణుల దినేశభవ్యుణుల నుతింతు మదిని.

సీ. అప్పమాంబ సుభార్య యైన నెవ్వఁడు సదా
    శివశివత్వంబునఁ దనరియుండె
సీతమ విపులాత్మజాత గా నెవ్వాని
    జనకత్వ మెలమిగా జగతి నెగడె
గంగ దేవవ్రతోత్తుంగజనని గాఁగ
    నెవ్వానివర్ధిత్వ మిలఁ దనర్చె
లక్ష్మీపతిసుతలలామ మై యెవ్వాఁడు
    పృథులోత్తమాతతప్రీతిఁ గడపె.
నతఁడు నలుగురు సహజులు నాఁడుఁబడుచు
లైదుగురు తోడ జనియింప నమలలీల
వెలయుశ్రీపాదకులమెల్ల నలరఁజేయు
మజ్జనకు బుచ్చనసుధీంద్రు మదిఁ దలంతు.

సీ. వరలుగ(శ్రీ)?భైరవవజ్ఝలజగ్గయ్య
    కును గౌరమాంబకుఁ దనయుఁ డగుచుఁ
దమ్ముఁడై కొండయ దనరార బుచ్చివెం
    కమను వరించి కొండయ్యఁ దమకు
బుత్రుఁగాఁ బడసి సత్పుత్రికాత్రయ మొప్ప
    నలువురుతోఁబుట్టువులు వెలయఁగ
రాజవిద్వత్సభారాజిలోపలఁ దన
    యశము పెంపొప్పఁగాఁ బొసఁగఁ జేసి.
రాజ్యకార్యవిధానవిరాజమాన
రీతి వర్ణన కెక్కఁగా ఖ్యాతి వేంక
టాచల సమాఖ్యచే భువి నలరుచున్న
నాదుమాతులు నెంచెద మోద మలర.

మ. ప్రకటశ్రీహరిచర్య రామకథయుం బ్రఖ్యాతిగా ధాత్రిలో

. . . . . . . . . . .

. . . . . . . . . . .

శుకవాల్మీకుల నెంచెదన్ దదుభయాప్తోక్తార్థసంశ్లేషమై.

* * * *

ఉ. సూరకవీంద్రుఁ డేర్పఱచుచో బ్రకటించుక గాంచి నెమ్మదిన్
గూరిమి రామకృష్ణులఁ గనుంగొనఁ గోరి తదీయసత్కథా

సారము జోడుసేసి యొకసత్కృతిఁ గూర్పఁగ సాహసించితిన్
ధీరవరేణ్యులార యిది తెల్లముగా దయ నాదరించుఁడీ.

*    *    *    *    *

క. అని యిట్లు దేవతావం
దన మొనరింపుచును సుకవితతి నెన్నినవె
నర్కను దాటి కుకవులను బ్రా
ర్థన సేయుచు నున్న నిష్టదైవత మంతన్.

ఉ. శ్రీమదశేషదేవమునిచిత్తనిరంతరవర్తి . . .
. . . . . . . . . . .
. . . . . . . . . . సింహాసం
క్ష్మామహితావనీధ్రసదనస్థితసుందరమూర్తి కన్పడెన్.

*    *    *    *

సీ. అతులవిద్వజ్జనప్రతతిపరస్పరా
స్తోకప్రసంగవిస్ఫూర్తికలిత
సఖికానుకూలలాస్యప్రచారనటత్సు
తనుకరాభినయసంతతవిలసిత
శృంగారమండితప్రాంగణాంతరనవ
వరరత్నకీలితభర్మవేది
కాంతరముక్తామయప్రభాభాసిత
కనకదుకూలసంఘటితపీఠ

భాష్మోర్వీ(సుర)శ్రీలలితపూసపాటివిజయ
రామగజపతి రాజాధిరాజబాహు
దండపాలితభూతలోద్దండసింహ
ధరణిధరరాజవాసి ప్రత్యహ మయ్యె.

గీ. అట్లు పాడకట్టినప్పు డత్యంతహర్ష
మునను దచ్చరణాంబుజంబులకు నొరగి
చేతులు మొగిడ్చికొనుచు నేఁ జెంత నున్న
తఱి వరాహానృసింహాభిధానఘనుఁడు.

సీ. శోభితాపస్తంబసూత్రుఁ గౌశికగోత్రు
శ్రితమిత్రు వెలనాటినుతచరిత్రు

శ్రీపాదసత్కులసింధుకుముదమిత్రు
లక్ష్మీపతిసుధీలలామపౌత్రు
బుచ్చనాభిఖ్యసుధ్యచ్చమాంబాపుత్రు
లలితలక్ష్మీపతిలక్ష్మణాఖ్య
సౌభ్రాత్రు సుకళత్రు జగదేకవిఖ్యాత
భైరవవజ్ఝలభవ్యవంశ్య
జగ్గయబుధేంద్రదౌహిత్రు సాధ్వి యైన
సీతమ సహోదరియుఁ గాఁగఁ జెలఁగుచున్న
వేంకటాచలకవిమిత్రు విపులపుత్రు
నముఁ గని వచించె నాదరం బొనర నపుడు.

క. రూపవినయనతశోభా
దీపితుఁడు భవత్సహాజపతి సకలవిద్యా
వ్యాపారశాలి కొల్లూరు
గోపాలాభిఖ్యసుకవి గుణనిధి సుమ్మీ

* * * *

క. ఇప్పుడు రెండర్థంబులఁ
జెప్పెడిశ్రీరామకృష్ణచరిత్రకథఁ జే
నొప్పిద మైనప్రబంధముఁ
దప్పక కృతియొసఁగు మాకుఁ దనరుదు దానన్.

* * * *

గీ. అనిన నాజన్మ పావనం బయ్యె ననుచు
నందులకు నియ్యకొంటి నే నాతఁడంబ
యాఘనుండు తిరోధానుఁ డయ్యెనన్న
దీయవంశప్రశంస నే నిట్లు సేతు.

* * * *

చ. . . . . . . . . . . .
ప్రశమితమిత్రుఁడై . . . . . . .
. . . . . . . . . . . యా
కుశికసుతాగ్రజన్ముఁడు దగన్ భువి మాఱటశర్వుఁడో యనన్.

క. ఆకౌశికగోత్రమున న
నేకులు జనియించి వార లెలమి నగరనా
మాకలితకులసమాఖ్యలు
చేకొని రవి చెప్ప నరిది శేషునకైనన్.

గీ. అట్టి కౌశికసంతాన మలరియుండ
నందుఁ బొడమినసమతూర్వర్వబృందమునకు
వరకులాభిఖ్యశ్రీపాదవా రనంగ
నమరె నందు జనించెఁ దిమ్మాభిధుండు.

క. ఆతిమ్మన కుదయించెను
చేతోజసమానమూర్తి శ్రీశివతత్త్వం
బాతనిసొమ్మైయుండఁగ
ఖ్యాతిగ గంగాధరాఖ్యఘనుఁడు ధరిత్రిన్.

*　　*　　*　　*

గీ. అతఁడు పాపమాంబ నలఘులీల వరించి
కాంచె నాకరసుతునిఁ గవిసమాను
లలితలీల నలరులక్ష్మీపతిసమాఖ్యు
సిద్ధయశుని బుకసమృద్ధిఘనుని.

సీ. ఆస్మత్పితామహుఁ డైన యాలక్ష్మీప
తిసమాఖ్యుఁడు వరించె ధృతి దలిర్ప
భైరవపష్టిభవ్యకులజ కొండ
యాభిఖ్యసుత గంగమాంబ నట్టు
లాయిరువురకుఁ బుట్టె ననఘపుత్రకపంచ
కము పుత్రికావంచకంబు వారి
పేర్వేరఁ జెప్పెదఁ బేర్లు బాపన్న కొం
డన్న బుచ్చన్న కామయ్యఁ వెంక
టాఖ్యతనుజాగ్రణులు పాపమాంబసోద
మాంబ యచ్చమ వెంకప యచ్చపయును
కూఁతు లీరీతి సంత(తి?)సఖ్యాతి సంత
తి దనరఁగ వారు మూఁడుమునఁ బొదలి రవని.

*　　*　　*　　*

క. అందగ్రజుఁ డగుబ్రహ్మన
నందనుఁ డాంధ్రసురభాష నన్నయ యన నిం
పొందెనుఁ దిమ్మయసంజ్ఞకుఁ
డెందఁగ బహురాజకావ్యశేముషి దగఁగాన్.

* * * *

సీ. వరలు నాబుచ్చనవర్యుఁడు భైరవ
వఝ్ఝలజగ్గయ్యవరకుమారి
నచ్చమాంబ వరించి యాత్మజులను గాంచె
నప్పదాదుల వేంకటాచలాఖ్య
లక్ష్మీపతిసమాఖ్యలక్ష్మణాభిఖ్యుల
నందన సీతమనామవతిని
గన్యకాదానంబు గావించెఁ గొల్లూరు
(గోపన్నసుధికి నకూఁతు నాత.)
తప్పదీయాభిధాన యోసట్రియువతిఁ
దగ వివాహము నే నయి తనయుల నలు
గుర సుతలనైదుగురఁ గాంచి గురుగుణవతు
లైనవారలఁ దెల్పెద నాఖ్య లిటుల.
శా. భూనాథానిశపూజ్యు లుత్తమగుణుల్ బుచ్చన్న గోపాలక
శ్రీనారాయణసంజ్ఞకుల్ సుజనతాశ్లేషాంకరాకారుఁడౌ
నానాగాయణసత్కృపన్ గనువగావాభిఖ్యుఁ డచ్చమ్మసీ
తానామ్నీనరసాంబికాప్రమలు సత్యస్వాంత కామన్నయన్.

గీ. ఈతెఱంగున మత్కులజాతకులప్ర
శంసఁ గావించి తింక నాజన్మపావ
నంబుగ వరాహనరసింహనామదేవు
నిలయ మగుశైలరాజము లలి నుతింతు.

* * * *

క. దరికిన్ సదరికి జితమరు
దరికిన్ సతతవినతజనతైకాదరికిన్
హరికిం ద్రావకరికి ముఖ
కిరికిన్ గుణభరికి సింహగిరివరహరికిన్.

క. అమలమతి నే నొసఁగెదను
హిమకాస్పద మైనరామకృష్ణోపాఖ్యా
నమను ప్రబంధమునకుఁ గథ
క్రమ మెటు లన వినుఁడు చెప్పఁగణఁగితి నెలమిన్.

క. ధరణి మధుర నాఁగ రమా
వరవైభవపురి యధోభువనకు యుదవనీ
పురమణి నవకాంచనఘృణి
యరయఁగ సుమహిత యయోధ్య యనఁ దగి వెలయున్.

* * * *

**End :**

* * * *

మ. ఒక నారాయణ నామచోరకునిఁ గోపోద్దీప్తిమై నుచ్చరిం
చి కదా మోక్షము నొందె మానవుఁడు నిశ్శేషంబుగా మానవుం
డకలంకోక్తుల రామకృష్ణుల లసద్వ్యాపారకావ్యంబు నో
పిక చే విన్నను వ్రాసినన్ జదివినన్ వే చెందఁడే తత్ప్రావన్.

* * * *

చతుర్విధకందము.

ధరధరణ సింహశైలసు
శరణా నిరుపమకటాక్ష చక్రీసరసా
కిరిమర్త్యసింహ సదమల
వరదా పురుహూత ముఖ్యవందితచరణా.

**Colophon :**

గద్యము.

ఉ. శ్రీపద్మోద్భవ శంకర ప్రవిల సత్సింహాద్రిరాట్సేవక
శ్రీపాదాన్వయ వేంకటాచల కవి శ్రీమద్వచోగుంభితో
ర్వీపాలానిశపూజితాంధ్రకవితావిద్యాస్ఫురద్రామకృ
ష్ణోపాఖ్యానమునన్ దృతీయ మిది నా నొప్పారు నాశ్వాస మై.

(బి-బి)—

సంపూర్ణము మూఁడాశ్వాసములు. వ్రాఁత తిన్ననిది. నిర్దుష్టము గానే యున్నది. నూతనము. పాతము లేదు.

రామాయణ భాగవతానుసారము లగు రామకృష్ణకథలు కలయ ద్వ్యర్థి కావ్యముగాఁ గూర్పఁబడినవి. రచయిత శ్రీపాద వేంకటాచల కవి. కౌశికగోత్రుఁడు. తండ్రి బుచ్చన. తల్లి యచ్చమాంబ. వెలనాటి వారు. ఇతని గురువు జగాఁతి వేంకటరామయ్య. ఇతని మేనమామ వారణాసి లక్ష్మీపతి ఆదికావ్యమను రామాయణమును దెలిఁగించుటయే కాక యే తద్గ్రంథవ్యాఖ్యారచనమున నీతనికిఁ దోడు పడెనఁట. ఈ గ్రంథము విజయనగరాధిపతి యగుపూసపాటి విజయరామగజపతి కాలమున రచింపఁబడినదిగాఁ జూపట్టుచున్నది. దీని నీకవి సింహాద్రి వరాహ నృసింహస్వామి కంకిత మొసంగెను. పూర్వాచార స్వప్న వృత్తాంతాదికము నీతఁడును మానినవాఁడు కాఁడు. ఈతని బావమఱఁదియును గవియఁట. ఇంకను నీకవి వంశాదికము మున్నగు విషయము లుదాహృతభాగము వలనఁ దెలియనగు.

---

(*b*) రామకృష్ణోపాఖ్యాన వ్యాఖ్యానము.

**RĀMAKṚṢṆŌPĀKHYĀNA VYĀKHYANAMU.**

**Fol. 71*b*-322*b*.**

**A commentary on the Prabandha described above by Śrīpāda Vēṅkaṭācalakavi (the author of the text) and his uncle Vāraṇāsi Lakṣmīpati as mentioned under the last sub-section. It is written in colloquial language.**

**Complete.**

**Beginning :**

శా. శ్రీగమ్యాంగు లురోముఖార్థతనులం జెల్వొప్పఁగా నిల్వ ని
స్త్రాగస్థాయదమేయ భాసురసముద్యల్లీల శృంగారచే
ష్టారాజద్రసరీతిఁ దన్పిన యఖండానందమూర్తిత్రయో
దారాజాఖ్య మనంగఁ జెల్లు పరతత్త్వంబుం బ్రశంసించెదన్.

* * * *

క. ఇటు దేవతానమస్కృతి
పటుతరగతి సల్పి సుకవిభణితిని గుకవి
స్ఫుటగతిఁ జెడుటఁ దెలిపి యం
తటను మదీయేష్టదైవతము నెన్నుతన్.

సీ. కటిబద్ధ విస్రస్తకనకాంబరముఁ దన
సవ్య హస్తంబున సంఘటించి
. . . . . . . . . . 
సింహగిరివాసి యానరసింహమూర్తి
యెదుటఁ బొడకట్టి నను జూచి యిట్టు లనియె.

శా. శ్రీపాదాన్వయ వేంకటాచలకవి శ్రీ మన్మదీయస్ఫుర
ద్వ్యాపారాంచితరాగలబ్ధ సుకవిత్వాత్యంతసద్రామకృ
ష్ణోపాఖ్యానము తేట తెల్లమిగ నీయుర్విం బ్రవర్తిల్ల న
ద్వ్యాపారయ ల్దగి మెచ్చఁ బూని తిటు తద్వ్యాఖ్యానముం జేయఁ
[గా

ఉ. తొల్లి కవీంద్రు లెల్లెడలఁ దోరపురీతిని గూర్చినట్టి కా
వ్యోల్లసదర్థమిద్ధరణి నొప్పఁగ మూల మొనర్చినట్టి వా
రెల్లను టీకఁ జేయు టరిదిం దుల కన్యుల నెన్న నేల సం
ధిల్లి తెలుంగు ధీరుఁ డగుమాతులుఁ డుండఁగ నీకుఁ దోడుగన్.

గీ. వారణాసి కులజుఁడు దుర్వారసరస
సాహితీపూర్ణుఁ డిల రామచరితఁ దెనుఁగు
బాసఁ గబ్బముఁ గూర్చిన ప్రౌఢసుకవి
లలిత లక్ష్మీపతి సమాఖ్య లక్షణుండు.

ఉ. సేయుము టీక యీ సుమతి చేర్పున నాకిటు వోఁచె దీన లో
కాయతకీర్తి గల్గి యలరారుదు నుండఁగ మామకీనచ
ర్యాయుత సత్కథావళుల నర్మిలిఁగూర్చిన యీ నిబంధనం
బీయెడ మాకు సత్కృతిగ నిమ్ము మెలంగెద వన్నిభంగులన్.

గీ. మున్నె మావంక చిత్తసమ్మోదగరిమ
ప్రబలఁగను మాకు మూలము రచించి దలిర్ప
కృతి యొసఁగి యీనిబంధనం బిడిన మిగుల
శరధరాటీర సంసర్గ సరణి గాదె.

* * * *

ఉ. అని మదిలోన నానృహరి యాడినరీతిఁ దలంచి యీ నిబం
ధన మిడఁక సింహశైల సదనస్థితుఁ డైనవరాహమర్త్య సిం
హుని కిడఁ బూనియున్నయెడ సూరిశిఖామణి నాదుమాతులుం
డును జనుదేర నాఘనునితో నిది తెల్పిన వారి కౌతుకుండై.

గీ. కొన్ని దినముల కిటీకఁ గూర్త మదియు
సింహగిరి వాసి కిడుదు నీచిత్తసరణి
నంకిత మటంచు సమకూర్చినట్టి టీక
ధీరు లరసిరి తెల్పెద వారి తెఱఁగు.

సీ. సరసశాస్త్ర విశేషసార విద్భిసర
వస్తురంగాచార్య వైష్ణవమణి
వైయాకరణశిరోవర రత్నసంజ్ఞ భా
గవతుల హరిశాస్త్రి ఘనుఁడు సుమతి
రమణీయ సంస్కృతాంధ్ర కవివర్యుండు త్రి
వేంకటరామసద్విబుధుఁ డుదయ
సరససాహిత్యనిస్తంద్రపోషణపెద్ది
వేంకయ పండితోర్వీసురాగ్ర
గణ్యుఁడును మఱి ముఖ్యసత్కవులుకొందఱ
అరసి నిర్దోష మని పల్కి యవ్వ డుభయ
కవి మనోరంజని యని యాఖ్య యిడి నట్టి
టీక యిది యన నొప్పారు లోకమునను.

శా. లక్ష్మాభ్యంచిత జిహ్వాశాగృహ సవాలాస్యన్మహా భారతీ
లక్ష్మీశుండును కామయాఖ్యసుధికిన్ లక్ష్యంబకున్ బుత్త్రుఁ డా
లక్ష్మీపత్యభిరామ సూరికృప లీలం జేసి తగ్గించు సిం
హాక్ష్మాధ్రాగ్ర్యనివాసి యా కిరినృసింహస్వామి కత్యంతమున్.

*     *     *     *

క. భాసుర సింహాధరాధర
వాసునకును శాతకుంభవరుచిశుంభ
ద్వాసునకు సతతరక్షిత
దాసునకు రమావిలసితదరహాసునకున్.

వ. సభక్తికంబుగా నే సమర్పించిన శ్రీరామకృష్ణోపాఖ్యానంబు
నకు నఖిలసుకవిజనానందంబుగా మదీయమాతులుండును వారణాసి
సద్వంశజుం డగు లక్ష్మీపతిసుకవిసహాయంబున రచియించిన యుభయ
కవిమనోరంజని యను నిబంధనంబునకుఁ గ్రమం బెట్టిదనిన.

క. ధరణి మధుర నాగరమా
వరవైభవపురి యధోభువనవియదవనీ
పురమణి నవకాంచనఘృణి
యరయఁగ సుమహితయయోధ్య యనఁ దగి వెలయున్.

టీక. (రా) మధుర యుక్తమైనట్టువంటి, నాగ యేనుగుల యొక్క రమా సంపదయొక్క వరవైభవము గల, మధుర శబ్దము వైభవ విశేషణము. యద్వా, నాగర నగర సంబంధమైన మా లక్ష్మియొక్క వరవైభవముగలది. "స్వాదుప్రియౌతు మధు ఇత్యమరః". అధోభువనవియదవనీపురమణి పాతాళస్వర్గ మర్త్యపురములకంటె శ్రేష్ఠమైనది. నవకాంచన ఘృణి నూతన సువర్ణకాంతులు గలది. సుమహిత యగు, పురి, యయోధ్య యనునామమున, ధరణియందు తగి వెలయును.

యా. "యోద్ధుమశక్యా అయోధ్యా" ధరణియందు వెలయును ప్రకాశించును. కడమసమము. మధురశబ్దమునందలి ద్వితీయచతుర్థ వర్ణ సందేహమునకు కావ్యదర్పణము చేసిన మహాకవి ప్రయోగము సంస్కృత రాఘవయాదవపాండవీయే "జయత్యుదారా మధురాజైత్ర పౌరవరాజితా సాకేతనామోదిత శ్రీర్హస్తినామాస్పదంపురీ".

* * * *

**End:**

* * * *

చ. విదిత మహాశరా శరధివిహ్వలమానవిశాలకాండ కాం
డదసమమూర్తి మూర్తిగుణధారిత శాంకరధన్వ ధన్వభూ
పదపరితోవికీర్ణపరిప-థివధూకుచహారహారశుం
భదతిసువర్ణ్యమానమహిమప్రకృతిప్రణుతాత్మనామకా.

క. గీర్వాణపాగ్నిపిత్పరా
ట్పూర్వామరవరుణగగనభూత్తరకకుభీ
ట్పూర్వజ్ఞాంబుజభవముఖ
సర్వామరపూజితాత్తచరణసరసిజా.

పంచచామరము—

కరీడ్ఘ దివ్యగార ఘోరకర్బురాతురాతుస్సే
శ్వరాద్యనేకకర్బురోర్విజాప్రచండమారుతా

వరాహ మర్త్య సింహారూపవర్ణ్యమానదేవరాట్
కరీంద్ర పూజితాత్మ పాదకంజ మానిరంజనా.

**Colophon:**

గద్య. ఇది శ్రీమదశేషమనీషా విశేష మనీషి హృదయంగమ గోపికా భుజంగమ మహాప్రసాద సంలబ్ధ చిత్రసరసకవితావ్యాప్తి పాత్ర కౌశికగోత్ర పవిత్ర శ్రీపాద లక్ష్మీపతి సూరిపౌత్ర బుచ్చనార్య సత్పుత్ర, వేంకటాచల కవిమిత్ర ప్రణీతంబైన రామకృష్ణో పాఖ్యానంబను శ్లేష మహాప్రబంధంబునకు వారణాసి సద్వంశజుం డగు లక్ష్మీపతి సుకవి సహాయంబుగాఁ దద్వేంకటాచలకవి విరచితం బైన యుభయకవిమనోరంజని యను నీ ప్రబంధంబునందుఁ(?)దృతీయాశ్వాసము.

(వి-వి.)—

సమగ్రము.

పూర్వోదాహృత రామకృష్ణోపాఖ్యానమునకు నుభయకవి మనోరంజనియను టీక. శ్రీపాదవేంకటాచలకవియు, వారణాశి లక్ష్మీపతియుఁ గలసి రచియించిరి వాడుకభాషను వ్రాయఁబడినది. విశేషముల కుదాహృత భాగముం గనునది.

---

## R. No. 309.

Paper. 11 × 9¾ inches. Foll. 68. Lines, 20 on a page Mode of writing, good but fairly correct Good.

Transcribed in 1917-1918 from the manuscript of M.R.Ry Boddapāti Vēṅkatēśvara Rao Gāru of Rāmanapudi, Kistna district

కపిలగోసంవాదము.

KAPILAGŌSAṀVĀDAMU.

This Prabandha deals with the principles of the Vēdānta as taught by Kapila to Sōmaraśmi who was in the form of a cow. The author is Koṇḍubhaṭṭu, son of Akkamāmba and Nṛsiṁhabhaṭṭāraka of Hārītagōtra and disciple of Gōvindaguru. The work is dedicated to God Nṛsiṁha worshipped at Ahōbala.

Incomplete: contains the first three Āśvāsās.

**Beginning:**

శా. శ్రీమాద్యత్కుచకుంభసంభరిత కాశ్మీరార్ద్ర)రేఖా సము
ద్దామశ్రీ విలసిల్లువక్షమున భక్తత్రాణ (త) మాత్మావన

ప్రేమం బై కనురాగసంపదను ప్రేరేపించి నందత (?) మో
దామోదస్థితి జాఁడఁ గన్గు నృసింహస్వామిఁ గీర్తించెదన్.

* * * *

వ. అని యిష్టదేవతాభివందనంబును . . . . . . . .
బ్రహ్మవిద్యం దెలుంగున విస్తరింపఁ (జేయం) దలంచి దీనికిఁ . . .
కపిలగోసంవాదం బనుపురాతనేతిహాసంబు నిదానంబు గావున జగద్విఖ్యా
తంబుగాఁ దానిరచియింప నారంభించి యేతత్కావ్యకన్యకామణికి నాథుం
డు . . . మదిష్టదేవుండును నహోబలనివాసుండును నగునృసింహ
దేవుండే యగు నని . . . . భావించి యిట్లని వితర్కించితి.

గీ. నీరధిఁ దరంగ లుదయమై యింకి కెగయు
నీరకణములు జనియించి నీటఁ గలయు
భాతిఁ దావైననే నూహఁ బుట్టుపలుకు
లతని లోఁగూర్చి విమలుండ నగుచు నగుచు

వ. నిశ్చయించి యేతత్కృతిత్వంబునకు మూలాధారం బగు మదీ
యవంశావతారంబు వర్ణించెద.

క. హారిత స నీంద్రుం డల
హారిపాదసరోజభక్తుఁ డనఁ దతతః
పరిపూరితమనసత్కుం (?)
(?) దరివర్ణవిభుక్తుఁ డనఁగ నలరు ధరిత్రిన్.

క. ఆ మునీంద్రుకులంబున
శ్రీమత్కామరోశివంశశేఖరుఁ డగుచున్
రామావజ్ఝలుఁ డనఁగ సు
ధీమాన్యుం డుదయమయ్యెఁ దేజం బెసఁగన్.

శా. రామావజ్ఝలుఁ డాత్మసత్యవచనారంభప్రచారంబునన్
రామాధీశ్వరుఁడే యనంగఁ దనపేరన్ వంశ ముప్పొంగను
ద్దామప్రేమఁ జెలంగ వ్యాసముని ప్రత్యక్షుఁబు నై సత్వర
(?) స్తోమంబీయనొసంగె సర్వజనసంస్తూయప్రభావంబునన్.

క. ఆరామావజ్ఝలుసతి
శ్రీరంజిలులక్ష్మమాంబ సిరియే యనఁగా

భూరిగుణంబుల నొప్పి
ధారుణిలోనఁ బతివ్రతామణి యగుచున్.

క. ఆదంపతులకుఁ బుత్రుఁడు
శ్రీదయితసమానుఁ డగుచుఁ జెలఁగెన్ సుగుణా
పాదియును వేంకటార్యుం
డాదరమణి (మున) సిద్ధమాంబ యంగన గాఁగన్.

గీ. ఆవధూవరులకు సుతు లవని బెద్ద
కొండుభట్లయ్యయును చిన్నకొండుభట్లు
బాలకొండయ్యయును సుగుణాలవాలు
లగుచు మువ్వురు నుదయంబు నంది రందు.

ఉ. అనఘుఁడు బాలకొండసుగుణాకరుఁ డాన్యనుతప్రచారుడై
వినయము సత్యమున్ ధృతియు విశ్రుతకీర్తియు నుల్లసిల్లఁగాఁ
దనరె ధరిత్రిఁ దత్సతి యుదారమతిన్ విలసిల్లె దేజ మిం
పానరఁగ నెల్లమాంబ భువనోన్నతసత్యగుణావలంబ యై.

గీ వారలకు బుచ్చనార్యుఁ డవార్యధర్ముఁ
డైన పెదయెల్లవిభుఁ డంచితాభుఁడైన
చిన్న యెల్లయాఖ్యుండును చిన్నఘనుఁడు
వేంకటాఖ్యుండు గలిగిరి విబుధవరులు.

క. వారలలోపల సుగుణో
దారుఁడు చినయెల్లఘనుఁడు ధారుణిలోనన్
జేరంది సకలకార్యవి
శారదుఁడై సభలయందు జనవరు లెన్నన్.

క. చినయెల్ల విభునిభామిని
యనఘామలగుణకదంబ యగు యజ్ఞాంబన్
వినుతింప ధర్మమార్గం
బనయముఁ దనయందె నెగడ గలరె ధరిత్రిన్.

సీ. ఆవధూవరులకు ననఘాత్ముఁ డగుకొండ
భట్లయ్య సుగుణుండు పాపయారు:

దధికధర్మాచారుఁ డగుముసలవిభుండు
రమణీయభావుఁ డౌరమణఘనుఁడు
వివిధేతిహాసకోవిదుఁడు బాలవరుండు
సిరులచేఁ జెన్నొందు చెన్నవిభుఁడు
నిరతధర్మోద్ధారనిధి నరసాఖ్యుండు
కరిగిరి సురగిరికల్పు లగుచు

వీరిలోపల నాత్మవిచారపరుఁడు
సత్యవాక్యుండు బుధకోటిసన్నుతుండు
సరసకావ్యకవిత్వవిశారదుండు
నరసయాఖ్యుండు దనరు విస్ఫురణమెఱయ.

* * * *

క. అసుగుణాంభోనిధిసతి
భాసురమతి యకరమాంబ పతిభక్తిమెయిన్
భాసిల్లె సద్గుణస్థితి
శ్రీసతికిన్ సాటి యగుచు సిరు లలరారన్.

ఉ. వారలకున్ నృసింహపదవారిజభక్తుఁడు కొండయాఖ్యుఁడున్
భూరిగుణుండు కృష్ణయయు భోగసురేశుఁడు సుబ్బయార్యుఁ డెం
తేరసికాత్ముఁ డైముసల యేంద్రుఁడుఁ బుట్టిరి మేమునల్వురిం
పారఁగ నేను నగ్రజుఁడ నంచితశాంతగుణప్రచారుఁడన్.

సీ. గోవిందగురువర్యపావనాంఘ్రిసరోజ
భక్తుండ ముక్తుండఁ బటుగురూక్తి
సరసకావ్యకవిత్వ చాతుర్యకల్పనా
కలితుండ లలితుండ ఘనులలోన
సకలాత్మవిద్యావిచారానుసంధాన
సహితుండ విహితుండ సభలయందు
నిఖిలార్యసమ్మతనీతినిర్మలలస
ద్వచనుండ రచనుండ వైద్యవిద్య
సత్యవాక్యాభిలాషుండ సర్వసుజన
సహాకృతాశేషసజ్జనసముదయుండ

వినయధుర్యుండ జనలోకవిశ్రుతుండఁ
గొండయాఖ్యుండ హారితసగోత్రజుండ.

క. నే నీకావ్యము సేయం
బూనితి నానందలీల పొసఁగఁగ మదిలో
శ్రీనారసింహదేవుని
మానక సన్నుతులు సేతు మత్కృతిపతిగాన్.

క. ధాతృసుఖనిఖిలసుఖభు
గ్వ్రాత మణీమకుటఘృణివిరాజితపదకం
జాతునకు నహోబలవి
ఖ్యాతనృసింహునకు నిత్యకల్యాణునకున్.

వ. నిత్యపరంపర మంగళాభివృద్ధిగా నాసమర్పింపంబూనిన యాత్మ
విద్యాప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన.

* * * *

శా. శ్రీకాంతామణికిం బ్రియుండును దయాసింధుండు గోవిందుఁ డే
లోకానం గపిలావతారమున ముల్లోకార్చితుం డై సుధీ
లోకేశుం డన సంచరించు నెడ నాలోకించెఁ దానొక్కగో
లోకగ్రామణి నుత్తమాకృతిని భూలోకోపకారిన్ వెసన్.

వ. కని యాగోవుం డాయంజని పరమహంసశ్రేష్ఠుండైన కపిలుం
డిట్లనియె.

* * * *

మ. అని యుబ్బుంగిని బలుకుపలుకులను వేదాచారపారీణుఁడున్
వనవాసుం డగుసోమరశ్మి తెలసన్ వర్తించువాఁ డై వినెన్
విని వేదంబులఁయుం దనాదరణ భావించె న్నిదేమంచు నీ
తనిఁ జర్చించెద నంచు గోముఖమునకు దాఁ జొచ్చె సూక్ష్మాకృతిన్.

* * * *

**End:**

క. ఈవిధమున మునివర్యుం
డావిప్రునితోడఁ బలికె నని ధర్మజుతో
దేవనదీసూనుఁడు వినఁ
గా వించె న్ననుచు మునులఁ గథకుఁడు తెలియన్.

క. వినిపించిన నమ్మానులు
విని సంతోషంబు నొంది విశ్రుతభక్తిన్
గొనియాడి వెండిసూతుని
గనుగొని సంప్రీతి నవలికథ వేఁడుటయున్.

*  *  *  *

తురగగతి వృత్తము.—

ప్రకటదితిసుతజఠరగళదురుగక్తసిక్తనఖాంకురా
నికటమునిజనజననవరిహార నిర్వికల్పనిరామయా
సుకటీవలయితసుకరమణిగణ శోభితాంచితమేఖలా
సకలసురవరమకుటవిరచిత చారుపాదుకపీఠికా.

**Colophon:**

గద్యము. ఇది శ్రీ నరసింహావరప్రసాదలబ్ధకవితావిచిత్ర హారితసగోత్రపవిత్ర నరసింహాభట్టారక ప్రియతనూభవగోవిందగురుశిష్యబుధజనవిధేయ కొండుభట్టునామధేయప్రణీతం బైనకపిలగోసంవాదం బను నధ్యాత్మప్రతిపాదకమహాప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము.

(వి-వి.)—

అసమగ్రము. మూఁడాశ్వాసములు మాత్ర మున్నవి. వ్రాఁత యొకతీరునఁ దప్పు లంతగా లేక యున్నది. గ్రంథపాతము లేదు. నూతనము. ఈ ప్రబంధమునఁ గపిలునకును, గోదేహముఁ బ్రవేశించిన సోమశర్మ యను నొకబ్రాహ్మణునకును జరిగినయధ్యాత్మవాదము వర్ణింపఁ బడినది. నృసింహాభట్టారకాత్మజుం డగుకొండుభట్టు దీనిని రచియించెను. ఇతఁడు హారితసగోత్రుఁడు. రామావఝ్ఝలఁ వంశమువాఁడు. గోవిందగురుశిష్యుఁడు. తల్లి యకరమాంబ. ఈ గ్రంథము నీతఁడు సోబాఖలనృసింహస్వామికంకితము చేసెను.

---

**R. No. 310.**

Paper, 10⅝ × 9¼ inches. Foll. 183 Lines, 20 in a page. Mode of writing, not bad and not correct. Good.

Transcribed in 1916-17 from the MS. obtained through the Sub-magistrate of Kovvur, Kistna district.

విష్ణుపురాణము (వచనము).

VIṢṆUPURĀṆAMU (PROSE).

A prose rendering of the Sanskrit Viṣṇupurāṇa, by Tupākula Anantabhūpāla, son of Bhāgamāmba and Candragiri Kṛṣṇabhūpāla (a chieftain). The division into Aṁśas and Adhyāyas found in the original is retained in the translation.

Contains the first 3 Aṁśas only.

**Beginning :**

క. శ్రీతరుణీపాణిగ్రహ
కౌతూహలకేళిమథితకలశాంబునిధీ
శీతాంశువదన సజ్జన
చేతస్సంచారలోల శ్రీగోపాలా.

అవధరింపుము శ్రీమత్కల్యాణగుణసాంద్రుండు . . . . దొకనాఁడు ప్రాతఃకాలకర్తవ్యంబు లైన నిత్యసత్కర్మంబు లాచరించి సుఖాసీనుం డైయున్నయెడఁ దదీయప్రియశిష్యుం డైనమునీంద్రుం డమ్మహర్షికిఁ బ్రణామంబు (అభివాదనంబును) గావించి యిట్లని ప్రశ్నంబు గావించె.

గురువరేణ్యా! మీవలన సకలవేదంబులును వేదాంగంబులును సమస్తధర్మశాస్త్రంబులును యథాక్రమంబుగా నధికరించితి. పరాశరసంయమీంద్రా! నీయనుగ్రహంబున జేసి మైత్రేయుం డితరుల నపేక్షింప (క) సకలశాస్త్రంబు లధికరించి ప్రాజ్ఞుం డయ్యె నని తత్త్వజ్ఞు లైనయార్యులు మిక్కుటంబుగాఁ బ్రశంసింపఁ బొగడ్త కెక్కితి . . . . . . . . . . . . . . . . . .

**End :**

వ్యర్థంబుగా జటాభారంబుఁ దాల్చియేనియు ముండితశిరస్కులేనియు నగుచు శౌచాచారంబులు మాని దేవతాదిసంతర్పణంబులు లేక భుజింపుచుఁ బితృపిండంబులకుఁ దోయప్రధానంబు లగు సత్కర్మంబులవలన సర్వేశ్వరుని నారాధించిరే సకలశుభంబులు నొందవలయు నని యెఱుంగుము. [illegible] వ యధ్యాయము.

**Colophon :**

గద్యము. ఇది శ్రీనందనందన వదనారవింద మత్తమధుకరాయమానచిత్త చతురివిధకవితాసామ్రాజ్యభోజ చంద్రగిరి కృష్ణభూపాలకతనూజభాగమాంబాగర్భశుక్తిముక్తాఫల తుపాకుల యనంతభూపాలక ప్రణీతంబైన శ్రీవిష్ణుపురాణంబునఁ దృతీయాంశము.

(ఐ-ఐ.)—

మూఁడంశములుమాత్రము గలవు. వ్రాఁత యంతతిన్నైనదియు నిర్దుష్టమైనదియుఁ గాదు. గ్రంథపాతము లక్కడక్కడఁ గాన్పించు చున్నవి. క్రొత్తది.

ఇది సంస్కృతవిష్ణుపురాణమునకుఁ దెనుఁగు. దీనినిఁ దుపాకుల యనంతభూపాలుఁడాంధ్రీకరించెను. ఈతఁడు చంద్రగిరి కృష్ణభూపాలునిపుత్రుఁడు. ఇతనితల్లి భాగమాంబ. మూలమువలెనే యంశములుగను నధ్యాయములుగను విభాగింపఁబడియున్నది. ఇందీతని గుఱించి తెలుపఁదగువిషయ ముదాహృతగద్యమునందలిదానికన్న వే రేమియు లేదు.

---

R. No. 311.

Paper. 10¼ × 8¼ inches. Foll. 18. Lines, 28 in a page. Mode of writing, not good and not correct Good.

Purchased in 1916-17 from M.R.Ry. P. Ādinārayaṅa Śāstrigaru of Madras.

జ్ఞానాంజనేయము.

JNĀNĀÑJANĒYAMU.

A Prabandha dealing with the Vēdānta philosophy. The author is Cējarla Rāmaya, son of Laksmāmba and Veṅkatrāmayya of Āṛuvēla sect of the Telugu Brahmins. The composition is erroneous and often ungrammatical.

Complete in 3 Āśvāsas.

**Beginning:**

చ. శ్రీమదఖండతేజ మగుచిన్మయమూర్తికి శేషశాయికిన్
గోమలనీలవర్ణునకుఁ గూరిమి సద్గురురాజచంద్రుకున్
నామది నేసవమ్ములను సుస్థితివెల్గెడిసా (?) రేణికిన్
నామదిలోన మ్రొక్కి కృతినాథునిఁగాఁ గయికొందు వేడ్కలన్.

* * * *

వ. అనియు నిష్టదేవతాప్రార్థనంబును . . . . . . .
గుండ్లపల్లివీరబ్రహ్మేంద్రకృపాప్రసాదితభావామృతపానంబునం జేసి .
. . . ఈకృతి రచియింపం బూని కించిత్కాలంబు మద్వంశం బభివర్ణించెద.

సీ. శ్రీకరంబైనట్టి చెర్లవంశజుఁ
డగునాఱువేలకులాబ్ధివిధుఁడు
హారితసగోత్రుఁ డాపస్తంబసూత్రుండు
కరుణాన్వితుఁడు కార్యఖడ్గవేది
యగుకొండనామాఖ్యుఁ డైనయామంత్రికి
సుతుపాపరాజనసుజనప్రో
డతనికి నందనుం డన నొప్పుచుండును
విష్ణుసేవాభక్తి వెలయుచుండు
మంత్రివరులకునెల్లను మేటి యగుచు
సకలకార్యంబులెల్లను సమతఁ జేయు
నుపమశాలియు పరఉపకారి యనియు
వెలయు వేంకటరామన్న యంత్రు బుధులు.

క. శ్రీవిష్ణువువక్షంబున
భావింపఁగ లక్ష్మియున్నవగిదిని దనకున్
శ్రీవెలయఁ బత్నిగాఁగను
నావేంకటలక్ష్మమ్మ యన నుతికెక్కెన్.

క. ఆదంపతులకుఁ బుట్టితి
మేదినిలాపుత్రు లనఁగ మెఱయనలువురం
మోదగవాడిలో నను (?)
శ్రీదయితునికరుణచేఁ గనిష్ఠుఁడ నేనున్.

క. శ్రీరామచంద్రకరుణా
కోరిన వేదాంతశాస్త్రగురుబోధితుఁడన్
శ్రీరామయోగచరితుఁడ
ధారుణి నేరామనామధరుఁడన్ వరుఁడన్.

క. గురుసేవావ్రతచర్యుఁడ
గురువాక్యాధిష్ఠితుఁడను గురిగలవాఁడన్
గురు . . కవివరుడను
గురుతరవేదాంతరంహావాసితుఁడన్.

* * * *

క. యతిగణప్రాసంబులు నే
మతి నెఱుఁగను సుజనులార మతిసద్గురునిన్

గతి యనినమ్మినవారికి
యతిగణప్రాసంబు లెల్ల నెందుకుఁ దెలియన్.

* * * *

వ. ఇట్టిగ్రంథంబునకుఁ బ్రారంభం బెట్టినదనిన నైమిశారణ్యంబున శ్రీవిష్ణుక్షేత్రంబున నపవర్గకాంక్షితు లైనశౌనకాదిమహామునులును సూతునిచే సకలపురాణేతిహాసంబులు విని వేదాంతసారం బైనయోగశాస్త్రంబు వినఁ గోరి యతని కిట్లనిరి.

క. శ్రీరాజయోగమహిమల
ధారుణిలో జనులు మోహితతి గనిరనియన్
న్నారయఁ జెప్పఁగ విందుము
యేరీతినిసలుపవలయు నీయోగంబున్.

**End :**

వ. అనిరాజయోగసారం బైనవ్యాఖ్యానంబు సూతుండు సంక్షేప రూపంబుగాఁ జెప్పినశౌనకాదిమహామునులు విని సంతోషస్వాంతులై పరమానందసముద్రంబునం దేలి అఖిలభూతకర్త యైనయీశ్వరుని గురించి . . రింపుచు సూతుం గొనియాడి సుఖం బుండిరిట్లు.

క. పరమాత్మ విశ్వరూపా
కరివరద ముకుంద యోగకల్పకభూజా
పరమాణరూపకారణ
గురుబ్రహ్మేంద్రమహాత్మ కోవిదవినుతా.

**Colophon :**

గద్యము. ఇదిశ్రీరామబ్రహ్మేంద్రకరుణాప్రసాదలబ్ధ సరసకవిత్వగచనానిపుణహారితసగోత్ర చేజర్లవంశపయః పారావారపూర్ణిమాకువలయమిత్రాది వెంకట్రామయ్యా సుపుత్ర వెంకటలక్ష్మమాంబాగర్భశుక్తిముక్తాఫల సకలయోగిజనవిధేయ రామయ నామధేయప్రణీతంబైన జ్ఞానాంజనేయం బను యోగశాస్త్రంబునందు సర్వంబును దృతీయాశ్వాసము.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత యంతబాగుఁగా లేదు. నిర్దుష్టము కాదు. గ్రంథపాతము లేదు.

ఈ మూడాశ్వాసముల గ్రంథమున వేదాంతవిచారము చేయఁబడినది. చేజర్లరామయ చేసినాఁడు. ఇతఁడాఱ్వేలనియోగి. దీని నితఁ డధ్యాత్మపరబ్రహ్మమునకంకిత మొనరించెను. కవిత్వము లక్షణవిరుద్ధమై యపశబ్దభూయిష్ఠమైయున్నయది.

---

## R. No. 312.

Paper. 10¾ × 9½ inches. Foll, 20. Lines, 7 in a page. Mode of writing, good but containing mistakes. Good.

Transcribed in 1916–17 from the MS. of M.R.Ry. Cintalapāṭi Vēṅkaṭaśāstrulugārū of Chintapalli, Gudivada taluk.

నాగరఖండము.

### NĀGARAKHAṆḌAMU.

This is the same work as the one described under R. No. 294 *ante*.

The name of the scribe and the date of transcription of the MS. from which this was copied are given in the Telugu extract below as found at the end of the MS.

Complete in 5 Āśvāsas.

**End:**

మ. హనుమత్తేరతనచక్రశూల నవలోహాభీతివ్(హా)స్త్రాతుసూ
త్రకవీనాగనపంచకత్రిణయనోద్యన్మానదండంబులన్
ఘనబాహాదశకంబు శుద్ధకనకాంగంబున్ లసన్మేఘవా
హన మొప్పంగను విశ్వకర్మ చనియెన్ హర్మ్యాంతరంగంబుతోన్

* * * *

గీ. మున వసిష్ఠాదిమునులు సన్మోహమునను
దమతమనివాసములకు నంతయును జనిరి
శాశ్వతైశ్వర్యధుర్యుండు శంకరుండు
నద్రిసుత తాను జెన్నొందె హర్మ్యమునను.

* * * *

ఉత్సాహ —

ప్రాజ్ఞలోకకల్పభూజ భాగ్యరాజరాజ వి
శ్వజ్ఞగోత్రసత్పవిత్ర వైభవాదిగోత్ర భా
వజ్ఞమంత్రివర్గనిత్య వర్ణనీయసద్గుణా
శేజ్ఞరాజ్యపూజ్యకుంఠ భిన్నయోగ్యశేఖరా.

**Colophon:**

గద్యము. ఇది శ్రీమద్దుర్గాదక్షిణామూర్తివరప్రసాదఫలితసారస్వత ధురంధరాజకవివరాయ్యంకి బాలసరస్వతీనామధేయప్రణీతంబైన శ్రీ స్కాందం బను మహాపురాణంబునందు సనత్కుమారసంహితయను నాగరఖండంబునందు సర్వంబును బంచమాశ్వాసము.

ఈ గ్రంథపుమాతృక కడపట "అక్షయనామ సంవత్సర వృష్య బ ౧౧ లు గురువారం కొమరవోలు రామలింగం విశ్వకర్మకు కొమరవోలు సుబ్బరాజా ఈ నాగరఖండము . . . . సంపూర్ణముగా వ్రాసి యివ్వడమయినది" అనియున్నట్లు లీగ్రంథాంతమున వ్రాయఁబడి యున్నది.

(బి-బి.)——

సమగ్రము. అయిదాశ్వాసములు వ్రాలందముగా నున్నవి. తప్పులున్నవి. పాఠము లేదు.

ఇది త్రై. క్యా. ఆర్. నెం 294 రున వర్ణింపఁబడిన గ్రంథమే.

---

## R. No. 313.

Paper. 11 × 9¾ inches. Foll 41. Lines, 20 in a page. Mode of writing, fair and incorrect. Good.

Transcribed in 1916–17 from a manuscript of M.R.Ry Kañcarla Kuṭumba Rao garu of Krisṇāpuram, Kistna District.

అధ్యాత్మరామాయణము.

ADHYĀTMARĀMĀYAṆAMU.

A Telugu rendering, in the form of a Prabandha, of the Sanskrit work of this name (described under No. 2153 of the Des. Catalogue of Sanskrit Manuscripts, Vol. IV Part 1). The author is Kañcarla Śarabhanakavi, son sof Narasamāmba and Ayyanāmātya of Ātrēyagōtra. One of the ancestors of this author was a village Karaṇa at Mēḍūru. Another named Rāmana is said to have received for the benefit of the Visnu temple at Śrīkākula certian lands at Mēḍūru from Vīrasiraṅgarāya, who was under the patronage of Vīrapratāpadēvarāya, in Śaka 1361. The grandfather of the author is stated to have composed Kāśīkhaṇda in Telugu Dvipada verse. Rājēndrula Annamārādhya of Maudgalyagōtra was the Guru of the family to which the author belongs.

**Breaks off in the Ayōdhyākāṇḍa.**

**Beginning:**

ఉ. శ్రీకరు లబ్ధధారణులు సింధుసముద్భవభూషితుల్ దయా
లోకను లార్యభక్తజనలోలులు నాదిమదంపతుల్ సురా
నీకమునీంద్రవందితులు నిత్యవిభూతు లుమామహేశ్వరుల్
మా కొనగూర్త్రు గాత మసమానకవిత్వపటుత్వసంపదల్.

* * * *

సీ. కాళిదాసుని . . . .
. . . . . . . .
. . . . . . . . . . .
. . . నన్నయభట్టును సన్నుతించి
సొంపుగాఁ దిక్కనసోమయాజిని వేఁడి
భాస్కరు కవివరు భక్తిఁ గొల్చి
నవకవీంద్రుల శ్రీనాథకవిని బోత
రాజుఁ బింగళిసూరపరాజు నల్ల
సాని పెద్దనఁ దిమ్మన సరసరామ
లింగకవి రామభద్రుల లీలఁ దలఁతు.

* * * *

క. భవబంధముక్తికొఱకై
కవనము రచియింపఁ బూని కనుమూసినచో
నవకంజనేత్రుఁ డొకఁడు
చెవిలో నా కిట్లుపలికెఁ జిత్తం బలరన్.

“ అధ్యాత్మరామాయణ మాంధ్రభాషయా
కురు ప్రకాశం భవబంధముక్తయే.”

వ. అనంతరంబున మేల్కాంచి స్వప్నప్రకారంబు విచారించి శ్రీరామప్రసాదంబునఁ గావ్యసాకల్యం బగునని నిశ్చయించి యొకశుభముహూర్తంబున మామకవంశావతారం బభివర్ణించెద.

* * * *

సీ. శోభితాపస్తంబసూత్రుఁ డాత్రేయస
గోత్రుఁడు కంచెర్లకులపవిత్రుఁ

Breaks off in the Ayōdhyākāṇḍa.

**Beginning :**

ఉ. శ్రీకరు లబ్ధధారణులు సింధుసముద్భవభూషితుల్ దయా
లోకను లార్యభక్తజనలోలులు నాదిమదంపతుల్ సురా
నీకమునీంద్రవందితులు నిత్యవిభూతు లుమామహేశ్వరుల్
మా కొనగూర్త్రుగాత మసమానకవిత్వపటుత్వసంపదల్.

* * * *

సీ. కాళిదాసుని . . . .
. . . . . . . .
. . . . . . . . . . .
. . . నన్నయభట్టును సన్నుతించి
సొంపుగాఁ దిక్కనసోమయాజిని వేఁడి
భాస్కరు కవివరు భక్తిఁ గొల్చి
నవకవీంద్రుల శ్రీనాథకవిని బోత
రాజుఁ బింగళిసూరపరాజు నల్ల
సాని పెద్దనఁ దిమ్మన సరసరామ
లింగకవి రామభద్రుల లీలఁ దలఁతు.

* * * *

క. భవబంధముక్తికొఱకై
కవనము రచియింపఁ బూని కనుమూసినచో
నవకంజనేత్రుఁ డొకరుఁడు
చెవిలో నా కిట్లుపలికెఁ జిత్తం బలరన్.

"అధ్యాత్మరామాయణ మాంధ్రభాషయా
కురు ప్రకాశం భవబంధముక్తయే."

వ. అనంతరంబున మేలుకాంచి స్వప్నప్రకారంబు విచారించి శ్రీరామప్రసాదంబునఁ గావ్యసాకల్యం బగునని నిశ్చయించి యొకశుభముహూర్తంబున మామకవంశావతారం బభివర్ణించెద.

* * * *

సీ. శోభితాపస్తంబసూత్రుఁ డాత్రేయస
గోత్రుఁడు కంచెర్లకులపవిత్రుఁ

క. సింగనమంత్రికులాంగన
రంగలరఁగ లచ్చమాంబ రహిఁ సతికెక్కెన్
శృంగారకళాసేవిత
యంగజాత ల్లసఁగ సిరులయందు నటించెన్.

చ. అరయఁగ మల్లమంత్రి గురువాంబికయందుఁ గుమారుఁ గాంచెఁ
. . . . . . సయ్యనమంత్రికుంజరున్.

* * * *

సీ. కృష్ణాపురంబునఁ గీర్తి నా(?)నందింప
మేడూరుపురమునఁ బ్రమదమలరఁ
నాగేశ్వరుని సురనాథు మార్కండేశు
స్థిరబుద్ధితోడఁ బ్రతిష్ఠచేసి
వనములు బావులు ఘనముగా వేయించె
మధురాపురముత్రోవ మనుజకోటి
కృష్ణవేణికిఁ జనఁ గృపమాఁది(రా)వులు
ప్రేమ నిల్పెను భక్తి వృద్ధిఁబొందఁ
గలితరచనలు కులెక్కుడుపలుకు లమర
శబ్దనాటకాలంకారసరణు లొప్పఁ
జెలువు మెఱయఁ గాశీఖండ మెలమి ద్వివదఁ
జేసెఁ గంచర్లయయ్యాన శ్రీలు ప్రబల.

గీ. ఖ్యాతి నీరంకిలో రెండునూతు లొనరు
గరిమ నేయించె నన్నసత్తరువు లునిచె
సరవి వడుగులు పెండ్లిండ్లు చాలఁ జేసె
కంచరల యయ్యనామాత్యకవివరుండు.

* * * *

గీ. అయ్యనామాత్యుఁ డుద్వాహ మయ్యెఁ దిరుమ
లాంబ సద్గుణశాలిని యక్కమాంబ
యనఁగ నిద్దరిలోఁ జాల నతిశయిల్లె
నమితసద్గుణనికురుంబ యక్కమాంబ.

క. భారద్వాజసగోత్రుం
డారూఢిగమాగులూరియన్వయపాత్రుం
డారయ బాపనసచివుఁడు
? ధారుణి వర్ధిల్లె సుజనసంఘము మెచ్చన్.

క. బాపనమంత్రికుటుంబిని
యోపికతో లచ్చమాంబ యున్నతి గనియెన్
ప్రాపుగ బంధులు మెచ్చఁగ
సోపాయతభోగభాగ్యశుభములు మెఱయన్.

క. ఆతనిపుత్రుఁడు శరభన
భూతలమునఁ గీర్తిఁగాంచెఁ బుణ్యాత్మకుఁడై
ప్రీతిగఁ జిన్నమ తనకున్
ఖ్యాతిగ నిల్లాలు గాఁగ భాసురగుణుఁడై

క. శరభనతమ్ముఁడు శ్రీగిరి
యుగుతరమగు ప్రవణ మెఱయ నొప్పె ధరిత్రిన్
వరగుణవతి నాగమ తన
కిరువుగఁగులకాంత యగుచు నెలమి వసింపన్.

క. శ్రీగిరికిని సోదరుఁడై
రాగిలె వీరప్రధాని ప్రాభవ మెసఁగన్
బాగుగ లచ్చమ తన కను
రాగముతోఁ బెండ్లికూఁతు రై వర్తిల్లన్.

గీ. బాపమంత్రీంద్రుఁ డొగిఁ గాంచెఁ బ్రబలి లచ్చ
మాంబయందును శరభనమంత్రివరుని
శ్రీగిరీంద్రుని వీరన శ్రేష్ఠగుణుని
నకరమాంబకు సోదరు లైనవారి.

* * * *

చ. ప్రమదము మీఱ మల్లనయు భద్రయశోనిధి భద్రమంత్రియున్
క్రమమున నయ్యావారు మఱి నాగనమంత్రియు శ్రీగిరీంద్రుఁడున్
విమలగుణాఢ్యులున్ దనకు వే జనియించిరి యకరమాంబకున్
అమరపయోధికిం జనన మైనసురద్రుమపంచకం బనన్.

* * * *

గీ. మల్లసచివునికులకాంత మహిని బ్రబలె
భాసురానూనసంపదల్ పరిఢవిల్ల
నిరుపమానందసద్గుణనీతి యగుచు
విభుమనఃపద్మరోలంబ వీరమాంబ.

* * * *

గీ. భద్రమంత్రిభార్య పతిభక్తిచే నొప్పెఁ
బద్మయనఁగ సుగుణసౌమ్యయగుచుఁ
బరమభక్తితోడఁ బతిని వ్రాప్తిని
నిలిపి కొలిచ్చి భావమలరుచుండె.

ఉ. భద్రనసోదరుండు . . . . .
. . . . . అయ్యవారు.
. . . . . . . .
. . . . . . . .

క. జ్ఞానామృతనిధి యద్వై
తానందసరస్వతులకు నతిమోదముతో
మానుగఁ బ్రియశిష్యుండై
ధీనుతి మనె నయ్యవారు తేజం బెసఁగన్.

క. ఇమ్మగసింగనబాపకు
తిమ్మన పద్మనయు నరసధీమణి యనఁగా
సమ్మతితో నుదయించిరి
తిమ్మన యామువ్వురందు స్థిరమతి యయ్యెన్.

గీ. తిమ్మసచివుండు కేసమదేవియందుఁ
బుత్రులను గాంచె వంశ పవిత్రగుణుల
నరసనను సింగరయ్యను సరసుని చిన
నరసమంత్రిని నరసక్కు నరుదు మీఱ.

గీ. వారిముువ్వురితోఁబుట్టు వైననరస
మాంబ నతివేడ్కఁ గంచర్ల యయ్యవారు
ప్రియము శోభిల్ల శుభరీతిఁ బెండ్లియాడె
లోకు లెల్లను వినుతింపఁ బ్రాకటముగ.

* * * *

ఉ. సాగరవేష్టి తావని విశాలయశఃప్రభ లుల్లసిల్లఁగా
భోగములందు నింద్రుఁడన బుద్ధిసమగ్రత గీష్పతే యనన్
రాగిలె రాజపూజితుఁడు నాగవిభూషణపాదభక్తుఁడౌ
నాగనమంత్రి మంత్రికులనాథుఁడు భూరిదయాసముద్రుఁడై.

క. ఆనాగమంత్రికులసతి
భూనుతముగ గంగమాంబ పొలుపొందు ధరన్
సూనాస్త్రితల్లిమాడ్కిని
నానాసంపత్ప్రచారనయగుణమహిమన్.

క. నాగనకు సోదరుం డగు
శ్రీగిరిబవాఖ్యభోగభాగ్యచిహ్నాలు మెఱయన్
ధీగరిమంబునఁ బ్రబలెను
బాగుగఁ బాపమ్మ తనకు భార్యై చెలఁగన్.

*　　*　　*　　*

క. వీరలతోఁబుట్టువు లగు
నారీమణు లవని వెలసినారు గుణాఢ్యల్
మారుచుగురువమ గిరియును
మాఱునితలిఁబోలు సర్వమంగళ యనఁగాన్.

ఉ. కంచరలాన్వయాంబునిధికైరవబాంధవుఁ డయ్యవారికిన్
సంచితపుణ్యశీల నరసమ్మకుఁ బుత్రుఁడ రామభక్తుఁడన్
బంచశరారిపాదయుగభావనచేతఁ గవిత్వసంపదల్
గాంచినవాఁడ రామకథఁ గౌతుకవృత్తిని జెప్పఁబూనితిన్.

క. అగణితవిద్యావైభవ
సుగుణప్రావీణ్యుఁ డగుచు సూరిజనంబుల్
తగ నను భూషింపంగను
జగములఁ బ్రఖ్యాతిఁ గనినశరభాహ్వయుఁడన్.

క. అకళంకమ లింగమ యచ్చమ
చకలంగఁ బాపమ్మ యనఁగ సరసగుణాఢ్యల్
మికిలి నాతోఁబుట్టువు
లకలంకముగఁ బ్రబలి రవని నతిశయంపదలన్.

గీ. సంస్కృతాలెల్ల నాంధ్రభాషను రచించి
పంచె యధ్యాత్మరామాయణంబు నిలుపఁ
గవుల నేరమి గాదిల కరుణ నన్ను
ధన్యుఁ గావింపఁ దలఁచినతలఁపు గాని.

గీ. శింగరాకానిబోధితశివ కరుండు
. . . . . రామకర్ణకాత్మపుత్రి
వెలయ మద్భార్యయయ్యెను వీరభద్రు
రాణి పేరిటిసతి పూర్ణరాజవదన.

సీ. శకవత్సరంబులు శశిఋతు గుణచంద్రు గణ
లగుక్రోధనాబ్దంబునందు భాద్ర
పదశుద్ధద్వాదశిభానువారంబున
భూపతివీరప్రతాపదేవ
రాయలకును (?)బుణ్యమాయతంబుగఁ గొండ
వలికెన నెడియలు కేమి తెలిపి
ణంగుచువీరెనని(?) రంగరాయనిగారు
వీనా మొసంగిరి భూనుతముగ
నెలమి శ్రీకాకుళంబున వెఁయు తెలుఁగు
వల్లభస్వామి కతిభక్తివర్థిలంగ
సముతుపడిపిన్న తిరువడిఘములకున్న(?)
అంగరంగవైభవముల కమర మఱియు

క. రామానుజకూటంబున
కామించట నృత్తగీత యాచకతతికిన్
దోమాలికకున్ బోగము
భామలకును నిత్యవాద్యపారిణులకున్

సీ. మేడూరిపాలఘులోడుర్ల యాజ్ఞఖో (?)
గాతి తేజస్వామ్యములరునట్టి
స్థలకరణం బైనసత్యసంపన్నుఁడు
కంచర్ల రాఘవగారివశముఁ
గా సర్వమాన్యముగను మణ్ణుణటని
పాలుపొందఁ బంద్రెండుపుట్లు నిత్తు (?)

లాంగిఁబాలుమేర బాగుగ నాచంద్ర
తారార్కమై(?)తనరుచుండు
(?)నుచునిరాతిపైనలరుశాసనంబు
(?)ప్రఖ్యాతిజగతివిడుబమయ్యె
గజపతీశ్వరుఁ డేలెడుకాలమందు
నిక్షిమర్యాద వర్తిల్లెనెట్టణముగ.

క. కపిలేశ్వరపురిలింగము
విపరీతిగ నుదుటికన్నుఁ విప్పినఁ జని తా
నుపశాంతిగ నానరించెను
జపమహిమన్ శరభరాజు సభ్యులు మెచ్చన్.

క. ఈరంకినిపాలిమేరకుఁ
గోరికతో శరభరాజు కోడును కలియున్
కూరిమితోడను(?)వే
మారును వేయించె ధర సుధీగత మెఱయన్.

గీ. పరమమౌద్గల్యగోత్రవిభ్రాజితుండు
రమణరాజేంద్రు లన్నమారాధ్యు లెలమి
వసుధకంచర్లవంశమువారి కెల్ల
గురువులై చాలవిఖ్యాతిమహి(గరి)మ మెఱయు.

గీ కొండపల్లిని కొండలు గొల్లపూడిఁ
(?)గొందలుండిరి కాత్యాయనితంజాపురందుఁగొంద
ఱెలమి వసియించి ప్రబలిరి చెలువు మిగుల
మీఱి కంచర్లవంశంబువారు ధరణి.

గీ. వసుధఁ గంచర్లవంశంబువారి కెల్ల
నాయురారోగ్యభాగ్యంబు లతిశయిల్లఁ
బోసఁగ నిలువేల్పు దానౌచుభూరికరుణఁ
బ్రజలరక్షించు శ్రీవీరభద్రుఁ డెపుడు.

క. . . . . . . . . .
. . నయోధ్యానిలయశ్రీరామునకున్
. . . . . . . . .
. . . . . . . .

వ. సంప్రీతిగా శ్రీమదధ్యాత్మరామాయణమాహాత్మ్యంబు రచియించి తదనంతరంబున శ్రీమదధ్యాత్మరామాయణంబు రచియించెద నందు శ్రీమదధ్యాత్మరామాయణమాహాత్మ్యంబునకుఁ గథాక్రమంబెట్టిదనిన.

* * * *

గీ. అఖిలలోకచరుఁడు హరివరభక్తుండు
పరహితార్థలోకపావనుండు
నయగుణాఢ్యుఁ డైననారదుఁ డొకనాఁడు
సత్యలోకమునకు సంభ్రమమున.

**Colophon**

ఇది శ్రీభవానీశంకరప్రసాదలబ్ధకవితాచాతుర్యశ్రీమదాత్రేయసగోత్ర కంచర్లఅయ్యనామాత్యపుత్రసకలవిబుధవిధేయశరభననామధేయప్రణీతంబైన శ్రీమదుమామహేశ్వరసంవాదంబును, విశ్వామిత్రప్రోక్తంబును సకలపురాణసమ్మతంబును నగు శ్రీమదధ్యాత్మరామాయణంబునందు బాలకాండము సంపూర్ణము.

* * * *

**End :**

చ. విమలవిచార ధీర బలవిక్రమశాలివి నిన్నెఱుంగుటల్
సమయము గాదు సుమ్ము రఘుసత్తమ దృశ్యము లైనయట్టిరా
జ్యములు శరీరముల్ నిజము లైనఁ బ్రయాసము మేలుగాక దుః
ఖములకు మూలమై ధ్రువము గా దది గానఁ బ్రయాసమేటికిన్.

* * * *

(వి-వి.)—

మొదటినుండి యయోధ్యాకాండమునఁ గొంతవఱకున్నది. వ్రాఁత యొకవిధముగానున్నది తప్పులతడక. శైథిల్యపాతములు కానరావు.

కంచర్లశరభనకవి యీయధ్యాత్మరామాయణమును రచియించెను. ఇతనితలిదండ్రులు నరసమాంబఅయ్యనామాత్యుడు; ఆత్రేయసగోత్రులు; ఆపస్తంబసూత్రులు. వీరిమూలపురుషుఁడురామన మేడూరిస్థలకరణముగా నుండెనఁట. ఈశరభనతాత కాశీఖండమును ద్విపదకావ్యముగా రచియించెను. సప్తసంతానాదులొనరించెను. ఈకంచెర్లవారు కొండపల్లె గొల్లపూఁడి తంజావూరు మొదలగుస్థలముల వసించుచుండిరఁట. మహాద్భల్య

గోత్రీయుఁ డైనరాజేంద్రులయన్నమారాధ్యులీవంశము వారికెల్ల గురువఁట. వీరియిలువేల్పు శ్రీవీరభద్రుఁడు. ఈకవి తన వంశస్థుఁడగు రామనవశమున వీరపిరంగరాయ(?) లనునాతఁడు వీరప్రతాపదేవరాయల పేర శా॥శ ౧౩౬౧ వ సంవత్సరమున శ్రీకాకుళాంధ్రవిష్ణువునకు షోడశోపచారపూజాదుల జరుపుటకుఁగా బంద్రెండుపుట్లవిత్తనాలపట్టుభూమిని మాన్యముగా నిచ్చియుండినట్లు చెప్పికొనుచున్నాఁడు. ఇందుకు శిలాశాసనమును గలదఁట. ఈ సందర్భమును దెలుపు పద్యములు దోషములతో సందిగ్ధార్థములుగానున్నవి. ఇంకనునీకవివంశీయులచేతఁ జేయఁబడిన ఘనకార్యములు నుదాహృతభాగమువలనఁ దెలియనగు. ఏతత్క-వి దీనిని శ్రీరామునకుఁ గృతియిచ్చెను.

---

## R. No. 314.

Paper. Size, $10\frac{3}{8} \times 9\frac{1}{8}$ inches. Foll. 74. Lines, 20 on a page. Mode of writing, good but containing mistakes. Good.

Transcribed in the year 1916–17 from the MS. of M.R.Ry. Krōvi Dakṣiṇāmūrti Garu of Chintakunṭapalemu, Masulipatam.

### విజ్ఞానేశ్వరీయము.

### VIJÑĀNĒŚVARĪYAMU

A rendering into Telugu prose of the Sanskrit work on Dharma-Śāstra, Vijñānēśvarīya—Vyavahārakāṇḍa. It is divided into 24 sections. The name of the Telugu author is not known.

Contains only the Vyavahārakāṇḍa consisting of the Pūrva and the Uttarā Bhāgas.

The name of the scribe and the date of transcription are given in the Telugu extract, as found at the end of the original MS.

**Beginning:**

వ. రాజైనవాడు క్రోధము లోభము లేక విద్వాంసు లైనబ్రాహ్మణులతోఁగూడుకొని ధర్మశాస్త్రక్రమాన వ్యవహారాలు పరామర్శించవలెను. అందుల తప్పువచ్చినట్టాయెనా రాజునకు . . . ణులకు పనిలేదు. నేరములేనివారిని దండించినా నేరము గలవారినిదండించకున్నా రాజుకపకీర్తిన్ని నరికమున్ను ధర్మశాస్త్రమునకు విరోధము లేనప్పుడు దేశాదిసమయధర్మములున్ను ధర్మశాస్త్రసమ్మత మనంబడును. వేదశాస్త్రములువచ్చి ధర్మజ్ఞులై శత్రుమిత్రులయందు సమముగా నుండువార్లను సభకు పిన్నపెద్దలను సేయవలయును.

*　　*　　*　　*

**End :**

రాజైనా అన్యాయముచేతను దండుగ పుచ్చుకోక వున్నట్టాయెనా బ్రాహ్మలతో దెలియఁజెప్పి పుచ్చుకొనినదండుగకు ముప్పైఅంతలు వరుణ దేవుని కని పలుకరించి తీసి బ్రాహ్మణులకు యియ్యవలెను. దండుగ పుచ్చుకొన్నంతసొమ్ము వానికియ్యవలెను. విజ్ఞానేశ్వరీయము రెండోఅధ్యాయములోను ఉత్తరార్ధమాయెను.

ఈ అధ్యాయమందుప్రకారణాలవరుస.

౧. వ్యవహారమాతృకాప్రకరణము.
౨. భుక్తిలక్షణము.
౩. నిక్షేపహారణము.
౪. సాక్షిప్రకరణము.
౫. లేఖ్యలక్షణము.
౬. దివ్యస్వరూపకథనము.
౭ దాయవిభాగము.
౮. సీమావివాదము.
౯. స్వామిపాలనవివాదము.
౧౦. అస్వామివిక్రయము.
౧౧. దత్తాప్రదానికము.
౧౨. క్రీత్వానుశయము.
౧౩. అభ్యుపేత్యశుశ్రూష.
౧౪. సంవిద్వ్యతిక్రమము.
౧౫. వేతనాదానము.
౧౬ ద్యూతసమాహ్వయము.
౧౭. వాక్పారుష్యము.
౧౮. దండపారుష్యము
౧౯. సాహసము.
౨౦. విక్రియాసంప్రదాయము.
౨౧. సంభూయాసముత్థానము.
౨౨. స్తేయప్రకరణము.
౨౩. స్త్రీసంగ్రహణము.
౨౪. ప్రకీర్ణసమితి.

**Colophon :**

ఇవి యిరువదినాలుగు. వ్యవహారకాండము సంపూర్ణము.

"తారణనామసంవత్సర భాద్రపద శుద్ధ ౫ శుక్రవారమువరకు వేమూరి గోపాలసోమయాజులు విజ్ఞానేశ్వరము వ్యవహారకాండ ౨౪ ప్రకరణాలు మాతృకలో వున్నక్రమాన సంపూర్ణంగా వ్రాసెను" అని యున్నది.

(వి-పి.)——

ఇందు వ్యవహారకాండము మాత్ర మున్నది. వ్రాఁత బాగుగా నున్నది. తప్పులుకలవు. క్రొత్తది.

ఇది విజ్ఞానేశ్వరీయమందలి వ్యవహారకాండమునకుఁ దెలుఁగువచనము దీని నెవరు చేసిరో తెలియరాదు. ఇరువదినాల్గు ప్రకరణములుగ భాగింపఁబడియున్నది.

R. No. **315**.

**Paper.** Size, $10\frac{3}{4} \times 9\frac{1}{2}$ inches. Foll. 88. Lines, 20 on a page. Mode of writing, settled but not free from mistakes. Good.

Transcribed in 1916-17 from a manuscript of M.R.Ry. Dēvata Raṅganāyakulu gāru of Bhimavarapukota, Tuni taluk, Gōdavari district.

నలచరిత్రము (ద్విపద).

NALACARITRAMU (Dvipada).

Same work as that described under R. No. 145 *ante.* The author is Cakrapuri Rāghavakavi, son of Tiruveṅgaḷārya.

Complete in two Bhāgas (Pūrva and Uttara).

**Beginning :—**

శ్రీరంగసదళాత్ము స్థిరకృపాకటాత్ము(?)
వాసవస్తుతభాషు వరభక్తపోషుఁ
బరమదయాకల్పుఁ బన్నగతల్పుఁ
గరిరాజవరదుఁ గౌస్తుభమణిహారు

. . . . . . . .

నిరుపమజయ . . నిత్యకళ్యాణుఁ
గరుణామహోల్లాసు ఘటికాద్రివాసు
. . . . . . సన్నుతిచేసి
యురవొంద భూతపురీశు యతీశు

. . . . . . . .

చిరకీర్తిగాంభీర్యు శ్రీభాష్యకార్యు

. . . . . . . .

కందర్పసంకాశుఁ గుణావిశేషుఁ
గందాళగురుచంద్రు ఘనదయాసాంద్రు

. . . . . . .

నరపుణ్యచారిత్రు వాదూలగోత్రు
దుగత(?)ర్యు దొడ్డయాచార్యు
మఱవక సేవించి మఱి ప్రస్తుతించి

. . . . . . . .

భారతకథలోనఁ బంచమవేద
సారం బనఁగఁ గీర్తి సాధించెఁ గాన

వార్తగా నలచక్రవర్తిచరిత్రఁ
గీర్తించి హరికి నంకితముగాఁ ద్విపదఁ
గావింతు . . . . . .
. . . . . . . . .
పరమపావనుఁ డైనపాండునందనుఁడు
ధరయెల్లఁ గపటజూదంబున నోడి

* * * *

End:—(of the Purvabhaga).

వినుతవాక్యంబుల వెలయంగఁ జెప్పె
ననుచు వాధృస(వాధూళ)గోత్రాబ్ధిచంద్రుండు(?)
చిరకీర్తివంతుఁ డా శ్రితహితోదయుఁడు
కరుణాపయోనిధి కందాళ దొడ్డ
యాచార్యునకు శిష్యుఁ డైనట్టివిష్ణుఁ
డాచారతత్పరుం డతిదయాకరుఁడు
పొలుపు మీఱినవక్రపురి దొడ్డఘనుఁడు
వలనొప్ప నతనికి వరమూర్తి తనయుఁ
డకలంకమానసుం డతిపుణ్యచరితుఁడు
సకలవైష్ణవపాదసంసేవకుండు
రంగనామాత్యుండు రాజపూజితుఁడు
సంగీతసాహిత్యచతురమానసుఁడు
సరసత సత్కవీశ్వరుగు(రకు)లాధీశుఁ
డరయంగ నాతని కరయ సోదరుఁడు
దనరిన సకలవిద్యాప్రవీణుండు
జనలోకహితుఁడు సజ్జనలోకహితుఁడు
తిరువేంగళార్యుండు ధీరాగ్రగణ్యుఁ
డర్థయ నాతనిపుత్రుఁ డబ్ధిగంభీరుఁ
డమలమానసుఁడు విద్యావిశారదుఁడు
రమణనె వరకవి రాఘవాహ్వయుఁడు.
నరహరిఘటికాద్రినాథుని పేరఁ
బరువడి నేనాంధ్ర)భాషలు వెలయ
నవనిలోఁ గవిరాజు లైనట్టిసరస
కవుల సత్కృప నాకుఁ గలుగఁగ జేసి

యలవడి యీనలోపాఖ్యాన మేను
బోలుపొందఁ జెప్పితిఁ బూర్వభాగంబు
రచియించి శ్రీహరి కర్పణచేసి
వినుతి కెక్కి తి రామవిభుకరుణచేత.
ధర్మమార్గంబున ధరణి పాలించె
ధర్మజ యని బృహదశ్వుండు సెప్పి(ప్పె)
శ్రీరంగరాజ యాశ్రితకల్పభూజ
నీరజదళనేత్ర నిత్యచారిత్ర
హాస్తీంద్రసంరక్ష యమరారిశిక్ష
కౌస్తుభాంచితవక్ష కాలేయరక్ష
రంగనాయకరాజ రాజార్కతేజ
రఁగుమెలంగుభారత పురాణమున
బన్నుగా నారణ్యపర్వంబునందు
వన్నెగా నలచక్రవర్తిచరిత్ర
వినిన వ్రాసిన జదివినను బేర్కొనిన
శని పీడ వారలఁ జేరంగ వెఱచు
కమనీయ ధర్మార్థకామము ల్గలిగి
కమలాయతాక్షుని కరుణః జెన్నొంది
తలకొని యాచంద్రతారార్కముగను
వెలసి కీర్తుల నభివృద్ధిబొందెదరు.

(వి-వి.)——

సంపూర్ణము. (పూర్వోత్తరభాగములు.) వ్రాఁత కుదిరికయైనది. తప్పులు కుప్ప. నూతనము.

ఈ ద్విపద నలచరిత్రమును చక్రపురి రాఘవకవి రచియించెను. ఇతఁడు వైష్ణవుఁడు. ఇతని తండ్రి తిరువేంగళార్యుఁడు. వీరు కందాళ దొడ్డయాచార్యుని శిష్యులు. ఈయాచార్యుఁడు వాధూల గోత్రజుఁడు. ఇది ఘటికాద్రినాథున కంకిత మీఁబడినది. ఇది డై. క్యా. నెం 145 రున వర్ణింపఁబడినదియే యైనను దీనఁ జాల భేదము చూపట్టుచున్నది. ఇం దుదాహరింపఁబడిన భాగము విశేషములం దెలుపఁగలదు.

---

R No. **316**.

Paper. $10\frac{3}{4} \times 9\frac{1}{8}$ inches. Fol. 32. Lines, 20 on a page. Mode of writing, fair and incorrect. In good condition.

Transcribed in the year 1916–17 from the MS. of M.R.Ry. Kāśīnātha Bhairavamūrti Ayya Garu of Elakurru, Kistna district.

భక్తానంద కల్పద్రుమము.

BHAKTĀNANDA KALPADRUMAMU.

Topics relating to astrology, palmistry, etc , are here discussed in the form of a dialogue between Bṛhaspati and Himavanta. The author is Bāpirāju. The composition is not faultless. The work was dedicated to Oṭla Subbanna.

Breaks off in the 2nd Āśvāsa.

**Beginning:**

క. శ్రీమన్మతజనసమ్మత
భాషాపతితుల్యవేత్త ప్రౌఢధురీణా
భూమణియుగపాండురవా
స్తోమ్యతిసమవైభ వోట్లసుబ్బనవర్యా.

* * * *

మ. అనుచుం బాపకవీంద్రు కల్పకము భక్తానందకల్పద్రుమం
బను ప్రాబంధముఁ జేసె నందుఁ గథలుం న్యాయంబు గానీవుమా
కును దెల్పు న్నని కోఁకదుం డడుగ లోకుత్తైచ్చ గానూ విదుం
డును దెల్పంగఁ దలంచెఁ బుట్టుమొదలుం రూఢిం వచోద్గాఢమై.

**Colophon:**

గద్య. ఇది శ్రీమదంకదేవ కాళీవరప్రసాదలబ్ధసకల జనమతసమ్మత స్తుతవివాయిత ధౌరేయ నిరంతరోద్గాఢార్థ సౌందర్యతాత్పర్యమాధుర్య శబ్దగుంభనాలంకార ప్రేతునుగుణ్యప్రకటనటననానాదేశాన్విత భాషాకవితాంధ్ర గీర్వాణఘుటికాశత గ్రంథకల్పకవిద్వజ్జనాహ్లాదకర పాకనాటిశ్రేష్ఠ పరాశరగోత్రశివ పూజాధురంధర వట్పామాత్రనిగూరగిరత్నాకర శశాంక పరమపాతివ్రతతుల్యాచ్చమాంబాధ వేశ్వరవదప్పాబాజాబ్ధిసుధాకర దివాకర రాజు శేషాచలానులావతి వేంకమాంబాసుత బాపిరాజప్రణీతంబైన భక్తానందకల్పద్రుమంబను ప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము.

**End:**

సీ. మీభాషణముకంటె మించు పలుకుల చెలిఁ
జూడరా ధ్వనియందు శుకములాల
మీచదువుకంటెను మించి చదివిన చెలి
నగుబడె సరణి శారికములాల(?)
మీస్వరతుల్యమా మేలయినయట్టియా
యతివె నెరుగర పరభృతములాల
మీదునడ. సమాన మేలుతరుణీమణిఁ
గనర విధాత వాహనములాల
గనర మిముబోలు జనులు లోకంబులాల
అనుచు యీలాగు సతికిపై పాడలుచూను(?).

(వి-వి.)—

అసమగ్రము. ద్వితీయాశ్వాసమున గొంతవఱకుఁ గలదు. వ్రాత సామాన్యము. తప్పులకు మేరయే లేదు. శైథిల్య గ్రంథపాతములు లేవు.

ఇయ్యది బృహస్పతికి హిమవంతునికినైన సంవాదము. ఇందు జ్యోతి స్సాముద్రికాది శాస్త్ర విషయములు చిన్న కథలుగఁ జర్చింపఁబడినవి. దీని రచయిత పాకనాటి నియోగి యగు బాపిరాజు. కవిత్వము దుష్టము. దీనినీతఁడు ఒట్ల సుబ్బన్న కంకిత మొసంగెను.

---

## R. No. 317.

**Paper.** 11 × 9½ inches. Foll. 64. Lines, 20 on a page. Mode of writing, good but containing mistakes. In good condition.

Transcribed in the year 1916–17 from the MS. of M.R.Ry. Paṇḍitārādhya Vīrēśaliṅgam Garu of Mummadiyaram, Amalāpuram taluk, Godavari district.

వీరశైవదీక్షాబోధ (ద్విపద).

VĪRAŚAIVADĪKṢĀBŌDHA (DVIPADA).

A treatise in Vīraśaiva religion dealing with the initiation into the principles thereof. It is in the form of a dialogue between the Guru and the pupil. The author is Piḍuparti Basavana, son of Mallamāmba and Pamaṇaya. The work is based on the Kanarese work of Keriya Padmarasu who first wrote the work in Sanskrit. The work was dedicated to Vīrabhūpati, son of Timmabhūpati. The author states that

he was the disciple's disciple of Pālkuriki Sōmanātha's (the author of Basava Purāṇa) disciple's disciple. At the end of the Telugu extract there is a stanza in the Kanda metre in which is mentioned the name of the scribe

Complete in three Āśvasas.

**Beginning :**

శ్రీగురులింగంబు ఒ(చి)న్మయాంగంబు
యోగాంతరంగంబు యోగిసంగంబు
దూతదుస్సంగంబు దోషభంగంబు
వీతాభిషంగంబు వేదరంగంబు

* * * *

తగఁ .డసిన పండితస్వామిఁ గొలిచి
బసవపురాణాది బహుకృతుల్ సెప్పి
వసుమతి వీరశైవ . . . .
. . . . బొగడి.

* * * *

చిన్నప్రాయమునఁ జెప్పితి శివకథలు
. . . గా నూతనోక్తులను
గాల మాసన్నంబు గాకటమున్నె
లాలిత కావ్యకళా ప్రౌఢిపేర్మి
. . . . . . . .
సకలాగమ పురాణసమ్మత మైన
యొకశివకథ యుఁక నొనరింపవలయు
వాయార శివకథ వర్ధనార్థ(?)
. . . . . . . .
ఉన్నతంబుగను నేనూహించుతఱిని
రాజశిఖామణి రాజమాన్యుండు

* * * *

. . శివపాదభక్తిసంబంధ
బాంధవాశ్రిత మిత్రపాలనశాలి.

* * * *

వీరశైవాచార విమలవర్తనుఁడు

* * * *

జైత్రుఁడై సతతకృపాసాంద్రవిశాల
నేత్రుఁడై చను తిమ్మనృపవరేణ్యుండు.
ఆతిమ్మ నృపతికి ననుఁగునందనులు

* * *

అం దగ్రజుఁడు బాంధవాశ్రితసుకవి
మందారభూజ మమందప్రతాపి.

* * *

రాజశేఖరుఁ డగురాజశేఖరుఁడు

* * *

వినుతి కెక్కినయట్టి వీరభూవరుఁడు.

* * *

కుంభిని వెలసిన గుర్వభూవిభుఁడు

* * *

వారిలో వీరభూవరుఁడు తిమ్మేంద్రు
గారాపుపట్టి సంగతి నీతిపట్టి

* * *

సరవితోఁ గాలంబు జరపుచు నుండు.
అంతటఁ గర్ణాట మందుండి భక్తి
మంతుండు శైవాగమపురాణవేది
పరమసద్గురు చెన్నబసవేశ
. . . . తకాయుండు పుట్టి

* * *

మతవీరశైవ ధర్మప్రచారుండు
నసమభక్తిజ్ఞాని యభినవచెన్న
బసవేశుఁ డగుచెన్నబసవేశ్వరుండు
పొదలు శివస్థానముల శివజ్ఞాన
విదుల మహాత్ముల శిక్షించుకొనుచుఁ
గ్రచ్చర వీరభూకాంతుఁ డున్నెడకు
వచ్చినఁ బ్రణమిల్లి . . . .

* * *

సతతంబు వారిచే శైవశాస్త్రములు
నతిభక్తి వినుచుండి యట్లొకనాఁడు.
శైవదీక్షాబోధఁ జదివి యర్థాను
భావం బెఱింగింపఁ బరిణామమొంది
యెలమి నీకృతి ముక్తి కిడినసోపాన
మలయట్ల పర్యాయములు చెప్ప నొప్పు
నిది శివా(ను)భవైక హేతువుజ్ఞాన
పదవికి నిచ్చెన భక్తికిఁ ద్రోవ
తెలుఁగున నిట్టిభక్తివిధానచరిత
వెలయఁగ నెన్నఁడు విన మిది యాంధ్ర
కృతి యైన నెల్లవారికి భక్తియుక్తి
మతిఁ దోఁచు నుత్తరమార్గంబుఁ దెలియఁ
దెలుఁగుకవిత్వంబుఁ దేటగాఁ జెప్ప
బలియుండు పిడుపర్తిబసవనాహ్వయుఁడు
వారిచేఁ జెప్పింపవలయు నీచరిత
మారూఢి ద్విపదగా నని తలపోసి
వీరభాణా(ణ)తుమ(మా) విభుతిమ్మశౌరి
వీరభూపాలుండు వేడ్క దైవార
ధీనిధి పిడుపర్తి రమణయ్యకును
మానిని మల్లమాంబకుఁ దనూభవుని
పరమమాహేశ్వరపదసేవైక
పరతంత్రుఁ బిడుపర్తిబసవనాహ్వయుని
ననుఁ బిలిపించి సన్మానంబు చేసి
వినయంబుతో భూతిపీడ్య మర్పించి
కృతిదీక్షబోధ కేగియపద్మరసువు
రతిఁ గన్నడంబున రగడఁ గావించెఁ
దెలుఁగున నాకృతి ద్విపదగా మీరు
సలవరింపుఁడు మాకు నభిమతం బనిన
నతిసంతసమున మిన్నందినాకావ్య
చతురత నేఁడుగా సఫలత నొందె
భావింప నాజిహ్వా పావనం బయ్యె
భావశుద్ధుఁడు కెరియపద్మరసు తొల్లి

యకలంక వేదవేదాంతసిద్ధాంత
సకలాగమగ్రంథజాలము ల్గూర్చి
సరవిఁ గావించె దీక్షావిధానంబు
గరిమ నాసంస్కృతగ్రంథార్థ మెల్ల
వారికిఁ దెలియంగ వశము గాదనుచు
బోరున నయ్యర్థములు కన్నడమున
వెరవార రగడఁ గావించె గ్రంథములు
వరుస సాక్షులు గాఁగ వ్రాసిచూపుచును
జరిపిన బహుశాస్త్రసారంబుగాని
నరులు చేసినకల్పనాకృతి గాదు.

* * * *

కావున నిట్టిదీక్షాబోధ కవిత
గావేడ్కఁ దెనుఁగునఁ గావింపఁ గంటి
వీరబాణుని తిమ్మవిభువీరనృపతి
కోరికయును సమకూర్పంగఁ గంటి
. జాజులుదేవరప్రసాదంబు
నతిశయంబుగ నాకు నబ్బినట్లయ్యె.
నని కృతి నీగీతి నంగీకరించి
ననిచినమతి మహానందీశు నిలిపి
చెలఁగి దీక్షాబోధఁ జెప్పఁ బూనితిని
. . చారిత్రవిధ మెట్టి దనిన,
శ్రీవాస నిజరూప భక్తికలాప (?)

* * * *

సర్వక్రియాధుర్య సజ్జనవర్య
పార్వతీనందన ప్రతిమానకదన
వీరబాణునితిమ్మవిభునికుమార
వీరమహోద్ధార విమలవిహార
భువి నాకట పుణ్యంబు పూర్వజన్మార్జి
తవిశేషమున నాకింత వివేక మొదవ

**End:**

అని సదానందాత్ముఁ డైనశిష్యునకుఁ
దననిర్మలప్రసాదముఁ గృప సేసి

యనుపమలింగతత్వామృతవార్ధి
ననుదినంబును నోలలార్ప శిష్యుండు
నతిభక్తి గురునాథు నంఘ్రిపద్మములు
ప్రతిముహూర్తంబును భజియింపుచుండె
నని యిట్లు కెరియ(పద్మ)రసు పురాణ
విను తాగమగ్రంథవితతుల సాక్షి
గా లిఖియించి దీక్షావిధానంబు
గావించి రగడగాఁ గన్నడభాష
ల(న)ప్పరమార్థంబులను భవుఁ దెలిపి
చెప్పంగ ద్విపదఁ జేసితిని నేనిట్లు
శ్రీపరాంబనపాద సేవాధురీణ(?).

*　　*　　*　　*

**Colophon :**

ఇది పాలకురికిసోమేశ్వరారాధ్య
సదమలశిష్యశిష్యప్రశిష్యుండు
సకలమాహేశాంఘ్రిజలజషట్పదుఁడు
సుకరశైవాగమసూత్రార్థవేది
సవిమలత్రివిధప్రసాదసుఖాను
భవపూర్తి పిడుపర్తిబసవనార్యుఁడు
రచియింపశైవపురాణతంత్రమునఁ
(బ్రచురమైభక్త) సభాయోగ్యమైన
ఘనతరశైవదీక్షాబోధయందు
ననుపమంబుగఁ దృతీయాశ్వాసమయ్యె

వ్రాయసకాని పద్యము :—

క　శివభక్తులు మతి మెచ్చఁగ
శివరహస్యగ్రంథ మిపుడు చేలిఖియించి
సువిధానంపత్రికామయ
కవిరళమతి నాసగె చెన్నయార్యుఁ డెలమిన్.

(వి-వి.)—

సంపూర్ణము. వ్రాఁత బాగుగానున్నది. తప్పులు కలవు. గ్రంథపాతము లున్నవి. నూతనము.

పిడుపర్తి బసవన చేసిన యీద్విపదకావ్యమున శైవవేదాంతము గురుశిష్యసంవాదరూపమునఁ బ్రతిపాదింపఁబడినది. మూఁడాశ్వాసములుగ విభజింపఁబడినది. మల్లమాంబారమణయ్యలకు: గోమరుఁ డనునీకవి కెరియ(?)పద్మరసు కర్ణాటకభాషయందు రచియించిన రగళ గ్రంథమునుబట్టి దీనిని రచియించెను. పద్మరసు సంస్కృతమునఁ దొలుత రచియించి, పిమ్మటఁ గన్నడించెను. ఈబసవన పాలకురికి సోమనాథునిశిష్య, శిష్య ప్రశిష్యుఁడనని చెప్పుకొన్నాఁడు. ఈ గ్రంథము వీరభూపతి కంకిత మీఁబడినది ఇతనితండ్రి తిమ్మభూపతి ఈ కవి చెన్నబసవపురాణ కర్తకాఁడు.

---

## R. No 318

Paper. 13 × 8⅜ inches. Foll. 27. Lines, 24 on a page. Mode of writing, good but full of mistakes. In good condition.

Transcribed in the year 1916–17 from a MS. of M.R.Ry. Vāḍrēvu Vīranna of Patakōta, Rāmachandrapuram taluk.

ఆంధ్రకౌముది.

ĀNDHRAKAUMUDI.

This is the same work and of the same extent as the one described under R. No. 124(*b*) but the stanzas containing the author's name, etc., are not found

(వి-వి.)—

మొదటినుండి క్రియాప్రకరణంబునఁ గొంతవఱకుఁ గలదు.

వ్రాఁత లెస్సఁగానున్నది. తప్పులు పెక్కు గలవు. గ్రంథపాత శైథిల్యరహితము.

ఈగ్రంథమే త్రై. క్యా. నెం 124 (*b*) దున సంపూర్ణముగా వర్ణింపఁబడియున్నది. ఇందుఁ గర్తృనామాదులం దెలుపు శ్లోకములు మాత్రము లేవు.

---

## R. No. 319.

Paper. 10¾ × 9½ inches. Foll. 26. Mode of writing, fair but full of mistakes. In good condition.

Transcribed in the year 1916–17 from a MS. of M.R.Ry. Venkatachalam garu of Bhatlapenumarti, Divi taluk, Kistna district.

క్షేత్రగణితము.

KṢĒTRAGAṆITAMU.

Same work as that described under R. No. 393 (*b*) of the Sanskrit part of the Triennial Catalogue of MSS. Vol I, Part 3, wherein see for the beginning. There are differences in reading, arrangement of matter, and manner of treatment. The name of the author is not known.

Contains the chapter on Geometry incomplete. Foll. 20 to 26 contain Telugu stanzas relating to the solution of arithmetical problems based on rule-of-three etc.

**Beginning:**

See R. No. 398 (*b*), Sanskrit Part of the Triennial Catalogue of MSS.

**End:**

పాదచ్ఛాయఘటికానిర్ణయము.

శ్లో. నవత్యష్టపదాదేకానాడికాతత్రఉచ్యతే
పంచార్ధచత్వారింశద్ద్వే అష్టావింశత్త్రియస్తథా
ఏకోనవింశచ్చత్వారిచతుర్దశ్యాంతుపంచకమ్
దశార్ధేనాడికాషట్చ అష్టకేసప్తనాడికాః
షట్పదేచాష్టకంవింద్యాచ్చతుర్థేనవసప్తకమ్ ?
త్రింశార్ధేదశకంవింద్యాద్ద్వ్యర్ధ ఏకాదశస్తథా
ఏకత్రిపాదేద్వాదశకంపాదమేకంత్రయోదశ
చతుర్దశ్యర్ధపాదేచశూన్యేపంచదశస్మృతాః॥

తాత్పర్యము

98 అడుగులు వకఘడియ ; 45½ అడుగులకు రెండు ఘడియలు ; 28 అడుగులకు మూడుఘడియలు ; 19 అడుగులకు నాలుగు ఘడియలు ; 14 అడుగులకు అయిదు ఘడియలు ; 10½ అడుగులకు ఆరు ఘడియలు ; 9 అడుగులకు యేడు ఘడియలు ; 6 అడుగులకు యెనిమిది ఘడియలు ; 4½ అడుగులకు తొమ్మిది ఘడియలు ; 3 అడుగులకు పది ఘడియలు ; 2 అడుగులకు పదకుండు ఘడియలు ; 1½ అడుగులకు పదిరెండు ఘడియలు ; 1 అడుగుకు పదమూడు ఘడియలు ; అర అడుగుకు పదునాలు ఘడియలు ; శూన్యఛ్ఛాయ అయితే పదిహేను ఘడియ లని తెలుసుకునేది.

(వి-వి)—

అసమగ్రము. వ్రాంతి సామాన్యము. తప్పులు లేకపోలేదు. శైథిల్యగ్రంథపాతములు లేవు.

ఇది(సంస్కృతభాగము) త్రై. క్యా నెం 393 (b) లో వర్ణింపఁబడినదే. ఇందు ఖాతగణితము లేదు. వివిధస్వరూపక్షేత్రమానవిధులును ఆయా క్షేత్రములయొక్క స్వరూపవిన్యాసమును, అంకవిన్యాసమును, ఇంకను గణితసంబంధములగు కొన్ని యితరవిషయములును గలవు. కవిపేరింకను దెలియరాదు. 39 వ పత్రమునుండి "మావుల లెక్క" యనుశీర్షికతోఁ త్రైరాశిక విషయము దెలుపు నొకసీస మాలిక 50 వ పత్రము వఱకున్నది. కర్త తెలియరాదు.

---

R. No. **320**.

**Paper.** 10¾ × 9 inches. Foll. 74. Lines, 20 on a page. Mode of writing, fair but incorrect. In good condition.

Restored in the year 1916–17 from a MS. of the Library.

(*a*) కామకళానిధి.

KĀMAKAḶĀNIDHI.

Foll. 1*a*—58*b*.

A treatise in erotics based on the Sanskrit works in this subject:—by Nellūri Śivarāma Kavi, son of Sūramāmba and Vīrarāghava Kavi, the author of the Yādavarāghavapāṇḍavīyamu. The author was a disciple of Nivṛtti Śēsācalarsi. The work was dedicated to Jayasiṁha, grandson of Ēkōji, who was the step-brother of Śivāji of the Bhōsala family and the ruler of the Cōḷa country. Śivāji is said to have conquered the Delhi Emperor and received the title Chatrapati. Ēkōji is stated to have defeated the kings that ruled the country lying to the south of the Narmada, to have set free the Pāndya king from the yoke of the Mysore Raja, and to have ruled the Chōla conntry.

Complete in three Āśvāsas.

**Beginning:**

శా. శ్రీగౌరీసతి పెండ్లివేళ స్వశిరస్సీమంతచంద్రాంతరో
ద్యోగాత్మాకృతి యన్యకాంత యని తా నూహింప రత్నాంకురా

(?)భోగశ్రీశుభకాధృతిన్ మెఱుఁగుగాఁ బూనించుదేవుండు ని
త్యాగారస్థితిఁ బ్రోచుఁగాత జయసింహస్వామి నెల్లప్పుడున్.

* * * *

మ. సకలాంధ్రోక్తుల కాంధ్రపాణిని యనన్ శాస్త్రంబుఁ గల్పించిన
త్సుకృతిప్రత్యయనిర్ణయంబుకొఱకై భాష్యంబుఁ గావించి దే
శికుఁడై రాజులచేతఁ బూజ గొను నా శేషాచలార్యున్ నివృ
త్తికులస్వామిని మద్గురున్ గొలుతు భక్తిన్ మానసాబ్జంబునన్.

క. ఆదిమకవులన్ వాల్మీ
క్యాదుల నాంధ్రు లగునన్నయాదుల మదిలోఁ
బాదుకొలిపి యధునాతను
లై తనరినబుధులఁ దలఁతు నతిమోదమునన్.

* * * *

వ. అని యిష్టదేవతావందనంబును . . . గావించి . .
. . నొక్క ప్రబంధంబు రచియింపవలయు నని నిశ్చయించియున్న
సమయంబున.

సీ. ఒకవంక . . . . .
. . . . . . .
నిండుకొలువుండు జయసింహమండలేంద్రుఁ
డాశ్రితుం డగునన్నుఁ గాంచి యాదరమున.

చ. హితుఁడవు పాకనాటి నుతికెక్కిన నెల్లూరి వంశజాతుఁడ
వతులిత సాహితీపటిమ యాదవరాఘవ పాండవీయమన్
గృతి గల వీరరాఘవకవీంద్రుసుతుండవు కొద్దివాఁడవే
తతమతి సంస్కృతాంధ్రకవితానిరతా శివరామ సత్కవీ.

క. హితమతిఁ బండితపామర
మతమై పురుషార్థమై సమ . . .
. . . . . . . . . పన్
జతురత రచియింపవలయు సరసులు మెచ్చన్.

వ. అని సగౌరవంబుగా . . . . కర్పూర తాంబూలంబుఁ
బెట్టినఁ బట్టి సకల జనులకు నావశ్యకం బయినపురుషార్థంబు కామశా

స్త్రం బదియును బహుమతంబుల సంకీర్ణం బగుటను గీర్వాణ భాషామయం బగుటను సర్వ సాధారణంబుగాదు కావున నది త్రిలింగభాషా రచితంబైనఁ దేటయై యిక్కలికాలంబున కనురాగసౌహార్దకరంబై గ్రాహ్యంబై సంరక్షణీయంబై యొప్పు . . . యీ కృతికిం బ్రారంభించితి. ఏతదాదియందుఁ దదీయ వంశావతారం బభివర్ణించెద.

సీ. అఖిల జగత్స్రష్ట . . . . .
నతఁడు పొగడొందు . . . .
. . . . భాస్కరుండు

క. వానికి నిక్ష్వాకుఁడు . . .

క. ఆయిక్ష్వాకు కులంబున
శ్రీయుతులు దిలీప రఘు . . .
. . . . . . . . . .
. . లుదయ మంది రతుల ప్రౌఢిన్.

గీ. వారి కులమునఁ గలిగె నవార్యబలుఁడు
భోసలాభిధధాత్రీ ప్రభుం డతండు
హితమతిని హాటదేశంబు నేలుచును య
శంబు దిక్కుల నించె భాస్వరవిభూతి.

గీ. అతని పేరిట నా భాస్కరాన్వయంబు
భోసలకులం బనఁగను పొగడు గనియె
నతనికిఁ బురోహితుఁడు గాధిసుతుఁడు గాన
ధాత్రి నతనికిఁ గౌశిక గోత్ర మమరు.

మ. అలగోత్రంబున సంభవించి . .
. . . . . . . . . .
. . . మాలోజి భూ
తలనాథుండు విరాజిలెన్ సకలవిద్యాభోజుఁడై యుద్ధరన్

* * * *

గీ. అమ్మహారాజు తనకు నర్ధాంగ లక్ష్మి
యగు నుమాదేవియందు శాహక్షితీశుఁ
గనియె . . . . . .
. . . . . . . . . . .

* * * *

గీ. తనదు భుజశక్తియును శౌర్యధైర్యమహిమఁ
గాంచి ఢిల్లీశ్వరుఁడు సంతసించి చెలిమి
నాప్తుఁడై మహారాజ విఖ్యాతి నొసఁగ
స్థిరతరవిభూతిచేతఁ బ్రసిద్ధిఁ గనియె.

క. అలఘునుఁడు గుహుఁడు శుభలీ
లల వల్లీదేవసేనలఁ బరిణయమై
వెలయుఁగతి జిజాదేవిని
దులజాదేవిని ముదంబుతో వరియించెన్.

గీ. అల జిజాదేవియందు మహానుభావుఁ
డగు శివాజినృపాలు వీరాధివీరుఁ
డైన శంభోజిరాజా నుదారవీర
నిద్దరఁ గుమారులను గాంచె నెసక మెసఁగ.

క. తులజాంబిక యగు రెండవ
లలనామణియందుఁ గనియె లాలితవిభవో
జ్జ్వలు నేకోజి మహీవిభుఁ
గలశాంబుధి పూర్ణచంద్రుఁ గాంచినమాడ్కిన్.

క. వారలలో నగ్రజుఁ డగు
సారమతి శివాజి (రజ) చంద్రుఁడు బాహా
ధారకరవాలధారా
దారితమువ్రరతురుష్కతతియై వెలసెన్.

మ. అతఁ డుద్వేల భుజాబలాఢ్యుఁడు తురుష్కాధీశుఁ డౌపాదుశా
నతిశౌర్యాప్తిఁ దృణీకరించి బహుదేశాధ్యక్షులం గూర్చి సం
తతధాటీగతి హాస్తిపట్టణముపై దండెత్తి పోరాడి ని
ర్జిత ఢిల్లీశ సమాఖ్యఁ జెందె నృపతిశ్రేణుల్ ప్రశంసింపఁగన్.

సీ. ఏవీరు తేజోదినేశున కవురంగ
జేబుపాచ్ఛా ఘూకశిశుక మయ్యె
నేవీరు సాయకాహికిఁ గ్రూరపారసీ
కకులంబు మూషికప్రకర మయ్యె

నేరాజు హయకోటి పోరాడ గోలకొం
డ బిజాపురంబులు తావు లయ్యె.

. . . . . . . . . .

ఎవ్వఁడేకాతపత్రమై యొసఁగ ధరణి
నేలుచును " ఛత్రపతి " యన మేలుగాంచె
. . . . శివాజి భూపాలకుండు.

* * * *

క. ఆపిరున కనుజుఁడు . . .
. . . . నేకోజి
త్స్మావిభుఁడు . . . .
. . . . . . . .

* * * *

సీ. పారసీకారట్టు బాహ్లీకాజానేయ
ఘోట్టాణ ఘట్టముల్ గొలిచి నడువ
దండెత్తి నర్మదా దక్షిణావనిసీమఁ
గల భూపతుల నెల్లఁ గలఁచివైచి
చేరి కర్ణాటకక్షితి బెంగుళూరిలో
నిలిచి వింధ్యాచల తలమునందు
సతుల పంచద్రవిడాధీశజయకృతా
క్షరపంక్తితో జయస్తంభము సలిపి(నిచి ?).

మరియు మైసూరి బలముచే మగ్నుఁడైన
పాండ్యరాజును రక్షించి ప్రబలుఁ డగుచుఁ
చోళరాజ్యంబుఁ గైకొని యేలుచుండె
రమ్యగుణశాలి యేకభూపాలమౌళి.

క. మానితగుణ సైభాయియు
ధీనిధి యగునానుబాయి దీపాంబ లనన్
శ్రీ నీలాభూరమణులఁ
(బోని) వధూమణుల నితఁడు ముపుర వరించెన్.

* * * *

క. ఆనరనాయకమణి విన
యానత యగుదీపమాంబయందుఁ గనెయశో

మానితుల మువురు తనయుల
శ్రీనిధులఁ గన్నా విశేష శేషుల నెమ్మిన్.

సీ. సకలదిగ్రాజన్య సన్నుతచరితుఁడై
ప్రౌఢిఁ గాంచిన శాహరాజవిభుఁడు
భామినీ నూతన పంచబాణాకృతిఁ
బొలుపొందు శరభోజ భూమిరమణుఁ
డనియతజాతయయాతి యై బహుగాజ్య (?)
సంపదఁ దగు తుళజ ప్రభుండు
సుమ్మూర్తుల వితాన మూర్ధన్యులై కళా
భోజులై భాసుర తేజు లగుచుఁ
దనమదికి నింపు నింప సంతత విభూతి
న్యాయమార్గంబుఁ దప్ప కమేయమహిమఁ
జోళరాజ్యంబుఁ బాలించె శుభచరిత్రుఁ
డేక భూపాలఘనుఁడు వివేకధనుఁడు.

*  *  *  *

సీ. సుందరాకృతి యైన సుందరాబాయియు
మాన్య యారాజకుమారబాయి
శుభతరచారిత్ర సుకుమారబాయియు
బాల యామోహన బాయిదేవి
రమణీయశీల యారామకుమారాంబ
లలితలక్షణ యగు లక్ష్మీబాయి
అనుపమతర భాగ్య యైన రాధాదేవి
సతి . . సద్గుణనిధి.
వీర సేనమంత్రుఁడు యాదవవిభుని యక్ష
మహిషుల వితానఁ దను నతి మహిమఁ గొలువ
విబుధ జనముల పాలిటి వేల్పనంగ
జగతి వర్ధిల్లుఁ దుళజరాజన్యవిభుఁడు

సీ. అలయ . . బాయియందు సద్గుణనిధి
జనపాలమణి హరిశ్చంద్ర విభుని

ధర్మైకవసతి రాధాబాయియందు నృ
సింహవిక్రము జయసింహవిభుని
రమణీయ చరిత యగు రాజకుమారాంబ
యందు నేకోజి ధరాధినాథు
వరరూప యగును మాబాయియందు గుణాఢ్యుఁ
డైన ప్రతాపసింగావనీంద్రుఁ.

గాంచి నాల్గ భుజమ్ముల ఘనతఁ గాంచు
శ్రీమహావిష్ణు వైవడిఁ జెలఁగునపుడు
సేతుపతి గర్వహరణ ప్రసిద్ధకీర్తి
చారుతరమూర్తి తుళజరాట్చక్రవర్తి

క. ఆరాకొమరులయందు
. . . . . . .
. . . హరిశ్చంద్ర ధ
రారమణుఁడు సూర్యవంశరత్నం బనఁగన్.

* * * *

క. ఆయన కనుఁజూడు .
. . . . . . . . . .
. జయసింహరాజధీరుఁడు వెలయున్
. . . . . . . . . . .

* * * *

క. పంచద్రవిడావని తల
పంచజనాధీశ మత్తవారణ పటలీ
పంచాననబిరుదునకు వి
పంచీవాదన కళాప్రపంచజ్ఞునకున్.

* * *

క. అతుల ప్రతాప విభవో
న్నతికిన్ . . . .
. . . . . . . .
. . జయసింహ వసుమతీతలపతికిన్.

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నా యొనర్పం బూనిన కామకళానిధి యను కామశాస్త్రంబునకుఁ బ్రారంభం బెట్టి దనిన.

గీ. వెలయు నఖిలభువనముల కధీశ్వరుండైన
కమలనాభునాభి కమలయందు
సంభవించి బ్రహ్మసర్గంబునకు నధి
ష్ఠాత యయ్యెఁ బంచసాయకుండు.

**End:**

క. కాముకులకుఁ బ్రీతికరం
బై ముఖ్యమై భోగయోగ్యమై యీకృతి
. . . చంద్రతారక
మై మెఱయు త్రిలింగసుకవు లభినుతిసేయన్.

* * * *

మాలిని.

సలలితగుణజాలా సత్కళానందలోలా
విలసితబహులీలా విస్ఫురద్దానశీలా
అలఘుమతివిశాలా హారికీర్త్యాలవాలా
చలితవిమతసాలా సత్యవాక్యానుకూలా.

**Colophon:**

ఇది శ్రీగురుచరణారవిందమిళిందాయమానమానస నెల్లూరి వీరరాఘవామాత్యతనూభవ సూరమాంబాకుమార సంస్కృతాంధ్ర సాహిత్యసామ్రాజ్య సార్వభౌమ శివరామ నామ ప్రణీతంబైన కామ కళానిధి యను కామశాస్త్రంబునందుఁ జతుర్థాశ్వాసము.

(వి-వి.)—

సమగ్రము. నాల్గాశ్వాసములు. వ్రాఁత బాగుగనే యున్నది. తప్పులు మెండుగాఁ గలవు. శైథిల్యము లేదు. గ్రంథపాతము లచ్చ టచ్చట కలవు.

ఇది కొక్కోక రతిరహస్యము ననుసరించి నెల్లూరి శివరామ కవి యొనరించిన కళాశాస్త్రము. ఇతని తండ్రి యాదవరాఘవపాండ వీయ కృతికర్త యగు వీరరాఘవ కవి. తల్లి సూరమాంబ. వీరు పాక నాటివారు. ఈ కవి నివృత్తి శేషాచలఋషి శిష్యుఁడు. ఈ గ్రంథము నీతఁడు శివాజి సవతి తమ్ముఁడు మనుమఁడును జోళదేశమున కధిపతియు నగు జయసింహున కంకితమొసంగెను. ఈ శివాజి ఢిల్లీ పాద్షా

మున్నగువారిని జయించి 'ఛత్రపతి' యను బిరుదము నందెను. ఈ జయసింహుని తాత ఏకోజి నర్మదానదికి దక్షిణపు వైపునఁ గల రాజుల నందఱను జయించెను. మైసూరివారి బారిఁ బడిన పాండ్యరాజును గాపాడెను. చోళరాజ్యము నాక్రమించుకొని యేలెను. ఈ రాజులు భోసల వంశమువారు. శేషించిన విషయము లుదాహృతభాగమువలనఁ గాన నగును.

---

(b) రతిరహస్యము.

RATIRAHASYAMU.

Foll. 58*b*—74*a*.

This is the same work as those described under R. Nos 6 and 152 *ante*. The author, Eṟṟanakavi, was the son of Kūcanāmātya and bore the titles of Aṣṭabhāṣākavitāpravīṇa and Navaghaṇṭāsuratrāṇa. The work was dedicated to Mallanamantri, son of Bhairava and Lakkamamba and the disciple of Tirumala Tiruvēṅgaḻācārya.

Incomplete. Contains the first Āśvāsa, with only the Ṣaṣṭhyantas in th> introduction.

**Beginning:**

ఉ. శ్రీయును సత్యభామయును భజింపఁగ రాధికకుం బ్రమోదముం
జేయుచు గోపకామినులచిక్కని చన్నులఁ బేరురంబునన్
రాయఁగఁ గౌఁగిలించి రతిరాజుఁ గృతార్థునిఁ జేయు గోపికా
నాయకుఁ డేలు గావుత భైరయ (వ) మల్లధీమణిన్. (?)

* * * *

క. తిరుమల తిరువేంగళగురు
పరమ కృపాలబ్ధ విభవ భావోక్తునకున్
. . . . . . . . . . . .

క. శ్రీచండలాంబవరకరు
ణాచరితునకు . . .

క. లక్కాంబానందనునకు
. . . . . . .
. . . మల్లధీమంతునకున్.

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన కొక్కోకం బను రతిరహస్యకళాశాస్త్రంబునకుఁ గథాసూత్రం బెట్టిదనిన.

క. శ్రీవైశ్యదత్త కౌతుక
భావిత కొక్కోకసత్ప్రబంధనిగూఢ
ప్రావీణ్యాధిపకల్పక
ళావాక్యము లెఱుఁగు తెఱఁగు లగయఁగవలయున్.

**End :**

మాలిని. తిరుమలగురుసేవా దృష్టభావస్వభావా
పరహితనిజభావా భామినీస్మర్యహావా
వరవితరణసేవా పార్థివశ్రీస్వభావా
నిరుపమగుణశౌర్యా నీతినిత్యప్రభావా.

**Colophon :**

ఇదిశ్రీమదష్టభాషాకవితాప్రవీణనవఖండ (ఘంట) సురత్రాణ, కూచనామాత్యపుత్ర యెల్లయనామధేయప్రణీతంబైన రతిరహస్యం బనుకొక్కోకకళాశాస్త్రంబు నందు ఇష్టదేవతాప్రార్థనంబును కృతిపతివంశవర్ణనంబును, స్త్రీజాతులును, కళాస్థానంబులును, దినభోగక్రమంబులును, వాతపైత్యశ్లేష్మప్రకృతులును, షణ్ణవద్వ్యాదశాంగుళభేదంబులును, దేశసాత్మ్యంబులును, ఆలింగన నఖదంతక్షతాదిబాహ్యసురతోపచారంబులు నన్నది ప్రథమాశ్వాసము ——

(వి-వి.)——

అసమగ్రము. ప్రథమాశ్వాసముమాత్రము. వ్రాఁత మంచిదే కాని తప్పులు చాలఁగలవు. శైథిల్యగ్రంథపాతములు లేవు.

పతద్రచయిత ఎల్లయ. కూచనామాత్యునిపుత్రుఁడు. "అష్టభాషాకవితాప్రవీణ" "నవఘంటాసురత్రాణ" అనుబిరుదములు కలవాఁడు. ఈ గ్రంథము భైరవమల్లమంత్రికిఁ గృతియొసఁగఁబడినది ఈ మల్లమంత్రి లక్కాంబ కొడుకు. తిరుమల తిరువేంగళాచార్యునిశిష్యుఁడు. షష్ఠ్యంతములుతప్ప తక్కినయవతరణికాభాగ మిందు లేదు. ఈ గ్రంథము తై. క్యా. నె 6, 152 రుల వర్ణింపఁబడినదియే.

---

## R. No. 321.

Paper. 10¾ × 9¼ inches. Foll. 174. Lines, 20 on a page. Mode of writing, good and apparently correct. Condition, good.

Transcribed in the year 1916-17 from a MS of M.R.Ry. Cilukūri Sēṣagiri Rao Garu of Kōṭipalli, Ramachandrapuram Taluk, Godavari District.

భగవద్గీత-సాంధ్రవ్యాఖ్యానము.

BHAGAVADGĪTA WITH TELUGU MEANING

The Telugu commentary is said to have been written by Yōgīndrasūri and follows the Dvaita Vēdānta system of Ānandatīrtha

Incomplete; contains 1 to 17 Adhyāyas.

**Beginning:**

ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః
మామకాః పాండవా శ్చైవ కిమకుర్వత సంజయ.

వ్యాఖ్యాతృశ్లోకాః.—

" గుణగణనిలయం పతిం రమాయాః
జగదఘదహనంచవాసపిశునమ్ (?)
మునికులతిలకంచ పూర్ణబోధం
గురు మపి పరమం గురుం చ వందే.

ఆనందభగవత్పాదాచార్యనిర్మితం (?)
వ్యాఖ్యా స్యే భగవద్గీతాభాష్యం తత్కరుణాబలాత్
దేవం నారాయణం నత్వా సర్వోపనిషదర్చితమ్
పరిపూర్ణం గురుం చాపి గీతార్థం వక్ష్యేవి వేషతః " ?

టీక. హే సంజయ ధర్మక్షేత్రే = సకలసాధనంబై సాధుజనోపాసనపరమపవిత్రంబై శ్రీలక్ష్మీనారాయణవాసపాత్రంబైన, కురుక్షేత్రే = కురుక్షేత్రమందు, సమవేతాః = కూడియున్నవంటి, యుయుత్సవః = కయ్యంబునకియ్యకొన్నవంటి, మామకాః = దుర్యోధనప్రముఖాస్మత్పుత్రశతంబును, పాండవాః = పాండుమహీపాలకపుత్రులైదుగురున్ను, కిం = ఏమి, అకుర్వత = చేసిరి.

**End:**

అశ్రద్ధయా హుతం దత్తం తప స్తప్తం కృతంచ యత్
అస దిత్యుచ్యతే పార్థ న చ తత్ప్రేత్య నో ఇహ.

టీక. హే పార్థ = ఓ అర్జున, అశ్రద్ధయా = భక్తిరాహిత్యంబుచేతను, హుతం = హుతముచేయునది, దత్తం = ఇయ్యబడ్డది, యత్ = ఏది,

తపః = తపస్సు, తప్తం = చేయబడ్డది, యత్ కృతం = ఇదికాక యే యేది అశ్రద్ధచేత చేయబడ్డమువంటిది అది, అసత్ ఇతి = అసత్తని; ఉచ్యతే = చెప్పబడును. తత్ అది, ప్రేత్య = పొంది పరలోకసాధనంబు లేదేకదా, నో ఇహ = ఈలోకమందుసుఖంబు లేదు, అదినిమిత్తానను నిష్కామ్యంబుగా సత్వగుణంబాశ్రయించి శ్రీకృష్ణార్పణబుద్ధిగా క్షత్రియకులోచితంబైనయుద్ధమనియెడికర్మంబు చేసి మదనుగ్రహపాత్రుడవు కమ్మని నరునకు హరి యెరింగించిన వృత్తాంతంబు యధ్యాయార్థము. హరిః ఓంతత్సత్.

**Colophon :**

ఇతిశ్రీమహాభారతే శతసాహస్రసంహితాయాం వైయాసిక్యాం శ్రీభీష్మపర్వణి భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే యోగీంద్రసూరి విరచితాంధ్రభాషాటీకాయాం శ్రద్ధాత్రయవిభాగయోగోనామ సప్తదశోధ్యాయః.

**(వి-వి.)**—

పదునేడు అధ్యాయములు కలవు. వ్రాంత బాగుగా నున్నది. తప్పు లంతగా లేవు. శైథిల్యగ్రంథపాతములు లేవు.

ఇది భగవద్గీతకుఁ బ్రతిపదాంధ్రటీక. దీనిని యోగీంద్రసూరి యనునాతఁడు రచియించెను. ఈ టీక యానందభగవత్పాదాచార్యవ్యాఖ్యానము ననుసరించి వ్రాయఁబడినదఁట ఇంతకన్నధిక మిందేమియుఁ దెలియరాదు.

---

## R. No. 322.

**Paper.** 10½ × 8½ inches. Foll. 22. Lines, 18 on a page. Mode of writing, good but containing mistakes. Condition, good.

Transcribed in 1916–17 from a manuscript of M.R.Ry, Tāḍēpalli Gurumūrti Garu of Jonnāḍa, Ramachandrapuram taluk, Godavari district.

సంతానగోపాలశతకము.

SANTĀNAGŌPĀLAŚATAKAMU.

A centum of stanzas in Sīsa metre, in praise of God Santānagōpāla worshipped at Ellore, and dedicated to him. The author is Tippābhaṭla Vēṅkaṭaśivakavi, son of Liṅgāmbika and Varadasūri, and grand son of Sūrārya of Kauṇḍinyagōtra. Sanskrit notes called Sañjīvanī explaining certain words and added by the author are also found herein.

Complete. (102 stanzas).

**Beginning:**

శ్రీగమ్యవ్యాదయానుసార సారసపత్ర
 నేత్ర నేత్రత్రయస్తోత్రమహిమ
హిమగిరివసుగిర్యహీనకసద్ధీర
 ధీరజనోద్ధార ధారణాస
నాది యోగాంగక్రియావిచింతితపాద
 పాదలగ్నానంతవేదబృంద
బృందారకోచ్చయార్పితసత్తసంతాన
 సంతానతరుసమ సమరభీమ
భీమశత్రువినాశ నాశామదేభ
తుండసన్నిభకౌశలదోర్విలాస
సరసదరహాస యేలూరిపురనివాస
గోపికాలోల సంతానగోపబాల.

ఏషాం పద్యానా మవసానే ప్రయోజితా స్సాంతశబ్దాః అపురూప (?) కోశేషు స్థితా అత ఏవ వ్యుత్పన్నాః వ్యుత్పన్నానాం స్ఫుటీకరణార్థం మయా స్పష్టం యథాభవతి తథా విలిఖ్యంతే తద్యథా :—దోర్విలాసో నామ భుజలీలా. అదంతః పుంసి. ఇతి నానార్థరత్నమాలా.

**End:**

సీ. సొరిది నాపస్తంబసూత్రుండఁ గౌండిన్య
 గోత్రుండ సూరార్యపౌత్రుండ వర
దాహ్వానసూరి లింగాంబికాపుత్రుండఁ
 గామసూర్యనుజుండ రామయాహ్వ
నకుఁ గోనయాభిధునకును బూర్వజుండఁ (ది)
 ప్పాభట్లవంశ్యుండ పంచవింశ
దబ్దవయస్కుండ నఖిలవేదాంతాది
 సతకళాచతురుండ సంస్కృతాంధ్ర
భాషణవిశేషశబ్దగుంభనకవిత్వ
రసికుఁడ సుధీయుతుండ వేంకటశివకవిని
జెప్పితిని నీదుశతక మాశ్రితనివాస
సరసదరహాస . . . . ౧౦౧

నివాసో నామ గృహః. అదంతః పుంసీత్యమరః.

సె. . . . . . . . .

మానసర్త్వయనవర్ష మాహితోత్స
వాదులు సల్పు పద్మాన్వయాంబుధిచంద్రుఁ
డవు వేంకటనరసింహాప్పరావు
బహాదరుతోఁ జెప్పి బాగుగ నీకునే
సంకితంబుగ . . . .

. . . . . . . పాతిక

. చోవ్వున భూమి నాసోమసూర్య
తారకంబుగ నిప్పించి దయను జూడు
మయ్య పునరుదయోద్ధృతానంతదాస
సరసదరహాస . . . . .

**Colophon:**

దాసోనామభక్తః అదంతః పుం సీత్యమరః.
ఇతి తిప్పాభట్ల వేంకటశివసూరి
విరచితాయాం సంజీవనీసమాఖ్యా
యాం సంతానగోపాలశ . . .

(వి-వి.)—

సంపూర్ణము. (౧౦౭ పద్యములు). వ్రాఁత యందముగా నేయు న్నది. తప్పులును గలవు. శైథిల్యము లేదు. గ్రంథపాతము కొంత కాన్పించుచున్నది.

ఇది ఏలూరిలోనుండుసంతానగోపాలున కంకితముసేయఁబడినది. "సరసదరహాస యేలూరిపురనివాస గోపికాలోల సంతానగోపబాల" యను మకుటముగల సీసపద్యశతకము. కృష్ణస్తుత్యాత్మకము.

తిప్పాభట్లవేంకటశివకవి యీశతకమును రచించెను. ఈతఁడు లింగాంబికావరదసూరుల పుత్రుఁడు. కౌండిన్యగోత్రుఁడు. ఈతనితాత సూరార్యుఁడఁట.

ఈతఁడే యీ గ్రంథమునకు 'సంజీవని' యనునామముగల యొక సంస్కృతటిప్పణిని రచియించెను. అదియు నిందుఁ గలదు.

---

## R. No. 323.

**Paper.** 10⅝ × 9⅜ inches. Foll 18. Lines, 20 on a page. Mode of writing, fair but not quite free from mistakes. Condition, good.

Transcribed in the year 1916–17 from a MS. of M.R.Ry. Susarla Subrahmanya Cayanulu garu of Mandapēta, Ramachandrapuram taluk, Godavari district.

శ్రీ గుణరత్నకోశము.

ŚRĪGUṆARĀTNĀKŌŚAMU.

A rendering into Telugu stanzas of the Sanskrit work Śrīguṇaratnakōśa of Parāśarabhaṭṭa (which is in praise of Goddess Lakṣmī). The author is Susarla Subrahmaṇyakavi, son of Mahālaksmi and Pāpayasōmayāji of Śālāvatagōtra (belonging to the Viśvāmitra family), and disciple of Brahmayajva, Rāma and Lakṣmaṇa. The work was dedicated at the instance of Punnamarāju Rāmacandra to God Harihara of Māṇḍvayāpura (Mandapēta) near Dākṣārāma (which is stated to be the residence of the author).

Incomplete, containing 48 stanzas besides the prefatory portion.

**Beginning:**

ఉ. శ్రీవిధివిష్ణుశంకరుల సేవకరక్తులఁ మహాత్ములన్
గోవనితేందిరాద్రిజలఁ గూడి యలౌకికు లయ్యు లోకవి
ద్యావిభవంబుఁ జూపిన గుణాకరులన్ ద్రిజగత్కుటుంబులన్
భావమునం దలంచెద నభంగురభక్తి నభీష్టసిద్ధికిన్.

* * * *

శా. శ్రౌతస్మార్తములన్ ప్రయోగసరణీచాతుర్యయుక్తిన్ బుధ
వ్రాతం బెన్నఁగఁ జెప్పి యాజవమహాగ్రంథత్రయిన్ లక్షణో
పేతస్ఫీతపదక్రమంబు లాగి నేర్పన్ ధాత్రి సర్వేశ్వర
ఖ్యాతిన్ మించినయజ్వ మజ్జనకుఁ డయ్యార్యున్ ప్రశంసించెన్.

చ. తొలుతఁ ద్రిభాష్యరత్నమున దొమ్మిదిశిక్షలు వానిభాష్యముల్
బలుసరవా స్వపద్ధతులఁ బాఠము జెప్పియు నాదుమానసం
బలర జటావధానవిధ మంతయు నాకు దయార్ద్రదృష్టిచేఁ
దెలిపినబ్రహ్మయజ్వవిబుధేంద్రునిపాదము లేను గొల్చెదన్.

క. అవ్యయతత్త్వజ్ఞానసు
ద్రవ్యముగాఁ గలుగు రామలక్ష్మణబుధులన్
కావ్యాలంకృతినాటక
భవ్యవ్యాకరణగురుల భావింతు మదిన్.

శా. శ్రీమద్రాజమహేంద్రనామనగరీశ్రీదుర్గ ఐర్యస్థితా
సామాన్యస్ఫురమాణదక్షపురపశ్చాద్భాగతుల్యానదీ
గ్రామణ్యంతికపూర్వదిక్ప్రథితతీరప్రాంతవిద్యోతిత
శ్రీమాండవ్యపురీవరం బలరె ధాత్రీనూతనస్వర్గమై.

ఉ. ఆపురినుండు . . . . . . . . .
. . . . . . . . . . .

* * * *

క. విస్మయకరచరిత్రౌ
తప్త్మార్తాచారనిరత తత్పురవరగా
మాప్మృతదోషచ్యావ్యా
త్యస్మద్వంశావతార మదియొప్పినన్.

క. ఆ గాధిపట్టివంశ
శ్రీగరిమకు హేతువగుచుఁ జెలువొందీ తపః
ప్రాగల్భ్యముక్తసంస్తుతి
రాగుఁడు శాలావతర్షి రంజిలె జగతిన్.

సీ. శాలావతసగోత్ర సంభవుఁడై వేద
వేదాంగములు బాల్యవేళ నేర్చి
. . . వ్యాఘ్రేశ్వరసోమయాజి
(వసుధ) వర్ధిల్లె సుసరలాన్వయమునందు.

మ. ధర వ్యాఘ్రేశ్వరసోమయాజిసుతరత్నంబై సుసర్లాన్వయా
బ్ధిరమాసోదరుఁడై సమగ్రతరవిద్యాని (?) భా
స్వరసర్వేశ్వరసోమయాజి తనరెన్ సర్వజ్ఞుఁడై భాగ్యబం
ధురుఁడై వందితసత్కవీంద్రజనతా స్తోత్రవ్యధీశాలియై.

* * * *

క. తలిదండ్రు లతని బాల్యపుఁ
బలుకులు విని ప్రేమఁజిన్నపాపఁడ యనుచున్
బిలిచిరి పిలిచిన నీఘనుఁ
డలరెన్ బాపయ్యసోమయాజియనంగన్.

సీ-గీ. . . పాపయాఖ్యసోమయాజివరుపత్ని
యై పరమసాధ్వి యనఁగ విఖ్యాతిఁ బూనె
సురుచిదీవి మహాలక్ష్మిసోమిదేవి

క. సుతుఁడను వారికి శాలా
వతగోత్రుఁడ సుసరలాన్వవాయోద్భవుఁడన్
హితుఁడను కవిబుధులకు నే
ధృతసుబ్రహ్మణ్యనామధేయుఁడ జగతిన్.

* * * *

క. ఒకనాఁడు శ్రీజనార్దను
నకు శ్రీమదగస్త్యదేవునకు నగుసేవల్
ప్రకటముగ జరగువేళన్
సకలప్రజ-మూడినట్టిసభ నిటునడిచెన్.

* * * *

వ. ఇట్లు ప్రశంసించి యనంతరంబ సభాగతుండనైన నన్నవలోకించి.

క. ఎన్నఁగ భాషాద్వయమున
నున్నతకవితాసమృద్ధి నొనరితి వని నన్
బున్నమరాజకులీనుఁడు
సన్నుతచర్యుఁడు రామచంద్రుం డనియెన్.

వ అది యెట్లనిన.

ఉ. శ్రీగుణరత్నకోశ మను చెల్వగు సంస్కృతపద్యకావ్యమున్
భోగిశయాన రంగపతిపుత్రపరాశరభట్టరార్యు లే
లాగునఁ జేసి రట్లు ప్రబలంబున నాంధ్రము సేయుఁడీ మహా
భోగము భాగ్యమున్ యశము పుత్రసమృద్ధియు మీకు నయ్యెడున్.

వ. ఇట్లు ప్రార్థించి తాంబూలం బొసంగిన . . . . .
నిజతల్పంబున నిమీలితాక్షుండనై యున్న సమయంబున.

సీ-గీ. . . . . . . . . .
హరిహరాత్మకుఁ డైనట్టి పరమపురుషుఁ
డొకఁడునాయందుఁ దనప్రేమ ప్రకటముగను

దర్శనం బిచ్చె నాజగత్పతిని జూచి
సన్నుతించితినిట్లు సార్థంబుమిగుల.

సీ. . . . . . . . . .
మాండవ్యపురధామ మానితస్థేమ ఖం
డితరిపుస్తోమ గాండీవిసోమ
. . . . . . . .

మ. నుతిగావించిన . . . . . .
. . శ్రీగుణరత్నకోశమదియాంధ్రంబొప్పఁగాఁ జేయుమా.

మ. అని యంతర్హితుఁడైన . . . .
. . . నాంధ్రరీతి నొనరింపం బూనితిం ధీరతన్.

క. హరిహరభావైక్యవిభా
స్వరమూర్తికి యానిచి త్తవృత్తికి వాగీ
శ్వరనుతకీర్తికి నరిదర
కరవిస్ఫూర్తికి నిరస్తగహనార్తి కొగిన్.

వ. సద్భక్తి సమర్పితంబు సేయం దలంచి.

క. ధీరపరాశరభట్టర
సూరివతంసప్రబంధసూక్త్యర్థము చే
నేరచియింపఁగఁ బూనుమ
హారమ్యాంధ్రప్రబంధ మది యెట్లంటే.

శ్లో. శ్రియై సమస్తచిదచిద్విధానవ్యసనం హరేః
అంగీకారిభి రాలోకైః సార్థయంత్యై కృతోంజలిః.

క. రంగేశాఖిలచిదచి
త్సంగతసుజగద్విధివ్యసనమును నిజదృ
ష్ట్యంగీకారముచేత ను
సాంగముగాఁ జేయుసిరికి సాంజలియగుదున్.

**End:**

శ్లో. యది మనుజతిరశ్చాం లీలయా తుల్యవృత్తే
రనుజను రనురూపా దేవి నావాతరిష్యః

అసరస మభవిష్య స్మర్మనాథస్య మాత
ర్దరదళదరవిందోదంతకాంతాయతాక్షి !

పద్యము.

మ. నరతిర్యక్ప్రమవృత్తి లీలఁ గని నీనాథుండు జన్మింపఁ ద
ద్వరజన్మంబుల కానురూప్యముగఁ బద్మా నీవు జన్మింపవే
విరసాపేతము తత్కటాతూవాలసమున్మేషంబు కించిద్దళ
త్సరసీజాంతరకాంతదీర్ఘనయనద్వంద్వా మదంబా సిరీ !

(వి-వి.)—

అసమగ్రము. (నలువది తొమ్మిది పద్యములు. వాని మూలశ్లోకములు). వ్రాఁత యంతమంచిది కాదు. తప్పులు లేకపోలేదు శైథిల్యపాతములు లేవు.

ఇది సంస్కృతమునఁ బరాశరభట్టరువారిచే రచియింపబడిన శ్రీగుణరత్నకోశమునకు సుసర్లసుబ్రహ్మణ్యకవిగారి యాంధ్రీకరణము. సంస్కృతశ్లోకములు, వానికి సరియగు నాంధ్రపద్యములు. మహాలక్ష్మికిఁ బాపయ్య సోమయాజులకుఁ బుత్రుఁ డగునీకవి శాలావతగోత్రుఁడు, శాలావతుఁడు కుశికవంశజులలో నివాఁడౌట. పున్నమరాజు రామచంద్రుఁ డనువాతని ప్రోత్సాహమున దీని నీతఁడు తెల్గించెను. ఈ కవి రాజమహేంద్రవరమువద్దనుండు దాక్షారామసమీపమున మాండవ్యపురి (మండపేట.) ? యందుండెడివాఁడు. ఆ మాండవ్యపురమునందు నెలకొన్న వారిహరసాథున కీ గ్రంథ మంకితము సేయఁబడినది. ఈతని గురువులు బ్రహ్మయజ్వ, రామలక్ష్మణులు అనువారు.

---

R. No 324.

Paper. 10⅝ × 9½ inches. Foll. 51. Lines, 20 in a page. Mode of writing, not good and not correct. Good.

Restored in 1914–15 from a MS of the Library

ఔషధయోగములు.

AUṢADHAYŌGAMULU.

Gives a number of medical prescriptions both in Sanskrit and in Telugu.

Incomplete.

**Beginning :**

వెర్రికి.*

బొమ్మకచ్చెరుదుంపల దెచ్చి పైపెచ్చు దీసి రోట వేసి కుమ్మి రసం దీసి ఆరసంలో పచ్చిపోకంత్తె నవాకు జిలకర పచ్చిపోకంత ముద్ద కలిపేది అంతా అరకాలెడుచేసేది. ప్రొద్దుప్రొద్దున అరసోలెడుసిరసం రెండుప్రొద్దులు యిచ్చేది. యీ అవుషదాన పైత్యవెఱ్ఱి మానును.

**End :**

ఆవెనుక రసంపోసి కలిపి దంచేది. లేహాం రసం కలియను దంచి అరచేతిలో కడిగి చూడగాను రసం ఏమాత్రం కనిపిస్తేను మళ్లా దంచి కడిగితె రసం కనిపించకుంటే చాలించేది. ఇఁదులో నిమ్మపంటిరసం యింతని . . . గోట్టుపికరాలంతేసి వుండలుచేసి కలివంటకం తినేది. పల్పువంటకం.

(వి-వి.) —

అసమగ్రము. వ్రాఁత బాగైనదికాదు. తప్పు లున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములు కలవు.

ఇందు వివిధము లగునౌషధయోగములు గలవు. తెనుఁగుపద్యములు కొన్ని సంస్కృతశ్లోకములు కొన్ని విడిమాటలు చాలవఱకును గలవు. కూర్పరి యెవ్వరో.

---

## R. No. 325.

Paper. $10\frac{3}{4} \times 9\frac{1}{2}$ inches. Foll. 146. Lines, 20 in a page. Mode of writing, fair but not quite free from mistakes. Good.

Transcribed in 1916–17 from a MS. of M.R.Ry. Iraṅki Veṅkaṭa Raogāru of Annavaram, Tuni taluk, Gōdāvari district.

చంపూరామాయణము.

CAMPŪRĀMĀYAṆAMU

A Telugu rendering of Bhōja's Campū-Rāmāyaṇa (Sanskrit) by Bulusu Sītārāmakavi, son of Viśvēsvarayājva of Gautamasagōtra. The work was dedicated to Sirigāmpurapu Vīrarāghava and Bhāgana Pantulu of Bhāradvājagōtra.

Complete.

**Beginning:**

శా. శ్రీమద్విష్ణుఁ డనంతమూర్తి ధృతలక్ష్మీలక్షణుం డాత్మవి
ద్యామూలస్థితవిష్టపత్రితయముఖ్యప్రాణనాథుండు బల్
ప్రేమన్ శ్రీసిరిగాంపురాన్వయుల సుగ్రీవదేవతాచంద్రులన్
శ్రీమంతుం డగు వీరరాఘవఘనున్ శ్రీభాగనన్ బ్రోవుతన్.

* * * *

క. అని యివ్విధమున బలుకే
వన లోనఁగుచు నున్నహితుని ధర గౌతమగో
త్రుని ననుసీతారామునిఁ
గనుఁగొని యొకనాఁడు మదిని గౌతుక మలరన్.

* * * *

క. . . . . . . .
శ్రీగరిమ వీరరాఘవ
భాగనపండితులు గురుతఁ బల్కెడి కరుణన్.
. . . . . . .

క. కెంజిగురువంటికవనము
రంజిలు నీవదనతామరసమున వాణీ
మంజీరయుగళమంజుల
శింజితముల బ్రోఁత బుధసుసీతారామా.

చ. కులుకుమ్మదూర్తిగుంభనలఁ గోమలతం గనుపట్టు తేనియ
ల్వొలుపడుభోజచంపు రఘువీరునివృత్తముఁ జెప్ప రెవ్వరున్
దెలుఁగున ముస్తవీశ్వరులు నీ వది సేవధిగాఁ దలంచి మి
క్కిలి సరసంబుగాఁగఁ దెనిఁగింపు మటంచు బహూకరింపఁగన్.

గీ. తగుదుఁ దగ నటంచుఁ దలఁచక బాహులే
యప్రసాదగరిమ నట్లచేయ
నియ్యకొంటిఁ దత్కృతీశ్వరవంశప్ర
శంస సేతుఁ దొలుతఁ జతురగతిని.

సీ. సర్వకూటస్థుఁ డౌ చతురాస్యుఁ డేకాస్యుఁ
డైభగద్వాజసమాఖ్యుఁ దనరి
యేమహాన్వయరాజ మిరవొందఁగఁ బవిత్ర
గోత్రర్షి యయ్యె నెకుడుఁ బ్రకాశ

రేలుఁబగ శ్లోకరీతిగా నుండని
పుండరీకముకన్నఁ బొసఁగుచున్నఁ
దనుచు నేయింటఁ బ్రియంబున సిరి గాఁపు
రము సేయు సిరిగాంపురపుగృహాఖ్యఁ
దనరె నట్టిమహాసురోత్తమకులాధి
నాయకుం డగుకోనేటిరాయఁడలరు
వేంకటనృసింహుఁ డను పేరు వేఱకలిగి
యతనిసతి లక్ష్మియను పేర నతిశయిల్లు.

క. అయిరువ్వరకును దిరుమల
రాయఁడు జనియించె శెలువు రాయఁ డతనికిఁ
బ్రేయసి భాగీరథియనఁ
గాయజరిపు రాణివగిది ఘనకీర్తిఁదగెన్.

గీ. అట్టిదంపతులకుఁ బుత్రు లవతరించి
రౌర శ్రీవేంకటాచలనారసింహు
లనఁగ వేదాద్రిసుబ్బారాయాఖ్యులనఁగ
ఖ్యాత పెూముల ఖ్యాతి వేదములరీతి.

ఉ. వారలతోడఁ బుట్టి రనవద్యచరిత్రలు లక్ష్మకాంబయుం
దీరగుబుచ్చమాంబికయుఁ దిర్మలనా ముగు రం
. . . . . . . . . .

* * * *

వసంతతిలకము.

ఆవేంకటాచలసమాఖ్యుఁడు ముప్పవార
శ్రీవంశచంద్రనరసింహతనూజలక్ష్మీ
దేవీకరాబ్జము విధిం గొని సర్వధర్మ
శ్రీవర్ధమానుఁ డయి చెందె ననంతకీర్తిన్.

గీ. అట్టిలక్ష్మ(మ్మ)కును జోగమాంబయనఁగఁ
దనరు నామాంతరం బట్టిధర్మపత్ని
యందు సంతతిఁ గనె వేంకటాద్రినాథుఁ
డద్రినాథుఁడు మేనకయందుఁ బోలె.

వ. అట్టిసంతానంబును.

*　　　*　　　*　　　*

సీ. నరసమ్మ యననగ్రనందన యైపుట్టె
　　నాయమతోడ డాయంగ వీర
రాఘవపండిత గ్రామణి జనియించె
　　నమ్మేటితోడ డాయంగఁ బుట్టె
భాగన్నపంతులప్పండితేంద్రునితోడ
　　నవతరించెను నాగమాంబతోడ
నందుమతత్కృతిపతులు . . .
　　. . . . . . . .
. . . . . . . .
　　. . . . . . . .
. . . . వృద్ధిఁ బొంది
రాశ్రితావనపరతంత్రు లైచెలంగి.

గీ. వీరరాఘవుండు వేంకటలక్ష్మివి
భుండు సర్వధర్మములు రచింప
భాగనార్యుఁ డౌర బాగు సావిత్రివి
భుండు తదనుమతమె పూని నడచె.

క. బలరామకృష్ణులకు నె
చ్చెలి యగునర్జునుఁడువోలె సింగితపుమహా
కులజుఁడు వేంకటరాయం
డెలమిని గొల్వంగ నుండు రిర్వురు వారల్.

క. వాగీశజనకశాంతుల
శాగతసత్కీర్తిపూరితాశాంతులకున్
శ్రీగురుకువీరరాఘవ
భాగనపంతులకు సత్ప్రభావంతులకున్.

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాతెనిఁగింపంబూనిన చంపూరామాయణప్రకారం బెట్టిదనిన—

ఉ. శ్రీనిగమద్రుమార్గమునఁ జెల్వగుపల్లవ మంతరాయశై.
లానిమిషేంద్రహేతి లసదంబుజడంబరచౌర్యనిఘ్న మీ

శౌనసుతాంఘ్రియుగ్మము ప్రసన్నత మీఱఁగ మాకు సంతత
శ్రీ నిడుఁ గాత వేఱొకనిఁ జేరి భజింపక యుండునట్లుగన్.

**End :**

మ. విజయు ల్లక్ష్ములు గొల్వఁ బ్రేమమున నుర్వీపుత్రితో నమ్మహా
భుజుఁ డారీతి బురంబుఁ జొచ్చియు విజాప్త శ్రైక సీపుత్రుఁడ
రరాజుఁడు స్మన్నగుహార లాజ్ఞఁగొని సత్కారంబు గా నిండ్ల కేఁ
గ జగం బేలుచు దీర్ఘకాల మతిసౌఖ్యం బొంది సత్కీర్తిచేన్.

*　　*　　*　　*

నరుర్కా టకము.

పరమదయాకరా విగతపంక గుణాభరణా
నిరుపమదానదర్పితవనీపకసాధుమతీ
గరుడగజాధిరూఢపదకంజమధువ్రత స
త్పురుషవరేణ్య దివ్యమణిభూషణకాంతియుతా.

**Colophon :**

ఇది శ్రీబులుసు పీరేశ్వరయజ్వకుమార కుమారచరణారవిందవందనా
నందసందీపితాంధ్రగీర్వాణకవి శ్వాభిరామసీతారామప్రణీతంబైన చంపూ
రామాయణం బనుమహాప్రబంధంబునందు యుద్ధకాండంబు సర్వంబు
షష్ఠాశ్వాసము.

" ధరణీసురపుంగవుఁ డగు
శితిగాంపుర వంశ వార్ధిశీతాంశునకున్
చిరకాలంబు వచింపగఁ
జరవేగమ వ్రాసెఁ జంపుసంపూర్ణముగన్.

అనియు—

విశ్వావసు జ్యేష్ఠ బ 30 లు సరిగా బుల్సు సీతారామశాస్త్రిల్లగారి
వ్రాసినప్రతినున్న క్రమంగాను రావర్తివెంకన్న వ్రాసెను."

అనియునీగ్రంథమునొకకృతుదను గలదు.

(వి-వి.)—

సంపూర్ణము వ్రాఁత యంతమేలైనది కాదు. తప్పులు లేకపో
లేదు. శైథిల్యగ్రంథపాతములు లేవు.

ఈ చంపూరామాయణాంధ్రీకరణము బులుసుసీతారామకవిచేఁ జేయఁబడినది. ఇతనితండ్రి విశ్వేశ్వరయజ్వ. వీరు గౌతమసగోత్రులు. దీని నీతండు సిరిగాంపురపువీరరాఘవభాగనార్యులకుఁ గృతియొసంగెను. వీరు భారద్వాజసగోత్రులు.

---

## R. No. 326.

Paper. 10¾ × 9½ inches. Foll. 10. Lines, 20 in a page. Mode of writing, fair but erroneous. Good.

Transcribed in 1916-17 from a MS. of M.R.Ry. Nāgam Veṅkannadoragāru, Chēmavaram, Tuni, Gōdāvari district.

ఆంధ్రపాండవగీత.

ĀNDHRAPĀṆḌAVAGĪTA.

A Telugu rendering of the Sanskrit work, Pāṇḍavagītā, which is in praise of Śrī-Kṛṣṇa. The author is stated to be the son of Mantravādi Vēṅkaṭapati. The work was dedicated to God Kastūri Raṅga, worshipped at Srirangam.

Complete.

**Beginning:**

క. శ్రీరంగనాయికాకుచ
సారంగమదానుషంగచంచద్వక్షో
దాధృతరథాంగా (?)
కారుణ్యయుతాంతరంగ కస్తురిరంగా.

క. అవధారు దేవ భువిఁ బాం
డవగీతలు సంస్కృతంబునందాన్వై(?)
భవములె తెల్పఁగ నవి నే
వివరించెద నాంధ్రభాష విశదము గాఁగన్.

**End:**

ఉ. మంగళ ముల్లసద్గరుడమండితకేతన విష్ణురూప స
న్మంగళ మంబుజాక్ష రిపుమర్దన యోమధుసూదనా జయ
న్మంగళ మిందిరానయనమత్తచకోరసుధాకరాశుభ
న్మంగళ మయ్య నీకు వినుమా ఘనమా నను గాచు టిత్తఱిన్.

చ పటుతరవాగ్విలాసము పాండవగీతలు సంస్కృతార్థము
న్నటులఁ దెనుంగుబాస వెలయన్ రచియించితి మంత్రవాదివేం
కటపతిమూర్తినందనుఁడఁ గస్తురిరంగ కవేరజానదీ
తటమున రంగనాథుఁ డగుదానవవైరికి నంకితంబుగన్.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత యంత తిన్ననిది కాదు. తప్పులు కలవు. శైథిల్యపాతములు లేవు.

ఇదిసంస్కృతపాండవగీతలకు సరియైనతెనుఁగు. మంత్రవాది వేంకటపతిపుత్రుఁడఁట రచయిత. శ్రీరంగమునందలి కస్తురిరంగనికిఁ గృతి యీఁబడినది.

---

## R. No. 327.

Paper. 10¼ × 9½ inches. Foll. 16. Lines, 20 in page. Mode of writing, fair but incorrect. Good.

(*a*) స్త్రీవర్ణనము.
STRĪVARṆANAMU.

Foll. 1*a*—7*a*.

Transcribed in 1916–17 from a MS. of M.R.Ry. Vāḍrēvu Vīrannagāru of Pātakōṭa, Rāmachandrapuram taluk, Gōdāvari district.

Stanzas describing the beauty of a woman from head to foot, and compiled from works like the Āmuktamālyada, the Vasucaritra, etc.

Complete

**Beginning:**

'(కేశవర్ణనము)

శా. హేమాభాంగవిభాధరారుణిమవక్త్రేందుప్రభాశ్రీలఁ ద
ద్భామారత్నము పొందదయ్యె మును దత్తద్వర్ణయుక్త్యాఖ్యలన్
శ్యామాత్వఁ బలికగర్వధూర్వహకచచ్ఛాయాచ్ఛటం గాంచె నాఁ
గా ము స్నర్వి శిరఃప్రధాన మనువాక్యం బెమ్మెయిన్ దప్పునే.

**End :**

(పాదముల వర్ణన)

* * * *

ఉ. భామపదద్వయం బడుగుఁ బాయక కొల్చు సరోజరేఖలన్
శ్రీ మెఱయన్ భజించి మధుజృంభణచే మొనమూపుపల్లవ
స్తోమము సౌకుమార్యమును శోభయుఁ గైకొనఁ బోలుఁ గానిచోఁ
గోమలతారుణత్వములు కోల్పడునే యివి నాఁడునాఁటికిన్.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత యంత తిన్ననైనది కాదు. తప్పులు కలవు. శైథిల్యపాతములు కాన్పింపవు.

ఇందుఁ గేశాదిపాదపర్యంతము క్రమముగ స్త్రీవర్ణనము చేయఁబడినది. ఆవర్ణనములు ప్రసిద్ధము లగువసుచరిత్ర ఆముక్తమాల్యద మొదలగు ప్రబంధములనుండి కైకొనఁబడినవి. కూర్చినవా రెవ్వరో తెలియరాదు.

---

(*b*) సభాపతిలక్షణము.

SABHĀPATILAKṢAṆAMU.

**Foll. 9*a*—16*a*. Fol. 8 is blank.**

Transcribed in 1916–17 from a MS. of M.R.Ry. Dēvarakoṇḍa Vēṅkaṭarāmayyagāru of Kapileswarapuram, Gōdāvari district.

Gives the qualities necessary in a president of councils (royal darbars).

Complete.

**Beginning :**

క. శ్రీరమ్యుఁడు సంతతశ్రీ
గారుఁడు రాజాన్వయప్రకాశుఁడు సతతా
నూధుఁడు సకలకళా(?)
పారాయణుఁ డనఁగ నాసభాపతియొప్పున్.

క. తరుణుం డై నవరత్నా
భరణుండై గంధపుష్పపరిమళయుతుఁడై

పరనారీవర్జితుండై
ఖరఁగినవాఁ డమరు నాసభాపతి యనఁగన్.

వ. ఇట్లు కొలువున్న సభాపతిలక్షణం బఖిలజగదుత్పత్తిహేతుం డైన బ్రహ్మదేవునివామదక్షిణభుజంబులం దుద్భవం బైన . . . . . . . . . . పరీక్షిన్న రేంద్రుం డొక్కనాఁడు కొలువున్నయెడ నారదుం డరుగుదెంచిన . . . . .

**End:**

బ్రహ్మప్రతిష్ఠ వనప్రతిష్ఠ దేవప్రతిమలు సేయుచుఁ బరిభ్రష్టరాజ్యంబులు నిలుపుటయు |నిదియాదిగాఁగల్గుధర్మప్రవర్తనలతెలంగెతింగి పాపంబులం బొరయక రాజ్యంబు సేయునతఁడుసభాపతి యనంబరగును.

(ఖి-ఖి.)—

సమగ్రము. వ్రాఁత యంత మేలైనది కాదు. తప్పు లున్నవి. శైథిల్యగ్రంథపాతములు లేవు.

ఇందువచనరూపమునసభాపతి(రాజు) యనువానికివలయుగుణములు, లక్షణములు వర్ణింపఁబడినవి. రచయితయెవ్వఁడో గుర్తింపరాదు.

---

## R. No. 328.

Paper. 10¾ × 9½ inches. Foll. 130. Lines, 20 in a page. Mode of writing, fair but not correct. Good.

Restored in 1916–17 from the Library MS. described under R. No. 202.

చిత్రభారతము.

CITRABHĀRATAMU.

Same work as the one described under R. No. 202 ante.

Incomplete.

(ఖి-ఖి.)—

అసమగ్రము. వ్రాఁత యంత మేలైనది కాదు. తప్పులుకలవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములుకలవు.

ఇది రైపి. క్యా. ఆర్. నెం 202 రున వర్ణింపఁబడినదే.

## R. No. 329.

Paper. 10⅞ × 9⅝ inches. Foll. 50. Lines, 20 in a page. Mode of writing, good but not correct. Good.

Transcribed in 1916–17 from the MS. of M.R.Ry. Jayanti Jōgannagāru, Hamsavaram, Tuni taluk, Gōdāvari district.

నృసింహగణితము (సమూలము).

NṚSIMHAGAṆITAMU (WITH TEXT)

A treatise in astronomy explaining the rules for the preparation of Hindu almanacs. Sanskrit stanzas are herein given with word-for-word Telugu meaning.

**Beginning:**

షష్టి(౬౦)శ్నశికర(౪౧)(?)వ్యపగతసంవత్స రేణ సమ్మిశ్రమ్
నవగగనాబ్ధి (౪౯)సమేతం-శకనృపకాలం విజానీయాత్.

టీక. అ ౬౦ పెట్టుకొని ౨౧టగుణించి ప్రభావాదిగతసంవత్సరాలు కలియఁగూడి అందులోను (౪౦౯) ఇవి కలియగూడితేను శకవర్షాలు అవును.

**End:**

ఇంకను షడశీతిముఖాలు తెచ్చే అందుకు.

శ్లో. మిథునేష్టాదశ(౧౮)చైవకన్యాయాంతుచతుర్దశ(౧౪)
ధనుష్షడ్వింశతి( ౬)శ్చైవ మీనే ద్వావింశతి(౩౨)స్స్మృ
[తమ్.

టీక. అని సూర్యుఁడు మిథునకన్యధనుర్మీనాలయందు వుండగాను షడశీతులు వుండును. ఇందుకు ధ్రువాలు మిథునం ౨-౧౮-౦-౦. స్ఫుటసూర్యుడు యీరాశిభాగలకు సామ్యమయినప్పుడు షడశీతి పుట్టును. కన్యకు ౫-౧౪-౦-౦ ధనస్సుకు ౨౬-౦-౦ మీనమందు ౧౧-౨౨-౦-౦ యివిధ్రువాలు యీరాసులయందు సూర్యుడు వుండగాను యీ ధ్రువాలకు స్ఫుటసూర్యుండు సామ్యమయినప్పుడు గ్రహంలోధ్రువంతీసి అయినా ధ్రువంలో గ్రహంతీసి అయినా సంసరించి గతయేష్యాలుయెరింగి లిప్త లుచేసి సూర్యగతిసవర్ణంచాత పాలు లబ్ధంఘుడియలు ఆ శేషం ౬౦ ట గుణించి యీగతిసవర్ణంచేతనే పాలులబ్ధంవిఘుడియలు. యివిగతప ష్యాలుయెఱింగి అహర్గళలో ధనఋణాలు చేస్తేను ఆవారంనాడుఅన్ని

ఘడియాదిఘటికయలప్పుడు షడశీతిముఖాలు అవును. ఈ క్రమాన యాటానునాలుగుసంక్రాంతులయందును షడశీతిముఖాలు తెచ్చి వ్రాసుకు నేది.

ఇది శ్రీప్రతిభాగగ్రహారత్నమాలకు తెలుగుటీక బాలబోధగాను ఆ చంద్రతారార్క మైపుండేటట్టుగాను వ్రాశినారము.

కల్యాదిద్యుగణంవల్ల మధ్యగ్రహాలు తెచ్చే అందుకు ద్యుగణంమూడు ప్రతులు పెట్టి గతులచేత గుణించి క్రిందిప్రతి ౬౦ంట పాలులబ్ధం నడిమి ప్రతిలోఁగూడి ఆప్రతి ౬౦ంట పాలులబ్ధం ఆమీఁది ప్రతిలోఁగూడి అది ౬౦ంట పాలు శేషంభాగలు. ఆలబ్ధం ౧౨ంట పాలుగొంటేను శేషంరాసులు మునుపటి మూడుప్రతులు శేషాలున్నూ లిప్తావిలిప్తావరలు అవును. ఈ క్రమానమధ్యగ్రహాలకు రాశిభాగలిప్తావిలిప్తావగలు తెచ్చుకు నేది.

(వి-వి.)——

ఇది సమగ్రమో యసమగ్రమో గుర్తింపరాదు. వ్రాఁత బాగుగా లేదు. తప్పులు కలవు. శైథిల్యగ్రంథపాతములు లేవు.

ఇందు జ్యోతిషసిద్ధాంత గణితము ప్రతిపాదింపఁబడినది. సంస్కృత శ్లోకములును వానికిఁ దెన్గుదండాన్వయమును గలదు. ఇందలి గణిత మువంచాంగముగుణించుంట కనుకూల మయినదిగాను నున్నది.

ఇందలిమూలమునకుఁ "బ్రతిభాగగ్రహారత్నమాల" యనునామాంతరమును జూపఁబెట్టిశిని. ఈ యాంధ్రార్థమును వ్రాసినవా రెవ్వరో తెలియరాదు.

---

## R. No. 330.

Paper. 10¾ × 9½ inches. Foll 11. Lines, 20 in a page. Mode of writing, fair but not quite correct Good.

Transcribed in 1916–17 from a MS. of M.R.Ry. Nandūri Jōgayya Rājugāru of Pennmāka, Gōdāvari district.

లలితాస్తోత్రము.

LALITĀSTŌTRAMU.

A centum of stanzas (in Sīsa metre) composed in praise of Goddess Lalitādēvi: probably by Śiṣṭu Sarva Śāstri.

Contains sixty-nine stanzas.

సీ. శ్రీమదాగమసమాశ్రితపరబ్రహ్మాంబ
విపులచిదానందవిలసనంబ
ఫలపరిపూర్ణసకలతంత్రసారంబ
చారుతరాననచంద్రబింబ
జితమహీమండలాకృతిభాసురనితంబ
నియతభక్తావననిర్వ్యాలంబ
లలితనిజోత్సంగలాలితహేరంబ
కబరీనివేశితఘనకదంబ

శయకృతవినూత్నతరకుశేశయవిడంబ
మానితాత్మీయకేళీకాధీనసాంబ
యధరిజితబింబశ్రీనగరావలంబ
పదనమద్దేవమునికదంబ లలితాంబ.

**End :**

సీ. రాయంచగమి మోయ రాణించుతలఁపుమా
నికపువిమానంబు నీకు మీఁది
నెక్కి మిక్కుటా మగుచకఁ దనమ్మాన
సురసతీసౌందర్యగరిమ లెల్ల
పారిమాండల్యము భజియింప వాహ్యాళి
కరుగుచో నడుత్రోవ నమరవరుల
మొఱ యాలకించి సమ్మోదము నిండించి
వారల విడిదలఁ జేరఁజేసి

వాసికెక్కినదాన వీవే సితాంశు
శేఖరోత్సంగసంగభాసితనితంబ
యధరజితబింబ శ్రీనగరావలంబ
పదనమద్దేవమునికదంబ లలితాంబ.

"శోభకృత్ సం॥ శ్రావణ బహుళ ౫ పంచమి (శిష్టు సర్వశాస్త్రులు ప్రణీతం)" అని గ్రంథాంతమున నున్నది.

(వి-వి.)—

౬౯ పద్యములుమాత్ర మున్నవి. వ్రాత యొకతీరుననున్నది. నిర్దుష్టముగాదు. శైథిల్యగ్రంథపాతములు లేవు.

ఈ సీసపద్యశతకము అధరజితబింబ . . . . లలితాంబ యనుమకుటముఁ గలిగి లలితాస్తుత్యాత్మకమైయున్నది. పతద్రచయిత శిష్టుసర్వశాస్త్రులని విలేఖఁడు వ్రాసినాఁడు.

---

## R. No. 331.

Paper 10⅝ × 9¼ inches. Foll 32. Lines, 32 in a page. Mode of writing, fair but not quite correct. Good.

Transcribed in 1916-17 from a MS. of M.R Ry. Pullela Sūrayya-gāru of Indupalli, Gōdāvari district.

Fol. 1 contains some Sanskrit and Telugu stanzas relating to the preparation of certain medicines.

కేశవరాయచరిత్రము.

KĒŚAVARĀYACARITRAMU.

Foll. 2*a*—32*b*.

A treatise describing the various acts of worshipful honors shown to God Kēśavarāya worshipped in the shrine at Indupalli. The author is Pullela Vīrabhadra Sōmayāji. Songs in Sanskrit and Telugu languages are given with their tunes.

Complete.

**Beginning:**

ఓం దేవదేవోత్తమా దేవతాసార్వభౌమా అఖిలాండకోటిబ్రహ్మాండ నాయకా వేదవేదాంతవేద్యా పురాణపురుషోత్తమా శ్రీమదిందుపల్లి కేశవ రాయ నిత్యమహోత్సవధూపసేవాప్రియ ధూపసేవా మవధారయ.

నాట రాగః.

శ్లో. కర్పూరాగరుపాటీరదివ్యగంధసమన్వితమ్ ।
ధూపం గృహాణ లోకేశ శ్రియా సహ భువా సహ ॥
శ్రీమత్కేశవరాయ త్వం చందనాగరు సంయుతమ్ ।
ధూపం గృహాణ లక్ష్మీశ శ్రీభూసహిత కేశవ ॥
ఏతేన దేవస్య ధూపం దత్వా
అనంతరం సాకం దేవాలయస్య త్రిప్రదక్షిణం కుర్యాత్.

ఆటతాళః.

పల్లవి. శ్రీకేశవంభజే శ్రీకేశవంభజే శ్రీకేశవంభజే శ్రీకేశవం
క్షీరాబ్ధిజాధవం శ్రీకే॥ జితసర్వదానవమ్ శ్రీకే॥
తామరసలోచనం శ్రీకే॥ తారుణ్యభాజనమ్ శ్రీకే॥
నీలాభకుంతలం శ్రీకే। నీరధరకోమలం శ్రీకే॥
స్వర్ణాచలాంబరం శ్రీకే॥ స్మరకోటిసుందరమ్ శ్రీకే॥
శృంగారనిలయం శ్రీకే॥ సంగీతతోషణమ్ శ్రీకే॥
యిందుపల్లీశ్వరం శ్రీకే॥ శ్రీవీరభద్రేశ్వరమ్ శ్రీకే॥

* * * * *

సురట రాగః.

పల్లవి. వందనం విభో ॥
వందనం తే వనజనాభ వందనంజగదీశ్వర
వందనమిందుపల్లినివాస కేశవ రాయభో

. . . . . . .

సుబుధపుల్లెలవీరభద్రసోమయాజివరప్రద
రభసవికసితరాజవదనరాజరాజసుఖప్రద ॥ వందనంవిభో॥

**End:**

ముఖారి రాగః, ఆటతాళః.

పల్లవి. విజయ విజయ విజయ ॥
విజయ కేశవరాయ విబుధపూజితకాయ
సుజనసందోహగేయ సుందరహేమసిచయ
సరసిజభవనుత సంతోషితాబ్ధిజాత
కరుణాసరసపూరిత కమనీయమణోమిళిత ॥ విజయ॥
నందారుమునివరబృందారకమందార
చందనకాశ్మీరచర్చితబాహాంతర ॥ విజయ॥
కోటిమన్మథాకారకోమలచికుర
కోటిమన్మథాకారకుందాభదంతహార ॥ విజయ॥
పరమపుల్లెలవీరభద్రసోమపవర
వరదమంజుమంజీరవర్తులతారహార ॥ విజయ॥
ఇందీవరసంకాశ ఇందు(వు?)పల్లీశ
ఇందిరాప్రాణేశ ఇంద్రనీలాభకేశ ॥ విజయ ॥

* * * * *

"విక్రమనామసంవత్సర శ్రావణశుద్ధ ౧ పాడ్యమి స్థిరవారము నరిశి-పుల్లెలరామయ్య యీ కేశవరాయచరిత్ర సంపూర్ణముగా వ్రాసుకొనెను" అని యీగ్రంథపుమాతృకయం దున్నట్టుల నీ గ్రంథాంతమున వ్రాయఁబడియున్నది.

(వి-వి.)——

సమగ్రము. వ్రాఁత చక్కఁగా నున్నది. నిర్దుష్టము కాదు. గ్రంథపాతములు లేవు.

ఇందు ధూపాదిగా దేవాలయములయందు జరుగు నుపచారములు వర్ణింపఁబడినవి. సంస్కృతాంధ్రగీతములును శ్లోకములును రాగతాళ నిర్ణయముతోఁ గలవు. ఇందుపల్లియందు నెలకొన్న కేశవరాయస్వామి కొనియాడఁబడియున్నాఁడు. కవి పుల్లెలవీరభద్రసోమయాజియఁట. గ్రంథాదిని 1-2 పుటలయందు అశ్వగంధలేహ్యము రసాయనము చేయు విధానము చెప్పఁబడియున్నది.

---

## R. No. 332.

Paper. 8¼ × 6¼ inches. Foll. 4. Lines, 16 in a page. Mode of writing, good and apparently correct. Fair.

Presented in 1916–17 by M.R.Ry Paṇḍitārādhyula Vīrēśaliṅgam Garu of Mummaḍivaram, Amalāpuram taluk, Godavari district.

భవానీశతకము.

BHAVĀNĪŚATAKAMU.

A centum of stanzas in the Kanda metre in praise of Goddess Bhavāni composed probably by Paṇḍitārādhyula Vīrēśaliṅgam Garu (owner of the MS.) whose name is noted on the fly-leaf of the MS. thus:—"Bhavānīśatakamu by Paṇḍitārādhyula Vīrēśaliṅgam, Mummaḍivaram station".

Contains fifty stanzas.

**Beginning:**

క. శ్రీకరదివ్యపదాబ్జా
పాకారిప్రముఖదేవపం_క్తిస్తుత్యా
(లోకేశ ?) నూతరాణీ
చేకొనుము మదీయకవిత కృతిని భవానీ

క. పలుమాఱు నీపాదంబులఁ
గొలుతును నాకోర్కి దీర్చు గురుతరకరుణా
జలనిధి వై వసియింపుము
వెలయఁగ నాయెడఁదదమ్మిబిరిని భవానీ ౯

**End:**

క. ఎన్నివిధంబులవేఁడినఁ
గన్నడ చేసెదవుగాని కరుణింపవు నీ
కన్నమఱి వేల్పు లేరెడ
సున్నారా తెల్పు మందు నాకని భవానీ ౫౦

(వి-వి.)—

౩౦ చేఁబడిపద్యములు ఉన్నవి. వ్రాఁతబాగుగా నున్నది. తప్పులును లేవు. శైథిల్యగ్రంథపాతములు లేవు.

భవానీస్తుత్యాత్మక మగునీకందపద్యశతకమును రచియించినవా రెవ్వరైనది గ్రంథమునఁగాన్పింపకున్నను ముఖపత్రమున నాంగ్లభాషయందు పండితారాధ్యుల వీరేశలింగ మని వ్రాయఁబడియున్నది.

---

## R. No. 333.

**Paper.** $8\frac{1}{4} \times 6\frac{3}{4}$ inches. **Foll.** 18. **Lines,** 12 in a page. **Mode of writing,** good and apparently correct. In fair condition.

Presented in 1916-17 by M.R.Ry Paṇḍitārādhyula Vīrēśaliṅgam Garu of Mummaḍivaram, Amalāpuram taluk, Godavari district.

రాజరాజేశ్వరీశతకము.

RĀJARĀJĒŚVARĪŚATAKAMU.

A centum of stanzas in Śardūla and Mattēbha metres composed in praise of Goddess Ambika (Rājarājēśvari). The authorship of the work is attributed to Paṇḍitārādhyula Vīrēsaliṅgam Garu (the owner of the MS ) in the statement found on the fly-leaf of the MS.

Complete.

**Beginning:**

1. శ్రీమత్పద్మభవాదినిర్జరశిరశ్శ్రేణీకిరీటాగ్రభా
గామూల్యాఖిలరత్నకాంతినికరవ్యాకీర్ణపాదద్వయా

సాహోద్భూతవిరోధిరాజగమనా శశ్వచ్ఛిదానందినీ
క్షేమారోగ్యసుఖప్రదాననిపుణా శ్రీరాజరాజేశ్వరీ !

**End :**

108. జననీ ! యీశతకంబుఁ జేసితి నమస్కారంబుఁ గావించి నీ
కు నివేదించితిఁ జిత్తగింపుము శిశూక్తుల్ తల్లి విన్నట్లు త
ప్పునఁ దప్పెన్నక సాధు లట్లకొని తృప్తిం జెంది కారుణ్యదృ
ష్టిని నన్ జూచినఁ జాలు పూజితసురీ శ్రీరాజరాజేశ్వరీ.

(వి-వి.)—

సంపూర్ణము. ౧౦౮ పద్యము లున్నవి. వ్రాఁతయందమైనది. తప్పులు నంతగా నుండునట్లు తోఁచదు. గ్రంథపాతము లేదు. శైథిల్యమును కాన్పింపదు.

" శ్రీరాజరాజేశ్వరీ " యను మకుటముఁగల యీశతక మంచికం బొగడుచున్నయది. రచయిత యెవ్వఁడో యుందుఁ గానరాకున్నను దొలిపుటపై నాంగ్లభాషను " పండితారాధ్యుల వీరేశలింగముగారిచే రచియింపఁబడియె " నను నర్థము వచ్చునటుల వ్రాయఁబడియున్నది.

---

## R. No. 334.

Paper. 8⅜ × 6⅛ inches. Foll. 8. Lines, 15 in a page. Mode of writing, good but not correct. In good condition.

Presented in 1916-17 by M.R.Ry. Paṇḍitārādhyula Vīrēśaliṅgam Garu of Mummaḍivaram, Amalāpuram taluk, Godavari district.

శనైశ్చరస్తవనక్షత్రమాల.

ŚANAIŚCARASTĀVANAKṢATRAMĀLA.

Containing twenty-seven stanzas praising God Śanaiścara (the presiding deity of the planet Saturn). This also appears to be the work of Vīrēśaliṅgam Garu (owner) as is stated on the title-page of the MS.

Complete

**Beginning :**

1. శా. శ్రీమత్పంకజబంధుపుత్ర నిజపత్నీవానురాగాశ్రిత
స్తోమావత్కృపాభృదబ్జపత్త్ర మునిరాట్స్తోత్యచారిత్ర సు

క్షామాశ్మప్రతిమానగాత్ర దురితోద్యద్వల్లికాదాత్ర నీ
వే ముఖ్యుండవు వేల్పులందుఁ గరుణన్ వీక్షింపు ఛాయాసుతా!

**End:**

27. మ. భవదీయాఖ్యసమంకితంబు లగునీపద్యంబులన్ భక్తితో
నెవ్వరైనన్ బఠియించిరేని బహు . . నిష్టార్థసంసిద్ధిఁ జే
యవలెన్ వారికి సంతతంబు విపులవ్యాజానుకంపంబుతో
దివిజప్రార్చితభక్తలోకసురధాత్రీజాత ఛాయాసుతా!

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత బాగుగానే యున్నది. తప్పు లున్నవి. శై
థిల్యగ్రంథపాతములు లేవు.

శనైశ్చరస్తోత్ర మగు నీ యిరువదేడు పద్యములను సైతము పండితా
రాధ్యుల వీరేశలింగముగారు రచియించినట్లు యాంగ్లభాషను దొలికాగి
తముపై వ్రాయఁబడియున్నది.

---

## R. No. 335.

Paper. 8⅜ × 6⅞ inches. Foll. 17. Lines, 22 in a page. Mode of writing, fair but not quite correct. In fair condition.

Presented in 1916-17 by M.R.Ry. Paṇḍitārādhyula Vīrēśaliṅgam Garu of Mummaḍivaram, Amalāpuram taluk, Godavari district.

విఘ్నేశ్వరచరిత్రము.

VIGHNĒŚVARACARITRAMU.

This is the same work as the one described under R. No. 65 ante.

Wants the beginning and the end.

(వి-వి.)—

తుదమొదళ్లు లేవు. వ్రాఁత చక్కఁగా లేదు. తప్పులు లేవు.
గ్రంథపాతములు కాన్పింపవు. శిథిలము. ఇది ట్రై-క్యా. ఆర్. నెం 65
రున వర్ణితమైన గ్రంథమే.

## R. No. 336.

Paper. 10¾ × 9½ inches. Foll 119. Lines, 20 in a page. Mode of writing, good but not correct. In good condition.

Transcribed in 1916–17 from a MS. of M.R.Ry. M. Ramakrishnakavi Garu, M.A., Special Assistant to the Curator, Government Oriental MSS. Library, Madras.

నలచరిత్రము.

NALACARITRAMU

A Prabandha describing the story of Nala and his wife Damayanti up to their re-union after banishment to the forest. The author is Siripragaḍa Dharmapuri, son of Vēṅkaṭāmba and Tippaya of Haritagōtra and disciple of Ācci Varadārya The work was dedicated to God Vēṅkaṭācalapati at the instance of his maternal uncle Tumurugōṭi Dharmapuri. They are said to have been the residents of the country of Indurtisīma.

Complete in six Āśvāsas

**Beginning.**

* * * *

క. సుకరముగ నేలు మముర
తుకవృత్తిన్ శంఖచక్రశార్ఙ్గగదానం
దకములు హరికరసంస్థా
నకములు సంశ్రితవితానవకల్పకముల్.

సీ. ఏవైష్ణవశ్రేష్ఠుఁ . . .
. . . . . . .
నతఁడు సత్యవచోవైభవాభిరాముఁ
డైనశ్రీరంగగురుసూనుఁ డాచ్చివరద
యార్యుఁ డస్మద్గురుం డమ్మహానుభావు
నాత్మలో నిల్పి వందనం బాచరింతు.

* * * *

ఉ. . . . . . . . .
నన్నయభట్టు నెఱ్ఱకవిధానుని(?) దిక్కనసోమయాజి ము
న్నెన్నఁగ నైషధంబుఁ దెనుఁ గేర్పడఁ జేసినయట్టి ధన్యులన్.

* * * *

వ. అని యభీష్టదేవతాప్రార్థనంబును . . . . గావించి సరసవచనరచనాసమర్థుండనైయుండి యే నొకప్రబంధం బొనరింపఁ గృతప్రారంభుండనైతి నందు మద్వంశక్రమంబు వర్ణించెద.

సీ. సురుచిరావస్తంబసూత్రవర్ధిష్ణుండు
హారితగోత్రపవిత్రుఁ డైతనాఖ్యుఁ
డతనికూర్మివధూటి యగుకొండమాంబకుఁ
గొడుకులు నమ్మనకొండనార్యు
లను నామములఁ దగి రందుఁ గొండనకుఁ బ
ద్మకకును సుతు లార్వు రాఢ్యుఁ డెల్ల
నామాత్యవరుఁ డైత యప్రభుండును గొండ
ధీమణి తిప్పమంత్రియును బ్రెగడ
ఘనుఁడు సిద్ధన నాఁగఁ బ్రఖ్యాతు లైన
వారిలో మజ్జనకుఁ డత్యుదారగరిమ
వెలసె సిరిపెద్దడాన్వయతిలకుఁ డగుచు
దృఢయశోహారి కొండయతిప్పశౌరి.

గీ. అతఁడుదా స్తంభగిరినరహరినివాస
మైనయిందుర్తిసీమలో నమరి సిరులఁ
కలిమిఁ జెలువొందు నిడుకుడె నెలవుగాఁగ
నిలిచి వర్తిల్లునతని వర్ణింపఁ దరమె.

* * * *

గీ. అతఁడు లోహితగోత్రాఢ్యుఁ డైనతుమురు
గోటితిమ్మయకును నీతికోవిదయగు
వేంగళాంబకుఁ బుత్రియై వెలయు వేంక
టాంబ నురుపుణ్యశీలఁ గల్యాణ మయ్యె.

క. అనువుగ నియ్యిరువురు నం
దనులం గని రతులమతుల నలువుర మము ధ
ర్మన నరసన రంగన తి
మ్మన . . శ్రుతిచతుష్టయము విధమమరఁగా.

క. అందగ్రజుండ నేను ము
కుందపదధ్యానవరతగురుకవితాలీ
లం దనరి బుధులసభఁ బ్రియ
మంది వెలసినాఁడ ధర్మనామాత్యుండన్.

* * * *

సీ. తనరు నేఘనుప్రపితామహుం డన లోహి
తసగోత్రుఁడగు పుల్లదండనాథుఁ
డెసఁగు నేఘనుతాతయనదృశోన్నతిఁబుట్టి
మాంబాధవుఁడు తిమ్మనామాత్యుండు
పెనిచె నేఘనుతండ్రి తనకీర్తిలత లాశ
లంటఁ బెంపగుఁ దిమ్మయప్రభుండు
వెలయు నేఘనుతల్లి విమలపతివ్రత
వివిధసద్గుణశీల వేంగళాంబ
యతఁడు తుమురుగోటవంశాబ్ధివిభుఁడు
సతతపేరూరికేశవస్వామ్యధీన
మానసస్థితిఁబరఁగు నామేనమామ
మతివి గురుసన్నిభుఁడుధర్మమంత్రివిభుఁడు.

* * * *

క. . . . . . . ధర్మనరత్నా
సనమునఁ గూర్చుండి ప్రియం
బెనయఁగ నసుఁ జేరఁ బిలిచి యిట్లని పలికెన్.

చ. విను మనఘాత్మ ధర్మసుకవి భవదీయవచోవిలాసముల్
ఘనకవిహృద్విలాసములు గావె చమత్కృతి మీఱ నీవు నే
ర్చినగతి నిప్పు డానలచరిత్రము వేంకటశైలరాణ్ణివా
సునకు సమర్పణంబుగను శోభనలీల రచింపు పెంపుగన్.

వ. అనినఁ దలపోసి సంతోషంబు ముప్పిరిగొనఁ బులకాంకితశరీ
రుండ నైయుండి యేతత్ప్రబంధంబు రచియింపఁ బూనితి నికారణ్యకన్యా

రత్నంబున కవీశ్వరుం డైనశ్రీవేంకటేశ్వరుని వంశావతారంబభివర్ణిం
చెద.

* * * *

క. అక్షీణకృపాన్వితశుభ
లక్షణలక్ష్మీవధూట్యలంకారలస
ద్వక్షునకును విలసితప
ద్మాక్షునకును వేంకటాచలాధ్యక్షునకున్.

వ. సమర్పణంబుగా నాయొనర్పంబూనిన నలచరిత్రం బనుమహా
ప్రబంధంబునకుఁ గథాప్రారంభం బెట్టిదనిన.

**End :**

సీ. సంధ్యాద్యనుష్ఠానచతురక్రియలచేత
శాంతతాక్షరసమాచరణచేత
నంబుజోదరుపదాబ్జారాధనముచేతఁ
దత్కథాశ్రవణతత్పరతచేతఁ
గమనీయవైభవకైంకర్యములచేత
గురుజనవిద్వత్ప్రగోష్ఠిచేత
సతతాతిథేయపూజావిధానముచేత
సకలార్థదానప్రశస్తిచేత
నిఖిలశాస్త్రార్థనిర్ణయనిరతిచేత
విహితసజ్జనసంసర్గమహిమచేత
నెడపకానందములప్రొద్దుఁ గడపుచుండు
రాజమణి యైననలధరారమణుఁ డెపుడు.

* * * *

మాలిని. సరసిజదళనేత్రా శాతకుంభోరువేత్రా
నిరతగిరిశమిత్రా నిర్జరాస్యాబ్జమిత్రా
పరమగుణపవిత్రా పాపవల్లీలవిత్రా
పరివృతరిపుగోత్రా పాణిపద్మాప్తగోత్రా.

**Colophon :**

ఇదిశ్రీమదాంచివరదగురుచరణాభ్యాసనగసనావికాస తిరుమలగిరివేం
కటేశ్వరవరప్రసాదలబ్ధకవితావిలాస హారితగోత్ర సిరిప్రెగడ తిప్పన

మనీషిపుత్ర సుజనవిధేయ ధర్మపురినామధేయ ప్రణీతం బైనసలచరిత్రంబు నందు షష్ఠాశ్వాసము.

(వి-వి.)—

సమగ్రము. ఆఱాశ్వాసములు. వ్రాఁత బాగుగానే యున్నది. తప్పులు మెండు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు కూపట్టుచున్నవి. తొలిపద్యములు కొన్ని కానరావు.

ఇందు నలునికథ యంతయు వర్ణింప బడినది. కృతికర్త యగుసిరి ప్రెగడధర్మపురి హారితసగోత్రులగు వేంకటాంబాతిప్పయలకుఁ బుత్రుఁడు. ఆచ్చివరదార్యులశిష్యుఁడు. వీరు ఇందుర్తిసీమలోనివారఁట. తనమేన మామ యగుతుమురుగోటి ధర్మపురి యనునాతని ప్రోత్సాహమున నీకవి వేంకటాచలపతిని గృతిస్వామిని జేసెను. ఇందు వేంకటాచలమాహాత్మ్యము పైతము వర్ణింపఁబడినది.

---

## R. No. 337.

Paper. 10¾ × 9⅜ inches. Foll. 133. Lines, 20 in a page. Mode of writing, fair but full of mistakes Good.

Transcribed from a MS. of M.R.Ry. Tejōmūrtula Veṅkaṭappa Siddhānti Garu of Tuni, Godavari district.

(*a*) సిద్ధాంతసారము.

SIDDHĀNTASĀRAMU.

Foll. 1*a*—8*b*.

A treatise in Sanskrit stanzas with Telugu meaning, dealing with the determination of the time of commencement of the day, the month, etc. The names of the author and of the commentator are not known.

Incomplete.

**Beginning :**

వారప్రవృత్తికి నిర్ణయము.

వారప్రవృత్తికి సూర్యసిద్ధాంతమందు అర్ధరాత్రియందు వారప్రవేశము.

సూర్యసిద్ధాంతవచనము.

శ్లో. వారప్రవృత్తిః ప్రాగ్దేశే క్షపార్ధేభ్యధికే భవేత్ ।
తద్దేశాంతరనాడీభిః పశ్చాదూనే వినిర్దిశేత్ ॥

ఇందుకుటీక నిశ్వర్థము.

దేశాంతరవిఘడియలు 30 నిశ్వర్థం మీద 30 విఘడియలకు భూరే ఖకు తూర్పున వారప్రవృత్తి.

**End :**

శ్లో. శిలాతలేన సంశుద్ధే వజ్రలేపే దివాసమే ।
ఇష్టశంకర్వంగులైర్విష్టైస్సమమండలమాలిఖేత్ ॥

తన్మధ్యే స్థాపయేచ్ఛంఖు(కు)ం కల్ప్యాం చ ద్వాదశాంగుళమ్।
తన్మధ్యే తిమినా రేఖా చక్రే పూర్వాపరాభిధాః॥

(వి-వి.)—

గ్రంథ మెంతయున్నదో ? వ్రాఁతబాగుగా నున్నను తప్పులు చాలఁ గలవు. శైథిల్యపాతములు లేవు.

వారప్రవృత్తి, సంక్రాంతినిర్ణయము మున్నగువిషయములు గలయీ జ్యోతిశ్శాస్త్రగ్రంథమున సంస్కృతమూలముఁ దెనుఁగుటీకయును గలవు. టీకాకారు లెవ్వరో తెలిరాదు.

---

(b) లఘుమానసగణితము (సటీకము).

LAGHUMĀNASAGAṆITAMU (WITH TELUGU MEANING)

Foll. 9a—46b.

The text consisting of Sanskrit stanzas is the same as that described under No. 13475 of the Descriptive Catalogu of Sanskrit MSS., Vol. XXIV. The Telugu commentary was written in Śaka 1617 by Ayyalu sōmayāji Bālaya, son of Rāmacandra Bhaṭṭa and Accama of Kauṇḍinyagōtra. He calls the text by the name of Grahaṇa and the commentary by Daivajñamanōllāsa.

Contains four Adhyāyas.

**Beginning:**

రవిచంద్రగ్రహణాలకు తెలుగుటీక.

శ్లో. శ్రీవేంకటాచలావాసం శ్రీనిజాం(శాం)తభుజాంతరమ్ ।
వందారుజనమందారం వందే కమపి సుందరమ్ ॥

టీక. శ్రీవెంకటేశ్వరులకు నమస్కరించి గ్రహణశాస్త్రము తెలుగు చాయబూనినవాడను అయ్యలుసోమయాజికులసంభవుం డైనరామచంద్ర భట్లుగారికిన్ని అచ్చమకున్ను వరపుత్రుండబాల(య)యనువాఁడను కౌండిన్యసగోత్రోద్భవుండను నేను ఈ గ్రహణశాస్త్రానకు తెలుగుటీక సేయఁబూని ఈటీక చేసినవత్సరమాసదినవారలగ్నములున్నూ చెప్పంబడెను.

శ్లో. సప్తైకర్త్ర శశాంకవత్సరమితే శాకే యువాబ్దే చిరా
దాషాఢే బహుళే దశే గురుదినే స్త్రీబాలరాశ్యోదయే
శ్రీమత్య(మాన)య్యలుసోమయాజికులజశ్రీరామచంద్రాత్మజః
బాలాఖ్యో గ్రహణాఖ్యగ్రంథరచనాం వక్ష్యేకం ధ్రభాషాత్మికామ్ ॥

టీక. యువసంవత్సరమందు నిజఆషాఢబహుళదశమి గురువారము నాఁడు కన్యాలగ్నమందు ఈగ్రంథము తెలుగుశాయటూనినాఁడను.

* * * *

శ్లో. ప్రకాశాదిత్యవతాఖ్యతోభారద్వాజో ద్విజోత్తమః।
లఘుపూర్వం స్ఫుటోపాయం వక్ష్యేऽహం లఘుమానసమ్ ॥

**End:**

శ్లో. గ్రాసభేదా దశవిధా మోక్షభేదాస్తథా దశ।
న శక్తా వీక్షితుం దేవాః కింపునః ప్రాకృతా జనాః॥

టీక. ఈచంద్రసూర్యగ్రహణభేదాలు పట్టేలాగు 10 విధాలు. విడిచేలాగు 10 విధాలు. ఇవి తెలియను దేవతలకైనను శక్యంగాదనంగాను ప్రాకృతజనులకుఏమిచెప్పవలెను.

* * * *

**Colophon:**

ఇతి శ్రీమంజులాచార్యస్య కృతౌ లఘుమానసే సూర్యగ్రహణాధికారశ్చతుర్థః।

ఇతి శ్రీఅయ్యలుసోమయాజికులపారావారసంజనితకౌండిన్యసగోత్ర పవిత్ర శ్రీరామచంద్రార్యపుత్రబాలయప్రణీతం దైవజ్ఞమనోల్లాసం బను తెలుంగుటీకయందు సూర్యగ్రహణాధ్యాయము నాల్గవది.

(వి-వి.)—

నాల్గు అధ్యాయములు. వ్రాఁత బాగుగనేయున్నది. తప్పులున్నవి.

ఇది మంజులాచార్యవిరచిత మైన లఘుమానస మనుసంస్కృత గ్రంథమునకు నయిలుసోమయాజిబాలయచే రచియింపఁబడినతెలుఁగుటీక. ఈతఁడు కౌండిన్యసగోత్రుఁడు. రామచంద్రార్యునిపుత్రుఁడు. తల్లి అచ్చమ. ఈటీకకు దైవజ్ఞమనోల్లాస మనిపేరు. అధ్యాయక్రమము:—

1. మధ్యగ్రహాధ్యాయము.
2. స్ఫుటగ్రహాధ్యాయము.

3. చంద్రగ్రహణాధ్యాయము.

4. సూర్యగ్రహణాధ్యాయము.

Foll. 46*b*—47*a*.

"త్రైరాశికం దెచ్చే సూత్రము" అను శీర్షికతోఁ గొన్ని శ్లోకములును వానికిఁ దెలుఁగు టీకయుఁ గలదు.

---

(*c*) సిద్ధాంతసారము, సటీకము.

SIDDHĀNTASĀRAMU, (WITH TELUGU MEANING)

Foll. 47*b*—67*a*.

A treatise in Sanskrit dealing with the determination of the time of solar and lunar eclipses in accordance with the Sūryasiddhānta and the Laghumānasa. The Telugu commentary herein added was written by Marla Appaya, son of Pērubhaṭṭa of Kauṇḍinyagōtra.

Complete.

రాశ్యాత్మకగణితాలను సూర్యచంద్రగ్రహణాలు తెచ్చేటందుకు.

గ్రహణయోగం కలిగినపర్వంనాడు రవిచంద్రరాహులను స్ఫుటాలు చేసేది. రాహువును మానసానకు సామ్యమైనట్టుచేసే సంస్కారము,

శ్లో. వస్విందునేత్రకల్పితాః (౨౫) షట్త్రింశ(౩౬)ద్వికలోనితాః
మానసాఖ్యసమంచైవ సిద్ధాంతసా(?)రముచ్యతే॥

సూర్యసిద్ధాంతము మొదలుగాఁగల తంత్రగణితాలను రాహువును దెచ్చి భాగలలోను ౮ లిప్తలలోను ౫౯ విలిప్తలలోను ౩౬ తీసివేస్తేమానస రాహువుకుసామ్యమైయుండును.

**End :**

ఆద్యంతపుణ్యకాలానకు.

గ్రాసానకు తగినస్థిత్యర్థ ద్విగుణిస్తే అనగా ౨ గుణిస్తేను ఆద్యంత కాలము అవును. ఈరీతిని శాస్త్రసమ్మతిగాను సిద్ధాంతసారమందు సూర్యచంద్రగ్రహణాలు తెచ్చివ్రాసేది.

**Colophon** (on fol. 62*b*):—

ఇతి శ్రీమర్లవంశపారావారసంజనితకౌండిన్యసగోత్రపవిత్రశ్రీపేరుభట్టారకపుత్రఅప్పయనామధేయప్రణీతంబైన సూర్యసిద్ధాంతసజనిత తంత్రగణితవిధాంలఘుమానసానుగుణ్యస్య సూర్యగ్రహణాంధ్రటీకామూలం (?)సంపూర్ణమ్.

(బి-బి.)—

గ్రంథపరిమాణమెంతయో తెలియదు.

ఇందును సంస్కృతశ్లోకములు వానికి మర్లఅప్పయ వ్రాసిన తెలుఁగు టీకయుఁ గలదు. సూర్యచంద్రగ్రహణసంబంధ మయినవిషయము చెప్పఁబడినది.

ఈ గ్రంథాంతమున—

"స్వస్తిశ్రీకాళయుక్తినామసంవత్సరనిజశ్రావణశుద్ధ ॥ సప్తమిశని వారంవరుకు సిద్ధాంతసారము పుస్తకము గ్రహణాలు తెచ్చేటందుకు బాలబోధగాను తేలికగాను మర్లఅప్పయచేసినగ్రంథం తేజోమూర్తుల పేరుసోమయాజులుతనకుగుణించుకోనేటందుక వ్రాసికొనెను"

అనియున్నది.

---

(*d*) ग्रहचन्द्रिकागणितम्.

GRAHAÇANDRIKĀGAṆITAM.

Foll. 67*b*—76*b*.

By Ākhaṇḍala Pērājyōsyalu. See the Sanskrit part of the Triennial Catalogue, Vol. III.

---

(*e*) గ్రహచంద్రికాగణితము.

GRAHAÇANDRIKĀGAṆITAMU.

Foll. 77*a*—133*a*. Fol. 133*b* is left blank.

A Telugu commentary on the work described under (*d*) above. The commentator is Marla Appaya.

Complete

**Beginning:**

గ్రహచంద్రికగణితానకు తెలుగుటీక.

శకాబ్దాలలోను ౧౪౧౨ తీస్తే కగ్రహచంద్రికగణితకరణాబ్దాలు అవును.

కరణాబ్దాలు అనగాను అన్ని యేండ్లక్రిందట యీగణితం పుట్టింది. అని యెరింగేది. ఈకరణాబ్దాలు ౧౨ ట గుణించి చైత్రాదిగతమాసాలు కూడి అది ౨ప్రతులు పెట్టి క్రిందిప్రతి ౩౦ (ట)గుణించి అందులోను మరిన్ని ౬౦౦ కలయగూడి ౯౭౬ట పాలుగొన్నలబ్ధం ప్రతిమీదిప్రతిలోను గూడి ఆప్రతి౩౦టగుణించి శుక్లప్రతిపదాదితిథులు గూడి అది ౩ ప్రతులు పెట్టి ౩౦ వప్రతి ౭౧౪ట పాలులబ్ధం నడిమిప్రతిలో కూడి అందులోను మరిన్ని ౩౭ కలియగూడి అప్రతి ౬౪ టపాలుగొన్నలబ్ధం ఆమీదిప్రతిలోను తీస్తేను ఆశేషం ద్యుగణం అవును.

**End :**

ఇతి కుజాదీనాం శీఘ్రఫలకాని సమాప్తాని.

* * * *

**Colophon :**

శ్రీకాళయుక్తినామసంవత్సరే దక్షిణాయనే వర్షఋతౌ నిజశ్రావణ మాసే అసితపక్షే ద్వాదశ్యాం . . . తత్రైతే కర్కాటకరాశౌ ధను ర్లగ్నే సూర్యోదయాదిద్వావింశద్ఘటికానాముపరి త్రయోవింశద్ఘటికా నాం మధ్యే . . . . అఖండలపేరాజ్యోస్యరచితగ్రహచంద్రికాగణిత సాంప్రదాయరహస్య . . . . తస్య ఆంధ్రటీకాయాం మల్ల అప్పన్నరచనస్య తేజోమూర్తులవేంకటార్యకుమారస్య పేరుసోమయా జినా రచితమిదమ్.

(వి.-వి).—

ఇది ఆర్ నె 337(*d*) నగ కలఅఖండలపేరాజ్యోస్యకృత మగు గ్రహచంద్రికాగణితమునకు మల్లఅప్పన్నగారు వ్రాసిన తెలుఁగువివర ణము. తిథ్యాదిగ్రహణాంతముగలగణితము, వర్షధ్రువగుణకోపకారము, దినగతిపదకములు, స్ఫుటపదకములుమున్నగువిషయము లిందుఁగలవు. పేరు భట్టుకుమారుఁడగునీయప్పన్న రచియించినయొకశ్లోక మీక్రిందితీరున 67*b* వ పత్రమునందు.

శ్రీమల్లవంశకలశాంబుధికౌస్తుభేన
శ్రీపేరుభట్టతనయేన విరాజితేన।
సాధీయ(మ)తామభిమతాప్యయధీమతేయం
బోధాయ సర్వధరణీసురపండితానామ్।

## R. No. 338.

**Paper.** 10¾ × 9¾ inches. Foll. 64. Lines, 20 in a page. Mode of writing, good but incorrect. In good condition.

Transcribed in the year 1916–17 from a MS. of M.R.Ry. Mācirāju Rāmaswāmi Gāru, Tōṭagunṭa, Tanuku taluk, Godavari district.

(*a*) మల్లారిచరిత్రము.

**MALLĀRICARITRAMU.**

Foll. 1*a*—24*b*.

The fragmentary portion contained in this MS. deals with the story of Paraśurāma in the form of a Prabandha.

Wants the beginning and the end.

**Beginning :**

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన మల్లారిచరిత్రం బనుశృంగారప్రబంధంబునకుం గథాక్రమం బెట్టిదనిన.

* * * *

ఉ. వింటి భవత్కటాక్షమున విశ్రుతదేవచరిత్రముల్ జగ
త్కంటకదైత్యదానవులదారుణకర్మము లెల్లధర్మముల్
వింటిని పూర్వరాజులపవిత్రచరిత్రము లాలకించితిఁ
దొంటికథావిధానములతో విన నాగిరిరాజుసత్కథల్.

**End :**

శా. ఆమాట ల్విని సిద్ధిరాజు మదిలో నత్యంతముఁ గుంది తం
డ్రీ మత్ప్రాణభయంబుఁ బాపుటకు నై నిర్నిద్రజాగ్రత్ప్రతా
పామోఘప్రతవంశగౌరవములుఁ వ్యర్థంబుగాఁ జేయఁగా
నీమార్గంబున బుద్ధి చెప్పఁగలనా వృద్ధత్వసంప్రాప్తిచేఁ.

స్రగ్ధరా.

వైకుంఠాంశోద్భవుం డైవరలు నతఁడు దు
ర్వారశౌర్యోగ్రుఁ డంచుఁ
నీకుఁ భీతోక్తు లాడఁ నియత మె తలఁపఁ
నీరజాతాక్షుకన్నఁ
శ్రీకంఠుం డల్పుఁడే తచ్ఛివగురువరసం
సిద్ధయోనిప్రభూత
శ్లోకౌతత్కృష్టుండ వీవై . . .
. . . . . .
. . . . . .

* * * *

(వి-వి).—

తుద మొదలు లేదు. ఆశ్వాసవిభాగము లేదు. వ్రాఁత తిన్ననిది. తప్పులున్నవి.

అల్పముగా నున్నయీగ్రంథభాగమునఁ బరశురామవృత్తాంతము కొంత కలదు. గ్రంథకర్త యెవరో తెలియదు.

---

(*b*) మల్లారిచరిత్రము.

**MALLĀRICARITRAMU.**

Foll. 25*a*—64*a*. Fol. 64*b* is blank.

This poem consisting of stanzas of Dvipada and Mañjari metres gives an account of the kings that descended from Karṇa, who was born to a Ṛṣi from his ear. It is stated that the *Dvipada* work was written formerly by Mariganṭi Vēṅkaṭācārya and that Erramilli Pērarājakavi enlarged it at the instance of Gōḍē Jānakayyamma, wife of Sūryaprakāśa Rao, by adding verses of Mañjarī metre. An ancestor of this prince is said to have obtained kingdom through the grace of God Mallāri (Malahara).

Incomplete, containing the Āśvāsas 1 to 4.

**Beginning:**

శ్రీనివాసం బైన శ్రీగోడవంశ
కలశవారిధిసుధాకరుఁడు గాంభీర్య
వీర్యధైర్యస్థైర్యవిశ్రుతౌదార్య
కలితసాహసశౌర్యఘనతైశ్వర్య
యుతుఁ డురుసత్కృపాయుతుఁడు సూర్యప్ర
కాశరాయఁడుఁ దానఘనుఁ డని జగతిఁ
బ్రణుతి కెక్కినమేటి ప్రభువున కెలమి
సద్ధర్మపత్ని యై సరసాంతరంగ
పరమపాతివ్రత్యభవ్యగుణశీల
* * * *
అలరిన శ్రీజానకయ్యగా రెలమి
రహిఁ నెఱ్ఱమిల్లి పేర్రాజును నన్నుఁ
దమయాశ్రితులలోనఁ దద్దయు నెపుడు
గారవించుచు నుంటఁ గరుణచే నిట్లు
తెలియఁ జేయించిరి విలసితం బైన
స్కాందపురాణ సంగత మయియుండు
మల్లారిచరిత మిమ్మహిమీఁద వెలసి
ద్విపద కావ్యంబుగాఁ దేటపడంగఁ
సత్కావ్య మందొప్పనతిశయం బైన
కర్ణకులీనులఘనచరిత్రంబు
అది మత్కులాచారమంతయు నుండు
గ్రంథంబు గావునఁ గడిమి మీఱంగ
మున్నున్నపుస్తకమునఁ జాలఁదప్ప

లున్నవి కావున నన్నియు మీరు
సవరించుకేకాదు సరసంబు గాఁగ
మఱికొన్నిపట్టుల నరసి రచింప
వలసినగ్రంథంబుఁ దెలియఁజేసెదను
అదియును రచియించి ముదమున మీరు
వ్రాసి యొప్పింపఁగ వలయు నటంచు
నీరీతిఁ దెలియఁజేయించినపిదప
సంతసమంది యాసాధ్వీలలామ
సెలవుసొప్పున నేను చిత్తంబులోన
మదభీష్టదైవంబుఁ గుదురుగ నిలిపి
పూనితి నకృతిఁ బోఁడిమి మీఱ
దిద్ది లిఖింపంగఁ దీరుగా నిపుడు
శ్రీరమ్యధవళాంగ శ్రీశంభులింగ
చారుతరాపాంగ సదయాంతరంగ
అవధరింపుము బాదరాయణమునికి
నవిశేషమతి శరజన్ముఁ డిట్లనియెఁ
గృతయుగంబునమున్ను గిరిరాజనంగ
మతిమంతుఁ డాసక్తి మల్లారిఁ గొలిచి
యతనిసత్కృపచేత నతులితైశ్వర్య
యుతవైశ్రవణుఁడయి యుర్వి వర్ధిల్లె.

**End:**

వనిచిన నప్పుడు పరశురాముండు
ఆతివయుఁ దాను నానంద మొప్పఁ
దాతకుఁ బ్రణమిల్లి తనరారు వేడ్క
వందిమాగధులు వైకవాగముల్ సేయ.
ఘనరథారూఢుఁ డైకల్యాణవిభవ
మలరఁగఁ జతురంగబలములు గొలువ
మాహూరిపురి కేఁగె మహిఁ గర్ణకులుబు
ఈరీతి సిరి మీఱి యిం పలరంగఁ
జిరకాల మవనిలోఁ జెల్వునఁ గీర్తి
చెందియుండెడి మీఁదఁ జెల్వుగవృద్ధిఁ
బొందనున్నా రనిపొల్పుగ సూతుఁ

చెలిమితో శౌనకాద్యులకుఁ జెప్పంగ
విని ముదమందుచు వేడుక నవలి
కథఁ దెల్పు మని సూతుఁ గని పలికె రంత
ఈరీతి వివిధలోకేశుని పేర
హీరప్రకాశ గౌరీశుని పేర
రమణీయవృషభతురంగుని పేరఁ
బ్రముదితసదయాంతరంగుని పేరఁ
జారులక్ష్మీనాథసాయకు పేర

* * * *

గురులీలమటిగంటికులపవిత్రుండు
సరసుఁడౌ వేంకటాచార్యుండు ఘనుఁడు
ద్రావిడగీర్వాణ . . . .
వివరించి చెప్పెను విశ్వంబునందు
సారససంగీత సాహిత్యగరిమ
ధారుణిలోఁ బ్రసిద్ధముగ మల్లారి
చరితంబునందుఁ . . . ప్రౌఢి
నరుదందఁగాఁ జతుర్థాశ్వాస మిదియు.

గ్రంథాంతమునఁ విలేఖకుని పేరును, కాలమును, దెలుపు

"సీ. గగనేభనగభూమిద(1780)గు శాలివాహన
శకమునఁ బింగళసంజ్ఞవత్స
రమ్మునఁ దగు కార్తికమ్మున శుక్లప
క్షమునఁ ద్ర . . . .
. . . . . . శ్రీగౌడ
సూర్యప్రకాశరాయార్యవర్య
జాయాశిరోమణిజానకయ్య యనుజ్ఞ
కుప్పిలి . . . ఖ్యుండు ప్రేమ
నోజమై నెట్టిమిల్లి పేరిరాజసుకవి
వ్రాయుమాతృకఁ జూచి మల్లారిచరిత
. . . . గల్గెనా వానిఁ బండి
తోత్తములు చూచి సవరింపుఁ డొప్పు మీఱ."

అను పద్యముగలదు.

(వి-వి.)—

అసమగ్రము. మొదటి నాల్గాశ్వాసములు కలవు. వ్రాఁత మంచిది. తప్పులు దిద్దఁబడినవి. గ్రంథపాతములు కలవు.

అకఠడకఠడ మంజరివృత్తముకలిసినయీద్విపదకావ్యమును మఱి గంటి వేంకటాచార్యుఁడు రచియించినాఁడు. గోడె సూర్యప్రకాశరాయలభార్యయగు జానకయ్యమ్మగారియాజ్ఞచొప్పున ఎఱ్ఱమిల్లి పేరాజకవి అకఠడకఠడ సంస్కరించి పెంచికూర్చినట్లు తాను చెప్పికొన్నాఁడు. ద్విపద భాగము వేంకటాచార్యులదియును మంజరీభాగము పేరాజకవిదియును గావచ్చును ఇందు గర్ణకులీనులగు రాజులవంశానుచరిత్రము వర్ణింపఁబడినది. నై 338 (a) రున వర్ణింపఁబడిన గ్రంథమిదేకథావృత్తాంతమునకుఁ బద్యప్రబంధరచనము.

---

## R. No. 339.

**Paper. 10⅝ × 7⅛ inches. Foll. 58. Lines, 20 on a page. Mode of writing, good but not quite erroneous. In good condition.**

(*a*) ధర్మగుప్తాభ్యుదయము.

DHARMAGUPTĀBHYUDAYAMU.

Foll. 1*a*—43*b*. Foll. 44 is left blank.

Transcribed in the year 1916-17 from a MS. of M.R.Ry Ivaṭūri Nāgabhūṣaṇam Pantulu Gāru of Masulipatam, Kistna district.

This Prabandha narrates the story of Dharmagupta who obtained salvation by observing the Sōmavāravrata. The author of the work is Kāśīnāthuni Vīrārādhya, a descendant of Śrīpatipaṇḍitārādhya, and he dedicates it to God Mallikārjuna worshipped at Śrīśaila. Another work of the author is Bhadrāyuścaritra.

Breaks off in the second Āśvāsa.

**Beginning :**

వ. అని యిష్టదేవతా ప్రార్థనంబును బ్రమథగణస్తోత్రంబును సుకవికీర్తనంబును, కుకవిపరిహాసౌన్నత్యంబును . . .। శ్రీమద్ధర్మగుప్తాభ్యుదయంబను పురాణేతిహాసంబు రచియించి శ్రీమద్భ్రమరాంబాహృత్కమలకర్ణికానిత్యందమరందబిందుసందోహాస్వాదనేందిందిరాయమాణమానసుండగు శ్రీగిరిమల్లికార్జునదేవునకు సమర్పించెద మద్వంశ

ప్రభావంబుమున్ను భద్రాయుశ్చరిత్రంబున సవిస్తరంబుగాఁ జెప్పంబడి
యె, నైన నదియెట్లనిన :—

మ. అరయన్ నిష్కళసంజ్ఞుఁడై పరశివాఖ్యన్నామరూప క్రియా
కరమాయాతిగుఁడై యదిక్స్థలమహాకాలాపరిచ్ఛేద్యుఁడై
స్ఫురణారూపచిదాఖ్యశక్తిమయుఁ డొప్పున్ సచ్చిదానందభా
స్వరసన్మూర్తి వెలుంగుచున్ శ్రుతిశిరోవాగ్వేద్యుఁడాద్యుండొగిన్.

క. పొందొనరఁగ నప్పరశివ
బిందుక్షోభమునఁ బొడమెఁ బృథుతరనాదం
బం దుదయించెను బిందువు
బిందువున సదాశివుండు పెంపుగఁ బుట్టెన్.

సీ. తనరఁ బంచబ్రహ్మ మనువిగ్రహుం డగు
నాసదాశివునకు నైదుముఖము
లానరుసీశానాఖ్య మూర్ధ్వవక్త్రము తత్పు
రుషము ప్రాఙ్ముఖముతీరుగ నఘోర
మట దక్షిణాననం బగువామదేవాఖ్య
ముత్తరాస్యం బన నొప్ప మఱియుఁ
బశ్చిమవదనంబు పరగు సద్యోజాత
మనునామములతోడ నలరుచుండు.
దశభుజంబులు గలిగి నేత్రత్రయంబు
చంద్రరేఖావతంసంబు సాంద్రకృత్య
పంచకాధీశతయుఁ గల్గి బైందవాఖ్య
మూర్తి యగునాసదాశివుముఖములందు.

చ. నలువురు వీరశైవగురునాథులు పుట్టిరి

* * * *

మ. ఇద్ధద్వాపరదేశికుల్ కలి . . . . ధీసాను వై రేవణా
సిద్ధోద్యన్మరళీశరామగురురాట్ఛ్రీపండితారాధ్యాహ్వయుల్
సద్ధీమంతులు నల్వు రుత్తరశివాచారుల్ స్వశిష్యావళీ
బుద్ధాఖండశివస్వయాంబ్దశమి . . . . .

* * * *

వ. తత్క్రమంబున వేర్వేఱ వివరిం . . .

సీ. . . . . . . . నా
ఫీనుండు రేవణాసిద్ధగురుఁడు

గురుతరాత్రేయసగోత్రుండు ఋగ్వేది
శాంతేశ్వరేష్టప్రశస్తమూర్తి
ధరుఁడు యతీశ్వరుం డురుకవిప్రథమాఖ్య
. . . . దేశికుం డమృతసిద్ధి
. . సిద్ధుఁడుసిద్ధవటువాసి
రహిభరద్వాజగోత్రప్రసిద్ధుఁ

గీ. డాగి యజుర్వేది సిద్ధాసనోజ్జ్వలుండు
దనరఁగపిలాఖ్యమల్లికార్జునవిదర్భ
యజనసద్యోగివనవిహారాశ్రమాఖ్యుఁ
డవని రెండవదేశికుం డగుచు నలరె.

సీ. గురుఁడు తృతీయుఁ డేకోరాముఁ డాగి బ్రహ్మ
చర్యాశ్రమస్థుండు సామవేది
సాంఖ్యాయనసగోత్రజనుఁడు భద్రాసనా
వేశుండు భోగమల్లేశమూర్తి
యోగిసద్ధ్యానగమ్యుం డుత్తరద్వార
మాహేశ్వరస్థాయి మఱియుఁ బండి
తుఁడు గృహస్థాశ్రమస్థుండు బాలబ్రహ్మ
సంజ్ఞేశ్వరస్థాని సౌమ్యపేరి
చెన్నమల్లేశచిన్మూర్తి శిష్టయోగ
పరుఁడు కాశ్యపగోత్రసద్భావభావి
విమలచరితుఁ డథర్వణవేది యనఁగ
గరిమ నాలవదేశికాఖ్యను మెలంగి.

సీ. తత్త్వమసీతి . . . పండితగురుండు

* * * *

గీ. అరయఁ దత్పండితేంద్రనిజాంశభూతి
భవులు శ్రీపతిమంచనపండితులును
మల్లికార్జునపండితుఁ డెల్లజనులు
వినుతు లొనరింప వెలసి రుర్వీతలమున

గీ. అంత శ్రీపతి పండితాన్వయపరంప
రోద్భవుండయ్యె లింగనాఖ్యుం డతండ
నంతనాముని గనియె నయ్యనఘమూర్తి
కాశినాథాహ్వయుని జిత్ప్రకాశుఁ గాంచె.

సీ. శ్రీకాశినాథదేశికచక్రవర్తికి
హరపంచముఖతుల్యు లగుచు సుతులు
సోమేశయుగళంబు సొంపొందు లింగయ్య
బసవన్నయును కోటిపల్లివిభుఁడు
ననఁగ నేవురు గల్గి రందగ్రజుం డగు
సోమేశ్వరుఁడు గాంచె సుతుల మువురఁ
గాశినాథుండును ఘనతమ్మనార్యుఁడుఁ
బండితుండు ననంగ భవ్యమతుల
గరిమ తోడుత వారిలోఁ గాశినాథ
దేశికాగ్రణి చిద్రూపదివ్యమూర్తి
షట్స్థలబ్రహ్మవిద్యావిశారదుండు
సర్వతంత్రస్వతంత్రధీశక్తియుతుఁడు

* * * *

శా. కాశీనాథకటాక్షసంభవలసత్కల్యాణచారిత్రు లా
వేశానూనచిదర్కమగ్నవరదృగ్విశ్రాంతిసంధాను లా
కాశోద్భాసిశరీరు లంచితశుభాగారుల్ సదాప్రాప్తయో
గాశాకీర్తు లనంతగౌతమగురుల్ హంసాత్మకుల్ పావనుల్

* * * *

సీ. గీ. అతఁడు శ్రీపతిపండితాన్వయపయోధి
పూర్ణిమైణాంకుఁ డనఘుఁ డపూర్వచరితుఁ
డగ్రజుఁడుఁ గౌతమునకు ననంతగురుఁడు
జగదుదక్యైవసిద్ధాంతచక్రవర్తి

గీ. అయ్యనంతాఖ్యగురునకు నరయమల్లి
కార్జునుం డమ్మహాత్మున కాత్మజుండు
లింగనార్యుం డతండు సల్లీల మెఱయఁ
గాంచె శ్రీకాశినాథు నఖండయశుని.

క. ఆకాశినాథ గురునకుఁ
బ్రాకటనిగమాగమార్థపారంగతులై

జోక౯ బుట్టిరి విమలశు
భాకారు లనంతగౌతమాఖ్యులు ప్రీతి౯.

సీ. వారిలో గౌతమవరునకు శరభాఖ్యుఁ
డయ్యయు (లు) ననుపుత్త్రు లనఘమతులు
శరభేశ్వరుఁడు గాంచె సరసాఖ్యు నాగన్న
యతనికి శరభాఖ్యుఁ డమరఁబుట్టె
నాశరభన్నకుఁ గాశినాథాదులు
సంభవించిరి మహాసభ్యు లగుచు
నతని తమ్ముం డైన యయ్యప్పకును వీర
భద్రుఁ డాఘనునకు భవ్యమతులు

తనర నాగేశుఁ డయ్యసదాశివుండు
దురితహరుఁ డైన చంద్రశేఖరుఁడు బుచ్చ
నాఖ్యుఁడును బుట్టి కాశినాథాన్వయత్ర
కాశ్యు లై పులివర్తి నివేశు లైరి.

గీ. కాశినాథునిసుతుఁ డగుగౌతమాగ్ర
జుం డగు ననంతునకు గౌతముండు పుట్టె
నతనికి జనించె గౌతముఁ డభ్రతనుఁడు
వీరశైవాబ్ధివిధుఁ డన వెలసె దిశల

గీ. చితర్లాభూపసంసిద్ధిఁ జెలఁగుఁగౌత
మాహ్వయుఁడు బాచమాంబికయందు సుతుల
గనె ననంతుఁడు చంద్రశేఖరుఁడు వీర
భద్రుఁడును గౌతముఁడు ననుభవ్యమతుల

గీ. అరయ నందులఁ జంద్రశేఖరుఁ డఘోర
మూర్తివరుఁ గనె శరభాఖ్యముఖ్యుఁ డతని
కాత్మజుం డయ్యె నాదేశికాగ్రణికిని
వీరమహాదిపుత్రులు వెలసి రెలమి

* * * * *

క. తనర గౌతమవర్యు పుత్రద్వయంబు
వీరభద్రుండు గౌతమవిభుఁడు ననఁగ

నంద త్రివిధప్రసాదభోగావధాన
మహిమ శిష్యుల కిడె గౌతమప్రభుండు !

శా. అందగ్రోద్భవవీరభద్రుఁడు మదీయాచార్యుఁడై యొప్పె.

* * * *

క. ఏవంవిధశివసదృశ
స్తావక బుధముఖ్యజాల దానామృతశి
ష్యావన ధౌరంధర్యను
భావాఖ్యత గల్గు వీరభద్రేశునకున్.

గీ. ప్రణవసురశాఖికిని నాల్గుఫలము మొదవు
సరణి వీరేశ గౌతమచంద్రశేఖ
రులును శ్రీకాళహస్తీశ్వరుండు ననఁగ
వెలసితిమి మేము బుధజనుల్ వినుతి సేయ.

శా. అం దేనగ్రజవీరభద్రుఁడను నిత్యానందబృందాఢ్యుఁడన్
కందస్థానరవీందుయోగజ చిదాక్రాంతాంతరంగుండ న
స్పందశ్రీగిరి మల్లికార్జున కృతిస్వామి ప్రయుక్తోక్తి నిం
పందన్ గూర్చుచు ధర్మగుప్తచరితం బారూఢి వర్ణించెదన్.

క. ఆత్రేయస గోత్ర ద్విజ
పాత్రాపస్తంబసూత్ర పటుయాజుషశా
ఖాత్రయ్యధ్యయనుఁడ (స
చ్ఛా) త్రాధ్యాపకుఁడ వీరశైవగురుండన్.

**Colophon :**

ఇది శ్రీమచ్ఛ్రీపతిపండితేంద్రాన్వయపయఃపారావారసుధాకర శ్రీగిరి భ్రమరాంబామల్లికార్జున కృపాలబ్ధ కవితాప్రబుద్ధ శ్రీకాశీనాథ వీరారాధ్యపుత్ర సుకవిమిత్ర వీరదేశిక ప్రణీతం బైన ధర్మగుప్తాభ్యుదయంబను మహాప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము.

**(వి-వి.)—**

అసమగ్రము. రెండవ యాశ్వాసము ముగియలేదు. వ్రాఁత తిన్ననిది. తప్పులు సరిచూడఁబడినవి. అక్కడక్కడ గ్రంథపాతములు కలవు.

శ్రీపతి పండితారాధ్యుని వంశపరంపరలోనివాఁడగు కాశీనాథుని వీరారాధ్యుఁ డీగ్రంథమును శ్రీశైల మల్లికార్జునస్వామి కంకితముగా రచించినాఁడు. గ్రంథ మెన్ని యాశ్వాసములో తెలియదు. ఇందు ధర్మగుప్తుని చరిత్రము వర్ణింపఁబడినది. ఈ కవి భద్రాయుశ్చరిత్రమును గూడ రచియించెను.

**End:**

మ. సతి దాఁబుట్టినయింటనుండి విభుఁగాంచన్ వచ్చుచోఁగట్ల మం
చితలీలన్ గొనివచ్చురీతిఁ దటినుల్ శ్రీమీఱ పూజావళ్
సతతానందఫలప్రసూనలతికాసందోహముం దెచ్చె భూ
ర్యతులోత్తుంగతరంగభంగకలనన్ వార్ధంబుతో వార్ధికిన్.

మ. ధరణీ నీకమృతంబు గావలయు నంతన్ బట్టు మం చాపయో
ధరగోరత్నము పల్కి మిక్కిలికి సాంద్రం బంచు భూతాశ్వవై
ఖరిగా నిండి తటాకదీర్ఘికల వేగన్ మించి పాతెన్ వరి
స్ఫురణన్ వారిదవారి వారినిధికై పుంఖానుపుంఖక్రియన్.

సీ. పొన్నపువ్వులలోలతల్ పుట్టి మింట
దవులఁ బ్రాకినగతి వర్షధార లుదక
ము.

---

(*b*) రాధామాధవవిలాసము.

RĀDHĀMĀDHAVAVILĀSAMU.

Foll. 45*a*—57*b*.

Transcribed in the year 1916-17 from a MS. of M.R.Ry. C. Jōgayya Śāstrulu Garu of Pithāpuram, Godavari district.

A Prabandha describing the sports of Rādhā and Mādhava (Kṛṣṇa) by Velidiṇḍla Vēṅkaṭapati, son of Tiruvēṅkaṭācārya.

Incomplete, containing the first Āśvāsa only.

**Beginning:**

వ. అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నారొనర్పంబూనిన రాధామాధవ విలాసం బను శృంగార మహా ప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన.

**End:**

ఉ. కూరిమిఁ గొన్నినాళ్లటుల గోపసుతుండు చెలంగుచుండి యే
మేర తలంపునం బడెనొ మెల్లనె రాధను నిద్రవుచ్చి దా
వారల కెల్లఁ దెల్పియును రాతిరి వేకువజామువేళ న
క్రూరుని వెంబడిన్ మధురకున్ జని వేడుక నుండె నయ్యెడన్.

**Colophon:**

ఇది శ్రీమద్వేణుగోపాలవరప్రసాదలబ్ధశృంగారకవిత్వవైభవ వెలిదిండ్ల తిరువేంగళాచార్యతనూభవ విద్వజ్జనవిధేయ వేంకటపతినామధేయ ప్రణీతంబైన రాధామాధవ విలాసం బను శృంగారప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము.

(వి-వి.)—

అసమగ్రము. కృత్యవతరణిక లేదు. ఒకటే యాశ్వాసము మాత్ర మున్నది. వ్రాత తిన్ననిది. తప్పులు కలవు.

వెలిదిండ్ల తిరువేంగళాచార్యుని పుత్రుఁడగు వేంకటపతి దీనిని రచియించెను. రాధామాధవుల శృంగారవిహారము లిందు వర్ణింపఁబడినవి.

Fol. 58.

శృంగార సీసపద్యములు రెండు గలవు.

---

## R. No. 340

Paper. $10\frac{1}{4} \times 9\frac{3}{8}$ inches. Foll. 47. Lines, 20 in a page. Mode of writing, good but fairly correct. In good condition.

కాళిందీ పరిణయము.

KĀḶINDĪPARIṆAYAMU.

Transcribed in the year 1916–17 from a MS. of M.R.Ry. Mañcirāju Rāmaswāmi Gāru of Tōṭaguṇṭa, Tuni Taluk.

A Prabandha narrating the story of the marriage of Kṛṣṇa with Kālindī by Dontirāju Accaya, son of Mallaya of Śāṇḍilyagōtra. The work was dedicated to Pērūri Veṅkayya, a Kōmaṭi by caste. Owing to the presence of many omissions in the MS. the genealogy of the author is not made out.

Breaks off in the third Āśvāsa.

**Beginning:**

చ. . . . . . నిచ్చెదు ప్రోడపేర్మిని
లక్కడ సిరు లిచ్చుఁగాత కృతికర్తకు వేంకయ కిమ్ము మీఱఁగన్.

* * * *

వ. అని యిష్టదేవతా ప్రార్థనంబును . . . . . . . .
శ్రీమదుదకాలగోత్ర పవిత్రుండును గృష్ణమవైశ్యశిఖామణి పౌత్రుండును
వీరయార్య పుత్రుండును సూర . . . . . గంగమాంబాశుక్తి
ముక్తాఫలుం డును శ్రీవేంకటాద్రి నాయకవరప్రసాదసంజాతుండును నగు
వేంకయనామధేయుండు.

సీ. గీ. వఱలు శ్రీతేటగుంట సత్పురనివాసుఁ
డరయఁ బేరూరి వర(?)వంశాంబురాశి
పూర్ణచంద్రుండు సజ్జన పోషకుండు
సురగుణాఢ్యుండు (వేంకయ) యొకనాఁడు.

* * * *

మ. ననులక్ష్మీరమణాంఘ్రిపంకరుహచింతాసక్త శాండిల్యస
ద్ఘనగోత్రాఢ్యువు దొంతిరాజ వరసంతా . . . (మ)
ల్లన మంత్ర్యాత్మజు నచ్చనాఖ్యకవిఁ బిల్వం బంచియాస్థానవా
సునిఁ గావించి మనోహరామలవచస్స్ఫూర్తిన్ బ్రశంసింపుచున్.

శా. శ్రీకృష్ణుం డెనమంద్రునాయికలఁ బెండ్లిం బెండ్లిరై . . . .
లోకోత్కృష్ట మహాప్రభావమహిమ న్మున్నుండె నంచున్ బుధుల్
సాకల్యంబుగఁ జెప్ప వింటి నివుఁ డిచ్చన్ జేయు కాళిందిక
న్యాకల్యాణ వివాహసత్కృతి సముద్యద్భవ్యరమ్యాకృతిన్.

**Colophon:**

ఇది శ్రీమదిందిరాసుందరీహృదయారవిందమిళిందగోవిందచరణార
విందమకరందసమాస్వాదనేందిందిరాయమాణమానసోపేతలలితకవితా
సరసకవితావిచిత్ర శాండిల్యగోత్రపవిత్ర దొంతిరాజాన్వయాంభోధి
కల్హారమిత్రమల్లయామాత్యపుత్ర సుజనవిధేయ అచ్చనకవి నామధేయ
ప్రణీతంబైన కాళిందీపరిణయం బను శృంగారప్రబంధంబునందు ద్వితీయా
శ్వాసము.

**End:**

క. వచ్చిన బాలామణిఁ గని
నెచ్చెలు లానందకలిత నిజమానస లై
మచ్చిక ముచ్చట లాడఁగ
నచ్చటికి సుభద్ర వచ్చి . . . .

వి. వి.)—

మూఁడవ యాశ్వాసమునఁ గొంతవఱకుఁ గలదు. వ్రాఁత చక్కనిది. తప్పులు దిద్దఁబడినవి గ్రంథపాతములు హెచ్చు.

ఈ శృంగార ప్రబంధ మెన్ని యాశ్వాసములు గలదో తెలియదు. గ్రంథకర్త దొంతిరాజ అచ్చయ. మల్లయ కుమారుఁడు. పేరూరి వెంకయ యను కోమటి కంకిత మీఁబడినది. గ్రంథపాతములు మెండుగా నుండుటచేఁ గృతిపతి వంశావళి యుదాహరింప రాదయ్యె.

---

R. No. 341.

Paper. 10⅛ × 9⅜ inches. Foll. 56. Lines, 20 on a page. Mode of writing, fair and fairly correct. In good condition.

(*a*) శృంగారమంజరి.

ŚṚṄGĀRAMAÑJARI.

Foll. 11*b*—37*b*.

Restored in the year 1916-17 from a MS. of the Library.

A Telugu rendering of a Sanskrit work dealing with the characteristics of the hero and the heroine of a Kāvya along with illustrations thereof. The author is Bālakṛṣṇakavi of Baudhakālarasagōtra.

Wants the beginning and the end. Contains a few Āśvāsas irregularly arranged. The date given by the scribe is noted below.

**Beginning:**

సీ. స్వాధీనపతి(తాని)జాధీశువశునిఁగా
మెలఁపఁగా నేర్చినమీననయన
వాసకసజ్జిక వరునిరాకకు మేను
నిల్లుశృంగారించునిందువదన
రమణుండు వేళకు రాకున్నఁ దపియించు
మును విరహోత్కంఠ యనులతాంగి

పరకాంతఁ బొందినపతిచిహ్నములు చూచి
వగచు ఖండిత యనువనజగంధి.
గీ. ధవుని నెడబాసి ప్రోషిత తత్తరించు
నలరుఁ గలహాంతరితనాథునడ . .
వినకు(సుఁగు) పతి నిచ్చఁ గానక విప్రలబ్ధ
వెరవ దభిసారికాఖ్య గ్రుమ్మరువ . .

**End:**

సాత్త్వోద్దర్శనము.—

ఉ. సుందరియొకర్తె సుందరుఁడు చూడుర్తె లకుం బొడకట్టి యట్టె నా
డెందముఁ గొంచుఁబోయెఁ బ్రకటింపఁగ నూఁకొను పేరెటుంగ న
య్యందపునవ్వు మోముఁ గనినప్పటినుండియు రోమహర్షముం
జెందెదుఁజూడుమీ . . . సేయుచునున్నదియే మొయత్నముల్.

* * * *

ఖడ్గబంధము.—

పూజితాజితాజిరంగపుణ్యపూరుషాజరా
రాజరాజపుత్రకోపరహితభవ్యమూర్తినా
నాజగత్సమేతగర్భనవ్యదివ్యసుందరా
రాజరాఘవేశదేవరాజివిత్యపారణా.

**Colophon:**

ఇది శ్రీమదనగోపాలకృపాలబ్ధకవితావిచిత్రబోధకాలరసగోత్రపవి
త్రబాలకృష్ణకవి ప్రణీతం బైన శృంగారమంజరియందు నవమోల్లాసము.

గ్రంథాంతమున:—"ఈ గ్రంథము ప్లవ సంవత్సర శ్రావణశుద్ధ ౧
శుక్రవారంనాడు కొల్లూరు నాగప్ప సంఘార్థంగా వ్రాసెను" అని
యున్నది.

(వి-వి.)—

అసమగ్రము. గ్రంథారంభము లేదు. ఉల్లాసము లన్నియుఁ
గ్రమముగా లేవు. వ్రాఁత తిన్ననిది. తప్పులు గ్రంథపాతములు కలవు.

ఇందు శృంగారనాయికానాయకలక్షణములు సోదాహరణముగాఁ
దెలుపఁబడినవి. దేని కేది యాంధ్రీకరణమో తెలియదు. గ్రంథకర్త
బాలకృష్ణకవి. అతనినిగూర్చి విశేషములు తెలియరావు.

ఈ గ్రంథమునకుఁ బూర్వము Foll. 1a—2a వఱకు నాయికానాయకలక్షణములను వివరించుసంస్కృతశ్లోకములు, Foll. 2b—11b వఱకు కావ్యాలంకారచూడామణిలోని కొన్నిపద్యములు వ్రాయఁబడినవి.

---

(b) శృంగారమంజరి.

ŚṚṄGĀRAMAÑJARI.

Foll. 38a—56a. Fol. 56b is left blank.

Restored in the year 1916–17 from a MS. of the Library.

A treatise in Sanskrit similar to the above, written by Parvata vardhana, son of Raṅgamā and Appana of Nandavara sect. He lived in the court of the king sākamūri Raṅgapa, son of Mādana. The Sanskrit text is accompanied by a Telugu rendering made by Īdulapalli Bhavānīśaṅkara. Further particulars about him have been given under R. No. 42 *ante*. The Telugu author gives some additional information about his contemporary poets which is found in the extracts below.

Complete.

**Beginning:**

ఉ. శ్రీవరముఖ్యనిర్జర కిరీటసమంచిత నూత్నరత్నశో
భావృత పాదపంకజుఁ డహార్యసుతాకరకంకణాంకిత
గ్రీవుఁడు భోగిభూషణుఁడు శ్రీగిరినాయకుఁ డింపు మీఱ నా
భావమునందు దాపుగొని భద్రము లెప్పుడు నిచ్చుఁగావుత౯.

* * * *

క. అనిశము భక్తి భజించెద
నొనరఁగ నివటూరికులపయోనిధిహిమధా
ముని సద్గుణగణమణిధా
ముని మునినిభు శంభులింగము౯ గురుమూర్తి౯.

* * * *

సీ. కొంచెపు . . . మనోభయంకరు
గెలిచె విద్యావాదవిలాసనమున
సద్గురు కృపకల్మిఁ జదువకయే సర్వ
శాస్త్రపాండిత్యంబు సంగ్రహించె

నయమొప్పఁ దెన్నటనాఁటనుండియునాంధ్ర
గీర్వాణభాషలఁ గృతు లొనర్చెఁ
బ్రౌఢి శ్రీవిష్ణుపురాణాదికములు ను
ధీవినుతంబుగఁ దెనుఁగుఁ జేసె
నతని వర్ణింతు సేతుకాశ్యంతరాళ
సూరివరనుత చాతుర్య మేరుధైర్య
లలిత వెణుతురుపలికులకలశ జలధి
సూర్య మోహాన వేంకటసుకవివర్య

సీ. అభియాతిమానవప్రభుమతాళిమణిఘృణి
రాజినీరాజితరాజితాంఘ్రి
నీరేరుహుండైనశ్రీరావుమాధవ
రాయశౌరికి నతిప్రౌఢరీతి
వాసవదత్తాదిభాసురకృతు లనే
కములొనరించి తత్కరుణచేత
హారకేయూరాగ్రహారవిస్ఫారతు
రంగముల్ రంగుమీఱంగ నంది
సకలసుకవీశ్వరాంభోజనికరహేళి
యై యలరు వక్కలంకాన్వవాయకలశ
జలధిశశి వీరభద్రు మత్ప్రభు నుతించి
తదనుమతిఁ గృతిఁ యొనరింతు ముదముతోడ

* * * *

క. పూర్వము కర్ణాటకుఁ డగు
పర్వతవర్ధనుఁడు తత్ప్రబంధమొనర్చెన్
గీర్వాణభాష నది నే
నుర్వరఁ దెలిఁగింతు సుకవు లాగి నగు ననఁగన్

**End :**

శ్లో. ప్రాప్త శ్చాకమురీంద్రమాదనసుత శ్రీరంగపేంద్రో స్సభా(ం)
చంద్రో రుద్రశిరో యథా హరిభుజా మధ్యం యథా కౌస్తుభః
శ్రీమన్నందవరాన్వయోఽప్పనసుత శ్రీరంగమానందనో
య స్తత్పర్వతవర్ధనేన రచితా శృంగారమంజర్యసౌ.

కవీశ్వరుఁడు నిజాన్వయజననీజనకులనున్ను, ప్రభువునున్ను, తన మాహాత్మ్యమునున్ను ఉగ్గడించుచున్నాఁడు.

సీ. హరియురంబునఁ దిరం బగుకౌస్తుభమువోలె
హరుశిరంబున సుధాకరుఁడువోలె
ధరశాకమూరి మాదనసుత శ్రీరంగ
రాజ సభాస్థలిఁ బ్రబలువాఁడు
స్థిరతరం బగునందవరపురాన్వయుఁ డప్ప
యకు రంగమాంబకు నాత్మజాతుఁ
డరయఁ బర్వతవర్ధనాహ్వయసుకవి శృం
గారమంజరి యను కావ్య మెలమి
సకలకలుషహరంబుగా సంస్కృతమున
హరిచరిత్రంబు శృంగారసరణిఁ జెప్పె
నదియు నే నేర్చు తెలుఁగున నాంధ్రభాషఁ
గబ్బ మిరవుగఁ జేసితిఁ గవులు పొగడ.

* * * *

మాలినీ. సరిదధిపనిషంగా చంద్రఖండోత్తమాంగా
వరసురగిరిచాపా వార్ధిజాధీశరోపా
సురపతినుతిపాత్రా సోమసూర్యాగ్నినేత్రా
పురదనుజవినాశా భూరిహాలాహలాశా.

**Colophon:**

ఇది శ్రీమద్గురుకరుణాతిశయలబ్ధకవితావైభవ ఈఁదులపల్లి శంకరమంత్రితనూభవ సుధీజనవిధేయ భవానీశనామధేయప్రణీతం బైనశృంగారమంజరియనుధ్వనిప్రధానశృంగారకావ్యంబు సర్వంబు నేకాశ్వాసము.

(వి-వి).—

సమగ్రము. వ్రాఁత చక్కనిది. తప్పులు దిద్దఁబడినవి. శైథిల్యగ్రంథపాతములు లేవు.

నందవరవంశ్యుఁ డైనపర్వతవర్ధనకవి సంస్కృతమున రచియించిన గ్రంథమున కిది ఈఁదులపల్లి భవానీశకవిచేఁ జేయఁబడిన తెలుఁగు సేఁత, ఆపర్వతవర్ధనకవి శాకమూరిరంగపేంద్రునిసభలో నుండువాఁడఁట.

భవానీశకవినిగూర్చి ఆర్. నె 42 దునఁ జూచునది. మఱికొన్నివిశే షము లుదాహృతపద్యములవలనఁ దెలియునది. ఇందు శృంగారనాయి కానాయక లక్షణములు సోదాహరణముగాఁ దెలుపఁబడినవి. మాల శ్లోకములుగూడ నిందుఁగలవు.

---

R. No. 342.

Paper. 10¾ × 10 inches. Foll, 167. Lines, 20 in a page. Mode of writing, fair but incorrect. In good condition.

Transcribed in the year 1916–17 from a MS. of M.R.Ry Vīrēśalingam Garu of Batchupēta, Masulipatam, Kistna district.

పరతత్త్వప్రకాశిక.

PARATATTVAPRAKĀŚIKA.

A treatise in Advaitavēdānta in the form of a Prabandha written by Penumacca Buccirāju, son of Subbamāmba and Vēṅkaṭapati of Dhanañjayagōtra. He was a Ksatriya by caste.

Complete in eight Āśvāsas.

**Beginning :**

శా. శ్రీలం బెంపొదవం బ్రసన్నకరుణాదృష్టి న్విలోకించుచున్
తాలోలాక్షి నిజాంకపీఠమునఁ బ్రత్యక్షంబుగా నెప్పుడున్
దా లోకోద్ధరలవంటకుప్పయన నిత్యశ్రీల రంజిల్లును
న్గా . . . . . . . . . . . . .

* * * *

సీ. శ్రీకరంబు నై ధాత్రిఁ బ్రసిద్ధి కెక్కి
శ్రీజనార్దనదేవుండు సిరిని గూడి
యనిశ మిచ్చట నుండెకిప ట్టుగుటవలనఁ
గర్ల . . . . . . . .

వ. అందు.

శా. . . . . . . . . . . . . . .
క్షేమం బొ పెనుమచ్చవంశమున సుశ్రీయుక్తుఁడై సంతత
ప్రామాణ్యంబున వేంకటాద్రిపతిప్రఖ్యాతనామంబుచేఁ
గామించెన్ స్వధనంజయప్రకటమై . . . .

సీ. ఆరాజవర్యుని కనుకూలపత్ని యై
తనరువసిష్ఠగోత్ర ప్రభూత
రహిం గాధిరాజు పేరమసద్గుణసమేత
సుజనసన్నుతనిత్యశుభచరిత
వారల కుదయించి వసుధం బెంపొందిరి
పుత్రులు మువ్వురు పుణ్యమతులు
అందగ్రజుండు వీరయశుం డైనజోగిరా
జాఖ్యుం డాఘనునకు ననుజుం డగుచు
నలరుం బేర్రాజ నగ విఖ్యాతి వెలయ
ధరణి విలసిల్లె వారల కిరువురకును
సోదరుండు సత్యవిజ్ఞానశోభితుండు
జగతి శ్రీవేంకటాచలపతిసుతుండు

*　　　*　　　*　　　*

క. కలిదిండిరంగభూవరు
సలలిత సత్పుత్రి సుజనసన్నుత పార్థివ

. . . . . . .

సీ-గీ. . . . . . .
ఘనతం దగి యస్మదీయజనని ధరిత్రి
సురుచిరంబుగ భాసిల్లు సుబ్బమాంబ.

మత్తకోకిల.—ఆవధూవరులందు సద్భవమైతి విమ్మహిం మేము స
ద్భావుకంబుగ బుచ్చిరాజనివల్లె వేంకటరాజన
పావనంబుగరామరాజనం బ్రస్ఫుటంబుగ రంగరా
డ్భావితంబుగ నీక్రమంబున భద్రమై చెలువొందుచున్.

గీ. భువిని నల్వురందు బుచ్చిరాజాఖ్యచేం
బెద్దవాండ నగుచుం బెద్దలకును
భృత్యభావ మలరం బెంపొందం గంటిని
వసుధ నాదుభాగ్యవశత చెలంగె.

End:

మాలిని. అభవవిభవశోభా పాటలాంభోజనాభా
శుభగుణసముదాయా శుద్ధబోధానుమేయా

త్రిభువనపరిపాలా దేవకార్యానుకూలా
సభయవికృతిదూరా జానకీచిత్తచోరా.

**Colophon:**

ఇది శ్రీరామచంద్రకరుణావిలసితోదయలలితకవిత్వవిద్యావిలాస యోగిజనమనోల్లాసవిజ్ఞానవిభవవిచిత్ర ధనంజయగోత్రపవిత్ర పెనుమచ్చవంశక్షీరపారావారపరిపూర్ణసుధాకరబుధజనవిధేయ బుచ్చిరాజనామధేయప్రణీతంబైనశ్రీపరతత్త్వప్రకాశిక యను వేదాంతప్రబంధంబునందు (బరీక్షిన్నరేంద్రుండు విదేహముక్తింగూడిపరతత్త్వసుధానందప్రాప్తింబొం దినచందంబునన్నది) సర్వంబు నష్టమాశ్వాసము సంపూర్ణము.

(వి-వి.)——

సమగ్రము. ఎనిమిదాశ్వాసములు. వ్రాఁత చక్కనిది. తప్పు లున్నవి. గ్రంథపాతములు మిక్కిలి కలవు

ఇది యద్వైతవేదాంతమును బ్రతిపాదించు గ్రంథము. దీనిని పెనుమచ్చ బుచ్చిరాజు రచియించెను. ఇతఁడు క్షత్రియుఁడు. ధనంజయగోత్రుఁడు. వేంకటపతిసుబ్బమాంబల కుమారుఁడు. గ్రంథము శ్రీరామాంకితము.

---

## R. No. 343.

Palm-leaf. 14¾ × 1⅜ inches. Foll, 22. Lines, 5 in a page. Mode of writing, fair but containing mistakes. In fair condition.

Presented in the year 1916–17 by M.R.Ry. Chandrabhatla Jōgayya Śastri Garu, Pithāpuram, Gōdāvari district.

రాధామాధవవిలాసము.

RĀDHĀMĀDHAVAVILĀSAMU.

Foll. 1*a*—16*b*.

This is the same work as the one described under R. No. 339 (*b*) *ante*.

Incomplete, containing the first Aśvāsa.

(వి-వి.)——

అసమగ్రము. ప్రథమాశ్వాసము మాత్రము వ్రాఁత యొకతీరుగానున్నది. తప్పు లున్నవి. శైథిల్యముకలదు. గ్రంథపాతములు లేవు.

ఇది ఆర్. నెం. 339 (b) రున వర్ణింపఁబడిన గ్రంథమే.

**Foll. 17*a*-22*b*** పత్రములలోఁ గొన్ని కట్టుపద్యములు కలవు.

## R. No. 344.

**Palm-leaf.** 16⅝ × 1⅝ inches. Foll. 58. Lines, 8 in a page. Mode of writing, settled and fairly correct. In good condition.

Presented in the year 1917–18 by M.R.Ry. W. Rāmayya Garu of Chintalapūḍi, Kistna district.

(*a*) విక్రమార్క చరిత్రము.

VIKRAMĀRKACARITRAMU.

Foll. 1*a*—54*b*.

This is a Telugu rendering in prose of the Sanskit work Dvātriṁśat_sālabhañjika or Vikramārkacaritra described under Nos. 12207–12209 of the Descriptive Catalogue of Sanskrit MSS., Vol. XXI. By Yādavārya, son of Bāpanāmātya of Bhāradvājagōtra.

Complete in two parts.

The name of the scribe and the date of transcription are given in the Telugu extracts below :—

**Beginning:**

క. శ్రీనారాయణ మాధవ
నానాజనవినుతదివ్యనామా నంతా
భానుకులవర్య విష్వ
క్సేనస్తుత భద్రశైలసీతారామా.

అవధరింపుము శ్రీకంఠుఁ డంబికతో కైలాసగిరియందు ప్రమథగణములు గొలువం గాఁగొలువున్న వేళను పార్వతీదేవి పరమేశ్వరునకు మ్రొక్కి దేవదేవోత్తమా దేవతాసార్వభౌమా వింతలుదొంతరలు గావిం చేది నొకపుణ్యకథ ఆనతియ్యవలె ననంగా.

* * *

సీ. వెలఁది నీవడిగినవిక్రమాదిత్యుని
జనకుఁ డౌచంద్రగుప్తునిచరిత్ర
మానుపూర్వికముగ నాభోజభూపాలు
కథ శాలివాహనువిధము నాతఁ
డావిక్రమార్కు నజీవితుఁ గావింప
నతఁ డెక్కినట్టిసింహాసనంబు
నెక్కి భోజుఁడుపూన నొక్కొక్కప్రతిమ దా
మొక్కొక్కదినమున నొక్కకథయుఁ
గాఁగ నారాజు సాహసత్యాగములను
జతురమతు లయి వినిపించి కుతుక మొసరఁ

దొల్లి నీశాపమునఁ దల్లడిల్లుచున్న
బొమ్మ లరుదెంచె నీసమ్ముఖమ్ము చేర.

**End:**

విక్రమార్కునిచరిత్ర మంబికకు ఆనుపూర్విగా వినిపించగావిని ఆమె సంతోషించి వరుణి పూజించి సేవ గావించెను.

* * * *

మాలిని. కువలయదళనేత్రా కుంభినీజాకళత్రా
భవధురణవిదూరా భక్తహృద్యావతారా
సవనకరణపాలా సచ్చిదానందలోలా
పవనజనురగాథా భద్రశైలాధినాథా.

**Colophon:**

ఇది శ్రీమద్భారద్వాజ గోత్ర పవిత్రబావనామాత్యపుత్ర సరసగుణ ధుర్యయాదవార్యప్రణీతంబైన విక్రమార్కచరిత్రంబునం దుత్తరభాగము సంపూర్ణము.

గ్రంథాంతమున

" ఆనందనామసంవత్సర చైత్రశుద్ధ ౧౦ బుధవారంవరకు ఉపాధ్యాయుల వెంకటనర్సు విక్రమార్కచరిత్రంబునం దుత్తరభాగము సంపూర్ణంగా వ్రాయనాయను "

అని యున్నది.

(వి-వి.)——

సంపూర్ణము. వ్రాఁతచక్కనిది. శైథిల్యగ్రంథపాతములు లేవు.

బావనామాత్యుని పుత్రుఁడగు యాదవార్యుఁడు ద్వాత్రింశత్సాలభంజికల కథలనిట్లు వచనరూపమున రచియించెను. కథారంభములందా యాకథాసంగ్రహముగా నొక్కొక్కసీసపద్యమునుగూడఁగూర్చినాఁడు.

---

(b) నాగేంద్రమోక్షదండకము.

NĀGĒNDRAMŌKṢADAṆḌAKAMU.

Foll. 55a—57a.

A poem in the Daṇḍaka metre narrating the story of the Gajēndramōkṣa. The name of the author is not known.

Complete.

**Beginning:**

శ్రీరామచంద్రుఁడా సుధాకీర్తిసాంద్రుఁడా దినాధీశవంశాబ్ధిచంద్రుఁడా ధరాధీశలోకైకకోదండహస్తుఁడా ప్రశస్తుఁడా.

**End:**

శ్రీరామచంద్రాకృతిన్ జంద్రకీర్తిన్ బ్రకాశింప సీతామహాదేవి తోఁ గూడి రాజ్యంబుఁ బాలింపుచున్ మమ్ము రక్షింపుచున్నట్టిదేవాది దేవా నమస్తే నమస్తే నమః.

వి-వి.)——

సంపూర్ణము. ఇందు గజేంద్రవిమోచన కథ వర్ణింపఁబడినది. కర్త యెవ్వరో తెలియరాదు.

---

(c) సూర్యదండకము.

SŪRYADAṆḌAKAMU.

Foll. 57*b*—58*a*. Fol. 58*b* is left blank.

A poem written in the Daṇḍaka metre, in praise of the Sun. The author's name is not known.

Complete.

**Beginning:**

శ్రీ సూర్యనారాయణా వేదపారాయణా లోకశిక్షామణీ దైవచూడామణీ ఆర్తరక్షా నమో పాపశిక్షా నమో.

**End:**

ముంగొంగుబంగారు తంగేటిజున్నై తపంబుల్ ఫలించున్ మహాదైవరాయా నమస్తే నమస్తేనమః.

(వి-వి.)——

ఇది సూర్యస్తుత్యాత్మకము. రచయితయెవ్వరో తెలియరాదు.

## R. No. 345.

**Paper.** 8 × 6½ inches. Foll. 17. Lines, 16 in a page. Mode of writing, bad but correct. In good condition.

Presented in 1917–18 by M.R.Ry. Kovela Śobhanādri Ācāryulu Garu of Taṇuku.

తిరుమంగయాళ్వారుచరిత్రము.

TIRUMAṄGAYĀḶVĀRUCARITRAMU.

A poem in the Yakṣagāna form giving an account of the life of Tirumaṅgaiyāḻvār, a Śrī-vaiṣṇava saint. By Kōvela Tiruvēṅgaḷadāsa, who dedicated the work to God Nṛsiṁha worshipped at Śōbhanādri in the Kistna district.

Complete.

**Beginning:**

ఉ. శ్రీకర మానిమానసవశీకర శోభనశైలపాద్వ్రవ
క్ష్మీకర సాధుపోషణసుధీకర సంభృతశంఖచక్ర చా
మీకరచేల సద్గుణసమీకరణా ప్రణతార్తివారి ర
త్నాకరజాముఖోత్పలసుధాకర శ్రీనృహరీ దయాకరా!

**End:**

ద్విపద. శ్రీరంగనాథునిప్రియపుత్త్రుడైన
శ్రీరంగతిరుమలశ్రీభట్టరార్య
గురువరశిష్యుండకోవెలాన్వయుండ
వరవేంకటాచార్యవరునిపౌత్త్రుడను
గురువరనరసింహగురునందనుండ
తిరువేంగళాచార్యదివ్యాహ్వయుండ
శ్రీమాధవునిపేర శ్రీహరిపేర
సారెకుశోభనాచలపతిపేర

* * * *

**Colophon;**

ఇది శ్రీశోభనాచలలక్ష్మీనృసింహ వరప్రసాదలబ్ధకవితావిలాస కోవెలతిరువేంగళదాసప్రణీతంబైన తిరుమంగయాళ్వారుచరిత్రం బను శృంగారనాటక గేయప్రబంధంబునందు సర్వంబు నేకాశ్వాసము.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁతమంచిదికాదు. శైథిల్యగ్రంథపాతములు లేవు.

పన్నిద్దరాళ్వారులలోని తిరుమంగయాళ్వార్లచరిత్రము యక్షగానముగాఁ గోవెల తిరువేంగళ యను వైష్ణవుఁడు శోభనాద్రి నృసింహస్వామిపేర రచియించినాఁడు.

---

R. No. 346.

Palm-leaf. 16 × 1½ inches. Foll. 76. Lines, 10 in a page. Mode of writing, fair and apparently correct. In fair condition.

Presented in 1917–18 by M.R.Ry. Vaḍlamannāṭi Veṅkaṭaramayya Garu of Masulipatam.

రాధామాధవము.

RĀDHĀMĀDHAVAMU.

A Prabandha describing the story of the love between Rādhā and Mādhava. The author is Cintalapūḍi Yallayya, son of Kāmanārya and grandson of Kṛṣṇabhaṭṭāraka of Śrīvatsagōtra. King Kṛṣṇadēvarāya of Vijayanagar is stated to have conferred on him the title Rādhāmādhava. The author may be the same as the Rādhāmādhavakavi that composed, according to tradition, difficult stanzas as required by Peddanāmātya of the court of Kṛṣṇadēvarāya. The author refers to Jayadēva as the author of the Rādhāmādhava which is perhaps different from the Gītagōvinda. The work is dedicated to God Rādhākṛṣṇa. For further particulars about the author vide the next number, where his other work Tārakabrahmarājīya is described.

Complete in five Āśvāsas.

**Beginning :**

శా. శ్రీలావణ్యరసాధిదేవతలునాఁ జెన్నొందు రాధాదిగో
పాలస్త్రీలఁ బదాఱువేల వివిధప్రాయంబులం గూడి బృం
దాలీలావనకేళి సల్పు తరుణీతత్త్వజ్ఞుఁ గందర్పగో
పాలస్వామి మదీయచిత్తవికచాబ్జస్థాయిఁ గావించెదన్

చ. పసగలనీకుచద్వయముపాటిఁగ జేయు మదీయకుంభముల్
పసలఁగనన్నమాడ్కి మదసక్తమధువ్రతఝుంకృతిస్తుతుల్
పొసఁగఁగఁ జాఁపి మత్తకరిపోతము లభ్రనదీజలం బనన్
బసిఁడిగలంతులం దిడఁ గృపం గొని మెచ్చుసిరిం దలంచెదన్.

* * * *

క. నుతియింతు వాగ్విశేష
స్థితి రాధామాధవంబు చెప్పినవిద్యా
చతురాననుఁ నీలాచల
పతిహితు జయదేవు సుకవిపంచప్రదరున్

సీ. వాణీవధూపాణివీణాకలక్వాణ
కలితవచస్స్ఫూర్తిఁ గాళిదాసు
భారతీమంజుమంజీరఝుళంఝుళ
శబ్దవాఙ్మాధురి సార్వభౌము
శారదాహస్తకంజాతకీరాంగనా
గంభీరవాక్ప్రౌఢిఁ గవి మయూరు
భాషాబలోపరిపరిమళకలకల
తాళంబినినాదోక్తిగరిమ మాఘు
నమృతధారాళవాచాలవిమలవాక్య
గతుల నన్నయభట్టుఁ దిక్కనకవీంద్రు
సన్నుతింతు నశేషభాషావిశేష
కావ్యరచనాధురీణుల భవ్యమతుల.

క. నానావిధనటనటదీ
శానశిరస్సరిదభంగసలిలోర్మిఘటా
మానధ్వనిమృదుమధురవ
చోనిధిశివదాసుఁ గొలుతు సుకవిశశాంకున్

శా. నానాశాస్త్రప్రమదామదస్ఫురితవక్షోజాతకాఠిన్యముల్
లూనంబాలు వచోవిలాసముల నేర్పుల్ చూపి కర్ణాటక
క్షోణీనాథేంద్రుసభం గ విద్యావిజయోత్సాహంబుఁ గైకొన్నమా
శ్రీనాథున్ గవిసార్వభౌముఁ గొలుతున్ సేవాంజలుల్ గీల్కొనన్

* * * *

క. బోధించియి[చుని?]ష్టదైవము
రాధాసతిఁ గూడి(డు?)సౌమ్యరమ్యాకృతి హృ
త్సౌధమునఁ దోఁచి కృష్ణుఁడు
రాధామాధవముఁ జెప్పరా యనిపలికెన్

* * * *

సీ. శ్రీవత్సలాంఛనశ్రీముఖాంబుజమున
శ్రీవత్సమునికులశేఖరుండు
ప్రభవించెనామహాభాగువంశాంభోధి
దివ్యరత్నంబులతెఱఁగుమీఱఁ
బుట్టి రనేకులు పురుషార్థపరులైన
వారు వారలలోనవంశకర్త
వర్ణితసత్కీర్తివల్లభుఁ డొప్పారె
నతనికి శ్రీకృష్ణుఁ డవతరించె
నతనియందుఁ గామనార్యుండుజన్మించె
నతనికేనులచ్చమాంబయందు
జననమైతినెల్లసత్కవిచంద్రుండ
సరసహితచకోరసంఘమలర.

శా. రాధామాధవ మచ్యుతాంకితముగాఁ బ్రౌఢక్రియం జెప్పిత
న్మాధుర్యంబునఁగృష్ణరాయవిభుఁగర్ణాటేశు మెచ్చించి, నా
నాధాతృప్రతిమానసత్కవులలోనన్ భూమణ్ణశ్రేణితో
రాధామాధవనామ మందినజగత్ప్రఖ్యాతచారిత్రుఁడన్.

* * * *

క. అంకురితరతికళావ్యా
త్పంకజగోపీకపోలపాళీకేళీ
కుంకుమరేఖారచనా
హంకారనిశాతకరరుహాంకూరునకున్.

**End:**

క. అనిశుకమునివరాళిరచిం
చిన, శ్రీకృష్ణునకుఁ జెప్పెఁజింతలపూఁడె
ల్లన రాధామాధవ మి
ట్లనుపమమధురముగ నాశశాంకార్కముగన్.

మాలిని. కనకపటపటీరా కంధరశ్రీశరీరా
మునిహృదయవిహారా మోహనిర్మగ్నదూరా
సనయగుణవిచారా సర్వవేదాంతసారా
మనసిజజయధారా మానినీచిత్తచోరా.

**Colophon:**

ఇది శ్రీమన్మదనగోపాలచరణకమలసేవాధురీణ సత్కళాపారీణ కృష్ణభట్టారకపౌత్ర చింతలపూఁడిరామయప్రభుసుపుత్త్ర సుకవివర్య రా

ధామాధవయెల్లనార్యప్రణీతంబైన రాధామాధవం బనుశృంగారప్రబంధం బునందుఁ బంచమాశ్వాసము.

ఉ. సంతతభావశుద్ధియుతసంస్థితియున్ సనయక్రియాపరి
శ్రాంతియు సర్వలక్షణవిచారతయున్ ఫలియించె, రాధికా
కాంతుఁడు ప్రాణవల్లభుఁడుగావునఁ బావనమూర్తియైన యీ
చింతలపూఁడియెల్లకవిశేఖరుకోమలకావ్యకన్యకున్.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁతజెలుగైయస్పష్టముగా నున్నది. తప్పులున్నవి. శైథిల్యమంతగా లేదు. గ్రంథపాతములు లేవు.

అయిదాశ్వాసముల యీశృంగారప్రబంధమున రాధామాధవుల శృంగారచరిత్రము వర్ణింపఁబడినది. సంస్కృతమున జయదేవకవి "రాధామాధవము" రచియించిన ట్లిందుఁ జెప్పఁబడుటచే దాని కిది యనువాదముగాఁ దోఁచుచున్నది. జయదేవుఁడుగీతగోవిందముగాక రాధామాధవ మనిపేరొక గ్రంథమునుగూడ రచించెనేమో! శ్రీవత్సగోత్రుఁడును, కృష్ణభట్టారకపౌత్త్రుఁడును, కామనార్యునిపుత్త్రుఁడును నగు చింతలపూఁడి యెల్లకవి దీనిని రాధాకృష్ణాంకితముగ రచియించినాఁడు. ఈ గ్రంథరచనమునకు మెచ్చి కర్ణాటేశ్వరుఁడగు శ్రీకృష్ణదేవరాయ లీ కవికి భూషణాది సత్కారముతో రాధామాధవుఁడను బిరుదనామమిచ్చె నట! "నగరు, తొగరు, తగరు, వగరు, అనుపదములు పాదాదులం దునిల్పి రామాయణభారతభాగవతార్థములు వచ్చునట్లు పద్యములు రచింపఁ బెద్దనామాత్యుఁడు సమస్యయీయఁగా, శ్రీకృష్ణరాయలసభలో మూఁడుపద్యములుచెప్పి సత్కరింపఁబడినట్లు తెలియఁబడెడు రాధామాధవుఁ డీతఁడే కావలయును. తారకబ్రహ్మరాజీయ మనుకృతి మఱియొక టి యీతనిదికలదు. ఈ కవినిగూర్చి మఱికొన్నివిశేషములు తద్గ్రంథ విషయవివరణమునఁ జూచునది.

---

## R. No. 347.

Palm-leaf. $14\frac{3}{4} \times 1\frac{1}{2}$ inches. Foll. 108. Lines, 5 in a page. Mode of writing, good but incorrect. In injured condition.

Purchased in 1917–1918 from M.R.Ry. Niḍadavōlu Sundaram Pantulu Garu of Vizagapatam.

తారకబ్రహ్మరాజీయము.

## TĀRAKABRAHMARĀJĪYAMU.

Foll. 1*a*—98*b*.

This Telugu Prabandha is a rendering of the Sanskrit work Rāmatārakabrāhmarājīya of Nārāyaṇāśramin of Prayāga. The author is Rādhāmādhavakavi, the same as that of the work described under the last number. The name Yellaya is not given in this work. The work was dedicated to Śrī-Rāma at the instance of Nañjaya Timmarasu, a minister in the court of Acyutadēvarāya, brother of Kṛṣṇa Dēvarāya. Timmarasu asked the poet to do so with a view to please the king, who had resolved to dedicate every year a work to God Vēṅkaṭēśa as a literary flower offering. Particulars about Timmarasu are found in the introduction extracted below.

Breaks off in the 4th Āśvāsa.

Foll. 99 *a*—108 *b* contains certain stanzas of the 18th Āśvāsa of Nirvacanottararāmāyaṇa.

**Beginning:**

శా. శ్రీరాజీవదళాక్షుఁ కౌస్తుభమణీసింహాసనం బెక్కి యు
ర్కారూఢస్ఫుటదీప్తియున్ బలెన సొంపారన్ నభోమండలా
కారశ్రీవిలసిల్లువిష్ణుఁడు జగత్కల్యాణచారిత్రగం
భీరున్ నంజయతిమ్మమంత్రివరు లక్ష్మీయుక్తునిం జేయుతన్.

* * * *

ఉ. భారతకావ్యహార మొకభాగము నన్నయభట్టుగూర్చె ము
క్తారమణీయవాక్యములఁ దక్కిన భాగము సోమయాజి పెం
పారనౌనర్చె రెంటిఁగలయన్ శివదాసుఁడు మధ్యనాయక
శ్రీరచియించె శారదధరింపఁ గవిప్రియకీర్తిమించఁగన్.

* * * *

వ. అని యభిమతదేవతా . . . . శ్రీగామబ్రహ్మతారకరా
జీయంబు పరమభాగవతోత్తముండు ప్రయాగక్షేత్రవాసి నారాయణాశ్ర
ములను మహాయతీశ్వరుండు సంస్కృతంబునరచియించె నది తెలుంగున
సకల జనులకుం దెలియునట్లుగా . . . సమయంబున.

చ. తిరుపతిగెల్చి పాండ్యనరదేవుని పట్టముగట్టి యుత్కలే
శ్వరుఁ గరుణించి క్రమ్మొక్కనవాయికిఁ దా నభయంబొసంగి పెం

పరుడుగఁ గీర్తిచేకొనిన యచ్యుతరాయల మంత్రిరత్నమై
చిరముగనున్న నంజవిభుతిమ్మరసుందగుఁ బ్రస్తుతింపఁగన్.

* * * *

ఉ. వేదపురాణశాస్త్రముఖవిద్యలకెల్ల గురుండు బ్రహ్మవి
ద్యాదృఢబుద్ధి నేర్పులివులన్నియు వ్రాయ, సమస్తదేశభా
షాదులెఱుంగు స్వామిహితమైన ప్రయోజన మాచరించు నా
నాదిశలం బ్రసిద్ధుఁడగు నంజయతిమ్మనిఁ బోలరెవ్వరున్.

వ. అమ్మహామహీశ్వరుం డొకనాఁడు చతుస్సముద్రముద్రితమధ్య భూభువనసింహాసనాధీశ్వరుండగు నచ్యుతదేవరాయల కొలువు చేసివచ్చి నిజనివాసభాసురచంద్రశాలా ప్రాంగణ మణిమంటపంబున విజయనగర రాజధానింగల బంధువర్గంబును విద్వత్కవీంద్రులును వందిమాగధగాయకవారకామినీనికరంబును సముచితప్రకారంబున సేవింప సుఖగోష్ఠిం బ్రవర్తింపుచు నిజస్వామియగు నచ్యుతదేవరాయలు ప్రతిసంవత్సరంబు శ్రీవేంకటేశ్వరునకు సత్కావ్యప్రబంధపుష్పాంజలి సమర్పించుచుఁ గీర్తిసుకృతంబులు నిర్వహించుకొనుచున్నవాఁడు తదనుమతంబున నవ్విభునకు నాకు నభ్యుదయపరంపరాభివృద్ధియుఁ జతుర్విధపురుషార్థసిద్ధియు గలుగునట్లుగా నా యిష్టదైవంబగు శ్రీరామవిభునకు నంకితంబుగా నొక్క పుణ్యప్రబంధంబు చెప్పింపవలయునని సుహృజ్జనంబులతో.

* * * *

క. రాధారుణాధరోరుప
యోధరకాశ్మీరవరశు (రసర) సోదయకవితా
మాధుర్యధుర్యు నన్నున్
రాధామాధవుని సుకవిరత్నముఁ బిలిచెన్.

* * * *

ఉ. నావుడు నీకు నంకిత మొనర్పఁదలంచినవాఁడ బంధుసం
భావన నీకు నిష్టముగ బ్రహ్మమయుం డగు రామభద్రధా
త్రీవరమౌళి కంకితమిదే యొనరించి . . . వైఁడికిన్
దావి ఘటిల్లె నేమి యనననంజ యతిమ్మ వివేకభూషణా

* * * *

వ. . . . . శ్రీరామమంత్ర సిద్ధుండగు నమ్మహాప్రధాన శేఖరునభినందించి.

సీ. కాశ్యపగోత్రదుగ్ధపయోధిచంద్రుఁడై
భాగ్యలక్షణముఁ బ్రభవ మొంది
రాయభారపరంపరాక్రమాగతమైన
నిజమంత్రికులము వర్ణితముసేయ
సకలదిగ్దేశరాజప్రధానుల కెల్ల
నాధారమయ్యె సింహాసనమునఁ
దనకు నేలిన మహీధవునకు సత్కీర్తి
తనర సామ్రాజ్య తంత్రంబు నడపె.
నుభయకులపావనుండును నిజ[?]కులోచి
తక్రియాచార నిరతుఁ డుదారగుణుఁడు
విప్రబాంధవవాంఛి తార్థప్రదుండు
విట్టలేశ్వరనిభమూర్తి [వట్టమరుని?].

క. ఆరాయమంత్రిమణికిని
నారీమణి తిప్పమాంబ . . . .

క. ఆశుభదంపతులకు గుణ
రాశి తపఃఫలమువోలెఁ బ్రభవించె యశ
శ్శ్రీశశినంజరుసురా
ధీశగురుప్రతిభవాఁడు తేజంబలరన్.

* * * *

ఉ. నంజరసయ్యమంత్రికులనాయకుఁ డుత్తమసాధ్వితిప్పమా
కంజదళాయతాక్షి శుభకారిణి శ్రీసతిఁ బెండ్లియాడు శ్రీ
కంజదళాక్షుఁడుంబలె జగంబులు ప్రస్తుతిసేయ బాంధవుల్
రంజిలభాగ్యసంపద నిరంతరమున్ గొనసాగుచుండఁగన్.

* * * *

శా. ఆతిప్పాంబకు నంజమంత్రికి సముద్యత్కీర్తిధుర్యుల్ సుఖా
న్వితుల్ తిమ్మరుసయ్యసంకవరుల్ వేదాంతవేత్తల్ మహీ
జాతారాముల కాత్మజుల్ కుశలవుల్ జన్మించిన ట్లుత్కట
ప్రీతిన్ బుట్టిరి తల్లిదండ్రుల కతిప్రేమంబు సంధిల్లగన్.

* * * *

క. శృంగారవతీమణి పు
ణ్యాంగన నంజరుసుతిమ్మనార్యుని సతియం[యా!]

లింగాంబిక యంబికకైన
మంగళసూత్రప్రభావ మానధనములన్.

ఉ. ఆహరిణాక్షియందు సుగుణాఢ్యుఁడు తిమ్మరుసయ్యగాంచెఁ దే
జోహరి సత్కృపాహరి విశుద్ధయశోహరి నిత్యభోగల
క్ష్మీహరి నంజమంత్రిని సమిద్ధకులాంబునిధీంద్రచంద్రునిన్
మోహనపుష్పసాయక సముజ్జ్వలరూప విశాలవైభవున్.

* * * *

వ. అని కులస్థానపౌరుషంబులు విజయనగరసింహాసనంబునఁ బ్రసిద్ధంబులై యున్నవి. సర్వలక్షణగుణ సంపన్నుండ వట్టిమహానుభావుండవు నీ వానతిచ్చినట్ల నీయభిమతదైవంబగు శ్రీరామచంద్రునకు నీతారకబ్రహ్మరాజం బంకితంబు చేసెద.

**Colophon:**

ఇది శ్రీమదనగోపాల చరణకమల సేవాధురీణ సత్కళాపారీణ కృష్ణభట్టారకపౌత్త్ర చింతలపూఁడి కామయప్రభుసుపుత్త్ర శుద్ధసారస్వత విభవరాధామాధవ ప్రణీతంబైన శ్రీరామతారకబ్రహ్మరాజం బను మహాప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము.

**End:**

చ. పవడపు మోవి నీనగవు పల్లవభాగతుషారవారిబిం
దువుగతి నున్న నీవరిది తోయవు ముత్తియమున్ గరంబడ(?)
ద్దివియఁగనీప్రకోష్ఠరుచినింపుచు నుచ్చితపండటంటివా
భవదుచితోక్తి సత్క్రియలు పాయున నామది తోయజేక్షణా.

(వి-వి.)—

అసమగ్రము. మొదటినుండి నాల్గవ యాశ్వాసమునఁ గొంత దాఁకఁ గలదు. వ్రాఁత తిన్ననిది తప్పు లున్నవి. శైథిల్యము హెచ్చు. గ్రంథపాతము లంతగా లేవు.

ప్రయాగక్షేత్రవాసి యగునారాయణాశ్రమి యను యతీశ్వరుఁడు సంస్కృతమున రచియించిన రామతారకబ్రహ్మరాజీయమను వేదాంత గ్రంథమున కీగ్రంథము తెలుఁగు. నాల్గాశ్వాసములకు మించి గ్రంథము

కలదేమో తెలియదు. చింతలపూఁడి రాధామాధవకవి దీనికిఁ గర్త. రాధామాధవ మనుశ్శృంగారప్రబంధము రచియించుటచే శ్రీకృష్ణదేవరాయలీ కవికీ బిరుదనామము నొసఁగెను. ఈతనితొల్లిటి పేరు ఎల్లయ. ఈ కవిని గూర్చి నెం 346 రున చూచునది. విద్యానగరాధీశ్వరుఁడగు నచ్యుతదేవరాయలమంత్రి నంజయతిమ్మరుసు ప్రేరణమున నీతఁడీకృతిని శ్రీరామున కంకితము చేసినాఁడు. ఈ తిమ్మరుసు వంశమునపూర్వులు గూడ విద్యానగర సింహాసనాధీశ్వరుల కొలువున నున్నవారే. విద్యానగరాధీశ్వరుఁడగు నచ్యుతరాయలు ప్రతివత్సరమును వేంకటేశ్వరస్వామికి సత్కావ్యప్రబంధపుష్పాంజలి సమర్పించువాఁడు గావున నా ప్రభువునకును దనకును నభ్యుదయసిద్ధికై యీ ప్రబంధమును రామాంకితముసేయుమని యొకనాఁ డచ్యుతరాయల కొల్వు చేసి వచ్చి విద్యానగరమున నిజనివాసమున నంజయ తిమ్మరుసు కోరిన నీకవి చెప్పుకొన్నాఁడు. నంజయ తిమ్మరుసు వంశవృత్తాంతము మొదలగు నది యుదాహృత గ్రంథభాగమును బట్టి యెఱుఁగునది.

ఈ గ్రంథము ముగిసిన తర్వాత $99^{a}$-$108^{b}$ తికటాన నిర్వచనోత్తర రామాయణము మొదటి యాశ్వాసమున గొంతభాగము వ్రాయఁబడి యున్నది.

---

### R. No. 348.

Paper. 9¾ × 7½ inches. Foll. 16. Lines, 25 in a page. Mode of writing, fair but not quite incorrect. Good.

Presented in the year 1917–1918 by M.R.Ry. Śrī Rāja Kandukūri Śivaprasādabhūṣaṇa Rao Garu, Zamindar, Narasāpuram, Kistna district.

అష్టావక్రగీతలు.

**AṢṬĀVAKRAGĪTALU.**

This is the same work as the one described under R. No. 195 ante.

Incomplete.

(వి-వి.)—

అసంపూర్ణము. వ్రాఁత తిన్ననిది. తప్పులు కలవు. శైథిల్య గ్రంథపాతములు లేవు.

ఇది ఆర్ నెం 195 రున వర్ణితమైన గ్రంథమే.

## R. No. 349.

Paper. 8⅝ × 6¼ inches. Foll. 106. Lines, 24 on a page. Mode of writing, fair but contains plenty of mistakes.

The first leaf of the MS. is not found. In fair condition.

Presented in the year 1917-18 by M.R.Ry. Vāsireḍḍi Chandramallīśāvaraprasada Bahadur Gāru, Zamindar of Muktyala, Kistna district

భిషక్సుధార్ణవము.

BHIṢAKSUDHĀRṆAVAMU

A treatise in medicine dealing with the feeling of the pulse, the symptoms of diseases, the preparation of medicines, etc., by Kambhamupāṭi, Vēṅkaṭabhaṭṭa, son of Rāmanna of Haritagōtra.

Breaks off in the ninth Āśvāsa.

**Beginning:**

క. మాలని రజకుని బోయను
దాలిమి లేకున్న గ్రామ్యదైవార్చకునిన్
లాలించి వైద్యమడిగినఁ
గాలుని వశమగును రోగి కళవళ మేలా

గీ. ఆశఁ బొందినయెడ నాదరించకపోవ
వేళయొసఁగకున్న వెగటుపడిన
లేమిఁబడిననాఁడు తామసమతియైన
సరవి వైద్యదోష సప్తకంబు.

గీ. రోగియుండునింట బాగుగా వైద్యుండు
కుడువ నిద్రపోవఁగోరనేని
వెజ్జరోగికిఁబగ వెజ్జకునారోగి
మృత్యువనఁగఁ బరగుఁ బ్రీతిఁ లేక.

**Colophon:**

ఇది శ్రీమదఘోరశాస్త్రివరప్రసాదాసాదితకవితాధురీణ సకలవిద్యాప్రవీణ హారితసగోత్రపవిత్రాపస్తంబసూత్రకంభముపాటి రామనామాత్యసుపుత్త్ర కవితావైద్యసముద్ర వేంకటభట్టప్రణీతంబైన భిషక్సుధార్ణవంబను మహాప్రబంధంబునందు.

**End:**

గీ. కలిగణంబువలన పులుసు గారము చెందు
జ్వరము వాత పైత్యవాంతులణఁచు

దాహమేహహిక్క తాపంబు లణచును
సారిది మాంద్యమేహశూల లట్ల

క. ఆయుర్వేదం బెఱిఁగిన
నాయువునీరోగగుణము నమరునుధరలో.

(వి-వి.)—

అసమగ్రము. మొదటి కాగితము పోయినది. మొదటినుండి తొమ్మిదవ యాశ్వాసమునఁ గొంతదాఁకనున్నది. వ్రాఁత యొకతీరుగా నున్నది. తప్పు లధికము. శైథిల్యమంతగా లేదు. గ్రంథపాతములు హెచ్చు.

ఇది వైద్య గ్రంథము. ఇందునాడీ నిదానము రోగనిదానము ఔషధ యోగములు మొదలగు విషయములు వివరింప బడినవి. గ్రంథకర్త కంభముపాటి వేంకటభట్టు. రామన్నకొడుకు. హారిత గోత్రుఁడు.

---

## R. No. 350.

Paper. 8×6 inches. Foll. 59. Lines, 20 in a page. Mode of writing fair but not quite incorrect. In good condition.

Presented in 1917–18 by Śrī Rājā Kandukūri Śivaprasāda Bhūṣaṇa Rao gāru, Zamīndar, Narasāpuram, Kistna district.

(*a*) వైజయంతీవిలాసము.

VAIJAYANTIVILĀSAMU.

Foll. 1*a*—37*b*. Fol. 38 is left blank.

A Prabandha describing the story of Toṇḍaraḍippoḍiyāḻvār, a Tamilian Śrī-Vaiṣṇava saint, by Sārangu Tammaya. As the introductory portion is wanting in this manuscript, no extracts are given here.

Incomplete, wants the beginning.

(వి-వి.)—

గ్రంథారంభమున నాల్గుకాగితములు లేవు కడమగ్రథం మెల్లఁ గలదు. వ్రాఁత తిన్ననిది. తప్పు లంతగా లేవు. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

ఇది సారంగుతమ్మయకృతమగు వైజయంతీవిలాసము. ఇందుఁ దొండరడిప్పాడి యాళ్వార్ల చరిత్రము వర్ణింపఁబడినది. గ్రంథావతరణిక యీ పుస్తకమున లేదు గావున నాద్యంతభాగములును, చరిత్రోపయుక్తాంశములును నిక్కడ నుదాహరింపరాదయ్యెను

---

(b) వీరభద్రదండకము.

VĪRABHADRADAṆḌAKAMU.

Foll. 39a—46a. Fol. 46b is left blank.

A poem in the Daṇḍaka metre, apparently in imitation of the Bhōginīdaṇḍaka of Pōtarāzu, by Velvari Śambhumantri. This work relates to God Vīrabhadra worshipped at Murmuḷḷa.

Complete.

**Beginning:**

శ్రీభద్రకాళీసమంచత్కుచద్వంద్వవిస్ఫారపాటీరకాశ్మీరకస్తూరిపం
కాంకితోరోమహోదారసౌరభ్య నానావిశేషంబు శేషోజ్జ్వలన్మస్తక
స్తోకమాణిక్య నీరాజమానేంద్ర నీలాకృతిత్త్వేళ—

**End:**

లాలించి యానందవారాశిఁ దేలించి మేలెంచి మోదించి కోర్కుల్ ప్రసాదించి తన్మాత నుద్యద్ధనవ్రాతగా నాజ్ఞగావించి ముర్మళ్లనామాంకితంబైన యప్పట్టణంబందు నేభద్రకాళీమహాదేవియుం దాను నన్యోన్యసల్లాపగోష్ఠీ విశేషంబులన్ శాశ్వతైశ్వర్యలీలాఢ్యులై దుష్టశిక్షావినోదంబులన్ శిష్టరక్షావినోదంబులన్ బ్రొద్దుపోనిచ్చుచున్ నిచ్చలున్ సత్ప్రీభల్ హెచ్చు శ్రీవెల్వరీవంశపాథోధిచంద్రుఁడై దయాసాంద్రుఁ నుద్యత్కృపాసాంద్రు నాత్మేశసేవామహోత్సాహునావన్నమంత్రీంద్ర సత్పుత్రుఁడౌ శంభుమంత్రీంద్రుఁ దీర్ఘాయురారోగ్య సౌభాగ్యసంపన్నుఁగా సత్కృపాదృష్టినీక్షించుచున్ బట్టసాద్రీశుఁడౌ వీరభద్రుండె తానై యనూనైకవిఖ్యాతివర్తించెఁ దచ్ఛంకరాంగీకృతిస్వీకృతంబై విచిత్రీకృతంబైన యీ దండకంబుండు, నాచంద్రతారార్కమై.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

భోగినీదండకముం బోలిన యీ శృంగార దండకము ముర్తుళ్ల యనుపురమున నెలకొన్నవీరభద్రుని పేర వెల్వరి శంభుమంత్రిచే రచియింపఁబడినది.

---

(c) వేమనపద్యములు.

VĒMANAPADYAMULU.

Foll. 47*a* –59*b*.

A collection of Vēmana's verses relating to Nīti and Vēdānta.

Contains 347 stanzas

**Beginning:**

గీ. శ్రీకరంబుగ వేమన్న చెప్పినట్టి
పద్యముల నెప్పుడేనియుఁ బఠన సేయు
నట్టిపురుషుఁడు మనముచే నిట్టిదనుచు
చెప్పరానట్టివస్తువు సేరు వేమ.

* * * *

**End:**

గీ. జన్మకాలమందు జందెము మెడ లేదు
తల్లిమేన లేదు తనకు లేదు
తల్లి శూద్రురాలు తానెట్టు బ్రాహ్మఁడో
విశ్వదాభిరామ వినుర వేమ.

(వి-వి.)—

౩౪౭ పద్యము లున్నవి. వ్రాఁతచక్కనిది. తప్పు లంతగా లేవు.

నీతి, వేదాంతబోధకము లయినయీపద్యములు వేమనయోగిరచియించినవి.

---

R. No. 351.

Paper. $6\frac{1}{8} \times 1\frac{1}{8}$ inches. Foll 41. Lines, 24 in a page. Mode of writing, fair but not quite correct. In good condition.

Presented in the year 1917–18 by M.R.Ry. Tōlēṭi Dakṣiṇāmūrti Garu of Neggipūḍi, Tanuku taluk, Kistna district.

(*a*) హనుమత్పంచవింశతి.

**HANUMATPAÑCAVIṀŚATI.**

**Foll. 1*a*—6*a*.**

This is the same work as the one described under R. No. 276(*d*) ante.

Incomplete. The first two stanzas are wanting.

(వి-వి.)—

తొలి రెండుపద్యములు లేవు. వ్రాంత యొకతీరుగా నున్నది. తప్పు లంతగా లేవు. శైథిల్యగ్రంథపాతములు లేవు.

ఇది ఆర్. నె 276(d) రున వర్ణింపఁబడిన గ్రంథమే.

---

(*b*) ఆంజనేయదండకము.

**ĀÑJANĒYADAṆḌAKAMU.**

**Foll. 6*b*—19*b*.**

A poem in the Daṇḍaka metre, written in praise of Āñjanēya, the monkey-warrior of the Rāmāyaṇa, by Vāsudēvakavi, son of Jaṅganāmātya.

Complete

**Beginning:**

శ్రీరామనామామృతాస్వాదలీలావిలాసస్ఫురద్వజ్రసంకాశదేదీప్య గాత్రా లసద్బాలభానుప్రభాశోభితాలిప్తసంరక్తనేత్రా జగత్ప్రాణపుత్రా మునిస్తోత్రపాత్రా సుచారిత్ర నీసుస్థిరానందసౌజన్యసత్కీర్తిసత్యవ్రతానేక సుజ్ఞానముం బ్రస్తుతింపంగ నే నెంత కారుణ్యవంతా

**End:**

చమత్కారభాషావిశేషంబులన్ దండకారూఢిఁ గావించె నార్వే లవంశాబ్ధిచంద్రుండు మీకీర్తిచేఁ జెల్మి చేకూరఁ బ్రసిద్ధిగా నెన్నికైనట్టి యాజంగనామాత్యపుత్రుండు సామీరికారుణ్యలబ్ధానుసారుండు విద్వజ్జనామోదసేవాధురీణుం డసాధారణప్రజ్ఞచే వాసుదేవుండు సద్భక్తితోడన్ హనూమంతు పేరన్ సమర్పించె నీదండకం బుర్విలో మానవుల్ వ్రాసి వాచించినన్ విన్న సర్వాంకమప్రజ్ఞచే మించి . . . శ్రీరామ దాసా మహానందలీలావిలాసా జయోల్లాస దేవా నమస్తే నమస్తే నమః.

(వి-వి.)—

సంపూర్ణము. వ్రాఁత యొకతీరుగా నున్నది. తప్పు లున్నవి.

ఆంజనేయస్తుతిరూప మగునీదండకమును జంగనామాత్యునిపుత్త్రుఁ డగువాసుదేవకవి రచియించెను.

---

(*c*) తులసీదళమాహాత్మ్యము.

TULAŚĪDAḶAMĀHĀTMYAMU.

Foll. 21*a*—36*a*. Fol. 20 is left blank.

A small Prabandha extolling the greatness of the Tulasī plant by an illustrative story; by Narasimhārya, son of Sītāmba and Lakṣmaṇa of Kāśyapagōtra

Incomplete with many omissions.

**Beginning:**

శా. శ్రీరామాయ నమోనమో శ్రితజనశ్రేయఃప్రదాత్రే స్ఫుర
న్నీరేజాయతలోచనాయ వలభుజ్జైత్రోఘవిధ్వంసినే
కారుణ్యాంబుధయే తపాదవనితాకష్టాపనోదక్రియా
పారీణాయ నమస్సదా యనుచు లో భావించి సేవించెదన్.

* * * *

సీ. గీ. అనఘుఁ డాతఁడు సర్వశాస్త్రార్థవేది
సంస్కృతాంధ్రకవిత్వవిచక్షణుండు
కాశ్యపాన్వయవార్ధిరాకామృగాంకుఁ
డనఁగ లక్ష్మణగురువర్యుఁ డలరుచుండు.

ఉ. ఆకరుణాంబురాశికిఁ బ్రియం బొనగూర్చుచునుండుఁ బత్నియై
. . . . నిజ్జగతీసతియె సీతాంబనన్. (?)

గీ. అమ్మహాత్ముల కాత్మజు లగుచు సుమతు
లలఘుగుణశాలి వేంకటాచార్యుఁ డనఁగ
నారసింహార్యుఁ డనఁ గృష్ణనామకుండు
ననఁగ వెలయుదు రార్యసేవార్థు లగుచు.

ఉ. వారల కగ్రజుండు . . . . . . . .
ధారుణి వేంకటార్యుఁ . . . . . . .

వ. ఆపుణ్యఫలార్థికి ననుజుఁడు నయిననరసింహాభిధుండ నయిన నేను . . . భగవత్కథాప్రతిపాదకంబుగాఁ దులసీదళమాహాత్మ్యం బనుగ్రంథఁబు రచియింపంబూనితి. తత్కథాప్రసంగం బెట్లనిన.

**End;**

వ. అని మఱియు సత్యభామను గనుఁగొని నాయనుమతి మహావ్రతంబు సలిపితివి. నీపుణ్యవశంబున సాంగంబయ్యెఁగాన నీవును రుక్మిణియు సకలసౌభాగ్యంబులుగల్గి వృద్ధిఁగాంతురుఁగాక యని యాశీర్వదించి కృష్ణు నాలోకించి యిట్లనిస్తుతియించె.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత యొకతీరుగా నున్నది. తప్పులు పెక్కులు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు మెండుగాఁ గలవు.

దీనిని గాశ్యవసగోత్రుఁ డగునరసింహార్యుఁడు రచియించెను. ఈతఁడు లక్ష్మణగురు సీతాంబలకుఁ బుత్రుఁడు. ఇందుఁ దులసీదళమాహాత్మ్యము వర్ణింపఁబడినది.

---

(*d*) నృసింహదండకము.

**NṚSIṀHADAṆḌAKAMU.**

**Foll. 36*a*—37*b*.**

**This is a poem in the Daṇḍaka metre composed in praise of Narasiṁha (fourth of the ten incarnations of Viṣṇu). The author's name is not known**

**Incomplete.**

**Beginning:**

శ్రీమన్మహేంద్రాదిబృందారకానందసంధాయకా శత్రుదైత్యార్తిసంధాయకా మౌనిరాణ్మానసాంభోజవాసా యహోబలా శ్రీనివాసా.

**End:**

సుజ్ఞానదం బైనయజ్ఞోపవీతంబునుం దాల్చి మున్వామనాకారి వై శిక్షకర్ణుండు గా-డంచు భిక్షుండవై యాబలిం బట్టి శిక్షించి దేవేంద్రు రక్షించితీవేగదా.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాంత తిన్ననిది. తప్పులు మెండుగా లేవు. శైథిల్యగ్రంథపాతములు కలవు.

నృసింహాస్తుత్యాత్మక మయినయీదండకమును రచియించినవా రెవ్వరో గుర్తింపరాదు.

Foll. 38a—40a. ఒకశృంగారగీతము కలదు. Foll. 40b—41 are left blank.

---

R No. 352.

Paper. 6¾ × 4 inches. Foll. 80. Lines, 18 in a page. Mode of writing fair but containing mistakes. In a fair condition.

Presented in the year 1917–18 by M.R.Ry. Tōlēṭi Dakiṣṇāmūrti Gāru of Neggipūḍi, Tanuku taluk, Kistna district.

(a) గణనాథాభ్యుదయము.

GAṆANĀṬHĀBHYUDAYAMU.

Foll. 1a—29a.

A Prabandha describing the incidents that led to the curse pronounced on the moon for having jeered at the size of Gaṇēśa's belly. This story is usually read on the fourth day of the bright fortnight in the month of Bhādrapada. The author is Cāṇāsi Vēṅkaṭarāmaya.

Complete.

**Beginning**:

క. శ్రీమహితసుగుణధామా
భూమిసుతాకుముదసోమ భూపలలామా
రామా జగదభిరామా
కామారిస్తుత్యనామ కలుషవిరామా.

వ. అవధరింపు మభ్యుదయపరంపరాభివృద్ధిగా నారచియింపంబూనిన గణనాథాభ్యుదయంబునకుం గథాక్రమం బెట్టిదనిన పరీక్షన్నరేంద్రునకు శుకయోగీంద్రుం డిట్లనియె.

**End**:

మాలిని. దశరథకులదీపా దైత్యసంహారచాపా
శశిధరనుతరూపా తూలితాశేషపాపా

విశదశుభకటాక్షా విద్వద్విహ్వాకా
ఒకముఖకృత ధారుణీముఖ్యభూపా.

**Colophon:**

ఇది శ్రీమదాత్రేయగోత్రపవిత్ర చాణాశి లక్ష్మీనృసింహార్యతనూభవ వేంక టరామ నామధేయప్రణీతంబైన గణనాథాభ్యుదయంబునందు సతీదేవి వలన గణనాథు . . . ఈ కథలు వ్రాసిన చదివిన జనుల భాద్ర పదశుద్ధచవితిని జంద్రునిఁ జూచిన నిందలు లేక శుభంబులు పొందుదురని శ్రీ కృష్ణుండానతిచ్చె ననియును, శ్రీశుకులు భారతప్రభావంబు చెప్పిన పరీక్షిన్న రేంద్రునిఁ గొనియాడి యీచరిత్రంబు వ్రాసినచదివిన జనులకు శుభంబు చే కూఱు నని శ్రీశుకులానతిచ్చిన కథలును గల యేకాశ్వాసము.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁతతిన్ననిది. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

భాద్రపదశుద్ధచతుర్థినాఁడు చదువఁబడు, గణనాథోపాఖ్యానకథ యేకాశ్వాసప్రబంధముగా నిట్లు చాణాశి వేంకటరామయ రచియించి నాఁడు.

Foll. 29*b*—45*a* లలోఁ గొన్ని భక్తి వేదాంతవిషయికము లగు గీతము లును, గొన్ని చిల్లరపద్యములును, గలవు.

---

(*b*) నీలాపనిందానివారణము.

NĪLĀPANINDĀNIVĀRAṆAMU.

**Foll.** 45*b*—59*a*.

A Prabandha narrating the story of the Śyamantaka gem as relating to Śrī-Kṛṣṇa; by Nṛsiṁha, son of Varadācārya.

Complete.

**Beginning:**

క. శ్రీకాకుత్స్థకులాంబుధి
రాకానిశాకరధామ రాజలలామా
స్వాకార విజితకామా
శ్రీకంఠధనుర్విరామ సీతారామా!

గీ. అవధరింపుము శౌనకాద్యఖిలమునులు
సూతుఁ గనుఁగొని వార్షసమేతులగుచు
పుణ్యతమమైన విఘ్నాధిపునిచరిత్ర
తెలియఁజెప్పుము మాకని పలుకుటయును.

**End:**

మత్తకోకిల.—జానకీప్రియ వార్ధిబంధనసంయమీశ్వరపాల స
న్మాననీయ దశాస్యభంజన మంజుభాషణ ధర్మసం
ధానతత్పరదీనరక్షణ భవ్యదివ్యతరోల్లస
ద్గానతర్పితభూమిదేవవితాన రామ దయానిధీ.

**Colophon:**

ఇది శ్రీ కాశికాన్వయ సంభూత వరదాచార్యతనూజాత సంతతా రాధితశౌరి నృసింహసూరివిరచితం బైననీలాపనిందానివారణం బనుప్రబంధంబునందు సర్వంబు నేకాశ్వాసము.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

శమంతకోపాఖ్యానమునే వరదాచార్యుల కుమారుఁడగు నృసింహసూరి యేకాశ్వాసప్రబంధముగా నిట్లు రచియించినాడు. నెం 352 (a) రు గలది వేఱు. ఇది వేఱు.

---

(c) పంచాయుధావినాభావసంబంధదశావతారస్తవము.

PANCĀYUDHĀVINĀBHĀVASAMBANDHADAŚĀVATĀRASTAVAMU.

Foll 60*b*—63*b*. Fol. 59*b* and 60*a* are left blank.

These 12 stanzas in the Sīsa metre praising the ten incarnations of Viṣṇu were composed by Kāśīcarla Lakṣmaṇakavi in such a way that the names of the five weapons of Viṣṇu might appear in each stanza.

Complete.

**Beginning:**

సీ. శ్రీకరంబై సుప్రసిద్ధమై నాణ్యమై
తనరు వైకుంఠభవనము నందు
బ్రహ్మాదిసురులెల్లఁ బ్రస్తుతింపఁగఁ జెలు
వొందుచున్నట్లు నాయందుఁ గరుణ

నుంచి స్వప్నమునఁగాన్పించి కాశీచర్ల
లక్ష్మణ నీవు సలక్షణముగ
మత్స్యకచ్ఛపముఖమద్దశలీలావ
తారముల్ పెంచి పద్యములుగాఁగఁ
బంచాయుధావినాభావసంబంధము
గాఁ గూర్చుమన్న మేలగ్గని ముదమున

నీపదాబ్జములకు మ్రొక్కి నేర్చినట్లు
పంచపదసీసముల రచియించినాఁడఁ
గృష్ణ! వైకుంఠనాథ లక్ష్మీసనాథ
రక్షణపరాయణుండ నారాయణుండ.

**End:**

సీ. శ్రీహరి నీవిట్లు చేసినచర్యల
భక్తిచే నెవ్వరైనఁ బఠనసేయ
ధర్మార్థకామముల్ దయచేసి తుదమోక్ష
మొసఁగుదువందురు యోగివరులు
ప్రత్యక్షముగను స్వప్నమున నా కగపడి
దశయవతారపద్యముల ధరను
రచియించు మని నరుల్ వ్రాయ వినినఁ జది
విన భవంబులఁ బాపి ఘనులఁజేసి

యిహపరసుఖంబు లిచ్చెద నిచ్చ నంటి
వహహా నీవాక్యములు చాలక ష్కృతభవ (?)
కృష్ణవైకుంఠ . . . . . .

(వి-వి.)—

సమగ్రము. పన్డెండు పద్యములు. వ్రాఁత తిన్ననిది. తప్పులు లేవు. గ్రంథపాతములు లేవు.

"కృష్ణ వైకుంఠనాథ! లక్ష్మీసనాథ! రక్షణపరాయణుండ! నారాయణుండ" అను మకుటముగల యీ దశావతారస్తవమును గాశీచర్ల లక్ష్మణ కవిరచియించినాడు. ఇందొకొక్కొక్క పద్యమునను బంచాయుధనామములను జేర్చియున్నాఁడు.

(*d*) పంచపదసీసమాలికాదశావతార స్తవము.

PAÑCAPADASĪSAMĀLIKĀDAŚĀVATĀRASTAVAMU.

Foll. 64*a*—67*a*.

A short poem consisting of 12 stanzas in Sīsa metre and of five lines each and in praise of the ten incarnations of Viṣṇu. The author Kāśicerla Lakṣmaṇakavi states that he was informed in a dream of the superiority of his own work (described under the last sub-section) to the similar eulogistic poem composed by Diṭṭakavi Prakāśakavi.

Complete.

**Beginning :**

సీ. శ్రీరమాధవ భవత్సేవ చేయుచునుండఁ
గలలోనఁ గనుపించి కరుణనించి
పంచాయుధావినాభావసంబంధద
శావతార స్తవ మవధరించి
మును దిట్టకవి ప్రకాశునిచే విరచితమై
యున్న పద్యంబులకన్న మించి
యున్నవి యివియని మన్నించి వాటిని
బంచపదలనియు బహుపదలని
యును నిరువిధముల నుచితంబుగాఁ గూర్చు
మన విని కూర్చితి నట్లు కాశి
చెర్ల లక్ష్మణుఁడను దరిఁజేర్చి ప్రోవు
దీనులను గావ హరి నీవె దిక్కు గావె
కృష్ణ ! వైకుంఠనాథ ! లక్ష్మీసనాథ !
. . . . . . . . . .

**End :**

సీ. అఖిలాండకోటిబ్రహ్మాండనాయక మీరు
స్వప్నమందున నాకుఁ జెప్పినట్లు
దలఁచి మున్నీమీఁద గలమత్స్యకూర్మాది
దశయవతారపద్యముల నిట్లు
మహి. బంచపదసీసమాలికలఁగఁ గూర్చి
నాఁడ నాకర్ణింపు నలిననాభ
మును భగీరథుఁడు గంగను దెచ్చి పితరులఁ
దరియింపఁజేసిన దానివలన

నితరు లాతనివలె నీప్సితములఁ జెంది
తమతమపితృదేవతలఁ దగింపఁ
జేసికొన్నట్టునట్రాశ్రీ కాశిచెర్ల
లక్ష్మణుండను దీనసంరక్షణ వారి.

(వి-వి.)—

సమగ్రము. పంద్రెండు పద్యములు. వ్రాఁత తిన్ననిది. తప్పు
లు లేవు. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

ఆర్ నె 352 (c) దున వర్ణింపఁబడిన దశావతారస్తవపద్యము లంద
లివిషయమే పంచపదసీసములుగా నా కాశిచెర్ల లక్ష్మణకవిచేత నే యిట్లు
పెంపొందింపఁబడినది.

---

(e) బహుపదసీసమాలికలు.

BAHUPADASĪSAMĀLIKALU.

Foll. 67a–72a.

Similar to the above and by the same author The stanzas here consist of more than five lines.

Complete, containing 12 stanzas.

**Beginning :**

సీ. శ్రీశ నీవనయంబు శృంగారమున శంఖ
చక్రగదాఖడ్గశార్ఙ్గములను
ధరియించికొనియొ మత్స్యముఖదశావతా
రములను దాల్చి యాక్రమములెల్లఁ
బ్రత్యక్షముగను స్వప్నమునందుఁ జూపింప
నానందమొంది నే నావిధముగఁ
బంచాయుధావినాభావసంబంధద
శావతారస్తవ మనెడివంచ (పదసీసములు)
బహుపదములఁగనుబరఁగఁజేయు మనంగఁ
బ్రథమమందునఁ బంచపదలఁ జేసి
పిదపనిట్టులబహుపదసీసమాలిక
ల్గావించినాఁడ వేఁ గాశిచెర్ల

లక్ష్మణాఖ్యుఁడ నుపలక్షించు (?)
మఖిలలోకాధార హరి ముకుంద
యుష్మదీయచరిత్రముల్ యోగ్యమైన
వినుతి సేయంగ లేరు నే వేడఁగలనె
కృష్ణ! . . . . . . . .

**End**:

సీ. పద్మనాభ హరి స్వపాంచజన్యరథాంగ
శార్ఙ్గగదాఖడ్గసంయుతముగ
నీవు ధరిత్రి జనించినమత్స్యాది
యవతారముల నెంచియర్థ్యముగను
పాదపంచకసీసపద్యముల్నేగూర్చి
చదువంగవినినీవు సంతసించి
మును దిట్టకవిప్రకాశుని చేవిరచితమై
యున్నపద్యంబులకన్న వన్నె
గలిగియున్నవి యివి కాశీవయసుల ల
క్ష్మణకవి యని నాదుకలను జెప్ప
యాపద్యములను నట్లయిదైదుపదములు
గా బహుపదములుగాద్విగతుల
రచియింపుమని సాదరముగ మీరానతి
నిచ్చిన మేలరిని మెచ్చికూర్చి
నాఁడనీపద్యముల్ వేడుకగా నేన
రులుపఠించిన విన్న రూఢిగాఁగ
నైహికఫలముల నాముష్మికమునిచ్చి
దేవ నన్మీదివ్య దేహమందు
నైక్యమును జేసికొనుమ యిట్లయినమేలు
చాలుజన్మంబు లింకెత్తఁజాలఁ బ్రోవు.

(వి-వి.)——

సంపూర్ణము. వంద్రెండు పద్యములు. వ్రాఁత తిన్ననిది. తప్పు లంతగా లేవు. శైథిల్య గ్రంథపాతములు లేవు. కడచిన ఆర్ నె 352 (c), (d) రులక్రింద వర్ణింపబడిన విషయమే దత్తాత్రయగులక్ష్మణ కవిచే బహుపదసీసములుగా బెంపొందింపఁబడినది.

Foll. 73b—80b.

"కామమ్మ కథ" యను గ్రంథమునందలి కొంతభాగము కలదు.

## R. No. 353.

**Paper. 8 × 6½ inches. Foll. 120. Lines, 21 on a page. Mode of writing, fair but full of errors. In good condition.**

Presented in the year 1917-18 by M.R.Ry. Tōlēṭi Dakṣiṇāmūrti Gāru of Neggipūḍi, Taṇuku taluk, Kistna district.

చిత్రభారతము.

CITRABHĀRATAMU.

This Prabandha in eight Āśvāsas narrates the story of the Pāṇḍavas as related in the Mahābhārata with an eye to poetical excellence in the form of composition. The author is Caṛigoṇḍa Dharmana, son of Timmanāmātya of Kauṇḍinyagōtra and disciple of Bhaṭṭaparāśaraprabhu Raṅgaguru. The author had the title Śatalēkhinīsuratrāṇa which shows his skill in composition. The work was dedicated to Yennumulapalli Peddāmātya, son of Mādana, and minister of Cittāmbu Khan. The author mentions frequently God Nṛsiṁha worshipped at Dharmapuri. Peddanāmātya's younger brother, Timmana, is stated to have constructed a temple to Lakṣmīśvara and a Gōpura (tower) in front of the temple of Pāñcālēśvara at Ōrjanṭi (Warrangal).

Contains the Āśvāsas 1 to 5 complete and each of the Āśvāsas 6 to 8 incomplete.

**Beginning :**

శా. శ్రీలక్ష్మీకుచపారిజాతకలికాశ్లిష్టోరువక్షుం డుదే
వాలీన్మాళిమణిప్రభారుచిరపాదాంభోజుఁ డుద్యద్దయా
లీలం ధర్మపురీశ్వరుండు గుణశాలిన్ మాధవా (దయా)ంశోనిధి
ప్రాలేయద్యుతిఁ బెద్దనప్రభు సమగ్రశ్రీయుతుం జేయుతన్.

* * * *

సీ-గీ. అతఁ డింగిహిందు లాటకర్ణాటకోట
ఝూటకరహాటపాండ్యపానాటగౌళ
చోళమళియాళరాజసంస్తూయమాన
మానధనుఁడైనచిత్తాంబుఖానవిభుఁడు.

శా. ఆరాజేంద్రశిఖావతంసనిజబాహాయత్తవిశ్వంభరా
ధారేయుండు విరోధిమంత్రిముఖముద్రాదక్షుఁ డుద్యద్దయా
పారీణుండు వటీగతారకసుధాపాణింధమశ్రీయశో
హారుం డెన్ములవల్లిమాదవిభుపెద్దామాత్యుఁ డుల్లాసిరై.

సీ. లలితశాస్త్రాగమాలంకారనాటకా
భ్యాసనదక్షవిద్వజ్జనంబు
లత్యంత మధుర వాక్యప్రౌఢి కావ్యని
ర్మాణబంధుర కవిగ్రామణులును
శ్రవణసమ్మోదసంజననకారణహృద్య
గానవిద్యాభిజ్ఞగాయకులును
దత్తిలభరతమతంగాదిమునికృత
నాట్యకళాప్రౌఢినర్తకులును
బంధువులు సోదరులు హితుల్ భామినులును
వందిమాగధవరులు గొల్వంగ వినూత్న
చంద్రకాంతశిలానద్ధసౌధరత్న
పీఠికాసీనుండై మనఃప్రేమమీఱ.

సీ. కౌండిన్యగోత్రదుగ్ధసముద్రచంద్రు నా
పస్తంబసూత్రు శోభనగరిష్ఠు
సర్వవిద్యాభిజ్ఞ చఱిగొండ తిమ్మనా
మాత్యాగ్రణికి . . మాధవునకుం
గూరిమినందను (నతిశాంతు) ? నారాయణధ్యాన
తత్పరు శ్రీరంగధామసదృశ
భట్టపరాశరప్రభురంగగురుపాద
నీరేజబంభరు నిర్మలాత్ము
ధర్మనామాహ్వయు సతర్కవితాధురీణు
దాంతు శతలేఖినీసురత్రాణబిరుద
కలితు నను వేడ్కఁ బిలిపించి
తేనియలు చిలుక నిట్లని యానతిచ్చె.

మ. శతలేఖిన్యవధానపద్యరచనాసంధానసురత్రాణబి
ఖ్యాతనామా చఱిగొండధర్మసుకవీ నీవాగ్విలాసంబులా
శితికంఠోజ్జ్వలజూటకోటరకుటీశీతాంశురేఖాసుధా
న్వితగంగాకనకాబ్జనిర్ఝరరసావిర్భూతమాధుర్యముల్.

గీ. కావున విచిత్రగతి నలంకారసరణి
మీఱ రసములు చిప్పిలి మెచ్చు లొసఁగఁ

దెనుఁగు గావింపు నా పేర ననఘసుకవి
ధీర యరుదందఁగాఁ జిత్రభారతంబు.

* * * *

వ. . . . . మద్విరచితకావ్యకన్యాకాకరమంగళసూత్రాయమానం బగుతదీయవంశక్రమం బభివర్ణించెద.

తే-గీ. . . . కశ్యపబ్రహ్మవెలసె.

క. ఆమునికులదుగ్ధాంబుధి
సోముఁడు భువనప్రపూర్ణశుదయశశ్శ్రీ
కాముఁడు పద్మాక్షీజన
కాముఁడు చెన్నప్రధానఘనుఁ డుదయించెన్.

చ. ధరవయి (నిందొక ?) జన్నమంత్రివనితామణి కాంచనమాంబకున్
సురుచిరకీర్తి నారయ విశుద్ధయశోనిధిలంకరాజు శ్రీ
హరిచరణారవిందయుగళార్చనశీలుఁడు వల్లభన్న సు
స్థిరమతి సింగమంత్రియు నృసింహవరంబునఁ బుట్టి రున్నతిన్.

క. అందగ్రజుండు నరహరి
కుందేందుసమానకీర్తి గుణవతిలక్ష్మాం
బం దగ నుద్వాహంబై
నందితసుజనుల మువురుతనయులం గనియెన్.

వ. వారెవ్వరనిన.

ఉ. ధీరుఁడు సింగమంత్రియు సుధీజనవర్యుఁడు ధర్మరాజు
లక్ష్మీరమణీశపాదసరసీరుహభక్తుఁడు తిమ్మనార్యుఁడున్
ధారుణి నుల్లసిల్లిరి వదాన్యగుణంబుల నందు సర్వథా
శ్రీరమణస్తుతుం డనఁగఁ దిమ్మనమంత్రి చెలంగె నున్నతిన్.

క. చెన్నగనాతిమ్మనయ
మ్మన్నమునఁ గనియె రూపమదనుల గుణసం
పన్నిధుల నత్యుదారుల
నన్నయమంత్రీంద్రు వేంకటార్యునిఁ బ్రేమన్.

వ. అందు.

క. అన్నయ్య యర్థికోటికి
నన్నియును సమస్తవాంఛితార్థప్రదుఁడై
మున్నీటి లేని సంపద
మున్నీటితెఱంగునన్ సమున్నతిఁ దనరెన్.

ఉ. అన్నమహీయకీర్తికిఁ బ్రియంబగుతమ్ముఁడు వెంగళన్న రూ
పమ్మున దానసంపదల బాహుబలంబున రూఢిమించఁగా
నెమ్మిని లజ్జ నొందుదురు నీరజసంభవుఁ డాసినట్టి పెం
దమ్ముఁడు సాగరాత్మభవతమ్ముఁడు ధర్మతనూజతమ్ముఁడున్.

గీ. తజ్జనకపూర్వజుం డగుధర్మరాజు
ధర్మపదమున విహరించుధర్మరాజు
శ్రీరమాధీశపాదరాజీవభక్తుఁ
డై తనర్చెను శుకయోగియట్లు జగతి.

వ. అందగ్రజుండు.

చ నరహరిమంత్రిసింగఁడు దినంబును విప్రులకోర్కులీయఁ ద
ద్గురుతరకీర్తి మించి సురకోటుల నద్భుతమందఁజేయఁగాఁ
బోరిపోరి కల్పకంబు లుడివోయెను . . . . చం
దురుఁడును గందె సాగరము తోడనె భంగమునొందె సిగ్గునన్.

క. ఆమంత్రికులవరేణ్యుని
భామామణి సింగమాంబ పరహితసుగుణ
స్తోమావలంబ కనియెన్
హేమాచలధైర్యయుతుల నిరువురుసుతులన్.

సీ. గీ. . . . . . . . . . .
వారినారయ మాదయగారినలరి.

శా. వందారువ్రజదోషమేఘపవనున్ వారాశిగాంభీర్యు నా
నందాత్మున్ హరిపాదభక్తు నిఖిలామ్నాయజ్ఞు విశ్వంభరా
మందారక్షితిజాతిమున్ నిగమసన్మార్గప్రతిష్ఠాపకున్
కందాళాఖ్యగురున్ వివేకనిధి లోకఖ్యాతు వర్ణింపుచున్

క. ఆదేశికపదకమలము
లాదరమునహృదయవీథి ననవరతంబున్
మోదముననిలిపి శ్రీలల
నాద . . . భక్తియుతులు నారనయు మాధవుఁడున్

వ. అందు.

సీ. . . . . . . . . .

శ్రీయుతుఁడు సింగమంత్రినారాయణుండు

గీ. కోరియాతఁడు శ్రీవత్సగోత్రజాతుఁ
డైనయుప్పలనారయయతివసింగ
సానికాంచినచెన్నాఖ్యచంద్రవదనఁ
బరిణయంబయ్యె సంతోషభరితుఁ డగుచు.

* * * *

కం. ఆదంపతులకుఁ గలిగిరి
తేజోవిభవమున విమలదీధితి భాస్వ
ద్రాజులు వైభవనిర్జర
రాజులు నరసింగవిభుఁడు రంగప్రభుఁడున్.

* * * *

ఉ. వారలలోన నగ్రజుఁ డవారితశౌర్యధురంధరుండు ది
గ్వారణదంతసంకలితకమ్రయశోవిభవుండు దీనమం
దారుఁడు సంగరస్థలవిదారితశాత్రవుఁ డంగనామనో
హారుఁడు నారసింహసచివాగ్రణి మించు వసుంధరాస్థలిన్.

సీ. గీ. . . . . . . .

బ్రహ్మవంశాంబునిధిరాజు రంగరాజు.

కం. ఏతజ్జనకానుజుఁ డగు
నాతతనయశాలి మాధవార్యుఁడు పుణ్యో
పేతగుణంబుల వెలయు ధ
రాతలకల్ప మని సుకవిరాజులు పొగడన్.

* * * *

గీ. అతఁడు కౌశికగోత్రవిఖ్యాతుఁ డనఁగఁ
దనరు గొబ్బూరిలకరామ ధర్మపత్ని
చెన్నసానమ్మ గన్నరాజీవపత్ర
నేత్రఁ గృష్ణాఖ్యఁ బెండ్లాడె నింతుప్రేమ.

* * * *

క. ఆలేమ గనియెఁ గీర్తి
శ్రీలలనావరుల రూపరేఖావిజిత

ప్రాలేయాంశుల|విద్యా
నాళీకోద్భవుల సుతుల నలువుర వారల్

సీ. సిద్ధబుద్ధిప్రభాజిత కార్యజీవన కుం(?)
భీనసకులరాజు పెద్దిరాజు
నానావిధోపాయనయకళా(వి)జ్ఞాన త
ర్జితవైరినృపమంత్రి సింగమంత్రి
యమృతధారాళనానార్థసంపద్వచ —
స్థితిరమావరు నయ్యతిరుమలయ్య
యఖిలభూదేవతాహ్లాదకారణసము
ద్యమపుణ్యసంచారుఁ డన్నగారు
ననఁగ శ్రీహరిభుజముల యనువుదోఁప
మానవత్వంబుఁ బొందునంభోనిధాన
ములన మహిమయు గాంభీర్యమును దలిర్ప
మీఱుదురు సర్వలక్షణోదారులందు.

* * * *

మ. అలఘుప్రాభవుఁడైన మాదవిభుతిమ్మామాత్యముఖ్యుండు లే
(?)న(ల)గూడన్ రజితాచలంబుగతి లక్ష్మీశాలయంబర్థి ని
శ్చలభక్తిన్ విలసిల్లఁ జేసి మఱిపాంచాలీశ్వరప్రాంగణ
స్థలిఁ గట్టించె సువర్ణకుంభవిలసత్సౌధంబు నోర్జంటిలోఁ.

* * * *

సీ. గీ. తనరు (అతఁడు) చిత్తాంబుఖానదయాత్తహేమ
చామరాందోళికార్జునఛత్రపీఠి
కాకరంక కళాచి భృంగారుకాది
రాజచిహ్నాంచితుఁడు సింగరాజు భువిని.

* * * *

సీ. గీ. మించి చిత్తాంబుఖానభూమీమహేంద్ర
సకలసామ్రాజ్యలక్ష్మీవిశారదుండు
భాగ్యసంపన్నుఁ డెనుములపల్లిమాద
మంత్రిశేఖరు పెద్దనామాత్యవరుఁడు.

* * * *

సీ. గీ. పాలవెల్లికి నల్లుఁడై పరగినట్టి
యాదిదేవుండు సర్వంసహావధూటిఁ

బెండ్లియాడినవిధమునఁ బెద్దమంత్రి
లక్ష్మిఁ బరిణయ మయ్యె నుల్లాస మెసఁగ.

గీ. తమ్ములెల్లను దను నిధానంబుఁగాఁగ
దైవమును దేశికుండుఁ గా దాతగాఁగ
నాత్మఁ దలపోసి సేవ సేయంగ మెఱయు
నీదృశగుణాఢ్యుఁ డైనమంత్రీంద్రునకును
* * * *

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన చిత్రభారతం బనుమహాపురాణంబునకుం బ్రారంభం బెట్టిదనిన.

**Colophon :**

ఇది శ్రీమత్కౌండిన్యగోత్రపవిత్ర సకలవిద్యాపారీణ శతఘంటసురత్రాణ సుకవిజనవిధేయధర్మయనామధేయప్రణీతంబైన చిత్రభారతంబను పురాణంబునందుఁ బంచమాశ్వాసము.

**End :**

సీ. యుద్ధసంగ్రామస్థలోద్ధవుం డుద్ధవుం
డుగ్రసేనుండగునుగ్రసేను
డభియాతిరాజ మహాక్రూరుఁ డక్రూరుఁ
డరిత మోనిచయారాధ్యదరుణుఁడరుణుఁ
డతులితధీరతా కృతవర్మ కృతవర్మ
కాంచనమణిమయాంగదుఁడు గదుఁడు
ధారుణిసమరైకతానుండు చేకితా
నుం డాస్యజితపుష్కరుండు పుష్క
రుండును శుకుండు దీప్తిమంతుండు భాను
విందుఁడు సునందనుండును వేదవాహుఁ
డును బృహద్భానుఁడును వృకుండును రథంబు
లెక్కి చని రనికి ధరణి గ్రక్కదలఁగ.

వ. మఱియు భానుదేవుండును, సారణుండును శ్రుతదేవుండును వరూథియుఁ జిత్రబర్హియునాదిగాఁగల . . . . .

అంతనిరంతరదానధారాగంధలుబ్ధపుష్పధయఝుంకారబధిరితదిక్తటంబులై చలితఘంటాఘణఘణ . . . . .

(వి-వి.)—

అసంపూర్ణము. ౫ ఆశ్వాసములు, నిండుగను, ౬, ౭, ౮ ఆశ్వాసము లరకొఱలుగ నున్నవి. ౮ వ ఆశ్వాసము ౫, ౬ ఆశ్వాసము లకునడుమ నున్నది. వ్రాంత తిన్ననిది కాదు. తప్పులుకుప్పలు. శైథిల్యా లేదు.

ఈ రసవత్ప్రబంధము చఱిగొండ ధర్మనకవి రచించినది. భారత కథ యిందు వర్ణింపఁబడినది. ఇది "చిత్ర భారత" మను సంస్కృత గ్రంథమునకుఁ దెలుఁగుసేఁత గాఁ దోఁచుచున్నది. ఈ ధర్మన, కౌండిన్యగోత్రుఁడు, తిమ్మనామాత్యుని కొడుకు - 'భట్టపరాశరప్రభురంగగురు' శిష్యుఁడు. శతలేఖినీసురత్రాణుఁడను బిరుదు పేరుగలవాఁడు. ఎమ్మలవల్లి మాదన కుమారుఁడగు పెద్దామాత్యునకీకృతి యంకితముసేయఁబడినది. ఈ పెద్దామాత్యుఁడు చిత్తాంబుఖాన్ ప్రభునకుమంత్రిగాఁ దెలియవచ్చుచున్నాఁడు. ఈ ఖాన్ ఎక్కడిరాజో తెలియదు. ధర్మపురీశ్వరుఁడగు నరసింహస్వామి యిందుఁ దఱచుగాఁ బేర్కొనఁబడుటచే గృతికర్తయుఁ గృతిపతియు నాధర్మపురి ప్రాంతములవారుగాఁ దోఁచుచున్నారు. ధర్మపురి నైజాం రాజ్యమున గోదావరిచేరువ నున్నది. మఱియుఁ గృతిపతి తమ్ముఁడగు తిన్నామాత్యుఁడు, ఓర్జంటిలో (ఓర్గంటిలో ?) లక్ష్మీశ్వరాలయమును, పాంచాలీశ్వర ప్రాంగణమున (పాండవుల గుడి ?) సువర్ణ కుంభములతో గోపురమును, గట్టించెనట. విశేషములుదాహృత పద్యములంబట్టి యెఱుఁగునది.

---

R. No. 354.

Palm-leaf. 11⅞ × 1½ inches. Foll. 12. Lines, 8 in a page. Mode of writing, good and correct. Fair.

Presented in the year 1917–18 by Śrī Rāja Vāsireḍḍi Chandramaḷu Iśvaraprasāda Bahadur, Zamindar of Mutyāla, Kistna district.

పరమశివస్తవరాజము.

PARAMAŚIVASTAVARĀJAMU.

A hymn of 114 stanzas of different metres and in praise of God Śiva as the supreme deity.

Complete.

**Beginning:**

శా. శ్రీకంఠున్ గిరిజామనోహరు మునిశ్రేణీసమారాధ్యు వి
శ్వాకారున్ ఫణిభూషణున్ నిఖిలభూతావాసు గంగాధరున్
నాకాధీశముఖామరార్చితు జగన్నాథున్ దయాసాగరున్
శ్రీకాంతాప్రియుఁ జంద్రశేఖరుఁ బరున్ సేవింతు నెల్లప్పుడున్

శా. దేవారాధ్యుల నీశ్వరేశ్వరుల మధ్యేమానసాసీనులన్
భావాతీతమహాప్రభావుల మునీంద్రధ్యేయులన్ భక్తిమ
త్సేవాప్రీతుల వాగగమ్య విలసద్దివ్యాంగ సౌందర్యులన్
దేవత్రాణుల సంస్తుతింతు గిరిజాదేవీ మహాదేవులన్.

**End:**

క. పరమశివస్తవ రాజము
పరమ శివప్రియముగాఁగఁ బఠియించినయా
పరమ శివపాదభక్తులు
పరమశివైక్యప్రసిద్ధిఁ బడయుదురు తుదిన్

క. పరమ శివస్తవరాజము
తిరముగనాచంద్రవసుమతీతారాది
కరరివరసాగరకులగిరి
తరణికమై వెలయుఁగాత ధరణితలమునన్.

(వి-వి.)—

సమగ్రము. 108 పద్యములు. వ్రాఁత తిన్ననిది. తప్పులు లేవు. శైథిల్య మించుక కలదు.

శివపారమ్యప్రతిపాదకమగు నీస్తోత్రగ్రంథమునకుఁ గర్త యెవ్వరో!

---

## R. No 355.

Palm-leaf. 17 × 1¼ inches. Foll. 122. Lines, 5 or 6 in a page. Mode of writing, good and apparently correct. Good.

Presented in the year 1917–18 by M.R.Ry. Vaḍlamannāṭi Vēṅkata-rāmayya Gāru, Masulipatam, Kistna district.

భారతము.

**BHĀRATAMU.**

వ. అట్లు వివాహంబై సాధ్వీమణియగు నమ్మలాంబయం దష్ట మూర్తి సమానంబగు కుమారాష్టకంబుఁ బడసెఁ దత్కుమారాష్టక వంశంబు వెల్గుచు విస్తరిల్లి మల్లమపల్ల్యగ్రహారంబునం బూర్వంబు వసియించుటంజేసి గ్రామనామంబు మల్లమపల్లి వారనం బ్రసిద్ధిగాంచె నందగ్రజుండు వీరారాధ్య వంశంబున.

క. గౌరారాధ్యుఁడు మహిమో
దారుం డుదయించె నతని తనయుండయ్యెన్
శ్రీరామదేశికుఁడు జగ
దారాధ్యుం డతని సూనుఁడై భాసిల్లెన్.

క. నయవిజ్జగదారాధ్యత
నయుఁడై పెంపొందె వీరన యతఁడు మృత్యుం
జయగురుని వీరబసవ
న్నయను సుతున్ భోగలింగనాముం గనియెన్.

క. ఆముగ్గురిలో నగ్రజుఁ
డౌ మృత్యుంజయుఁడు సంతతావిత శిష్యా
డామోదితబంధుఁడు భ
ర్గామల తత్త్వజ్ఞుఁడగుచు నచలం బ్రబలెన్.

గీ. ఆసుగుణరాశి కనుజన్ముఁడైనయట్టి
వీరబసవాహ్వయుండంతరారివిజయు
డాగమజ్ఞుండు రాజయోగావధాని
యగుచువన్నియగాంచె ననంతయందు.

సీ. ఆయన యనుజన్ముఁడగు భోగలింగాఖ్యుఁ.

* * * *

గీ. అతనియన్న మృత్యుంజయుం డతులకీర్తి
నమరు వీరాఖ్యుఁ బార్వతీశాఖ్యలింగ
నామకోమామహేశ్వరనామబసవ
నామసుత పంచకముఁ గాంచి భూమిలోన.

సీ. వారిలోఁ బెద్దయై వరలు వీరారాధ్యుఁ
డసముల శరభన్నయ్యగురుస
మాఖ్యునాగాఖ్యు బుచ్చన్నను శ్రీవీర
నాముఁ బేరయలింగనామధేయు

శ్రీ శైలపతిఁగనిసిరులొందె నయ్యాత్మ
జులలోన నైదవ సూనుఁ డైన
వీరదేశికుఁడు సాధ్వీరత్నమగునట్టి
నందమ్మ యను పత్నియందు వేడ్క.

దుష్టజనభూధరపవిని దురితతిమిర
రవిని శివభక్తి జితపునర్భవినిఁ జిత్త
భవన నందతగ తవాతసవిని బుచ్చి
కవిని నసుఁగని సౌఖ్యంబుగనియె భువిని.

**End :**

మణివిభూషణము.

సానుమత్కనకనిర్మిత చారునికేతనా
ఘనిభాస్య వృషఖేంద్రసమంచిత కేతనా
దాని రాక్షసదురంతమదప్ర ?
దానవాహితముఖాఖిలదైవతశాసకా.

**Colophon :**

ఇది శ్రీమదత్తలూరి పాపయామాత్యాయ ప్రసాదలబ్ధ కవితావై భవవీరారాధ్య తనూభవ శ్రీపేరయ లింగగురుదత్త శివలింగధర బుచ్చికవి ప్రణీతంబైన హాలాస్య మాహాత్మ్యంబునందు సర్వంబు షష్ఠాశ్వాసము.

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పులంతగా లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

మధురాఖండ మనునామాంతరముగల హాలాస్యమాహాత్మ్య మను సంస్కృతగ్రంథమున కిది తెలుఁగుసేఁత. ఆఱాశ్వాసములు. ఇందు దక్షిణమధురానగరమున నెలకొన్న హాలాస్యనాథుని యఱువదినాలుగు లీలలు వర్ణింపఁబడినవి. గ్రంథకర్త మల్లమపల్లి బుచ్చికవి. ఆరాధ్య బ్రాహ్మణుఁడు. వీరారాధ్యుని కుమారుఁడు. పేరయలింగమునొద్ద శైవ దీక్ష గొన్నవాఁడు. అత్తలూరి పాపయ శిష్యుఁడు. చెన్న బసవపురాణము రచియించిన యత్తలూరి పాపకవి యీతఁడే కాఁబోలును.

---

## R. No. 386.

Palm-leaf. Size, 16¾ × 1¼ inches. Foll. 233. Lines, 6 on a page. Mode of writing, good and correct. In good condition.

Purchased in the year 1917-18 from M.R.Ry. Nidadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

## విష్ణుపురాణము.

## VIṢṆUPURĀṆAMU.

A Telugu rendering in the Prabandha form of the Sanskrit Viṣṇu Pūrāṇa by Kalidiṇḍi Bhāvanārāyaṇa, son of Vēṅkaṭādri and Ṣūramāmba of Sālaṅkāyana Gōtra and Āpastambasūtra. The author was the disciple of Kandāḷa Śrīraṅgācārya. He had written previously Puruṣōttamakhaṇḍa and it is to God Puruṣōttama worshipped at Pūri that the work under notice was dedicated. Rāmakṛṣṇabhaṭṭu, a Gōsāyin of Pūri is praised herein by the author.

Contains the first four Āśvāsas.

**Beginning:**

శా. శ్రీనీలాచలశృంగభాగమున సంశ్లిష్యత్సుభద్రాలతా
వ్యానద్ధత్వ మెలర్ప నాశ్రితమనోవాంఛావిధానావధా
నానూనంబగుపూరుషోత్తమసుపర్వానోకహస్వామి మా
కానందప్రదకామితార్థఫలవర్గావాప్తిఁ గావించుతన్.

*     *     *     *

సీ. గీ. గాఁగవాధూల గోత్రసాగరశశాంక
భావనాచార్య తనయుఁడై ప్రబలునపర
హరిని గందాళ శ్రీరంగగురుని మద్గు
రుని భజింతు నభీష్టార్థరూఢికొఱకు.

*     *     *     *

సీ. సమధికస్ఫూర్తిఁ గృష్ణాగౌతమీమధ్య
దేశంబునకు భవ్యతిలకమగుచుఁ
బొగడొందు కలిదిండి పురమునకధిపతి
సుగుణుఁ డాపస్తంబసూత్రుఁ డఘకుఁ
డసమసాలంకాయన సగోత్రుఁ డుడవిరా
చయమంత్రి వెలయు నయ్యలఘుమతికి
తనయుండు మంత్రిరా జనఘుఁ డాతఁడు గాంచె
విమలచారిత్రుని వేంకటాద్రి
నమ్మహాత్మునకును సూరమాంబికకును
నందనుఁడఁ బూరుషోత్తమనాథపాద
వందనానంద మహిత జీవాతుజీవ
నాథ్యుఁడను భావనారాయణాభిధుఁడను.

*     *     *     *

గీ. ఘనత శ్రీపురుషోత్తమ ఖండమాంధ్ర
నవ్యపదబంధములఁ బ్రబంధంబు చేసి
యొన్నఁగల దైవమైయున్న వెన్నముద్ద
ముద్దుకృష్ణునకంకితంబుగ నొనర్చి.

వ. మఱియు నొకపురాణంబు తెనుంగు చేసి శ్రీజగన్నాథునకు సమర్పింపవలయునని తలంచి.

*　　　*　　　*　　　*

మ. దినముల్ శ్రీపురుషోత్తమాధిపతికిన్ దేదీప్యమానప్రసూ
ననవోద్యన్నవమాలికాఫలవిమానంబుల్ సమగ్రంబులై
తనరన్ దోఁటలు క్షేత్రరాజమునఁ జెంతన్నిల్పియవ్వద్మలో
చనుఁ డేతానగు రామకృష్ణ భటు గోసాయిన్ బ్రశంసించెదన్.

క. కృతి శ్రీ విష్ణుపురాణము
కృతికి నధీశ్వరుఁడు నీలగిరిపతి కవితా
మతిదాత్రి శ్రీసుభద్రా
సతి యహహా! మదీయభవము సఫలము గాదే!

**End:**

వనమయూరము. భాసురమణీవిసరబద్ధమహితోద్య
ద్భిత్తిసహిత సౌధఘనశృంగనిహితార్య
ద్వాసిరుచిదీపితనభః కకుబిలాంతా
వాసరుచిరానన సుధాంశురుచికాంతా.

**Colophon:**

ఇది శ్రీసుభద్రాకరుణాకటాక్షవీక్షాలబ్ధకవిత్వతత్త్వపవిత్ర వేంకటామాత్యపుత్ర కందాళశ్రీరంగాచార్యకృపాపాత్ర సజ్జనమిత్ర శ్రీహరిగురుచరణారవిందవందనపరాయణ కలిదిండిభావనారాయణ ప్రణీతంబయిన శ్రీ విష్ణుపురాణంబునందు మనువంశావతారంబున . . . . . పృథవీగీతలు ననుకథలంగల చతుర్థాంశంబునందుఁ జతురాశ్వాసము.
గ్రంథాంతమందిట్లున్నది :—

"ప్లవనామసంవత్సర నిజఫాల్గున శు ౩ సోమవారం రోజు సరికి . . . . కందాళం అప్పడు వ్రాసి విన్నకోట జగ్గన్నకు అత్యంత స్నేహపూర్వకంగా యిచ్చెను."

అసమగ్రము (నాలుగంశములు-నాల్గాశ్వాసములు) వ్రాఁతతిన్ననిది. తప్పులు లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

సంస్కృత విష్ణుపురాణమున కిది తెలిఁగింపు. కలిదిండి భావనారాయణకవి దీనికి గర్త. వేంకటాద్రికిని సూరమాంబకును గుమారుఁడు. ఆపస్తంబ సూత్రుడు. సాలంకాయన సగోత్రుఁడు. కందాళ శ్రీరంగాచార్యుల శిష్యుఁడు. తెనాలి యన్నయ తన సుదక్షిణాపరిణయమునఁ గూడనీ శ్రీరంగాచార్యుల నుతించినాఁడు. ఇంతకుఁ బూర్వ మీకవి పురుషోత్తమఖండమును దెలిఁగించినాఁడు. ఈ గ్రంథమును గూడ నా పురుషోత్తమ క్షేత్రమున నెలకొన్న జగన్నాథస్వామి కే సమర్పించినాఁడు. ఇందు జగన్నాథ క్షేత్రమున నున్న రామకృష్ణభటు గోసాయియను భక్తుని ప్రశంసకలదు.

---

R. No. **387**.

Palm-leaf. 13 × 1⅛ inches. Foll. 127. Lines, 5 on a page. Mode of writing, fair and correct. Much injured. Some leaves in the beginning and some in the end are broken.

Purchased in the year 1917–18 from M.R.Ry. Niḍadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

శంకరవిజయము.

ŚAṄKARAVIJAYAMU.

This Prabandha was rendered into Telugu from the Sanskrit work of this name written by Ānandagiri. The author is Rāpāka Lakṣmīpati, son of Liṅganārya of Parāśaragōtra.

Complete.

**Beginning :**

క. అదిగావున సుదతీమణి
మదనాహతఘూర్ణమానమానస యగుచుఁ
హృదయేశు నూర్ధ్వతాపను
ముదమునఁ దగజేరఁ బోయిముందఱనిలిచె

గీ. దానిభావంబుగని యూర్ధ్వతాపనుండు
దా. బతివ్రతయయ్యునేతద్విధంబు
పూనె నిది దృఢనిశ్చయజ్ఞానమాన
యని మనంబున రోసి యిట్లనియె నపుడు.

గీ. నియమవిఘ్నంబు సమకూడె నీకతనను
నీరజానన ఘనశాపనియతిఁ బూని

మనుజయోనిఁ జనింపు మీవని శపించి
యూర్ధ్వతాపసుఁ డరుగ నయ్యూర్విద యవుడు.

**Colophon:**

శ్రీమద్రామచంద్రసాంద్రకరుణాకటాక్షవీక్షణప్రసాదప్రాప్త కవితా విలాస భాసురపరాశరగోత్ర పాత్రలింగనార్య పుత్త్ర లక్ష్మణార్యప్రణీతం బైన శ్రీ మచ్ఛంకరాచార్య (చరిత్రం) బనుమహాప్రబంధంబునందుఁ ద్వితీయాశ్వాసము.

**End:**

సీ. శంకరాచార్యులు సకలశిష్యులు గొల్వఁ
బవమాన దిశను వైభవసమేత
పవముమల్లాభిఖ్య పట్టణంబును జేరఁ
జని యేకవింశతిదినము లచట
వసియించి తద్విప్రవరులఁ గన్గొని భవ
దాచారవిధి యేమియనిన విప్రు
లందఱు నమ్రులై యాచార్య మద్వంశ
జాతమానేత . . . . త్త
గీ. వినుము మల్లారి పరమేశ్వరునిచరిత్ర
దేవతారాధ్యుఁ డతఁడు మూర్తీభవించి
భువన జననావనక్షయంబుల . . . చు
వెలయునప్ప . . . . త్తమెపుడు.

అతిశిథిలము. సమగ్రమయినను, ఆదిని బదియు, నంతమున నిర్వదియుఁ బత్రములు తునాతునకలయి పోయినవి. గ్రంథపాతములు మిక్కిలి. వ్రాఁతతిన్ననిది. తప్పులు లేవు.

ఆనందగిరికృత శంకరవిజయమునుబట్టి రాపాక లక్ష్మీపతికవి తెలుఁగున నీనాల్గాశ్వాసముల ప్రబంధమును రచియించినాఁడు. ఈతఁడు లింగనార్యుని పుత్త్రుఁడు. పరాశరగోత్రుఁడు. అతిశిథిలమయియున్న యీ ప్రతినుండి యింతకన్న నెక్కువ యెఱుఁగరాదయ్యె.

---

**R. No. 388.**

Palm-leaf. Size, 17½ × 1⅜ inches. Foll. 311. Lines, 7 on a page. Mode of writing, fair and fairly correct. In a fairly good condition.

Presented in the year 1917–18 by M.R.Ry. Vaḍlamannāṭi Vēṅkaṭa rāmayya Gāru of Masulipatam, Kistna district.

భాగవతము.

BHĀGAVATAMU.

By Pōtana. Same work as the one described under No. 36 of the Descriptive Catalogue of Telugu MSS., Vol. I.

Contains the Skandhas VIII and X complete and VII in complete.

(వి-వి.)—

దశమాష్టమస్కంధములు సమగ్రముగను సప్తమస్కంధ మసమగ్రముగను గలవు. వ్రాఁత యొకతీరుగా నున్నది. తప్పులంతగా లేవు. శైథిల్య గ్రంథపాతములు లేవు. ఇది డి. క్యా. నె 36 రున వర్ణింపఁబడిన గ్రంథమే.

---

R. No. **389**.

Palm-leaf. 16¾ × 1⅜ inches. Foll. 148. Lines, 8 on a page. Mode of writing, good but not quite correct. In a bad condition. All leaves are worm-eaten; many leaves in the beginning and in the end are broken and torn.

Purchased in the year 1917–18 from M.R.Ry. Mallampalli Subrahmaṇyam Gāru, Ellore, Kistna district.

చెన్నబసవపురాణము.

CENNABASAVAPURĀṆAMU.

By Attalūri Pāpakavi. The work is not described here as the MS. is in a much injured condition.

(వి-వి.)—

అతిశిథిలము. వ్రాఁతమంచిది. గ్రంథపాతములు పెక్కులు.

ఇది యత్తలూరి పాపకవి రచియించిన చెన్న బసవపురాణము. ఆద్యంతభాగము లతిశిథిలములగుటచే యీ గ్రంథమును గూర్చి యిక్కడ వివరింపరాదయ్యె.

---

R. No. **390**.

Palm-leaf. 17 × 1¼ inches. Foll. 264. Lines, 5 or 6 on a page. Mode of writing, fair but not quite correct. In good condition.

Presented in the year 1917–18 by M.R.Ry. Vaḍlamannāṭi Vēṅkaṭarāmayya Gāru, Masulipatam, Kistna district.

భారతము.

BHĀRATAMU.

This is the same work as the one described under No. 163 of the Descriptive Catalogue of the Telugu MSS., Vol. I. By Tikkanasōmayāji.

Contains the Karna, Śalya, Sauptika, and Strī Parvas.

(ఐ-ఐ.)——

కర్ణ, శల్య, సౌప్తిక, స్త్రీపర్వములు కలవు. వ్రాఁత యందమయినదికాదు. తప్పు లంతగా లేవు. శైథిల్యగ్రంథపాతములు లేవు.

ఇది డి. క్యా. నెం. 163 రున వర్ణింపఁబడిన గ్రంథమే.

---

## R. No. 391.

Palm-leaf. 15¼ × 1¾ inches. Foll. 261. Lines, 7 or 8 on a page. Mode of writing, good and fairly correct. In good condition.

Presented in the year 1917–18 by M.R.Ry. Vaḍlamannāṭi Vēṅkaṭarāmayya Gāru of Masulipatam, Kistna district.

భారతము.

BHĀRATAMU.

This is the same work as the one described under No. 163 of the Descriptive Catalogue of the Telugu MSS., Vol. I. By Nannayabhaṭṭāraka.

The name of the scribe and the date of transcription are given below as found at the end of the MS.

Contains the Ādi and Sabhā Parvas.

(ఐ-ఐ.)——

ఆదిసభాపర్వములు కలవు. వ్రాఁత బాగుగనున్నది. తప్పు లంతగా లేవు. శైథిల్య గ్రంథపాతములు లేవు.

ఇది డి. క్యా. నెం. 163 రున వర్ణింపఁబడిన గ్రంథమే.

కడపట.—“ పింగళనామ సం॥ మాఘ శు ౧ ఆ॥ వడ్లమన్నాటి వెంకటయ్యగారు, ఆదిపర్వ సభాపర్వాలు విస్సా వెంకటయ్యచేత వ్రాయించ్చిరి” అనియున్నది.

## R. No. 392.

Palm-leaf. 16¾ × 1½ inches. Foll. 226. Lines, 6 on a page. Mode of writing, not quite good and incorrect. In good condition.

Purchased in the year 1917–18 from M.R.Ry. Nidadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

వైద్యవిషయము.

VAIDYAVIṢAYAMU.

A treatise in medicine containing Sanskrit stanzas with Telugu meaning and other Telugu passages.

**Beginning:**

వైద్యశాస్త్రాలపేళ్లు.—

రసార్ణవం ఖాపాటంచ పారిజాతం చ కౌముదీ
నాగార్జునం చ కాపాలీ దామోదరమతం తథా
రససారం సిద్ధసారం సూతరాజంచ టంకణమ్
కళ్యాణభేషజం కల్పం సూత్రస్థానంచ సంగ్రహామ్
కపాలి బిందునాదంచ గుణచింతామణిం తథా(?)
శారీరం వీరభద్రంచ వైద్యదీపకమేవచ
సోమనాథంమహాశాస్త్రం నందినాథం తథైవచ
భీమనాథం వైద్యనాథం ధన్వంత్రి చ మదాశ్వికా (?)

చాతుర్థికజ్వరానకు తర్పణంచేసేమంత్రం.—

యోఽసౌసరస్వతీతీరే అపుత్రో బ్రాహ్మణోహతః
చాతుర్థిక వినాశాయ ఇదమస్తుతిలోదకమ్.

శొంఠిశుద్ధి.—

శుంఠీని స్థ్వకర్పతంచాథ శిలాచూరం విలేపయేత్
నిత్తీపేదాత పాయాంచ సమ్యక్శుద్ధిర్భవేద్ధ్రువమ్.

శొంఠిమీద పొరగీసి రాసున్నంపూసి యెండబెట్టను శుద్ధియగును.

**End:**

చెవులో కురుపుకు.—

చెవులో కుర్పు అయినా పూరికెచేశినా (?) చెవులో నీళ్లుబడ్డ నొప్పి అయినా అందుకు మందు. ములుగోరంట ఆకుతెచ్చి నల్చి ము మ్మాటు చెవులో పోస్తే మట్టుపడును.

(వి-వి.)—

గ్రంథ మెంతకలదో తెలియదు. వ్రాఁత యంత మంచిదికాదు. శైథిల్యము లేదు.

ఇం దనేక వైద్యగ్రంథములనుండి వివిధ విధౌషధములు, వానిఁ జేయు రీతులు, ఓషధులు, వానిగుణములు, రోగలక్షణములు, తత్తద్రోగనివారకౌషధములు మున్నగునవి చెప్పబడినవి సంస్కృతశ్లోకములు. వానికిఁ దెలుఁగు టీక, కొన్ని విడిమాటలును గలవు. కూర్పరి యెవ్వరో ?

---

## R. No. 393.

Palm-leaf. 17⅜ × 1¼ inches. Foll. 175. Lines, 6 on a page. Mode of writing, good but not quite correct. Injured.

Purchased in the year 1917–18 from M.R.Ry. Nidadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

(*a*) వీరభద్రవిజయము.

**VĪRABHADRAVIJAYAMU.**

Foll. 1*a*—90*a*. Fol. 90*b* is left blank.

This is the same work as the one described under R. No. 282 (*a*) *ante*. By Bammera Pōtana.

The name of the scribe and the date of transcription are given below as found at the end of the MS.

Complete.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁతమంచిది. తప్పు లంతగా లేవు. శైథిల్యమట్టె లేదు. గ్రంథపాతములు లేవు.

ఈ గ్రంథమును గూర్చి వై. వి. క్యా. ఆర్. నెం 282 (*a*) లో చూచునది. ఈ ప్రతియందు, "భాగవత ప్రబంధమతిభాసురతన్ రచియించి దక్ష—" ఇత్యాది పద్యము లేదు.

గ్రంథాంతమునఁ బ్రతివిలేఖకుఁ డిట్లు వ్రాసికొన్నాఁడు. "విశ్వావసు సంవత్సర మార్గశిర శు ౧ ఆదివారం రోజు జాముప్రొద్దుసరికి విస్సులు శివన్నగారి వీరభద్రవిజయం ప్రతిలోవున్న క్రమంగాను, బంకా వియ్యన్న శ్రీరామార్పణంగా వ్రాసెను.

(b) భల్లాణచరిత్రము.

BHALLĀṆACARITRAMU.

Foll. 91a—153b.

A Prabandha describing how Bhallāṇa, a royal saint of the Sindhukaṭaka country, maintained his vow of liberality even by a gift of his wife to one who afterwards turned out to be no other than God Śiva in disguise. The author is Mallavarapu Vālēśvara, son of Virūpākṣa of Gautamagōtra, and disciple of Ivvaṭūri Rāmanārādhya. The author resided at Mallavaram in the Vinnakōṭa country.

Complete in five Āśvāsas.

**Beginning:**

మ. శ్రీమదుమామహేశ్వరుల సిద్ధచరిత్రులనీలపాండురో
ద్దామతనుప్రకాశులను ధన్యులసత్కరుణార్ద్రచిత్తులన్
సోమకళావతంసుల విశుద్ధకులీనులసార్వకాలిక
క్షేములనాదిదంపతులఁ గీర్తనచేసెద నిష్టసిద్ధికిన్.

* * * *

సీ. అనఁ బాడఁ జదువఁ జెప్పను నేర్చు సర్వజ్ఞ
భోజుండు మాతాతపోతురాజు
బహుపురాణజ్ఞుండు బాంధవాశ్రితకల్ప
భూజంబు మాతండ్రిపోలుమంత్రి
పరమశాంతుఁడు కృపాపాథోధిమాపిన
తండ్రి విరూపాక్ష దండనాథుఁ
డఖిలవిద్యానిధి యర్థార్థితతిఁ బ్రోచు
దాత మత్సుతుఁడు సదాశివుండు
ఏ వితరణాంపవరకవితావిశేష
వరదుఁడను బాకనాటింటివాఁడ శుద్ధ
శైవుఁడను గౌతమసగోత్రసంభవుండ
నెంచఁదగుమల్లవరపువాలేశ్వరుఁడను.

**End:**

క. ఈకథ యెవ్వరుచదివినఁ
గైకొన్నను విన్నఁ గోరికనువ్రాసినవా

రేకాలముశంభునికృప
నాకల్పముగందురీప్సితార్థములు మహిన్.

* * * *

తోటకము.—అంబరకేశదిగంబరరూపా
శంబరవైరివిశంకటకోపా
త్ర్యంబకశంకరహైమవతీశా
యంబుధితూణసదాద్రినివేశా!

**Colophon:**

ఇది శ్రీమదివ్వటూరి రామనారాధ్యగురుచరణసరసీరుహషట్పదాయమాన సరసకవితాచాతుర్య విద్యాసంధాన పరమమాహేశ్వరవత్స మల్లవరపురాధ్యక్ష గౌతమసగోత్రపవిత్ర పోలయామాత్యపుత్త్ర సంతతానంద విధేయ వాలేశ్వరనామధేయ ప్రణీతంబైన భల్లాణచరిత్రం బను మహాప్రబంధంబునందుఁ బంచమాశ్వాసము.

గ్రంథాంతమున విలేఖకుఁ డిట్లు వ్రాసికొన్నాఁడు.—"పరాభవ నామసంవత్సర జ్యేష్ఠబహుళసప్తమీజయవారం పగలు జాముప్రొద్దు సరికి . . పురుజాంకోనేటి కాశీపతికుమారుడు వీరయ్య సాంబ శివార్పితంగాను వ్రాసుకొనెను."

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పులు లేవు. శైథిల్యము గ్రంథపాతములు కలవు.

సింధుకటకాధీశ్వరుఁడగు భల్లాణుఁ డను రాజు కథ యిందు వర్ణితము. వీరశైవారాధకుఁడగు నా రాజు జంగము లడిగిన దెల్ల నిచ్చువాఁడై యొకనాఁడు శివుఁడే జంగమవేషమునవచ్చి పతివ్రతయగు స్త్రీని గోరఁగాఁ దనభార్యనే యొసఁగెనట! ఆ శైవవ్రతదీక్షకు మెచ్చి శివుఁడు నిజరూపమునఁ బ్రత్యక్షమై యాదంపతులకు మోక్ష మొసఁగెను:—ఈ కథను మల్లవరపు వాలేశ్వరుఁడను కవి యైదాశ్వాసముల ప్రబంధముగాఁ గూర్చినాఁడు. ఈతఁడు విన్నకోటసీమలోని మల్లవరమునందున్నవాఁడు. గౌతమగోత్రుఁడు. విరూపాక్షుని కుమారుఁడు. ఇవ్వటూరి రామనారాధ్యుని శిష్యుఁడు.

(c) వీరశైవదీక్షాబోధ.

VĪRAŚAIVADĪKṢĀBŌDHA.

Foll. 154a--167b.

This deals with the rules prescribed for the followers of Vīraśaiva religion. It is apparently the translation of a Sanskrit work.

Complete.

Foll. 168a—175b. Contains a fragmentary portion of the Nītiśataka. of Bhartṛhari's Subhāṣita, translated by Ēnugu Lakṣmaṇakavi.

**Beginning :**

యథామృగపతిందృష్ట్వా తథాభీతోవనేమృగః,
అదీక్షితార్చయోర్లింగం తథాభీతోమహేశ్వరః.

సింహమును జూచి యేనుగ భీతిచెందినట్లూబలెనే, లింగమూర్తి అదీక్షితుండై తన్నుపూజించవచ్చిన వానినిజూచి భీతుండై వానికి వెరచును.

**End :**

. . . ప్రణవం, ద్వయం, దేహత్రయం హృదిస్త్రోత్రం, త్వక్, నేత్రం, జిహ్వ, ఘ్రాణం, ఈ ఆరు అంగాలు, ఈ ఆరు అంగాలలో ఒక్కొకటి . . గురులింగప్రసాదమే కోరుతూవున్నాము.

సమగ్రము. వ్రాంత తిన్ననిది. శైథిల్యము కలదు. గ్రంథపాతములు గలవు.

వీరశైవదీక్షాబోధ మను శైవాచారవిధులను దెలుపు సంస్కృతగ్రంథమునకుం దెలుంగు తాత్పర్యము.

గ్రంథాంతమునం బదియాకులలో ఏనుంగు లక్ష్మణకవి రచించిన భర్తృహరిసుభాషిత పద్యములు కొన్నిగలవు.

---

R. No. 394.

Palm-leaf. 15¼ × 1⅛ inches. Foll. 11. Lines, 5 on a page. Mode of writing, good and correct. The last leafs broken.

Purchased in the year 1917-18 from M.R.Ry. Niḍadavōlu Sundaram Pantulu Garu of Vizagapatam.

మగటపల్లి కామయశతకము.

## MAGAṬAPALLI KĀMAYAŚATAKAMU

A centum of stanzas in the Kanda metre eulogizing one Magaṭapalli Kāmayya (a Kōmaṭi) son of Veṅkanna. The author of the work is not known.

Contains 12 stanzas.

**Beginning :**

క. శ్రీమద్గిరీంద్రకన్యా
కోమలకుచలిప్తగంధ గురువక్షుండౌ
సోముండు నీకిచ్చు సదా
కామితములు మగటపల్లి కామయచంద్రా!

క. సిరియురమునఁ భూనీలలు
పరిసరములఁ గొలువ జిలువపాన్పున జలధి
న్మెఱయురమాధీశుఁడు నిను
కరుణించును మగటపల్లి కామయచంద్రా!

**End :**

క. శ్రీరామలింగమూర్తికృ
పారసమునఁ బాలుపొంగుభంగిని బువ్వుల్
చేరెత్తినట్లువర్ధిలు
గారవమున మగటపల్లి కామయచంద్రా!

క. చెరువు గుడి తోఁట బావియు
ధరఁబుట్టినశించు స్థిరత దాల్చును దిరమై
పరగుఁగదా పద్యము హీగు
కరుణివలెఁ మగటపల్లి కామయచంద్రా!

(వి-వి.)—

౧౨ పద్యములున్నవి. వ్రాఁత తిన్ననిది. తప్పులు లేవు. కడపట నొకపత్రమున కొంత తునిగిపోయినది. అక్కడ గ్రంథపాతమున్నది.

మగటపల్లి వెంకన్నపుత్త్రుఁడగు కామయ్య (కోమటి ?) పై నీతిప్రధానముగా నిట్లు శతకమును రచియించిన వారెవ్వరో తెలియరాదు.

## R. No. 395.

Palm-leaf. 15½ × 1¼ inches. Foll. 22. Lines, 6 on a page. Mode of writing, good and correct. In good condition.

Purchased in the year 1917-18 from M.R.Ry. Nidadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

హయలక్షణవిలాసము.

HAYALAKṢAṆAVILĀSAMU.

Same work as the one described under R. No. 105 (*a*) *ante*; but there is considerable addition in matter and also much difference, and the whole is differently arranged under Adhikāras and not as Āśvāsas. The author is Manumanci Bhaṭṭāraka.

Contains the Adhikāras 1 to 3 complete, but without the introduction. The date of transcription and the name of the scribe are given below as found in the MS.

**Beginning:**

క. శ్రీజన్మసరససరాజ
ద్రాజీవసమాననయవిరాజీవునకున్
రాజకులదుగ్ధవారిధి
రాజునకుఁ గుమారకంపరాజునకెలమిన్.

వ. అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా చెప్పంబూనిన హయలక్షణ విలాసం బనుకృతిప్రకారం బెట్టిదనిన, నశ్వప్రశంసయు నావర్తలక్షణంబును, దశక్షేత్రవిభాగంబును, వయోజ్ఞానంబును, వర్ణలక్షణంబును, అశ్వలక్షణంబును, గండలక్షణంబును, పుండ్రలక్షణంబును, నిధానలక్షణంబును, జికిత్సయును, లవణవిధియును, నుదకవిధియును, ఘాసఘ్రాణప్రకారంబులు క్రమంబునం జెప్పఁదు నందుల నశ్వప్రశంస యెట్టిదనిన.

ఉ. అంబుధివేష్టితావనియు నాజిజయంబు మహోయశఃప్రతా
పంబులు నిత్యలక్ష్మియు నపారసుఖంబు నమందదానధ
ర్మంబులు వైభవోదయసమగ్రముదంబులుగల్గి యొప్పు
వాహంబులు చాలఁగల్గు వసుధాధిపుఁ డెప్పుడు నింద్రతుల్యుఁడై.

**End:**

మ. చెలువంబై హలశంఖచక్రకలశ శ్రీవృక్షఖండేంమఖ
ఝషలతాష్టాపదవేదికాంకుశపతాకావజ్రహారి గదా

కలితాతర్పణ తారనీల శుభదాకారంబు లై యొప్పవా
జిలలాటస్థలినున్నఁబొల్లుపతికిన్ జేకూరునిష్టార్థముల్.

* * * *

స్రగ్ధర. స్వర్ధేన్వౌదార్యధైర్యాచలకవిరచనాస్ఫారకీర్తిక్రుపాణీ
నిర్ధూతారిప్రతాపా నిఖిలజననుతా నిత్యభాషావిశేషా
స్వర్ధాపీపుత్రచండప్రకట రిపుమహీపాల వాహిసైన్యరాజీ
(?) మూర్ధానుక్తాశ్రింగిభారా ముదితకవివరా మూర్తిలక్ష్మీకుమారా!

**Colophon:**

ఇది సకలసుకవిజనవినుత సంస్తూయమాన కవితాచాతురీధురీణ నిఖిలభాషాప్రవీణ భైరవాచార్యపుత్ర మరుమంచిభట్టప్రణీతంబైనతురంగ (వాయులక్షణ) విలాసంబను కృతియందు . . . నన్నది తృతీయాధికారము.

గ్రంథాంతమున.—

"శుక్లనామసంవత్సరం పుష్య బ గురువారం రోజ్నా అశ్వశాస్త్రం వ్రాసేవు వెంకాజీ . . వ్రాయనయినది" అని యున్నది.

(వి-వి.)—

మూఁడధికారములున్నవి. వ్రాఁత యందమైనది. తప్పులు లేవు. శైథిల్య గ్రంథపాతములు లేవు.

ఇది డైౕ. క్యా. ఆర్ నె 10ప (a) రున వర్ణింపబడిన గ్రంథమే. అది యాశ్వాసములుగ విభజింపఁబడినది. ఇది యధికారములుగ విభజింపఁబడినది. విషయము, పద్యములు నందున్నక్రమమున నిందు లేవు. అందుఁ గొన్నివిషయములు పద్యము లధికముగ నున్నవి. ఇందు మఱికొన్ని యధికముగ నున్నవి. ఏకకర్తృకములయ్యు నిట్లు భిన్నరూపముల నుండుటకుఁ గారణము తెలియరాకున్నయది.

---

## R. No. 396.

Palm-leaf. 12¼ × 1⅜ inches. Foll. 37. Lines, 6 on a page. Mode of writing, good and correct. In good condition.

Purchased in the year 1917-18 from M.R.Ry. Nidadavōlu Sundaram Pantulu Garu of Vizagapatam.

(*a*) శ్రీకాళహస్తీశ్వరశతకము.

ŚRĪKĀLAHASTĪŚVARAŚATAKAMU.

Foll. 1*a*—19*b*.

A centum of stanzas in praise of God Śrīkālahastīśvara worshipped in the shrine at Kālahasti. The authorship is traditionally attributed to Dhūrjaṭikavi who also wrote Śrīkāḷahastimāhātmya. Some of the stanzas contained in this MS. are not found in the printed editions of this work.

Contains 128 stanzas.

**Beginning:**

శా. శ్రీవిద్యుత్కలితాజవంజవమహాజీమూతపాతాంబుధా
రావేగంబునమన్ననోబ్జసముదీర్ణత్వంబుగోల్పోయితిన్
దేవేనీకరుణాశరత్సమయమింతేచాలుసద్భావనా
సేవన్దామరతంపరైమనియెదన్ శ్రీకాళహస్తీశ్వరా.

**End:**

మ. శ్రుతులభ్యాసముసేయనీ స్మృతులుసంశోధింపనీ శాస్త్రసం
గతికండూతముసేయనీ నిఖిలమంత్రజ్ఞానిగానీ నితాం
తతపోనిష్ఠజనింపనీ కలుగదద్వైతప్రమోదంబు వ
ర్జితసంసారియొ కానివానికిc మదిన్ శ్రీకాళహస్తీశ్వరా.

గ్రంథాంతమం దిట్లున్నది.—

"వెణురుపల్లి పార్వతీశం పుప్పుల అప్పయ్యకు యీశతకం వ్రాశి యిచ్చెను. కీలకనామ సం॥ మాఖ శు బుధవారం."

(వి-వి)—

128 పద్యములున్నవి. వ్రాంత తిన్ననిది. తప్పులు లేవు. శైథిల్యము, గ్రంథపాతములు లేవు.

కాళహస్తిమాహాత్మ్యకర్తయగు ధూర్జటికవి రచియించినట్లు చెప్పంబడుసీశతకము, శ్రీకాళహస్తీశ్వరస్తుతిరూపమై లోకనీతులతో నిండియున్నది. ఇప్పటికి ముద్రితమగువానికంటె నెక్కువగా నిందు మఱికొన్ని పద్యములు గలవు.

— —

(*b*) రామప్రభుశతకము.

RĀMAPRABHUŚATAKAMU.

Foll. 20*a*—37*b*.

This is the same work as the one described under R. N. 179 ante. Complete in 111 stanzas.

(ఏ-ఏ.)—

సంపూర్ణము. నూటపదునొకండు పద్యములు. వ్రాఁత తిన్ననిది. తప్పులు లేవు. శైథిల్య గ్రంథపాతములు లేవు.

ఇది ఆర్. న్యూ. నెం. 179 రున వర్ణింపఁబడిన గ్రంథమే. ఇదియును 'వెణుతురుపల్లి పార్వతీశం' వ్రాసినదే.

---

## R. No. 397.

Palm-leaf $12\frac{7}{8} \times 1\frac{1}{8}$ inches. Foll. 12. Lines, 5 on a page. Mode of writing, good but incorrect. In good condition.

Purchased in the year 1917–18 from M.R.Ry. Niḍadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

భద్రాచలధామశతకము.

BHADRĀCALADHĀMAŚATAKAMU.

A centum of stanzas in Kanda metre with 'ల' Prāsa eulogizing God Rāma worshipped in the shrine at Bhadrādri. The author is Prayāga Kāmēśvarakavi.

Contains 102 stanzas.

**Beginning :**

క. మొలనూలు పైఁడిగంటలు
గలుగల్లనఁ గౌశికునిమఖము గాచుటకై
విలువొంనిచనవె భద్రా
చలధామా ! రామ ! నీలజలదశ్యామా.

క. తొలుతఁ దాటకవక్షః
పలలముధరమీఁద రాల్చి పనుపవె యమరా
ణ్ణిలయముచెంతకు భద్రా
చలధామా ! రామ ! నీలజలదశ్యామా

**End ;**

క. స్థిరమతిఁ బ్రయాగకామే
శ్వరకృతలప్రాసకంద శతకము నరుఁ లె

వ్వరు సదిబిరేనివారికి
సరవిగా సిరులీర భద్రశైలవిహారా.

క. సీతాసమేతశుభగిరి
నేతా శ్రితపారిజాత నిగమనుతగుణ
వ్రాతా మీకర్పితమా
గాంత . . శతక మఖిలకవిసమ్మతమై.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత మంచిది. తప్పులున్నవి. శైథిల్యము లేదు.

“భద్రాచలధామా రామ నీలజలదశ్యామా” యను మకుటముతో “ల” ప్రాసముగా నీ శతకమును బ్రయాగ కామేశ్వరకవి రచియించెను. ఇది భద్రాద్రి రామస్తుత్యాత్మకము.

---

R. No. **398**.

**Palm-leaf.** 14 × $1\frac{5}{8}$ inches. **Foll.** 18. **Lines,** 6 or 7 on a page. **Mode of writing,** fair but incorrect. **Much injured.** Leaves are broken.

Purchased in the year 1917–18 from M.R.Ry. Niḍadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

**మురుమళ్లశతకము.**

MURUMAḶḶAŚATAKAMU.

**Foll.** 1—6b.

As the leaves of this book are much injured, a description of the work is not given here.

(వి-వి.)—

పత్రములు సగముతునిఁగిపోయినందున నిట నీగ్రంథముఁ గూర్చి యేమియుఁ దెలుపఁగాదయ్యె.

**Foll.** 7*a*—18*b* contain a number of stanzas selected from various works.

పెక్కుచాటు పద్యములు, భళిరకగివేల్పుశతకములోని కొన్నిపద్యములున్నవి.

మచ్చునకొక పద్యము 17 వ పత్రమునుండి యుదాహరింపఁబడినది.

సీ. భుజియించి శతపదంబులు ద్రొక్కుచున్నవా
నయముతో సింహాసనమున నున్న
హారగంధప్రసూనాదు లలరుచున్నఁ
జెలఁగి తాంబూలంబు జేయుచున్నఁ
గమ్మపూఁబంతి నాఘ్రాణింపుచున్నను
సుముఖుఁడై యద్దంబుఁ జూచుచున్నఁ
జతురత నడిదంబు జళిపించుచున్నను
నలవేళఁ బురవీధు లరుగుచున్న
మందహాసంబు మోమున మలయుచున్న
వేశ్యకాంతలు నిరుగడఁ జెలయుచున్న
ముద్దుఁగొమరుండు తొడలపై మూఁగియుచున్న (!)
రాజు కా వేళఁ జెప్పంగవచ్చు మనవి.

---

## R. No. 399.

Palm-leaf. 16 × 1¼ inches. Foll. 17. Lines, 6 on a page. Mode of writing, fair and fairly correct. Much injured.

Purchased in the year 1917–18 from M.R.Ry. Niḍadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

(*a*) కవిసంశయవిచ్ఛేదము.

KAVISAMŚAYAVICCHĒDAMU.

Foll. 1*b*—12*b*.

A treatise in poetics by Aḍidamu Sūrakavi who also wrote Āndhranāmaśēsa, (R. No. 4 (*b*) ante), and Rāmaliṅgēśvaraśataka (R. No. 64 ante).

Incomplete.

(వి-వి.)—

మిక్కిలి శిథిలము. గ్రంథపాతము లెక్కువ. వ్రాఁత యంత మంచిది కాదు. తప్పులు లేవు.

అడిదము సూరకవికృతమగు కవిసంశయవిచ్ఛేద మను లక్షణ గ్రంథము. ఈ ప్రతి మిక్కిలి శిథిలమగుటచే పద్యము లుదాహరింపరా లేదు.

---

(*b*) ఆంధ్రభాషారత్నాకరము.

ĀNDHRABHĀṢĀRATNĀKARAMU.

Foll. 13a—16a. Fol. 16b is left blank.

This lexicography, of which only the third Āśvāsa is given here, is Paiḍipāṭi Lakṣmaṇakavi and is similar in nature but different from the Āndhranāmasaṅgraha of the same author described under R. No. 4(a) ante The father's name given here is Amaranāmātya and not Ekā mramantri.

Contains the third Āśvasa alone

**Beginning :**

క. కడిమియనఁగ వడియనఁదగు
నాఁడికంబన వేగ ననుటకొన రోసపరినా
బుడమిని జక్కఁగననుటకుఁ
దాడకెననఁగ జెలఁగనంట తోరమగుభుజఁగా.

సీ. అడరె నలరె నణఁగు నుడుగులన్ని తెనుఁగు
బాస . . . చటుపబలియున్న (?)
నన్ని యొప్పిదంబులయ్యె నఁటకుఁ జెల్లు
వెలయు తెల్ల తేజిగలుగు రాజ !

గీ. సరవిపొసఁగుచుండెఁ జక్కఁగానుండెను
జెలఁగ వేడ్కనుండె వెలయుచుండె
ననుచు నిట్లు పెక్కులై చాలఁదగుపలుకు-
లన్ని యొప్పుచుండె ననుటకొప్పు.

**End :**

క. కెన్నాఁగను జెన్నాఁగను
వన్నెఁగఁ గట్టెలపు పేరుకొలున్నాఁ బొన్నా
నెన్నఁగ బంగరు పేరగుఁ
జెన్నఁగ మలమూలితోటి చెలఁగెడుమేటీ !

**Colophon :**

ఇది శ్రీమదుమామహేశ్వరవరప్రసాదలబ్ధకవిత్వవైభవ అమరనామాత్యపుత్త్రపైఁడిపాటి లక్ష్మణకవిప్రణీతంబైన యాంధ్రభాషారత్నాకరంబునందుఁ దృతీయాశ్వాసము.

(వి.వి.)—

మూఁడవయాశ్వాసము మాత్రమున్నది. వ్రాఁత చిక్కగానున్నది. శైథిల్యము కలదు. గ్రంథపాతము లున్నవి.

ఇది పైఁడిపాటి లక్ష్మణకవి రచియించిన యాంధ్రభాషారత్నాకర మందలి తృతీయాశ్వాస మని యీగ్రంథగద్యము తెలుపుచున్నది. పైఁడిపాటి లక్ష్మణకవిరచన మాంధ్రనామసంగ్రహ మను నిఘంటువు సుప్రసిద్ధమగునది. దానికి దీనికి సంబంధమున్నట్టుతోఁపదు. ఆంధ్రనామసంగ్రహమున లక్ష్మణకవి యేకామ్రమంత్రి కుమారుఁ డని యున్నది. ఇందు అమరన కుమారుఁ డని యున్నది. రెండు గ్రంథములందును గర్తపేరు పైఁడిపాటి లక్ష్మణకవియే యని కలదు ఇందుఁగొన్ని యచ్చతెనుఁగుఁ పదముల కర్థము తెలుపఁబడినది. ఈ గ్రంథము నాంధ్రనామసంగ్రహమును బోలినదే.

---

## R. No. 400.

Palm-leaf. 14⅜ × 1½ inches. Foll. 18. Lines, 4 on a page. Mode of writing, bad and incorrect. In fair condition.

Purchased in the year 1917–18 from M.R.Ry. Nidadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

హరిశ్చంద్రకథ.

HARIŚCANDRAKATHA.

A poem describing the story of Hariscandra. The author's name is not known.

Incomplete.

**Beginning:**

క. శ్రీజానకీమనోహర
పూజితభక్తానుమోద పురుషోత్తమ ది
గ్రాజనుతపదసరోజా
రాజితతేజోవిశాల రామనృపాలా.

వ. అవధరింపుము గాధేయుండు ప్రతినగావించి హరిశ్చంద్రుని సత్యంబుదప్పించెనని, తద్రాజ్యధనధాన్యాగారసహితంబుగాఁగొనియత నింగానకుందోలెనని కుంభసంభవుం డానతిచ్చిన విని రఘునాథుం డేమనుచున్నాఁడు—

గీ. ఓమునీశచంద్ర తామరసాప్తవం
శాధినాథుఁ డైనయానృపాలు
నాత్మునెట్లుచేసె నాహరిశ్చంద్రుండు
సత్యమెట్లు నిలుపఁజాలెఁ జెపుమ.

**End:**

సీ. విరజాజు లేవేళఁ దురిమెదు వేనలి
ముడివిప్పి జడలుగా మురియఁజేసి
గురుతరలలితదుకూలముల్ దొలఁగించి
కాఠిన్యవల్కాంశుకములు గట్టి
మణిమయమకుటభూషణములు దొలఁగించి
యక్షమాలికలు నెయ్యమునఁ దాల్చి
శ్రీచందనము వగ చిల్కదుమేన ఘ
రాపరాగముదాల్చి యేపుమిగిలి
రాజయోగిరీతి రాజవర్యుం డేఁగ
సతియుసుతుఁడు నట్లు చనిరి తోడఁ
జూచి పౌరులెల్ల శోకార్తులై యిట్టి
కారణంబు చేసెఁగా విధాత.

*    *    *    *

క. సర్వంబొసఁగితి వపుడో
యుర్వీశ్వర యాగధనము నొగి మాకిడకీ
గర్వమున నూరకుంటివి
గర్వాలు . . . . .

(వి.వి.)—

అసమగ్రము. వ్రాఁత మంచిదిగాను. తప్పులున్నవి. శైథిల్యము లేదు.

హారిశ్చంద్రకథ. పద్య ప్రబంధము. రచియించినవారెవ్వరో ?

---

## R. No. 401.

Palm-leaf. 13½ × 1½ inches. Foll. 9. Lines. 6 on a page. Mode of writing, good and correct. Much injured.

Purchased in the year 1917–18 from M.R.Ry. Niḍadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

రామశతకము.

RĀMAŚATAKAMU

A centum of stanzas in Kanda metre composed in praise of Rāma, by Sārepāka Vēṅkaṭakavi

Complete in 101 stanzas.

**Beginning :**

క. శ్రీమన్నామ పయోద
శ్యామ మహీపుత్రికాహృదంబుజతేజో
ధామ కృతభక్తలోక
క్షేమ ధరాధిపలలామ సీతారామా.

క. భూవిబుధుఁడ నభివందిత
కోవిదుఁడను సారెపాకకులసంభవుఁడఁ
శ్రీవేంకటాఖ్యుఁడను . . .
. . . . నిన్ను వినుతిచేసెద రామా.

**End :**

క. ఈశతకము నతిభక్తిఁ
వ్రాసినఁ జదివినను వినినవారికిఁ గోర్కుల్
వేసమకూలును . . . .
వాసుఁడ వగునీదు సత్కృపను రఘురామా.

(వి.వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పులు లేవు. శైథిల్యము గ్రంథపాతములు గలవు.

సారెపాక వేంకటాఖ్యుఁడు శ్రీరామస్తుత్యాత్మకమయిన యీ కందపద్యశతకమును రచియించినాఁడు.

---

## R. No. 402.

Palm leaf. 16½ × 1½ inches. Foll 16. Lines, 5 on a page. Mode of writing, good but containing mistakes. In fair condition.

Purchased in the year 1917–18 from M.R.Ry. Niḍadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

కాళహస్తిసాంబశివశతకము.

KĀḶAHASTISĀMBAŚIVAŚATAKAMU.

This is the same work as the one described under R. No. 242 (*b*) ante. By Bāṇāla Vīraśarbhēndra.

Contains 103 stanzas.

103 పద్యములున్నవి. వ్రాఁత తిన్ననిది. తప్పు లున్నవి. శైథిల్యము, గ్రంథపాతములు లేవు.

ఇది ఆర్. నెం 242 (b) ని-వర్ణింపఁబడినదే.

---

R. No. **403.**

Palm-leaf. 13¾ × 1½ inches. Foll. 14. Lines, 7 on a page. Mode of writing, fair but incorrect. In fairly good condition.

Purchased in the year 1917–18 from M.R.Ry. Nidadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

వరాహ నరసింహశతకము.

VARĀHA NARASIṀHAŚATAKAMU.

A centum of stanzas in the Sīsa metre addressed in praise of God Varāha Nṛsiṁhasvāmi worshipped at Simhācalam. The author's name is not known.

Contains 101 stanzas.

**Beginning:**

సీ. శ్రీలక్ష్మీవల్లభు చిత్తంబు రంజిల్ల
నతనితోఁ దగుమాట లాడరమ్మ
కాయంబు లోకరూపై కలసియుండెడివేళ
నలుక లేమిటికని యడుగరమ్మ
ఓర్వఁజాలని యట్టియువిద లేమన్నను
జెవిఁ బెట్టవల దని చెప్పరమ్మ
నన్నేడబాసిది న్యాయంబుగాదని
చెల్లెలో విన్నపము సేయరమ్మ(?)
దానితోఁ గూడి నాపొందుఁ దలఁచఁడమ్మ
చెలులఁ జేపట్టి నన్నేడచేసెనమ్మ
అలివ నీ వేగి నేఁడు సింహాద్రినున్న
వరహానరసింహుఁ దేగదే వారిజాక్షి

**End:**

సీ. సింహాద్రిరాయని సీసశతకమును
జదివిన నిహపరసౌఖ్య మేల
యాలించినను వారి కఖిలసంపదలును
గామితార్థంబులు గలుగుచుండు

భక్తిచే నెవ్వరు పద్యంబు లీప్రాప్త
నతిఋంప గ్రహగండగతులు దప్పు
శ్రీహరిచరితను జిహ్వనుజదివిన
సిరులిచ్చులక్ష్మీనృసింహమూర్తి
వసుధలోఁ గలఁచు నేజాతివారికైనఁ
గరుణ వర్ధిల్లుదురు యెల్లకాలమునను
అతివ నీ వేఁగి నేఁడు సింహాద్రినున్న
వరహనరసింహు దెగదే వారిజాక్షి.

(వి-వి.)—

౧౦౦ పద్యములున్నవి. వ్రాఁత యంత తిన్నగిదికాదు. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములు లేవు.

ఈసీసపద్యశతకమున సింహాద్రివరాహనృసింహస్వామి పేరుపెట్టి విప్రలంభశృంగారము వర్ణింపఁబడియున్నది కవిపేరు తెలియదు.

---

## R. No. 404.

Palm-leaf. 10¾ × 1¼ inches. Foll. 9 Lines, 7 on a page. Mode of writing, fair but incorrect. In fairly good condition.

Purchased in the year 1917-18 from M.R.Ry. Nidadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam

గొలివెకన్నమనాయశతకము.

GOLIVEKANNAMANĀYAŚATAKAMU.

A centum of stanzas in the Kanda metre eulogizing one Golive Kannamanāyaḍu. The name of the author of this work is not known.

At the end of the MS. there are eight Kanda stanzas in praise of Golive Śītamanāyaḍu and Pēramanāyaḍu.

Contains 100 stanzas.

**Beginning:**

క. శ్రీమేఘోపమదేహుఁడు
భూమీతనయామనోబ్జఫుల్లుఁడు ప్రీతిన్
నీమహితమందిరాంతర
కాముం డై వెలుఁగు గొలివెకన్నమనాయా.

**End :**

క. తా నిచ్చినఁ బరు లిచ్చిన నే
నేనాఁడును ఘాత కూడ దెవ్వరికైనన్
మానితము గాదు మిక్కిలి
కానీనసమాన గొలివెకన్నమనాయా.

(వి-వి).—

సంపూర్ణము. ౧౦౦ పద్యములు. వ్రాఁత యంత తిన్ననిది కాదు. తప్పులు కలవు. శైథిల్య గ్రంథపాతములు లేవు.

ఈకందపద్యశతకమున గొలివెకన్నమనాయఁడు పొగడఁబడియు యున్నాఁడు. కర్త యెవ్వరో తెలియరాదు.

గ్రంథాంతమున గొలివె సీతమనాయఁడు, గొలివె పేరమనాయఁడు చెరినాల్గు కందములఁ గొనియాడఁబడియున్నారు.

---

R. No. **405**.

Palm-leaf. 10½ × 1¾ inches Foll. 19. Lines, 5 on a page. Mode of writing, fair but containing mistakes. Slightly injured. Some leaves here and there are missing.

Purchased in the year 1917–18 from M.R.Ry. Niḍadavōlu Sundaram Pantulu Garu of Vizagapatam.

వికృతివివేకము.

VIKRTIVIVĒKAMU

A treatise written in Sanskrit stanzas of Anusṭhup metre and dealing with the grammar of the Telugu language under five chapters viz., 1 Samjñā, 2 Sandhi, 3 Śabda, 4 Samāsa, and 5 Kriyā. According to the colophon the author is Atharvaṇācārya. Quotations are found herein from Daṇḍin's Kāvyādarśa and mention is made of previous grammarians, viz , Hari, Śṛṅgārabhusaṇa, Visṇuśarman, Śrīkavi, Kaviśikhāmaṇi, Śauri. There are 273 stanzas in this MS , but in another MS of the Library there are 222 stanzas without division into Paricchēdas

Contains 5 Paricchēdas

**Beginning :**

శ్లో. త దల్పమపి నోపేక్ష్యం కావ్యే దుష్టం కథంచన
స్యా ద్వపు స్సుందరమపి శ్విత్రేణైకేన దుర్భగమ్

గా ర్గాః కామదుఘా సమ్యక్ప్రయుక్తా స్మర్యతే బుధైః
దుష్ప్రయుక్తా పున ర్గోత్వం ప్రయోక్తు స్సైవ శంసతి.

**End :**

యథాప్రసిద్ధి సర్వత్ర శబ్దానాం కల్పనా మతా
ధాతోరర్థాంత రే వృత్తే ర్ధాత్వర్థే నోపసంగ్రహాత్
ప్రసిద్ధే రవివక్షాతః కర్మణో ఽకర్మికా క్రియా ।
. . ప్రమాణ మకలంకస్య పూజ్యపాదస్య లక్షణమ్.

**Colophon :**

ఇది శ్రీమదథర్వణాచార్యవిరచితే వికృతివివేకకృతౌ క్రియాపరిచ్ఛేదః.
శ్లోకసంఖ్య. 273.

గ్రంథాంతమం దిట్లుకలదు—

“ శ్రీవేదమూర్తులయిన [illegible]ట్లలసూరిశాస్త్రిలుగారికి వడ్డాది కామయ్య వ్రాసియివ్వడమయినది. కాళయుక్తినామ సంవత్సరం మాఘ 8 శనివరుకు ”

(వి-వి).—

సమగ్రము కాని సమాసపరిచ్ఛేదముతుద నొకపత్రము పోయినది. ప్రాంతతిన్నది. తప్పులున్నవి. శైథిల్యము కలదు. గ్రంథపాతములు లేవు.

అథర్వణాచార్యుఁడు రచియించినట్లు త్రిలింగశబ్దానుశాసనమని, వికృతివివేకమని (అథర్వణకారికలు) రెండాంధ్రవ్యాకరణములు సంస్కృతమునఁ గలవు. అందిది వికృతివివేక మనఁబడునది. ఇది సంజ్ఞా సంధి, శబ్ద, సమాస, క్రియాపరిచ్ఛేదములని యైదుప్రకరణములు గలది. ఇం దాచార్యదండికృత కావ్యాదర్శమునుండి కొన్ని శ్లోకములుఁ గైకొనఁబడినవి. ఈప్రతిలో రెండువందల డెబ్బదిమూఁడు కారికలున్నవి. మఱియొక ప్రతిలో నింతకంటెఁదక్కువగాఁ 222 కారికలు కానవచ్చుచున్నవి. ఇం దున్నట్టు ప్రకరణవిభాగమందుఁ గానరాదు. ఈవికృతివివేకమున హరి, శృంగారభూషణుఁడు, విష్ణుశర్మ, శ్రీకవి, కవిశిఖామణి, శౌరి, యను వైయాకరణుల పేళ్లు స్మరింపఁబడినవి. గ్రంథముముగిసినతర్వాతఁ “ ప్రమాణమకలంకస్య పూజ్యపాదస్య లక్షణమ్ ” అనియున్నదికాని యీవాక్యము గ్రంథాంతర్గముగా లేదు. ఈయథర్వణాచార్యునిగూర్చి యేమియుఁ దెలియరాదు.

లక్షణగ్రంథములం దథర్వణాచార్యునిభారతమందలివిగాఁ గొన్ని పద్యములు గానవచ్చుచున్నవి.

## R No. 406.

Palm-leaf. $16\frac{1}{4} \times 1\frac{1}{4}$ inches. Foll. 55. Lines, 3 or 4 on a page. Mode of writing, fair but contains plenty of mistakes. Much injured.

Purchased in the year 1917–18 from M.R.Ry. Niḍadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

యతికులరాజచంద్రశతకము.

YATIKULARĀJACANDRAŚATAKAMU.

A centum of stanzas in the Sīsa metre composed in praise of Rāmānujācārya, the chief exponent of the Viśistādvaita philosophy. The author's name is not known.

Contains 109 stanzas.

**Beginning:**

సీ. శ్రీకరా ఓంప్రణవాకరా త్రయప్రయుకద(?)
యాకరాద్వయకళాకారమూర్తి
పంచ . . . . . .
పంచార్థస్వీకరాపంచమూర్తి
యష్టాక్షరీసార యష్టప్రణవాకార
యష్టత్రయాధార యష్టమూర్తి
మంత్రముద్ధార తిరుద్వయాధికార (?)
చరమశ్లోకాధారచరమమూర్తి
జీవపరమాత్మజీవితజీ . . ర్తి
శేషి శేషవి శేషాది శేషమూర్తి
ప్రణవసింహాసనాదిప్రపత్తిమూర్తి
రామసోదర యతికులరాజచంద్ర (?)

**End:**

సీ. రహస్యత్రయార్థంబురక్షకత్వంబును
అర్థపంచకజ్ఞానమమరఁగాను
తత్త్వత్రయార్థంబుధర్మధర్మంబు ?
శ్రీవచనభూషణస్థితియుగు . .
. ర్గ ఆళ్వారుచరితముల్
అంకించినవృత్తియు అతిశయంబు
పరమునిహామును రెంటఁబట్టివిడుపును దెలియ
నాత్మలోగురుఁడుండియానతిచ్చె
రామసో . . . . . ను
చదివితెలిసినమోక్షంబుసంభవించు

నాత్మ నశియించి చెడిపోరు అధములైన
రామసోదర యతికులరాజచంద్ర. (?)

(వి-వి).—

109 సీసపద్యము లున్నవి. వ్రాఁతయంత తిన్ననిది కాదు. తప్పు లత్యధికము. పత్రములన్నియు నొకయోరఁగొంత తునిఁగిపోయినవి.

" రామసోదర యతికులరాజచంద్ర " యనుమకుటముగల యీసీసపద్యశతకమున విశిష్టాద్వైతమతస్థాపకులగు రామానుజులవారు స్తుతింపఁబడిరి. కర్తయెవ్వరో తెలియరాదు.

గ్రంథాంతమున నాలుగయిదుపత్రములలోఁ గొన్ని గీతములున్నవి.

---

R. No. **407**.

**Palm-leaf. 17 × 1½ inches. Foll. 43. Lines, 7 on a page. Mode of writing, good and correct. In fairly good condition.**

**Purchased in the year 1917-18 from M R Ry Niḍadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.**

గోపాలలీలాసుధాలహరి.

GŌPĀLALĪLĀSUDHĀLAHARI.

**This Prabandha in three Āśvāsas is said to be based on Prayāga Vēṅkaṭādri's work Gōpikāvastrāpahāra in the Dvipada metre, and describe Lord Kṛṣṇa's sports with the Gōpīs (the shepherdesses). The author is Prayāga Kāmēśvarakavi, son of Sarvēśvara of Kauśikagōtra. The work is dedicated to Śrī-Rāma worshipped at Rāmatīrtham near Vizianagaram. The author's other work is Sudantāpariṇaya. For further particulars about Vēṅkaṭādri see Telugu extracts below.**

**Complete**

**Beginning**:

శా. శ్రీసీతాస్తనజాతరూపగిరులన్ జెన్నొందిపీతాంబర
శ్రీసౌదామనిగాఁగ రాఘవమహాజీమూతమంఘ్రిద్వయీ
దాసవ్రాతమహీష్టసస్యములపైదాక్షిణ్యనిర్ణిద్రపీ
యూషాసారంబులుచల్లిచల్లి నను నిత్యానందునిం జేయుతన్.

* * *

క. మనువుసుదంతాపరిణయ
మనుకృతిభద్రాద్రిరాముఁ డగురామున కి

చ్చినగతి నీకృతి తన కిం
పున నిమ్మనిరామతీర్థపురరాముఁ డనెఁ.

* * * *

సీ. శ్రీధరేంద్రస్వామిచేఁజతుర్దశవిద్య
లభ్యసించిన వినయాన్వితుండు
ప్రత్యక్షమై చోరభయముమాన్చిన రామ
లక్ష్మణుల నుతించులక్షణాఢ్యుఁ
డారోహణావరోహణముగా నొకసారె
విని పారసీ వచించినఘనుండు
మెచ్చి ఢిల్లీశ్వరుం డిచ్చిన పచ్చల
పల్లకీగొనినకృపాసముద్రుఁ
డగుప్రయాగవేంకటాద్రీంద్రకృతగోపి
కాంశుకాపహార మనెడిద్విపద
కావ్య మేను బద్యకావ్యంబనల్పక
ల్పనలఁ జేయఁ దలఁచి భక్తి నతని.

**End:**

గీ. కోరికపల్లవింప గోపికావస్త్రాప
హారకావ్య మెవ్వఁడైనఁ జదువ
వ్రాయ వినఁగ నతఁడు వరపుత్త్రపౌత్త్రాభి
వృద్ధినొంది ముక్తివెలఁది నెనయు

వృత్తవిశేషము. వరవిచక్షణా వన్యభక్షణా
సరసరక్షణా చారువీక్షణా
గురుజపక్షణా కుజనశిక్షణా
దురితమోక్షణా తోయజేక్షణా.

**Colophon:**

ఇది శ్రీరామచంద్రకరుణారసాప్లుతహృదయాలవాలసంజాతభక్తిల తావేల్లితానల్పకల్పనాప్రసూనసమంచితకవితాశచీప్రియ ప్రయాగనార సింహపౌత్త్ర, సర్వేశ్వరపుత్త్ర, కౌశికగోత్రపవిత్రనిఖిలసుధీజనవిధేయ కామేశ్వరనామధేయ ప్రణీతంబైనగోపాలలీలాసుధాలహరియను శృంగా రప్రబంధంబునందు సర్వంబును దృతీయాశ్వాసము.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పులు లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

ప్రయాగ వేంకటాద్రియను కవి విరచియించిన గోపికావస్త్రాపహారమను ద్విపదకృతినిబట్టి ప్రయాగ కామేశ్వరకవి గోపాలలీలాసుధాలహరి యనుపేర సీమూఁడాశ్వాసముల ప్రబంధమును రచియించినాఁడు. ఈ కవి కౌశికగోత్రుఁడు; సర్వేశ్వరునిపుత్త్రుఁడు. ఈకృతి విశాఖపట్టణమండలమందలి రామతీర్థమున వెలసిన శ్రీరామున కంకితముసేయఁబడినది. సుదంతాపరిణయమను పేర వేఱొకకృతినీతఁడింతకుమున్ను రచియించెనట. ప్రయాగ వేంకటాద్రికవిసామర్థ్యాదులు బదాహృతపద్యమునఁ జూచునది.

---

## R No 408.

Palm-leaf. 14 × 1½ inches. Foll. 16. Lines, 5 on a page. Mode of writing fair but incorrect. Much injured.

Purchased in the year 1917–18 from M.R.Ry. Niḍadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam

రాఘవశతకము.

RĀGHAVAŚATAKAMU.

A centum of stanzas composed in praise of God Rāma worshipped in the shrine at Vēṅkaṭarāmapuri; by Mēḍūri Kṛṣṇadāsa.

Contains 116 stanzas.

**Beginning:**

ఉ. శ్రీకరమైనసత్కవులఁ జిత్తమునం దలపోసి వ్యాసవా
ల్మీకుల కాత్మ మ్రొక్కి శుభలీలరమామణిఁ బూజచేసి వాక్
ఛ్రీకరమిచ్చువాణిని బ్రసిద్ధిగ నెమ్మదిలోన నిల్పి ద
ర్వీకరనాథునిం గొలుతు వేంకటరామపురీశ రాఘవా.

*    *    *    *

**End:**

ఉ. ఆరయనత్రిగోత్రుఁడుమహాత్ముఁడు శ్రీవిఘనాహ్వయుండు మే
డూరికులోద్భవుండుసుగుణోజ్జ్వలుఁడాతిరువేంగళార్యకు
గారవమైనపుత్త్రకునిఁ గంజదళేక్షణుఁ గృష్ణదాసునిన్
వేడుదలంచ కేలితిరి వేంకటరామపురీశ రాఘవా!

*    *    *    *

ఉ. ఉత్పలచంపకంబు లన నొప్పగు నాటపదాఱుపద్యముల్
ఉత్పలచంపకాఖ్యకుసుమోజ్జ్వలమాలిక గా ధరించుఁడీ

తత్పరతన్మదీయునిజదాసునిఁగా నను జూచి వేడ్కభూ
భృత్పరతత్త్వరూపహరి వేంకటరామపురీశ రాఘవా !

సమగ్రము. ౧౧౬ పద్యములున్నవి. వ్రాఁత తిన్ననిదిగాదు. తప్పులున్నవి. శైథిల్యము గ్రంథపాతములునున్నవి.

'వేంకటరామపురీశ రాఘవా' యను మకుటముగల యీ శతకము మేడూరి కృష్ణదాసు రచియించినది. శ్రీరామస్తుత్యాత్మకము.

---

## R. No. 409.

Palm-leaf. 13⅜ × 1¼ inches. Foll. 160. Lines, 5 on a page. Mode of writing, good but incorrect. In good condition.

Purchased in the year 1917–18 from M.R Ry. Nidadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

మాఘమాహాత్మ్యము.

MĀGHAMĀHĀTMYAMU.

A Telugu rendering in the Prabandha form of the Sanskrit Māghamāhātmya contained in the Vāyu Purāna and describing the greatness and sanctity of the Māgha month (February–March). The author Oḍḍepūḍi Peddakavi,son of Pēramāmba and Vēṅkaṭamantri of Kāśyapa-gōtra. He was a Karaṇa of the Oḍḍepūḍi village. He dedicated the work to Dāsari Cina Gaṅga Vibhu of Kamma sect and disciple of Maddāli Tirumalācārya. The patron lived at Puruṣōttamapaṭṭaṇa built by the king Vīrapurusōttama Gajapati, who reigned at Cuttack; and he is said to have been honoured by Bāhubalīndra and Hariścandra.

Contains 1 to 5 Āśvāsas except colophon and a few stanzas at the end of the fifth Āśvāsa.

**Beginning:**

శా. శ్రీలింపొందఁగ నాల్గుహస్తముల లక్ష్మీదేవినుం జెక్కులన్
వాలిందల్లన నవినోదలీలమకరీపత్రావళుల్ వ్రాయుశా
బాలంకారుఁడు శోభనాచలనృసింహస్వామి సద్ధర్మసం
శీలున్ దాసరిచిన్నగంగవిభు దాక్షిణ్యంబునన్ బ్రోవుతన్.

* * * *

వ. . . . . . కొండపల్లికిం బ్రాగ్భాగంబున నున్నతత్స్థలంబునఁ గటకసింహాసనాధీశ్వర వీరశ్రీపురుషోత్తమగజపతినిర్మితంబును

. . . . పురుషోత్తమనామపట్టణంబునఁ బరిపూర్ణకరుణాసము
ద్రుండును జౌపరిపట్టభద్రుండును గమ్మవంశపారావారచంద్రుండును
. . . శ్రీమన్మారుట్లగోత్రపవిత్రుండును, సూరివర్ణితచారిత్రుండు
ను, మద్దాలి తిరుమలాచార్యశిష్యుండును గలితవైదుష్యుండును . .
. అగు దాసరిగంగ చినగంగనాహ్వయుండు సముచితవర్తనంబునం
బ్రవర్తిల్లుచు నొకనాఁడు :—

* * * *

చ. వినతసమస్తభూభుజుని వేంకటమంత్రికిఁ బేరమాంబకుం
దనయునిఁ బుణ్యవర్తనుని దానగుణాన్వితు నారసింహప
ద్వనరుహచంచరీకు ననివార్యవచోరచనావిశారదుం
ననిచినయొడ్డెపూఁడిపురనాథునిఁ బెద్దకవీంద్రచంద్రునిన్.

* * * *

వ. . . . వాయుపురాణంబుత్తమం బనియార్యజనంబులెన్ను
దురు తదీయఖండత్రయంబులో మాఘమాహాత్మ్యఖండంబు పయఃపా
రావారమథనంబుననుదయంబగు సుధారసంబుపోలిక హరిభక్తిహేతు
కంబును సకలజనవర్ణితంబునునై యొప్పునప్పుణ్యకథ యాంధ్రభాషానిరూఢి
నొకకృతిచమత్కృతిగా రచింపుమని కర్పూరతాంబూలంబులును
. . .

ఉ. పంకజగర్భదారకటిభాగవిభాసితభర్మమేఖలా
కింకిణికావిరావములఁ గేరి తదీయకరాగ్రవిస్ఫుర
తత్కంకణనిక్వణక్వణనదంబు నగున్ జినయొడ్డెపూఁడిమా
వేంకటమంత్రిపెద్దనకవీనవిలాసవచోనిగుంభనల్.

* * * *

వ. అని శ్రీమద్వరాహగిరి వేంకటలక్ష్మీనృసింహులందలంచి తదను
గ్రహంబుననిరఘుండనై కృతార్థతం జెందితి. నేతత్ప్రబంధభర్తయగు
గంగనివంశావతారం బభివర్ణించెద.

చ. హరిపదసంభవుల్ బుధహితాతిశయుల్ కమలాశ్రయుల్ శుభా
చరులును బుణ్యజీవనులు సత్పథవర్తులు లోకపావనుల్
సరసకవివ్రజాస్పదులు చారుగభీరులునై వియన్నదీ
స్థిరగతులైనవారి నుతిచేసెదఁ గమ్మకులాగ్రగణ్యులన్.

క. ఆకమ్మవంశమున సుగు
ణాకరుఁ డగునారధీరుఁడరిసముదయహృ
ద్భీకరుఁ డుదయించి ధరన్
శ్రీకాంతునికరుణచేత సిద్ధివహించెన్.

చ. అతనికిఁ దిమ్మనేఁడుదయమై శుభసంయుతు నాగధన్యశా
శ్వతయశుఁ గాంచె నావినయశాలికి సూరమకున్ జనించి రు
న్నతమతి గంగయప్రభుఁడునాగనతిమ్మయమెట్టినాఖ్యలన్
జతురగుణాభిరాములయి సన్నుతికెక్కెడువారిలోపలన్.

క. గంగాధరశరసుర ?
పుంగవపత్త్రాశిపవనుభుగినయశ (?)
స్సంగతివిలసిల్లుచుఁ బెద
గంగనధరఁబ్రబలు దానగౌరవలీలన్.

క. భూసురబంధుహితత్రా
ణాసక్తుఁడుధర నిరతుఁ డరిధరణీభృ
ద్వాసవుఁడు ప్రజ్ఞఁదనరెను
దాసరిపెదగంగఘనునిఁ దరమే పొగడన్.

గీ. అట్టి పెదగంగవిభునియర్ధాంగలక్ష్మి
యక్కమకు నుదయించి పెంపలరి రవని
నాగినేఁడును జినగంగనప్రభుండు
రామకృష్ణులరీతి సుత్రామనిభుఁడు.

క. శ్రీగలిగివిదితసంతత
భోగకళారూఢిఁ దనరి భూవలయమునన్
సాగరగభీరుఁడనఁగా
నాగన విలసిల్లు మేరునగధృతివెలయన్.

వ. తదీయానుజుండు.

సీ. సహకారపనసకేసరనింబజంబీర
సరళాదిభూరుహోత్కరమునిల్పె
నిఖిలజీవాధారనిమ్నపుష్కరమైన
చెరువుచేయించెనచ్చెలువుగాఁగఁ

జతురదేవాగారశార్ఙ్గకోదండప్ర
తిష్ఠాసమాసుఁ దేజరిల్లె
నుర్వీసురశ్రేణి కుపనయనోద్వాహ
వస్త్రప్రదాతృఁడై వాస్తు (సి?) కొకొ
నారయనమీతోఁ బురుషోత్తమాభిధాన
పట్టణస్థిరచౌదరి పట్టభద్రుఁ
డనుపమోదారనియతవర్తనుఁడు మాన
ధనుఁడు దాసరి చినగంగ ఘనయశుండు.

ఉ. సాంద్రయశోధనుండు హరిశౌర్యుఁడు బాహుబలేంద్రుఁ డాహరి
శ్చంద్రమహీతలేశుఁడు భృశంబుగ సత్యవచో ? నొసంగఁగా
చంద్రసుగంధపుష్పఘనసంకుమదాంబరరత్నరాజిని
స్తంద్రశుభార్తిఁ గైకొనియె దాసరిగంగన లోకమెన్నఁగన్.

* * * *

చ. హరిచరణాంబుజాతభజనాత్మకుఁడై తనరారునట్టి దా
సరిచినగంగధీరుసతి చారుగుణాన్వితమల్లమాంబ సు
సిరబహుభోగసంపదలచే నలరెన్ నిరతాన్నదానత
త్పరనిజచిత్తయై నిఖిలబంధుగణంబులు సన్నుతింపఁగన్.

క. ఆమల్లమాంబకనియెన్
సోమనిభునిబాపఘనుని సొబ్బనఁ బ్రకట
శ్రీమహితునినంకన్నను
ధీమంతుని నకటధీరుఁ దేజోఘనులన్.

వ. వారిలోన.

చ. వినయగుణాభిరాముఁ డరివీరభయంకరమూర్తి మిత్రస
జ్జనపరిరక్షణుండు హరిశౌర్యుఁడు దానకళానిరూఢవ
ర్తనుఁ డనఁగా ధరం బ్రబలు దాసరిగంగనకూర్మినందనుం
డనఁదగు బాపినేఁడు కమలాక్షపదాంబుజమత్తభృంగమై.

క. జనవినతుఁడైన దాసరి
చినగంగనసొబ్బినేని స్థిరతరకీర్తుల్
ఘనవాహాన ఘనదాహాన
ఖనదీచంద్రార్కతుహినకరులహసించున్.

క. పంకజలోచనభక్తుఁడు
బొంకఁడు కలలోననైన భూజననుతని
శ్శంకబిరుదాంక దాసరి
యంకనఁ బ్రణుతింతు రుర్వి నార్యజనంబుల్.

క. చక్కెరవిల్తునికన్నను
జక్కనివాఁ డతులదాన సద్గుణములఁ బెం
పెక్కినవాఁ డీ దాసరి
యక్కనఁ బ్రణుతింపఁదగు జనాధిప సభలన్.

గీ. ఇట్టినల్వురఁ బుత్త్రుల నెలమి రామ
లక్ష్మణభరతశత్రుఘ్నుల మహనీయ
గుణులఁ బొంది విధేయులై కొలువనిచ్చ ?
సిరులు చినగంగనవహించి ధరణిఁ బ్రబలె.

**Colophon:**

ఇది శ్రీమద్వరాహగిరి లక్ష్మీనృసింహవరప్రసాదలబ్ధసారస్వతవిచిత్రాపస్తంబసూత్ర కాశ్యపగోత్రపవిత్ర ఒడ్డెపూఁడి వేంకటమంత్రిపుత్త్రి సకలసుకవిజనవిధేయ పెద్దయనామధేయప్రణీతం బైనవాయుపురాణంబునందు మాఘమాహాత్మ్యం బనుమహాప్రబంధంబున . . . చతుర్థాశ్వాసము.

**End:**

క. నిమియనురాజుకుమహోద్ధక
మమరఁగఁ జేయంగ సురసుఁ డష్టావింశ
త్పురుషులకీ మహిమముఁ దె
ల్పె పొల్పుగను మునీశ్వరుఁడగు శాండిల్యుండున్.(?)

(వి-వి.)——

సంపూర్ణము. ఐదాశ్వాసములు. పంచమాశ్వాసము కడపటి పద్యములును, గద్యమును లేవు. వ్రాఁత తిన్ననిది· తప్పులు గలవు. శైథిల్యగ్రంథపాతములు లేవు.

ఇది వాయుపురాణాంతర్గతమాఘమాహాత్మ్యమునకు నొడ్డెపూఁడి పెద్దకవి యాంధ్రీకరణము. ఈ పెద్దకవి వేంకటమంత్రికిని, బేరమాంబకును బుత్త్రుఁడు. కాశ్యపసగోత్రుఁడు. ఒడ్డెపూఁడికి నధిపతి (కరణము)యఁట. దీని నీతఁడు దాసరి చినగంగవిభునకుఁ గృతిచేసెను.

ఈ గంగవిభుఁడు కమ్మకులజాతుఁడు. చౌదరి పట్టభద్రుఁడు. మద్దాలి తిరుమలాచార్యుని శిష్యుఁడు. బెజవాడ సమీపముననున్న కొండపల్లికి దూర్పుననుండెడి పురుషోత్తమపట్టణముననుండెడివాఁడు. ఈ పట్టణము కటకసింహాసనాధిపతియగు వీరపురుషోత్తమగజపతిచే నాతని పేరఁ గట్టింపఁబడెనఁట. మఱియు నీకృతిపతిని బాహుబలేంద్రుఁడు - హరిశ్చంద్రుఁడు సన్మానించినట్లు తెలియవచ్చుచున్నది. ఈ బాహుబలేంద్ర హరిశ్చంద్రనామములుగల యోఢ్రరాజులుండినట్లు తెలియవచ్చుచున్నది. విశేషాంశములను దాహృతపద్యములవలన నెఱుఁగనగును.

---

## R. No. 410.

Palm-leaf. 13⅜ × 1½ inches. Foll. 7. Lines, 5 in a page. Mode of writing, fair but incorrect. In fair condition.

Purchased in the year 1917–18 from M R.Ry. Niḍadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

అంతర్వేదినృసింహశతకము.

ANTARVĒDINṚSIṀHAŚATAKAMU.

A centum of stanzas (Sīsa metre) in praise of God Nṛsiṃha, who is worshipped in the shrine at Antarvēdi (Godavari district). The author's name is not known.

Complete

**Beginning:**

సీ. శ్రీరమారమణీమణీరమ్యవక్షోజ
కుంకుమాగరుఘుమాఘుమితహృదయ
కరుణాకటాక్షవీక్షణ సుధారసబిందు
బృందనందచ్చిదానంద నిచయ
ప్రణతపద్మజభవ ప్రముఖమూర్ధన్య స
న్మణిరుచిప్రచురకోమలపదాబ్జ
బహువిధబ్రహ్మాండ భాండమండితదివ్య
రోమకూపకలాప రుచిరచాప
నిగమసంచార నిత్యసన్నిహిత శూర
దళితరిపుజాల సంతతోద్ధరణశీల
విమలరవిభాస యంతరవేదివాస
భవ్యగుణధామ నరసింహభవవిరామ

**End:**

సీ-గీ. పొంచియున్నావు తురకలఁ బొడుచుటను నను చు
బాకు మొలఁజెకిగా యిది యొకటి బంటుఁ దనమె
విమలరవిభాస . . . . . . .

(వి-వి.)—

అసమగ్రము. 25 పద్యము లున్నవి. వ్రాఁత యంతమంచిది కాదు. తప్పులు కలవు. శైథిల్యగ్రంథపాతములు లేవు.

ఇది నృసింహస్తుత్యాత్మకమగు సీసపద్యశతకము ఈ నృసింహస్వామి యంతర్వేదియందు నెలకొనియుండెడివాఁడఁట. కర్త యెవ్వరో తెలియరాదు.

---

R No. 411.

Palm-leaf. 12×1 inches, Foll. 260. Lines, 5 in a page. Mode of writing good and apparently correct. In good condition.

Purchased in the year 1917–18 from M.R.Ry. Nidadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

(*a*) వరాహపురాణము.

VARĀHAPURĀṆAMU.

Foll. 1*a*—207*a*. 207*b* is left blank.

This Prabandha is a Telugu rendering of the former part of the Sanskrit Varāhapurāṇa by Haribhaṭṭa, son of Rāmavidvanmaṇi. He bore the title Aṣṭaghaṇṭāvadhāna. The work was dedicated to Kolipāka Yarrayamantri of Kambammeṭṭu The patron was the son of Gaṅgāmba and Sarvaya and disciple of Tirumala Nārāyaṇaguru. The other works of the author are Matsyapurāṇa (Telugu), the 11th and the 12th Skandhas of the Telugu Bhāgavata and probably the Ratirahasya (Sanskrit).

Complete in five Āśvāsas.

**Beginning:**

శా. శ్రీకాంతాకుచహారకౌస్తుభమణిశ్రీ లాత్మవక్షస్స్థల
వ్యాకీర్ణత్వమునొంది చూపఱకు నుద్యద్గంధకాశ్మీరచ
ర్చాకారంబు భజింప మించినసరోజాక్షుండు రక్షించుఁ దై
ర్యాకల్పుం గొలిపాకసర్వవిభుయెఱ్ఱామాత్యచూడామణిన్.

* * * *

సీ. గీ. నరసుతాంధ్రవచోధుర్యు నన్నపార్యు
సూక్తిమణిరాజిఁ దిక్కనసోమయాజి
మతిసురాచార్యు నెఱ్ఱనామాత్యవర్యు
ప్రౌఢిఁ దలఁచెద సాహిత్యరూఢి మెఱయ.

*　　　*　　　*　　　*

సీ. వరుణదిగ్వీథి నేపురమునఁ బ్రవహించెఁ
పావనసలిలసంపన్న పెన్న[మున్న?]
దీపించె నేపురి గోపికామానసా
స్పదవర్తి చెన్నగోపాలమూర్తి
భాసిల్లె నేపీటఁ బ్రహ్లాదభక్తివి
శ్రాణి కొండనృసింహ శార్ఙ్గపాణి
ఏ పట్టణంబునఁ జూపట్టె హితపద్మ
హేళి వీరేశబాలేందుమౌళి.

చతురచతురంగబలరత్న సౌధయూథ
సాలగోపురతోరణ సకలవర్ణ
పౌరవారాంగనా జనప్రముఖవస్తు
మేదురంబట్టి కంబముమెట్టపురము.

గీ. ఆంధ్రమండలగిరిదుర్గహారలతకు
విమలనాయకరత్నభావము భజించి
యున్నతోన్నతశైలసంపన్నమగుచు
సకలపుటభేదనముల నెన్నికకు నెక్కె.

వ. ఇవ్విధంబునం జూపట్టుచు విద్వేషిహృదయఘట్టనంబగు నమ్మహా
పట్టణంబున సలకరణికాగ్రగణ్యుండై.

*　　　*　　　*　　　*

మ. అమృతప్రాయవచోవిశేషరచనాహంభావపుంభావ వా
గ్రమణీమూర్తివి వేదశాస్త్రవివిధగ్రంథార్థనిర్ణీతినే
కముఖబ్రహ్మవు యాజుషప్రకటశాఖాధర్మధుర్యుండ వ
ర్యమతేజుండవు రాఘవార్యహరిభట్టా సత్కవిగ్రామణీ.

గీ. అష్టఘంటాభిదాన[వధాన?] విశిష్టబిరుద
నీవు రచియింపఁదలఁచిన నిరుపమార్థ

రమ్య మగునీ వరాహపురాణకావ్య
మంకితముసేయు నాపేర నభిమతముగ. *

* * * *

క. వారలలోపల నగ్రజుఁ
డైరాజిలు జెన్నసైనికాగ్రణి యకాకా
ధారమణియందుఁ గనియె మ
హారసికుల బసవవిభు ననంతామాత్యున్.

చ. సురుచిగలీలఁ జెన్నవిభుసోదరుఁడైన యనంతమంత్రిశే
ఖరుఁడు దిశాంగనాకబరికాతతులన్ నిజకీర్తిమంజరీ
పరిమళభాసురంబులుగ భక్తి నొనర్చుచు గంగమాంబికం
బరిణయమయ్యె శంకరుఁడు పార్వతిఁబోలెఁ బ్రమోదమానుఁడై.

వ. తదనుసంభవుండు.

శా. నించెంగీర్తులు పద్మజాండమున మన్నించెంగవిశ్రేణి నా
లించెన్విష్ణుపురాణసంహితలఁ బాలించెన్ధరాకాంత నీ
క్షించెన్ లోపటనంబుజోదరుని రక్షించెన్ సుధీబంధులన్
మించెన్ మంత్రుః సర్వయప్రభుఁడు నిర్మించెం బ్రతాపారులన్.

శా. రంగచ్చక్రపయోధరన్ గమలవక్త్రిన్ బంధుజీవాధరన్
శృంగారోరురసాన్వితన్ గువలయాక్షిన్ జంచరీకాలకన్
గంగాంబన్ వరియించె నాసచివలోకస్వామి వారాశితే
వం గళ్యాణగుణావళీమణిగణవ్యాసంగగంభీరుఁడై.

క. ఆరమణీరమణులకుఁగు
మారులుజనియించిరనుపమానులు ఘనులై
ధారుణిఁ బొడమిన సాక్షా
త్సారసభవశివసహస్రేంద్రదశయనులనంగన్.

* * * *

ఉ. చిత్రచరిత్రుఁ డాసచివశేఖరుసోదరుఁ డెల్లమంత్రి సౌ
భ్రాత్రధురంధరుండుహరిభక్తిసమేతుఁడు మారమాంబ లో॰

* కశ్యపగోత్రమున నెల్లమంత్రిపుట్టెను, ఆతనిభార్య మల్లమాంబ, వీరికి నల్వురు కొడుకులు—చెన్న విభుఁడు, అనంత మంత్రి, సర్వఘనుఁడు, రామశౌరి.

కత్రయవర్ణనీయగుణకాంతఁ బతివ్రత నన్నమంత్రిరా
ట్పుత్త్రికఁ బెండ్లియాడె సిరిఁబొల్పుగఁ గొను శౌరికైవడిన్.

శా. ఆసాధ్వీమణియందు సెట్టివిభుఁ డార్యానందసంధాయి సు
శ్రీసంపన్నుల భూసురోత్తమకృతాశీర్వాదసంవర్ధితో
ల్లాసోత్సాహచిరాయురున్నతులఁ గల్యాణాత్ములం గాంచె వి
ద్యాసంపూర్ణుల వేదమంత్రిపునసంతామాత్యకందర్పునిన్.

(తదనుజుండు తిప్పన.)

* * * *

ఉ. వీరలపిన్నతండ్రి ధరవిశ్రుతిగాంచినరామమంత్రిమం
దారుఁడు చంద్రచందనసుధాకరకుందమరాళమల్లికా
హారపటీరహీరసముదంచితకీర్తియుతుండు వీరమాం
బారమణీమణిం బరమభాగ్యవతిన్ వరియించెఁ గూరిమిన్.

గీ. ఆవధూటియందు నామంత్రివరునకు
నుదయమంది రర్థి సదయమతులు
హేమశైలధీరుఁ డెట్టిమంత్రీంద్రుఁడు
పంచబాణనిభుఁడు పంచవిభుఁడు.

వ. ఇవ్విధంబున లోకోత్తరగుణ రత్నాదారంబగు కశ్యపగోత్ర పారావారంబునఁ గొలిపాక సర్వయ ప్రభుగంగాంబికా గర్భశుక్తిమౌక్తికంబులగు తనూభవులు మువ్వురలోనఁ గృతినాయకుండును రూపరేఖా విజితపంచసాయకుండునగు సెట్టియమంత్రిసార్వభౌముని త్రిభువనపవిత్రంబగు చరిత్రం బెట్టిదనిన.

* * * *

క. తిరుమలనారాయణ గురు
చరణాబ్జధ్యానమధురసస్థిరమతిప
ట్స్ఫురణునకు ఫలితకృష్ణ
స్మరణునకు నరాతిమంత్రి మదహారిణునకున్.

క. శ్రీమహితస్తంభాచల
నామసముద్దామపట్టణస్థల గణక
గ్రామణికి బంధుహితర
క్షామణికిఁ గవీంద్రపంకజనభోమణికిన్.

**End:**

మ. కపటస్వాంతులుగాక యెవ్వరిల నాకాంక్షించి యేతద్వరా
హపురాణంబున నాదిఖండచరితం బాద్యంతమున్ విందురా
నిపుణుల్ గాంతురు పుత్త్రపౌత్త్రధనవాణీసంపదాయుష్యముము
ఖ్యపదార్థోదిత సౌఖ్యవృత్తియుఁ దుదిన్ గైవల్యసంప్రాప్తియున్.

* * * *

మాలిని.

శతమఖసమభోగా సాధురక్షానురాగా
సతతహరిసపర్యా సక్తసంతానధుర్యా
వితరణగుణధామా విస్ఫురత్కీర్తిసీమా
హితజనసురభూజా యెఱ్ఱయామాత్యరాజా !

**Colophon:**

ఇది శ్రీహనుమత్కరుణాప్రసాదాసాదిత సారస్వత నిరాతంకచంద్ర నామాంక రామవిద్వన్మణితనూజాత అష్టఘంటావధాన పరమేశ్వర బిరుద విఖ్యాత హరిభట్టప్రణీతంబైన వరాహపురాణంబునం గైవల్యఖండంబను పూర్వభాగంబునందు . . . . . . పంచమాశ్వాసము సంపూర్ణము.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పులంతగా లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

కైవల్యఖండ మను పేరుగల వరాహపురాణపుఁ బూర్వభాగమున కిది తెలిఁగింపు. అయిదాశ్వాసములు గలది. కర్త హరిభట్టారకుఁడు. రామవిద్వన్మణి కుమారుఁడు. అష్టఘంటావధాన బిరుదముగలవాఁడు. గద్యమందున్న చంద్రనామాంక పదము నర్థమేమో ! తెలుఁగున, మాత్స్య పురాణము భాగవతైకాదశద్వాదశస్కంధములు నీతని కృతులు గలవు. శృంగారదీపిక, రతిరహస్యము, నను నామములతో సంస్కృతభాషనుగల కామశాస్త్రగ్రంథగద్య మీతని గద్యముతోఁ గొంత పోలుచున్నది. ఆ గద్యమిది “ఇది సర్వవిద్యానవద్యసహజసారస్వత చంద్రనామాంక రామవిద్వన్మణికుమార హరిహరనామకవి విరచితాయాం శృంగారదీపికాయాం రతిరహస్యే.” ఈ వారాహ పురాణము కంబము మెట్టపురమునకుఁ గరణముగానున్న కొలిపాక యెఱ్ఱయమంత్రి కంకితము చేయఁబడినది.

ఈ యెఱ్ఱయమంత్రి కశ్యపగోత్రుండు. సర్వయప్రభుగంగాంబల పుత్త్రుండు తిరుమలనారాయణగురు శిష్యుండు. వీని వంశవృత్తాంత ముదాహృత పద్యములం జూచునది.

వారాహ పురాణమును, దుళువ వీరనరసింహరాయల (కృష్ణదేవ రాయల తండ్రి) కంకితముగా నందిమల్లయ ఘంటసింగయ అను కవులు గూడం దెలిఁగించి యున్నారు.

---

(*b*) రాధామాధవవిలాసము.

RĀDHĀMĀDHAVAVILĀSAMU.

Foll. 208*a*—260*a*. Foll. 260 (*b*) is left blank

This is the same work as the one described under R No 343 *ante*. By Velidindla Vēnkatapatı.

The name of the scribe and the date of transcription are noted below as found at the end of the MS.

Complete.

(ఖ-ఖ.)—

సమగ్రము. వ్రాంత చక్కనిది. తప్పు లంతగా లేవు. శైథిల్య గ్రంథ పాతములు లేవు.

ఇది డెస్క్రి. క్యా. ఆర్. నెం 343 దున వర్ణింపబడిన గ్రంథమే.

గ్రంథాంతమున—"పార్థివ సం॥ భాద్రపద బ ౯ శుక్రవారం సరికి కొడుకుళ్ల వెంకట సోమయాజులు . . వ్రాసుకొనెను" అని యున్నది.

---

## R. No. 412.

Palm-leaf. $15\frac{1}{2} \times 1\frac{1}{8}$ inches. Foll 47 Lines, 5 on a page. Mode of writing, good and correct. In good condition.

Purchased in the year 1917-18 from M.R.Ry. Nidadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

రుద్రాక్షమాహాత్మ్యము.

RUDRĀKṢAMĀHĀTMYAMU.

This Telugu Prabandha describes the sanctity of the Rudrākṣa bead worn in the neck by Saivites. The work was composed by Amalāpurapu Sannyāsikavi son of Kāśana of potter caste and was dedicated to God Pañcamukhēśvara worshipped in a shrine on the bank of the river Vēgavati near Sālūru (Vizagapatam district). The author was the disciple of Kaṭṭamūri Kāmēśvarārya.

Complete in three Āśvāsas.

**Beginning:**

శా. శ్రీమద్భూధరవల్లభప్రియసుతా చేతోభిరామున్ గుణో
ద్దామున్ సోము జటాభరార్పితసుధాధామున్ బృహన్నాము ని
ష్కామున్ నిస్తులపాదభక్తపటలీకల్పద్రుమారాము సు
త్రామారాతివిరాముఁ గోటిశిఖరుద్ధామున్ బ్రశంసించెదన్.

క. కల్యాణగుణోద్దామున్
కల్యాణాన్వయలలాముఁ గల్యాణకుభృ
త్తుల్యోజ్జ్వలధీరున్ సా
కల్యతఁ ద్రిపురారిదేశికప్రభు నెంతున్.

క. శ్రీకట్టమూరికులర
త్నాకరరాకాశశాంకు నభినవపుణ్య
శ్లోకున్ మద్విద్యాప్రదు
శ్రీకామేశ్వరగురున్ భజించెద నిమ్మన్.

క. చారుకులాలకులాలం
కారున్ గౌరీశ్వరాంఘ్రికమలమిళిందా
కారున్ నిరహంకారు ను
దారున్ మజ్జనకుఁ గాశనాఖ్యు నుతింతున్.

* * *

గీ. శ్రీమదమలాపురాన్వయగ్రామణి యనఁ
గుంభకారకులంబున సంభవించె
మల్లికార్జుననాముఁడు మల్లికార్జు
నామలయశోభిరాముఁ డీయవనియందు.

గీ. ఆమహామహునకు నంకమ్మయ నెడు ప
యోజపత్రనయన కుద్భవించె
వసుధ న్యాయమార్గవర్తి నారాయణ
మూర్తి చంద్రికాభకీర్తి యగుచు.

క. ఆసూరివర్యులకు ల
క్ష్మీసతికుదయించి రుర్విఁ గేవలకరుణో
ల్లాసులు మల్లనకాశన . .

. . . . . . .

క. అందగ్రజుం డుదారుఁడు
మందరధీరుఁ డఖిలార్థిమందారుఁడు బా
లేందుకళాధర పూజా
మందానందాంతరుండు మల్లన నెమ్మిన్.

మ. ఇలలోఁ బెంకెకులామృతాంబునిధి తారేశుఁ డనా నొప్పు ని
శ్చల కామేశ్వరనామధీమణికి శ్రీచల్లాంబకున్ బుత్త్రికా
తిలకంబైన సుభద్రికాఖ్యయుతసాధ్విన్ బెండ్లియాడంగ న
చ్చెలి భక్తిన్ నిజభర్తతో ననుగమించెన్ బెద్దలౌరా యనన్.

క పెనుగుదిటి వంశపావనుఁ
డనఁదగు లింగనకుఁ బాపమాంబికకు నిలన్
దనయ యగు గంగమాంబిక
యను సతి నివహించెఁ గాశనాహ్వయుఁ డెలమిన్.

గీ. ఆవధూవరులకును నిజాత్మభవులు
ముగురు తనయులు నల్వురిమ్ముగ జనించి
రందులోఁ బూర్వజుండు చిన్నయ్య తదను
జుండు సోమాఖ్యుఁ డాతని సోదరుండు.

క. ఫాలాక్షుచరణసేవా
లాలసుఁడన్ గన్నమాకళత్రాన్వితుఁడన్
లాలితసుగుణనికాయో
ద్వేలుఁడ సన్న్యాసి నామధేయోజ్జ్వలుఁడన్.

సీ. పొన్నమండకులాబ్ధిపూర్ణేందుఁ డగు గుర
వయ్యకు నంకమయను సతికిని
దనుజన్ములిర్వురు జనియించి రుర్విలో
పలవినాయక వీరభద్రులనఁగ
గంగాధరయ్య శ్రీకరశరభయ్యయు
నాదయాకరులలో నగ్రజుండు
గంగాధరయ్య నన్నుంగనె మహాదమ
లాపురీవంశప్రదీప సద్గు
ణాఢ్య సన్న్యాసి సుకవి రుద్రాక్షఫలమ
హాత్త్వ మింపుగఁ బద్యకావ్యము రచింపు

మనియనుజ్ఞయొసంగఁదదాజ్ఞఁ బూని
చెప్పఁదొడఁగితి నేముక్తి సిద్ధికొఱకు.

క. భూలోకనాకమనఁదగు
సాలూరు పురోపకంఠసద్వేగవతీ
కూలోద్యానవనాంతర
ఖేలనరతుఁ బంచముఖుని గిరిధరసఖునిన్.

క. కృతిపతినొనరిచి ప్రాసవి
రతిగణనియమంబులెఱుఁగ రక్షింపు ముమా
పతి యంచు వేఁడి ముదమునఁ
జతురత్వ మెలర్పఁ జేతుషష్ఠ్యంతంబుల్.

**End :**

మాలినీ. అమృతకరకిరీటా యార్యదీనారకూటా
సమధికవృషఘోటా స్వర్ణదీసిక్తజూటా
కమలభవకరోటా గాఢపశ్యల్లలాటా
సమరజితనిశాటా జాంబవత్కాలకూటా.

**Colophon :**

ఇది శ్రీమత్పంచముఖేశ్వరచరణారవింద నిష్యందమ్మరందధారాభినందితేందిందిరాయమాణమానసవైభవ కాశనాఖ్యతనూభవ శ్రీమదమలాపురాన్వయపయఃపయోధిరాకాసుధాకర సమస్తగుణాకర సకలసుకవిజనవిధేయసన్న్యాసినామధేయవిరచితంబైనరుద్రాక్షఫల మాహాత్మ్యంబను శైవకథయందుఁ దృతీయాశ్వాసము.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పులు లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

కుమ్మరకులమువాఁడగు నమలాపురపు సన్న్యాసికవి మూఁడాశ్వాసముల యీగ్రంథమునకుఁ గర్త. రుద్రాక్ష మాహాత్మ్యమిందు వర్ణింపఁబడినది. సాలూరు పురము దగ్గఱ వేగవతీనదీతీరమున వెలసిన పంచముఖేశ్వరస్వామి కిది సమర్పింపఁబడినది. సాలూరు విశాఖపట్టణమండలమందున్నది. ఈ కవి కట్టమూరి కామేశ్వరార్యుని శిష్యుఁడు; ఈ తని వంశవృత్తాంతము దాహృతపద్యములఁ బట్టి యెఱుఁగునది.

## R. No. 413.

Palm-leaf. 15⅝ × 1⅛ inches. Foll 31. Lines, 6 on a page. Mode of writing, good but contains plenty of mistakes. In fairly good condition.

Purchased in the year 1917-18 from M.R Ry. Niḍadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

సిరియాళచరిత్రము.

SIRIYĀLACARITRAMU.

A Prabandha narrating the story of the Tamil Śaiva saint Siruttoṇḍanāyanār (vide a Dvipada work under R. No. 278 *ante*). The author of the work is Garikipāṭi Tammaya.

Complete in three Āśvāsas.

**Beginning:**

ఉ. శ్రీనగమందిరుందనుజశిక్షు మహోన్నతుఁ బార్వతీశ్వరున్
భానుచుహోగ్రదీప్తనతభక్తగృహాంగణపారిజాతమున్.

* * * *

సీ. శివకపీశ్వరులను జిత్తంబునం గొల్చి
నందిశో (?) మేశు నమస్కరించి
పిడుపర్తి బసవన్నఁగడుఁ బ్రస్తుతులుచేసి
తత్పుత్త్రు సోమయ్యఁదలఁచితలఁచి
బాణమయూరులఁబ్రస్ఫుటాంజలిచేసి
కాళిదాసాదులఁగాంతుఁజేసి
శ్రీహర్షుమల్లుపసుసేవించి పూజించి
వాల్మీకులకుఁ జేసివందనంబు
పూనికొలిచెదబమ్మెర పోతవిభుని.

**End:**

దేవదేవమునీంద్రవందిత ద్విరదచర్మవిచేలనా
భావజాంతక త్రిపురభంజనభక్తమానసగంజనా
జీవితేశ్వర భూతనాయక సింధుతూణగిరీశ్వరా
కోవిదస్తుతవృజినదూరిత కోటిసూర్యప్రకాశితా.

**Colophon:**

ఇది శ్రీమద్గురుసిద్ధవీరేశ్వరవర ప్రసాదలబ్ధ కవితాసామ్రాజ్య ధురంధర ఘనయశోబంధుర సమధిక వీరశైవాచారనిదాన గరికిపాటి

లింగనామాత్యపుత్త్రితమ్మయనామధేయ ప్రణీతంబైన సిరియాళ చరిత్రంబన్నకావ్యంబున సర్వంబును దృతీయాశ్వాసము.

(వి-వి.)——

సమగ్రము. వ్రాంత తిన్ననిది. తప్పులు మెండు. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

సిరియాళచరిత్రమను నీమూఁడాశ్వాసముల నీరసప్రబంధము గరికిపాటి తమ్మయకవిచే రచియింపఁబడినది. చిఱుతొండఁడను వీరశైవుని చరిత్రమిందు వర్ణింపఁబడినది. ఆర్. నె 278 రున వర్ణింపబడినది. వేఱు. ఇది వేఱు.

---

R. No. **414**.

Palm-leaf. $16_8$ × $1\frac{1}{8}$ inches. Foll. 178. Lines, 6 or 7 on a page. Mode of writing, good and fairly correct. In an injured condition. Many leaves are broken here and there.

Purchased in the year 1917-18 from M.R.Ry. Niḍadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

రాఘవపాండవయాదవీయము, సటీకము.

**RĀGHAVAPĀṆḌAVAYĀDAVĪYAMU WITH COMMENTARY.**

The stories of Rāma, the Pāṇḍavas, and Śrī-kṛṣṇa are narrated in this Prabandha wherein the stanzas and the passages are so written as to give three different meanings so as to suit the context of each of the three stories. The author is Ayyagāri Vīrabhadra, son of Sōmanārādhya of Kauṇḍinyasagōtra

Complete in three Āśvāsas.

**Beginning :**

శా. శ్రీమచ్ఛైలసుతాపయోధరతటీ శ్రీచందనార్ద్రీకృతో
దామోరస్సహము న్భూషణాయితపాతాళంబు శార్ఙ్గిస్వయం
భూమాణిక్యకిరీటరాజితపదాంభోజాతయుగ్మంబును
త్రామాదిత్రిద తహము పరబ్రహ్మంబు భావించెదన్.

ఉ. హారికిరీంద్రవిగ్రహవిహారికి నాశ్రితబృందదుఃఖసం
హారికి భూతదేవనివహారికిఁ గౌస్తుభసంజ్వలన్మణీ

హారికిహస్తపద్మగమహారికి సాగరబాలికామణీ
హారికి వాహనత్ఫణపహారికి శౌరికిఁగేలుమోడ్చెదన్.

* * * *

సీ. కౌండిన్యగోత్రరాకానిశాకరుఁడౌచు
బహుయామములు రవిబద్ధుఁజేసి
యొప్పారుశివదేవయోగియు మొదలైన
యారాధ్యులుదయించి రకులమున
గౌరనారాధ్యుండు మీఱె నాతనికివి
శ్వేశ్వరుండుదయించె నెలమినతని
కుదయించె సుతుఁడు మృత్యుంజయుం డతనికి
సోమన్నయుదయించె సుగుణశాలి
యతనికాత్మజులగుచుఁ జల్లమ్మయందు
నీవురామేశ్వరుం డుదయించినారు
నీవుమద్భక్తుఁడవుగాన నిఖిలశుభము
లొసఁగెద భవత్ప్రబంధంబు నొసఁగు మాకు.

* * * *

క. నేటుఁగబాటిలు బత్తుల
గాటపుమదులనెడుతమ్మిగమిఁద్రిమ్మఱుఁబ
త్తేటికి నీటగుదోసము
మీటించెడి కొండపిటిమేటికిబత్తిన్.

వ. అంకితంబుగా నారచియింపంబూనిన రాఘవయాదవపాండవీయంబను మహాప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన.

**End:**

(సుగంధి). పక్కిఱజక్కిఱనెక్కిఱచొక్కుఱ బల్లిదుండుతూపుగాఁ
జొక్కఱమైన పుడమియల్లు చొక్కఱటంపుఁదేరుగా
నిక్కుఁజెవుల వాపురౌతు నెలవుకొండవిల్లుగా
ముక్కొఱటికలరక్కసులను మోదినట్టిపోటరీ.

**Colophon:**

ఇది శ్రీమదుమా రమణీరమణ రమణీయకరుణా కటాక్షవీక్షణ లబ్ధకించిద్గీర్వాణాంధ్రవిద్యాపరిచయ అయ్యగార్యన్వయ కౌండిన్యసగోత్రపవిత్ర సోమనారాధ్య పుత్త్రసుజనవిధేయ వీరభద్రనామధేయ ప్రణీ

తంజైన రాఘవపాండవయాదవీయంబను మహాప్రబంధంబునందు సర్వంబును తృతీయాశ్వాసము.

సమగ్రము. వ్రాఁత చక్కనిది. తప్పులు లేవు. శైథిల్యము మిక్కిలి. గ్రంథపాతములుండును.

రాఘవ పాండవ యాదవీయమను నీత్ర్యర్థిప్రబంధమున రామ, పాండవ, శ్రీకృష్ణచరిత్రలు పొసఁగించి వర్ణింపఁబడినవి. కౌండిన్యగోత్రుఁడగు నయ్యగారి వీరభద్రకవి కర్త. ఈతఁడు సోమనారాధ్యుని కొడుకు. ఇందుఁ బద్యములకుఁ టిప్పణికూడ వ్రాయఁబడినది. ఈ టిప్పణికూడ గ్రంథకర్తృకృతమే కావచ్చును.

---

## R. No. 415.

Palm-leaf. 15⅜ × 1⅜ inches. Foll 100. Lines, 5 or 6 on a page. Mode of writing, fair but fairly correct. In injured condition.

Purchased in the year 1917-18 from M.R.Ry. Niḍadavōlu Sundaram Pantulu gāru of Vizagapatam.

తత్త్వసంగ్రహరామాయణము.

TATTVASAṄGRAHARĀMĀYAṆAMU.

This Prabandha was rendered into Telugu from Sanskrit by Ākoṇḍi Vēṅkaṭakavi, son of Jagannāthabudha of Āśvalāyanasūtra.

Contains the Sundarakāṇḍa only.

**Beginning:**

క. శ్రీమజ్జాంబవతీయువ
తీమణి మణితస్వనశ్రుతిప్రోద్గతఘూ
ర్ణామోదవికసదురుకరు
ణామాధ్వీభరితహృద్వనజహరికృష్ణా.

సీ. అవధరింపుము శౌనకాద్యఖిలమౌని
జనులకో సూతుఁ డిటు చెప్పె శర్వుఁ జూచి
యనిలసుతుఁడంతఁ దా నేమియాచరించెఁ
దెల్పుమని గౌరి వేఁడ సద్దేవుఁడనియె.

**End:**

మాలిని. హరిహయసుతమోదార్థాదరాత్తప్రతోదా
పరపరిభవభేదానాపాదనాస్త్రప్రభేదా

వరబుధనుతివాదాస్వాదనోద్య ద్వినోదా
హారిముఖసవనాదాహ్లాదనాత్మప్రసాదా.

**Colophon:**

ఇది శ్రీమదాశ్వలాయన సూత్రా (?) త్రపవిత్ర శ్రీమదాకొండి వంశార్ణవపూర్ణిమాత్రేయ సూరిజనగేయ శ్రీమజ్జగన్నాథనామధేయ విద్వత్స్తుతబుధవితతహిత శ్రీరామభద్రకృపారసాసాదితఘనకవిచంద్ర కళానిధాన శ్రీవేంకటాభిధాన ప్రణీతంబైన శ్రీమత్తత్త్వసంగ్రహరామాయణంబున సుందరకాఁడంబు నేకాశ్వాసము.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత మంచిదికాదు. తప్పులు లేవు. శైథిల్య మెక్కువ కలదు. గ్రంథపాతములుండును.

సంస్కృతమున నున్న తత్త్వ సంగ్రహరామాయణమునకొ కొండి వేంకటకవి చేసిన తెలుఁగుసేఁతలోనిది సుందరకాండమాత్రము. కవి ఆశ్వలాయన సూత్రుఁడు. జగన్నాథబుధుని కుమారుఁడు.

---

## R. No. 416.

Palm-leaf. 17¼ × 1s inches. Foll. 312. Lines, 6 or 7 on a page. Mode of writing, good and fairly correct. In fair condition.

Purchased in the year 1917–18 from M.R.Ry. Nidadavōlu Sundaram Pantulu gāru of Vizagapatam.

నారదీయపురాణము.

NĀRADĪYAPURĀṆAMU.

A translation into Telugu Prabandha of the Sanskrit Upapurāṇa of this name, by Allāḍa Narasiṁhakavi, son of Cennayāmātya of Kaśyapagōtra and disciple of Kañcarla Koṇḍamācārya, whose ancestor, Kēśavācārya, is spoken of as having propogated the Rāmānujamata at Ēkaśilānagara. The author speaks highly of Śrīvaiṣṇava religion.

Complete in eight Āśvāsas.

**Beginning:**

శా. శ్రీమైనుండుయుహాంబుదంబు యమునాసింధూర్మిగావార్ద్రమై
ఘూమింజెంది నిజాప్తబంధువయియొప్పంగేకిభవ్యాంగముగా

దాశాళిక ధరియించెనోయన శిఖోత్తంసతరళలాంఛనుండై
శ్యామాత్యంతమనోజ్ఞమూర్తి యగుకృష్ణస్వామి నన్నేలుతన్.

* * * *

సీ. లక్ష్మీసమాఖ్యయాలలనచే గృహమేధి
భావంబుచేఁ జాలఁ బ్రబలినాఁడ
కలితవైభవులు సింగన్నయనంతుండు
నాదిగాఁ బుత్త్రుల నందినాఁడ
శోభితాపస్తంబ సూత్రపవిత్రకీ
ర్తిస్ఫూర్తిచేత వర్తిల్లినాఁడ
అఖిలవైష్ణవరహస్యార్థోపదేశంబు
లనుపమభక్తిమై నందినాఁడ
గీ. నందనందనపూజ నానందవార్ధి
నోలలాడుచుసద్గోష్ఠి నున్నవాఁడ
సూరిమాన్యుండ నల్లాడ నారసింహ
నామకుఁడ సంతతగురు ప్రణామకుండ.
సీ. ఏదేశికాధీశుఁ డిద్ధబుద్ధిస్ఫూర్తి
బ్రహ్మరాక్షసులశాపం బడంచె
ఏదేశికోత్తముం డెదిరించి గెలిచిన
శక్తికిఁ జక్రాంకశక్తి యొసఁగె
ఏదేశికాధ్యక్షుఁ డేకశిలాపురి
నిజమతం బంతయు నిర్వహించె
ఏదేశికశ్రేష్ఠుఁ డాదియై రామాను
జాచార్యవిజయ ధ్వజాంకమయ్యె
నతఁడు వైష్ణవ పీఠసింహాసనస్థుఁ
డుభయవేదాంతవిద్యా మహోన్నతుండు
శుద్ధసాత్త్వికధర్మప్రసిద్ధ కీర్తి
శాలి కంచర్ల కేశవాచార్యమౌళి.

**End:**

మాలిని. కుముదహితకులేశా కోటిసూర్యప్రకాశా
విమలకమలనేత్రా విస్ఫురన్నీలగాత్రా
భ్రమరచికురజాలా భక్తచిత్తాబ్జఖేలా
సమదఖలవిదారీ సర్వలోకావ(ర్తి) ?హారీ ![కోపకారీ ?]

**Colophon:**

ఇది శ్రీమత్కంచర్లకొండమాచార్య పాదారవిందమిళిందాయమాన చెన్నయామాత్యపుత్త్ర కశ్యపగోత్రపవిత్ర శ్రీమదల్లాడనారసింహప్రణీతం బైననారదీయపురాణంబునందు సర్వంబు సప్తమాశ్వాసము.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పులు లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

సంస్కృతమునఁగల నారదీయమను నుపపురాణమున కిది తెలుఁగు. అల్లాడ నరసింహకవి దీనికిఁ గర్త. ఈతఁడు చెన్నయామాత్యుని కొడుకు. కశ్యప గోత్రుఁడు. కంచర్ల కొండమాచార్యుల శిష్యుఁడు. వైష్ణవమతాభిమాని. ఈ కొండమాచార్యుని వంశకర్త కేశవాచార్యుఁడు ఏకశిలానగరమున వైష్ణవమతమును వ్యాప్తపఱిచినాఁడట.

---

## R. No. 417.

Palm-leaf. 14½ × 1⅝ inches. Foll, 38. Lines, 6 on a page. Mode of writing, fair but not correct. In fairly good condition. Many leaves are not found.

Purchased in the year 1917-18 from M.R.Ry, Niḍadavōlu Sundaram pantulu gāru of Vizagapatam.

చిత్రాంగదవిలాసము.

CITRĀṄGADAVILĀSAMU.

A composition in the Yakṣagāna form narrating the story of the prince Dharmāṅgada who was born as a serpent but subsequently assumed the human form by the endeavours of his wife. The author is Ayyagārı Vīrana.

Breaks off in the 3rd Āśvāsa.

**Beginning:**

క. శ్రీకాశీవ్యాదయేశ ది
వాకరకోటిప్రకాశ వాసవనుత భ
క్తాకరసుగుణాకర శశి
శేఖర హర భవవినాశ శ్రీవిశ్వేశా!

వ. అని యిష్టదేవతాప్రార్థనంబు చేసి.

సీ. భూతలంబున మహాపుణ్యుఁడై విలసిల్లు
నయ్యగారీశ్వర నామాంకితునకుఁ
జిన్నయద్వయపుణ్య శీలుఁబుమ్మనమంత్రి
వేంకటాఖ్యులనంగ వెలసె సుతులు (?)
మఱియునందుమ్మనాత్మజులలో వేంకట
శివనాగ్రజుఁడ వీరకవివరుండఁ
దనకిష్టవేలుపై తనరెడు శ్రీవిశ్వ
నాథుని కృపచేత నాకుఁదోఁచు
నట్టులేనంద మొప్ప ధర్మాంగచరిత
మనఁగఁ జిత్రాంగదవిలాసమనఁగ యక్ష
గాన మొనరింతువేడ్కమల్లట్టి జనులు
పాడివినిపింపఁ బుణ్యసంపద ఘటింప.

**Colophon :**

ఇతి శ్రీవిశ్వనాథ కరుణాకటాక్షవీక్షణసరసకవితా సామ్రాజ్యధురంధరఘనయశోబంధుర కౌండిన్యగోత్రపవిత్ర అయ్యగార్యుమ్మనామాత్యపుత్ర సకలవిద్వజ్జనవిధేయ వీరకవినామధేయప్రణీతం బైనచిత్రాంగదవిలాసంబను యక్షగానంబునందు ద్వితీయాశ్వాసము.

**End :**

సీ-గీ. అఖిలబంధుల నెడబాసి యన్యదేశ
మునకు నేతెంచి పంతకంబనకనిందు
విడిచిపెట్టిన నాప్రాణవిభునిమీరు
కాచి రక్షించుఁడీమదిక . . .

(వి-వి.)—

మొదటినుండి మూఁడవయాశ్వాసమునఁ గొంతవఱకున్నది. వ్రాఁత యొకతీరుగా నున్నది. తప్పులు కలవు. శైథిల్యమంతగా లేదు. గ్రంథపాతములున్నవి.

ఇది యయ్యగారి వీరకవిచే రచియింపఁబడిన గేయప్రబంధము. "పాముపాట" యను కథయందలి వృత్తాంతమే యిందు వర్ణింపఁబడినది. దీనికి "ధర్మాంగదచరిత్ర" మను నామాంతరముకలదు. ఈ వీరకవి యుమ్మనార్యునిపుత్త్రుఁడును, గౌండిన్యగోత్రుఁడు నఁట.

## R. No. 418.

Palm-leaf. 13⅞ × 1½ inches. Foll. 169. Lines, 6 or 7 on a page, Mode of writing, not good and incorrect. In injured condition.

Purchased in the year 1917–18 from M.R.Ry. Niḍadavōlu Sundaram Pantulu gāru of Vizagapatam.

శ్రీరంగమాహాత్మ్యము.

ŚRĪRAṄGAMĀHĀTMYAMU.

This Prabandha describing the sanctity of the shrine at Srirangam in the Trichinopoly district is said to be a Telugu rendering of the Sanskrit work of this name consisting of 100 Adhyāyas and included in the Gāruda Purāṇa. The author is Kaṭṭā Varadarāja, son of Kṛṣṇamba and Haridāsarāja of Kṣatriya caste. He speaks of himself as a descendant of the kings Karikālacōla and Bijjala. The author's other work is stated to be Paramabhāgavatacaritra.

Complete in 10 Āśvāsas.

**Beginning :**

శా. శ్రీరామాజనతాశిరోమణినరించెన్ నాథునంకంబుపై
నారాయాంచన వెంత లేదనుచుఁ దా నాముక్తమాల్యంబుతో
శ్రీరత్నోపరిఁబూన్పుధారుణి మనోలీలారతింజొక్కు నా
శ్రీరంగాహ్వయు(య ?) వేంకటేశ్వరుఁడు రక్షించుంబ్రస[న్నా]
[న్నా]వళిన్.

*  *  *  *

ఉ. నన్నయభట్టుఁబ్రెగడను నాచనసోముని సార్వభౌముఁ ది
కన్నను బెద్దిరాజు మొదలైతగు నాంధ్రకవీంద్రముఖ్యులన్
సన్నుతిచేసివారురచనల్ పొసఁగించిన శ్రోవగాంచి యా
యెన్నిక నేనుఁ గొంతరచియించుటకున్ మదినుత్సహించితిన్.

*  *  *  *

గీ. మున్ను నాపేర నంకితంబుగ నొనర్చి
తవనిలోఁ బొగడొంద భాగవతచరిత
మీవుడొనర్పు ప్రబంధమ్ము నిమ్ము నాకు
నంకితంబుగ శ్రీవేంకటాధిపతిని.

*  *  *  *

క. కృతిసేయుము గారుడసం
హితహితమతి మాకుగారుడేలాధరమూ

ర్జితనిజధామం బగుటన్
ప్రతిపత్తి విశేషమగుచుఁ బాటిలుననుచున్.

ఉ. చేయరె తొల్లిసత్కవు లశేషపురాణములుం దెలుంగునన్
[దీ]నియితిహాసమెందు రచియింపమి తావక పుణ్యమెంత యా
మ్నాయ చతుష్కసారము సనాతనగారుడ సంహితాశతా
ధ్యాయి తెనుంగుసేయనొకఁ డర్హుఁడె నేఁటికవీంద్రకోటిలోన్.

మ. హరిదాసక్షితిపాలశేఖరుఁడు కృష్ణాంబాసతీరత్నమున్
జిరకాలంబు రమేశుఁగూర్చి రహిఁ బూజింపంగఁ బూర్వార్జిత
స్థిరపుణ్యంబిది నీస్వరూపమయిమించెం గాన యీభాగ్యమి
ద్ధరపైనన్యులకేలకల్గు వరదేంద్రా! దానచింతామణీ!

* * * *

మ. తెలుఁగుంబిజ్జలరాజశేఖరునికీర్తిస్తోత్రగాథావళుల్
తలమేయెన్నఁగఁ గల్గెరంగవిభుఁ డేతద్వంశవిస్తారుఁడై
బలవత్సంగర రంగభీమధరణీపాలావళీసింహుఁడై
లలనామంగళలక్షణాసహనశైలక్ష్యగ్ధ బాహూగ్రుఁడై.

క. ఆరంగవిభునితనయుఁడు
శ్రీరంగాధీశ్వరాంశ సిద్ధాకృతియై
శ్రీరంగద్వైభవుఁడై
శ్రీరంగప్రభుఁడు వెలసె స్థిరశౌర్యమునన్.

క. ఆకట్టరంగవిభునకు
నాకద్రుమపంచకంబనఁగ గుణరత్న
శ్రీకరనీరాకరమహి
మాకరులై వెలసిరేవురాత్మజులెందున్.

సీ. చత్రాతిపైనాఱియెత్రా ఘొలిచెఁ గట్ట
కత్రాజనుచురిపుల్ కంపమెసఁగ
ఉద్దిరాజులలోన నద్దిరా పేరెందుఁ
బెద్దిరాజుకునన్న వద్దువెలయ
శరదాగమారూఢ శరదాభి నుతకీర్తి
హరిదాసరాజశేఖరుఁడనంగ
రఘునాథతేజోని రఘుసాధితారాతి
రఘునాథరాజన్న రవణమెసఁగ

ఇచ్చి రాకున్నఁ బిలిపించి యిచ్చు రాజ
లచ్చిరాజని యర్థిజాలంబు పొగడఁ
గట్టరంగేశ గర్భముక్తాఫలములు
గలిగి రేవురువారిలో నలఘుయశుఁడు.

**Colophon:**

ఇది శ్రీవేంకటేశ్వరవరప్రసాదాసాదితచాటుధారాసిరాఘాటసగస చతుర్విధచతురకవిత్వరచనాచమత్కారసకలవిద్వజ్జనాధారకట్టహరిదాసరాజగర్భాబ్ధిచంద్రవరదరాజేంద్రప్రణీతంబైన గారుడపురాణశతాధ్యాయి శ్రీరంగమాహాత్మ్యంబను మహాప్రబంధంబునందు సర్వంబును దశమాశ్వాసము సంపూర్ణము.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత చక్కనిది కాదు. తప్పులున్నవి. శైథిల్యము గ్రంథపాతములు గలవు.

శ్రీరంగమాహాత్మ్య మను పేరి యీ పదియాశ్వాసముల రసవత్ప్రబంధము గరుడపురాణమందలి శతాధ్యాయి శ్రీరంగమాహాత్మ్యమునకుఁ దెలిఁగింపు. కర్తకట్ట వరదరాజను క్షత్రియుఁడు. హరిదాసరాజునకును గృష్ణాంబకును గుమారుఁడు. కరికాల చోడఁడు, తెలుంగుబిజ్జలుఁడు తమ వంశమున పూర్వులని యాతఁడు చెప్పుకొన్నాఁడు. ఈ కవి యింతకుముందు పరమభాగవతచరిత్ర మనుప్రబంధమును రచియించెనఁట! వీరి వంశవృత్తాంతాదిక ముదాహృతపద్యములఁబట్టి యెఱుఁగనగును.

---

## R. No. 419.

Palm-leaf. Size, 13¾ × 1¼ inches. Foll. 25. Lines, 6 on a page. Mode of writing, good but fairly correct. In good condition.

Purchased in the year 1917–18 from M.R.Ry. Niḍadavōlu Sundaram Pantulu gāru of Vizagapatam.

ఇల్లమనాయకేంద్రశతకము.

ILLAMANĀYAKĒNDRAŚATAKAMU.

A centum of stanzas in Sīsa metre invoking on one Ciḍi Illamanāyaka, the blessings of Śrī Kṛṣṇa whose erotic sports are incidentally described in the first four lines of each stanza. The poem is composed of sweet little Telugu words but the name of the author is not known.

Complete.

**Beginning :**

సీ. సిరులపై కమ్మలసిరులఁ బిసాళించు
జిడ్డు సంద్రము పుట్టుదొడ్డ కెంపు
కన్నులసింగాణి మన్నీనిఁ గన్నకెం
దలిరుటాకుం బోఁడిగల వెడంద
అొమ్ము నీలపుఱాలు తమ్మి కెంపులమాని
కాలుపచ్చల పుల్గురాలు మూల
రాలుగీలు కొలుపు మేలిమి బంగరు
సందికడెములఁ బెంపొందు నలుబు
జములు ధరియించి దేవకీసతికిఁ బొడమ
చిన్ని కృష్ణుఁడు నీకిడు సిరులగములు
అరికరి మృగేంద్ర ! చీడికులాబ్ధి చంద్ర !
సద్గుణసాంద్ర ! యిల్లమనాయకేంద్ర !

**End :**

సీ. అంభోజనీవగీరంభణక్రియ చేతఁ
గొఱలుచునుండెడు కువలయారి
తుణదానితంబినీమణిసుఖవారాశి
నోలాడుచున్న మహాత్మలారి
సకలగీర్వాణ సంచార విభ్రాజిత
సానుకులాచలసంచయంబు
వివిధపయోరాశి వేష్టితనవఖండ
మండితమగు మహీమండలంబు.
నెంతగాలంబు సుస్థితి నిరవునొందు
నంతగాలంబు నీకృతియలరుగాత
నరికరి మృగేంద్ర ! చీడికులాబ్ధిచంద్ర !
సద్గుణసాంద్ర ! యిల్లమనాయకేంద్ర ! ౧౩౩.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పులు లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

ఇది శ్రీ కృష్ణుని శృంగార విలాసవర్ణనపూర్వకముగా, చీడియిల్లమ నాయకుని యాశీర్వచనమై ముగియు సీసపద్యముల శతకము. చకచని తెలుఁగుఁబలుకులచే హృద్యమయిన యీ శతకమునకుఁ గర్తయెవ్వరో తెలియదు.

## R. No. 420.

Palm-leaf. Size, 15 × 1⅝ inches. Foll. 9. Lines, 8 on a page. Mode of writing, fair and fairly correct. In good condition.

Purchased in the year 1917-18 from M.R.Ry. Niḍadavōlu Sundaram pantulu gāru of Vizagapatam.

కందుల చినవెంకన్నశతకము.

KANDULA CINAVEṆKANNAŚATAKAMU.

A centum of stanzas (Kanda metre) eulogizing one Kandula Cinavenkanna of Bērisetti caste, composed by Rēgulagaḍḍa Sāmbaśivakavi, son of Jōgāmba and Gōpana.

Complete in 103 stanzas.

**Beginning:**

క. శ్రీ గౌరీవాఙ్ముఖుల
కేగణపతి యిష్టసిద్ధులిచ్చిమని పెనో
యాగణపతి మీకీవుత
వేగరిమఁ గందులచిన వేంకన్నార్యా!

**End:**

క. శ్రీరమణచరణవినత
శ్రీరేగులగడ్డ సాంబశివ కృతకృతి యా
తారార్కముగఁ జెలఁగుఁదగ
ధీరతగాను కందుల చిన వేంకన్నార్యా!

క. ధీగురు హిత సాంబశివుఁడ
రేగులగడ్డాన్వయుండ శ్రీమజ్జోగాం
బాగోపనజుఁడఁ జేసితి
వేగృతిగాను కందుల చినవేంకన్నార్యా!

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

"కందుల చిన వేంకన్నార్యా" యను మకుటముతో ముగియు నీ కందపద్య శతకము నీతిస్తుత్యాత్మకము. కర్త రేగులగడ్డ సాంబశివ కవి. జోగాంబాగోపనల కొడుకు. ఈ కందుల చిన వెంకన్న బేరి సెట్టియఁట!

## R. No. 421.

Palm-leaf. Size, 14⅜ × 1⅜ inches. Foll. 55. Lines, 8 on a page. Mode of writing, fair but correct. In good condition.

Purchased in 1917-18 from M.R.Ry. Nidadavōlu Sundaram Pantulu gāru of Vizagapatam.

రాఘవచరిత్రము.

RĀGHAVACARITRAMU.

A poem describing the story of the King Raghu of the solar dynasty, by Kavirāyani Rāmabhadrakavi. It is based on the portion of Kālidāsa's Raghuvaṁsa dealing with this narrative.

Complete in 3 Āśvāsas.

**Beginning:**

ఉ. శ్రీకరుణార్ద్రసైకపరచిత్తుఁడు పల్లవకోమలాత్ముఁడు
ల్లోకనమత్పికోత్సవకరుండు సుమోజ్జ్వలవాసనాగుణ
శ్రీకమనీయమూర్తియు వశీకృతలోకుఁ డతిప్రవృద్ధనా
ళీకచయుండు మాధవుఁ డలీన శుభాంకురదాయి గావుతన్.

* * * *

క. స్థాణునకు నిఖిలభూత
స్థాణునకుపచారవిధి సమాదరపరగీ
ర్వాణునకు మునిసులభని
ర్వాణునకుఁ గృతాదిదానవత్రాణునకున్.

**End:**

చ. అని విజయంబుఁ గైకొని ప్రియాన్వితుఁడై యరుదెంచినట్టి నం
దనుఁ గని గారవించి ప్రమదంబున నాత్మకుటుంబభారమా
తని పయి నిల్పి మోక్షపదతత్పరుఁడయ్యె రఘుక్షితీశుఁడా
య్యనకులధుర్యుఁ డబ్బిన గృహంబున నిల్తురె సూర్యవంశజుల్.

మాలిని.

పురదనుజవిదారీ పూతగంగాంబుధారీ
సరసగుణవిహారీ శైలజాచిత్తహారీ
శరనిధిసునిషంగా శాంతమార్గానుషంగా
కరకలితకురంగా గర్వహీనాంతరంగా.

**Colophon :**

ఇది శ్రీమత్పార్వతీపరమేశ్వర వరప్రసాదాసాదిత కవితాభిరామ భద్రకవిరాయని రామభద్రకవి ప్రణీతంబైన రాఘవచరిత్రంబను మహా ప్రబంధంబునందు సర్వంబును దృతీయాశ్వాసము.

(వి-వి.)——

సంపూర్ణము. మూఁడాశ్వాసములు. వ్రాఁత యొక్క తీరున నున్నది. తప్పులు లేవు. శైథిల్య గ్రంథపాతములు లేవు.

ఈ ప్రౌఢ ప్రబంధమును కవిరాయని రామభద్రకవి రచించెను. ఇందు రఘు మహారాజు వృత్తాంతము వర్ణింపఁబడినది.

---

## R. No. 422.

Palm-leaf Size, 15⅜ × 1⅛ inches. Foll. 32. Lines, 6 on a page. Mode of writing, fair but incorrect In fairly good condition.

Purchased in the year 1917-18 from M.R.Ry. Niḍadavōlu Sundaram pantulu gāru of Vizagapatam.

సోమవారవ్రతమాహాత్మ్యము (ద్విపద).

SŌMAVĀRAVRATAMĀHĀTMYAMU (DVIPADA).

This is the same work as the one described under R. No. 242 (*n*) *ante*.

Complete.

(వి-వి )——

సంపూర్ణము. వ్రాఁత యొక్క తీరుననున్నది. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతము లంతగా లేవు.

ఇది త్రైవి. క్యా. ఆర్. నెం 242 (*n*) రున వర్ణింపఁబడినదే. కర్త యెవ్వరో తెలియరాదు.

---

## R. No. 423.

Palm-leaf. Size, 17 × 1⅛ inches. Foll 51. Lines, 8 on a page. Mode of writing, fair but incorrect. In injured condition

Purchased in the year 1917-18 from M.R.Ry. Niḍadavōlu Sundaram Pantulu garu of Vizagapatam.

లక్ష్యసారము.

LAKṢYASĀRAMU.

A treatise in Yōga and Vēdānta dealing with the nature and characteristics of the various kinds of Yōga, such as, Sāṅkhya, Tāraka, Amanaska, Rājayōga, etc, and of Samādhisiddhi, etc. The author is Rāja, son of Kōṭannamantri of Parāśaragōtra and disciple of Prativādibhayaṅkara Vēdāntacinmaya.

Complete in 2 Āśvasas.

**Beginning :**

సీ. నీలమేఘమువంటి నిర్మలతనువు పై
భసితాంగరాగంబు ప్రబలువాని
కాంచన ప్రభగల్గు ఘనజటాభారంబు
. . . తోమలయువాని
రూఢి కెక్కినయు వెల్గురుద్రాక్షహారముల్
కంఠధామంబునఁ గల్గువాని
నాదబిందు కళాంతనవ్య దివ్యప్రభ
నిలయంబుతాన యైనవాని . . . వాని.

గీ. పరమహంసస్వరూపుఁ బ్రఖ్యాతయశుని
నారదానుగ్రహము నొందినట్టి ఘనుని
శ్రీ గురుస్వామియైన శ్రీచిన్మయులను
బరమభక్తితో సతతంబుఁ బ్రణుతిచేతు.

వ. మఱియు ;

**End :**

మాలిని :—

అమలకమలనేత్రా! అంబుదశ్యామగాత్రా
విమలఘనచరిత్రా విశ్వమాతాకళత్రా
అమితగుణపవిత్రా ఆర్యసద్బృందస్తోత్రా.

**Colophon :**

ఇది శ్రీరామచంద్రవరప్రసాదలబ్ధకవిత్వరచన సుకవిజనబుధారాధనచిత్తపరాశర గోత్రపవిత్ర శ్రీమత్ప్రతివాది భయంకర వేదాంత చిన్మయగురు పదధ్యానపారీణ కోటన్నమంత్రితనూభవ రాజనామాంకితప్రణీతంబైన లక్ష్యసారంబను శ్రీ వేదాంత ప్రబంధంబునందు ధర్మ

రాజునకు నారదుండు జ్ఞానభక్తి వైరాగ్యయుక్తంబైన పూర్ణకుంభకధ్యాన యోగసమాధి లక్షణంబులన్నియును నెఱింగించుటయును హృదయగ్రంథి విచ్ఛేదనంబునన్నది సర్వంబును ద్వితీయాశ్వాసము.

(వి-వి.)——

సమగ్రము. వ్రాంత యొకమాదిరిగా నున్నది. తప్పులున్నవి. శైథిల్యము మిక్కిలి. గ్రంథపాతములున్నవి. గ్రంథారంభము నాల్గు మూఁడాకులు మిక్కిలి తునిగిపోయినవి.

లక్ష్యసారమను పేరుగల యీ వేదాంత గ్రంథమున సాంఖ్యతారకా మనస్క రాజయోగ సాధన లక్షణములు సమాధిసిద్ధి మొదలగు యోగ వేదాంత విషయములు ప్రతిపాదింపఁబడినవి. కర్త రాజన్న. కోటన్న మంత్రికొడుకు. వేదాంత చిన్మయగురుని శిష్యుఁడు.

---

## R. No. 424.

Palm-leaf. 13¾ × 1⅛ inches. Foll. 44. Lines, 6 on a page. Mode of writing, good and correct. In good condition.

Purchased in the year 1917-18 from M.R.Ry. Niḍadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam

ధర్మగోచరిత్రము.

DHARMAGŌCARITRAMU.

A Prabandha in a single Āśvāsa narrating the story of how a cow seized by a tiger kept its word to return after milking its calf and how they all obtained salvation. The author is Śaṅkhula Cōḍaya, son of Śankarāmba. He salutes God Viśvanātha worshipped in the shrine at Narasipura, which may probably be the same as Narasipaṭṭaṇa in the Vizagapatam district.

Complete.

**Beginning :**

ఉ. శ్రీనగజాను ధారసము చేఁదగు దుర్విషశోష జిహ్వకిం
పైనరుచుల్ రచింప ననలాక్షశిఖోష్ణము నెంచి మించి గం
గానదితుంపరల్ గురియఁ గాంతలచేఁ దనుతాప మార్చు మే
ఘానిధి విశ్వనాథుఁడు సదామధురోక్తిఘటించుమత్కృతిన్.

* * * *

అని కృత . . . గావించి స్కాందపురాణంబున శంకర సంహితయందు ఉమామహేశ్వరసంవాదంబున గోప్రసంగంబునందు నాకర్ణయితిహాసంబు ధర్మగోచరిత్రనామంబున సూక్ష్మంబుగా రచియించెదఁ దత్కథావిధానం బెట్టిదనిన.

**End**·

మాలిని. విధివిధునుతిపాత్రా విద్వదంభోజమిత్రా
విధువిధికరభూషా విశ్వమాయావిశోషా
మధుమధురచిదర్థా మర్దితారాతిమూర్ధా
బుధవిబుధనుతాంహః భూరిదేవాఘసింహః.

**Colophon**:

ఇది శ్రీవిశ్వనాథదయోదయ లలితకవితాలతావితానస్ఫుటవాక్కుసుమమంజరీరంజిత కావ్యదివ్యాంగనాచికురనికర ప్రకటీకృత మధుకరాయమానమానస శంకరాంబాగర్భక్షీరపారావార సముత్పన్నసుధానిధాన శంఖులచోడయ్యాఖ్యసత్కవీంద్రప్రణీతంబైన ధర్మగోచరిత్రమను నిర్మలపుణ్యప్రబంధంబునందు సర్వంబు నేకాశ్వాసము.

గ్రంథాంతమం దిట్లున్నది.—

"మన్మథసం॥ పుష్య బ 3 శుక్రవారం పగలు పదిగంటలప్రాద్దేకేసరికి వ్రతిలోనున్న క్రమంగాను శంఖుల చోడయ్య మనవడు నందీశ్వరాఖ్యునిచే సంపూర్ణంగా వ్రాయఁడ మైన దీపుస్తకము."

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పులు లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

గోవ్యాఘ్రచరిత్రమను ప్రసిదకథయే ధర్మగోచరిత్ర మను పేర శంఖుల చోడయ యనుకవిచే నేకాశ్వాస ప్రబంధముగా రచియింపఁబడినది. ఒక గోవు పెద్దపులికిఁ జిక్కి సత్యమాహాత్మ్యముచే ముక్తినిబొందుట యిందలి కథాసారము. కవినిగూర్చి విశేషములు తెలియరావు. నరసిపురపు విశ్వనాథదేవుని స్తుతించినాఁడు. నరసిపురమనఁగా నరసీపట్టణ మగు నేమో.?

## R. No. 425.

Palm-leaf. 9⅜ × 1¼ inches Foll. 89. Lines, 5 on a page. Mode of writing, fair but incorrect. In injured condition.

Purchased in the year 1917-18 from M.R.Ry. Niḍadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam

గౌరీకల్యాణము,
GAURĪKALYĀṆAMU.

This Prabandha describes the marriage of Pārvati and Paramēśvara and the incidents leading thereto. It was composed by Maṅgaḷapalli Sūryanārāyaṇa, son of Vēṅkaṭēśvara of Hāritagōtra.

Complete in three Āsvasas but without the prefatory portion.

**Beginning :**

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాకర్ణియింపం బూనినగౌరీకళ్యాణంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన.

మ. అమరస్త్రీజనగానఘూర్ణితదరీవ్యాప్తేందుకాంతస్రవ
త్కమనీయామలవారియుక్తదివిషద్గంగాసమాలోకన
భ్రమదాయాతమరుద్విమానయుతశుంభచ్ఛృంగసంఘంబుతో
హిమవంతుండలరారు నుత్తరదిశం బృథ్వీధరాధీశుఁడై.

ఉ. ఆనగరాజుకూటములనంటుచు నేఁగెడు తారకాళి పం
చాననపోతశాతనఖరాగ్రహతద్విపకుంభనిర్గతం
బైన విశుద్ధమౌక్తికసమాజముగాఁ దలపోసి చెంచురా
చానలు చేరనేఁగ నవి చాగిన నిచ్చరపోదు రచ్చరల్.

**End :**

క. నీతిజితాశన సంగర
భూతేశ వధూకదంబ పుష్పాస్త్రరిపు
క్ష్మాతలనాథ కిరీటమ
శీతల్లజకేసరౌఘనిచితపదాబ్జా.

భుజంగప్రయాతము.

సురాధీశ సద్భోగ శుభ్రాంశుకీర్తి
సరోజాతసంభూతసామ్యార్యబుద్ధీ
కురంగేక్షణా మారకోటిప్రకల్పా
దరీసంచరద్వైరిధాత్రీతలేశా.

**Colophon :**

ఇది శ్రీమదిష్టదేవతావరప్రసాదలబ్ధోభయ . . . . . .
కవితాచాతురీధురీణాంతఃకరణమంగళపల్లివంశపయః . . . .
హారితసగోత్రాభరణ వేంకటేశ్వరతనూభవసూర్యనారాయణ.

(వి-వి.)—

కృత్యవతరణిక లేదు. వ్రాంత తిన్ననిది. శైథిల్యము మిక్కిలి. గ్రంథపాతము లనేకముగా నున్నవి.

గౌరీపరిణయమను నీ మూఁడాశ్వాసముల ప్రబంధమునఁ బార్వతీ పరమేశ్వరుల వివాహకథ వర్ణింపఁబడినది. గ్రంథకర్త మంగళపల్లి సూర్యనారాయణుఁడు. వేంకటేశ్వరుని కుమారుఁడు. హారితసగోత్రుఁడు.

R. No. **426**.

Palm-leaf. 14⅝ × 1⅜ inches Foll 121. Lines, 6 on a page. Mode of writing, fair and correct. In injured condition.

Purchased in the year 1917–18 from M.R Ry. Niḍadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam

ఐరావతచరిత్రము.

AIRĀVATACARITRAMU

A literary composition in the Yakṣagāna form narrating the same story as is contained in the Airāvatacaritra described under R. No. 119 *ante*. The author is Daruvūri Appalācārya, son of Raṅgārya of Ātrēyagōtra. For further particulars about the author, see extracts given below.

Complete.

**Beginning :**

క. శ్రీసింహాచలవాసుం
డాసరసిజభవభవాఖిలామరవినుతుం
డాసరసిజాలయావిభు
డాసర్వేశ్వరుఁడు హరిదయం బ్రోచు మమున్.

సౌరాష్ట్రి - దరువు త్రిపుట.

శరణు శరణు హరీ !
శరణు శ్రీకమలామనోహర శరణు హరిగిరిమందిరా

శరణు నారదముఖమునీశ్వర సారసావళిభాస్కరా! శర॥ శర॥
పరమపూరుష పద్మలోచన పద్మనాభ జనార్దనా,
వరద దామోదర సుదర్శనధర ధరాధర శ్రీధరా! శర॥ శర॥

* * * * *

ద్విపద. శ్రీలకు నెలవయి చెన్నొందుచున్న
పాలమున్నీటికిఁ బ్రతియగుచున్న
యాత్రేయగోత్రంబు నందుద్భవించె
చిత్రంబుగా శ్రీనృసింహార్యమౌళి
యానవ్యగుణనిధి కాత్మజులైరి
శ్రీనివాసార్యులు శ్రీజగన్నాథ
వెంగళసుందర వినుతనామముల
సంగతి నొప్పెడు సద్గుణశాలు
లందు శ్రీశ్రీనివా సార్యశేఖరుని
సుందరియగుచును సొబగొందుచున్న
నరసమ్మగర్భంబు నను జన్మమొంది
నిరుపమగుణముల నెగడుచునున్న
నరసింహగురువరునకుఁ దమ్ములగుచు
మఱిజగన్నాథార్యమౌళికి నగ్ర
జన్ములౌ రంగార్య జనశేఖరునకు
సన్మతి రంగాంబ సతియయ్యె మఱియు
శ్రీమాధవులమాడిరిఁ జెలఁగుచునున్న
యామహాత్ముల కగ్రపుత్త్రుండు
రహి శ్రీనివాసార్య రంగార్యులనఁగ
సహజన్ములరయ లక్ష్మణనామధేయుఁ
డను సర్వజనును వేడుక నప్పలార్యు
లనఁగఁ బేరొందనువాఁడ హరిపేరఁ గృతులు
దేవభాషను గొన్ని తెలుఁగున గొన్ని
ప్రావీణ్యమునఁ జేసి భక్తినర్పించి
యనుదినియనిమతి నూహతో నిప్పు
డొనరించు నైరావణోత్తమచరిత
మను నామమున నొప్పునది యక్షగాన
[illegible]నర శ్రీనరహరి కొసఁగఁ దలంచి.

**End:**

క. దరువూరి యప్పలార్యుం
డరుదుగ నైరావణవ్రతాఖ్యానము తా
విరచించెను గురుభక్తికి
నిరవుగ నే తేటి పార్వతీ . . .

**Colophon:**

వ. . . . . . . . హయగ్రీవనిర్హేతుక కటాక్షలబ్ధోభయభాషాకవిత్వ చాతుర్యోదార్యసకలకవిమిత్రాత్రేయగోత్రపవిత్ర శ్రీనివాసా . . . . . విధేయ దరువూర్యప్పలాచార్యనామధేయప్రణీతంబగు నైరావత చరిత్రం బను యక్షగానం . . . .

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత తిన్ననిది. తప్పులు లేవు శైథిల్యము హెచ్చు. గ్రంథపాతములున్నవి

టై. ఆర్. నెం 119 రున వర్ణితమగు గ్రంథమునందలి కథయే యక్షగానరూపమున దరువూరి అప్పలాచార్యకవి యిట్లు రచియించినాడు. కవిని గూర్చి యుదాహృత గ్రంథభాగమునం జూచునది.

---

## R. No. 427.

Paper. 10⅝ × 8¼ inches. Foll. 21. Lines, 20 on a page. Mode of writing, good but in correct. In good condition.

Transcribed in the year 1917–18 from M.R.Ry. Mantri Veṅkaṭasānnayya Gāru of Ākipūdi, Kistna district.

వచనవిచిత్రరామాయణము.

VACANAVICITRARĀMĀYAṆAMU.

This is the same work as the one described under R. No. 218 *ante.*

Incomplete. Contains the portion wanting in the MS. described under the above noted number

(వి-వి.)—

అసమగ్రము. వ్రాంత తిన్ననిది. తప్పులున్నవి. శైథిల్య గ్రంథ పాతములు లేవు.

ఇది టై. క్యా. ఆర్. నెం 218 రున వర్ణితమైన గ్రంథమున లేని ప్రారంభభాగము.

## R. No. 428.

Palm-leaf. 14¾ × 1¼ inches. Foll. 150. Lines, 7 or 8 on a page. Mode of writing, fair and fairly correct. In fairly good condition

Purchased in the year 1917--18 from M.R.Ry. Niḍadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

### సంకల్పసూర్యోదయము.
### SAṄKALPASŪRYŌDAYAMU.

A Telugu rendering in the form of a Prabandha of the Sanskrit drama, Saṅkalpasūryōdaya of Vēdāntadēśika, which is an allegorical work in support of the Viśiṣṭādvaitavēdānta, like Kṛṣṇamiśrás Prabōdhacandrōdaya. The author is Rāyaḍappa Raṅgarāya, son of Subbamāmba and Annarāya. He bears the title Sarvajña. The reading of this MS. in regard to the portion dealing with the acquisition of kingdom by the royal author varies from that found in the printed edition.

Contains ten Āśvāsas.

**Beginning:**

ఉ. శ్రీ తనయంకమందున వసించి మెఱుంగుతెఱంగు చూపవి
ద్యోతితశార్ఙ్గ మింద్రధనురున్నతిఁ బూనమునీంద్రచాతక
వ్రాతములం గృపాలలితవర్షముగా ముదమందఁ జేయుఁజీ
మూతసమానచారుతరమూర్తి ముకుందుఁడు మమ్ముఁ బ్రోవుతన్.

* * * *

శా. కందాళాన్వయదుగ్ధవారినిధిరాకాచంద్రునిన్ సంతతా
నందోపేతుని వేంకటాఖ్యుని రమానాథాంఘ్రిభక్తాగ్రణిన్
మందారేందుసమానకీర్తిధను సస్మద్దేశికాగ్రణ్యునిన్
గందర్పోజ్జ్వలసుందరాకృతిని వేడ్కన్ సన్నుతింతున్ మదిన్.

సీ. బహుసంస్కృతాంధ్రప్రబంధనిర్మాణవి
చక్షణుం డతిశుభలక్షణుండు
సద్గ్రంథత్రయాన్విత జ్యోతిషజ్ఞానవి
భ్రాజితుం డవనీశపూజితుండు
సత్యయుతాఖిలజనసన్నుతప్రియ
భాషణుండు దయావిభూషణుండు
కోటికలపూఁడిసత్కులపయోరాశిసు
ధాకరుం డుచితగుణాకరుండు

మైథిలీవల్లభాంఘ్రి తామరసభంభ
రాయమాణసమగ్రాంతరంగుఁ డగుచు
నెఱు వేంకటకృష్ణాహితాగ్ని మత్పు
రోహితుని సన్నుతింతు సిరూఢమతిని.

శా. తర్కవ్యాకరణాగమాంతముఖశాస్త్రప్రద్యవిజ్ఞానబా
లార్కస్ఫోటితకామలోభమదమోహక్రోధమాత్సర్యసం
పర్కన్ శ్రీకరిమెళ్లవంశజుని దీవ్యత్సుబ్బయాభిజ్ఞునిన్
గోర్కిన్ మత్కృతికిన్ సహాయుఁడగుటన్ గూర్మిన్ దలంతున్
[మహిన్.

* * * *

గీ. వారిలోపల యనపోతవసుమతీశుఁ
డాదిరాజులతో సమమైనవాఁడు
శత్రుభూపాలకుల నెల్ల సంహరించి
రణము మడిపెను సంగ్రామరంగమునను

గీ. తత్కులంబున నుదయించె ధైర్యశౌర్య
వైభవైశ్వర్యగాంభీర్య వర్ణనీయుఁ
డగుచు సర్వజ్ఞనృపుఁడు భాగ్యాతిశయము
నం జయించును నిర్జరనాథుసేన.

* * * *

మ. హరిపాదోద్భవులైన వెల్మదొరలత్యంతప్రతాపాఢ్యు;లా
దొరలం దెన్నఁగ రావువారు బలవంతు;ల్మేటి సర్వజ్ఞభూ
వరుఁడా రావుకులీనులం దతనిసద్వంశంబునం బుట్టు స
త్పురుషు లాకరణజన్ములంచు గుణవంతుల్మెత్తు రెల్లప్పుడున్

క. లింగవరంగేంద్రుండా
వంగళమునఁ బుట్టి ప్రబలవైరినృపాలో
త్తుంగోత్తమాంగములఁ జర
ణాంగుష్ఠము మోపి ధరణి నతఁ డేలుకొనెన్

క. తనరాజధాని బొబ్బిలి
యను నగరముఁ జేసికొని సమగ్రబలమునన్
జనులను బాలించెను రిపు
మనుజేంద్రు లుపాయనము సమర్పణచేయన్

శా. కొట్టెం బస్తరుదేశ ముత్కళుల నాక్రోశింపఁగాఁజేసెఁ జే
పట్టెన్ బర్బరభూమిపాలకులసామ్రాజ్యంబు సౌరాష్ట్రులన్
గట్టెన్ మత్తగజాంధ్రులన్ లఘుగపుత్రాభర్తలన్ గాఁదలన్
బెట్టెన్ లింగపరంగరాయఁడతనిన్ బృథ్వీపతుల్మెచ్చ రే *

* * * *

మ. సహజుల్ వేంకటవేంగళక్షితిపతుల్ శత్రుక్షమాభర్తలన్
గుహలందూరఁగఁ జేయఁగా నెలమితో గోపాలకృష్ణేంద్రుఁ డీ
మహి యేలెన్ నలకార్తవీర్యసగరక్ష్మాజాధిపానంగరం
తిహరిశ్చంద్రభగీరథప్రముఖ ధాత్రీభర్తలన్ బోలుచున్.

క. గోపాల కృష్ణగంగో
ర్వీపతికిఁ గుమారుఁడగుచు వేంకటరాయ(రంగ)
క్ష్మాపాలుఁడు బొబ్బిలిలో
నేవునను వసించి రాజ్యమేలెఁ జతురుఁడై.

* * * *

క. ఆవేంకటరంగధరి
త్రీవిభుఁడు సమగ్రదివ్యదేశంబులకున్

* * *

---

* ఈ లింగపరాయని తదనంతరమున
వెంగళరాయభూపతియు,
నతని తర్వాతను
శ్రీరంగపతియు,
నాపిమ్మట
వేంకటవిభుఁడు,
నాపైని
జనార్దన రంగభూరమణుఁడు,
నాతని వెనుక
రాయడప్పయు,
నటుపిమ్మట
గోపాలరాయఁడును రాజ్యము నేలిరి.

ఇతనికి గోపాలకృష్ణరంగోర్వీపతి, వేంకటవిభుఁడు, వెంగళరాయఁడునను ముగ్గురు పుత్రులు.

బోవఁగఁ దదీయరాజ్య
శ్రీవిభవము లాక్రమించిరి విమతనృపతుల్.

గీ. వెలమవారు కొండ తెలిమి మీతండ్రి వ
ద్దికిని నప్పుడేగుదెంచి పలికి
రనఘపద్మనాయకాధారమగు రాజ్య
మన్న్య లాక్రమించి రన్నరాయ.

ఉ. నీజనకుండు బోగిధరణీపతి వైరివసుంధరేంద్రులన్
దేజమణంగఁ జేసె; భవదీయపితామహుఁ డన్నరావు వి
భ్రాజితసౌమ్యుఁడై రిపునృపాలకులన్ జతురంగయుక్తుఁడై
యాజి జయించి గైకొనె సమగ్రగతిన్ యిలమండలాదులన్.

* * * *

ఉ. తావకసోదరుం డచలధైర్యుఁడు వేంకటరాయఁ డొక్కఁడే
శేవదలిర్పఁగా సమరసీమఁ గృపాణముఁ గేలఁబూని దం
తావళముఖ్యవైరిబలదర్ప మణంపఁగ నోపు నుర్వి నా
నావనిపాలకుల్ కలియుగార్జునుఁడంచు నుతింతు రాతనిన్.

ఉ. నీపినతమ్ముఁడౌచు ధరణిం దనరారెడు కృష్ణరాయధా
త్రీపతి సంగరంబున నుదీర్ణగతిన్ వసియింప దేవసే
నాపతియైనమానసమునం జలియించును దక్కనట్టివా
రోవుదురే రణంబున సముద్ధతితో నెదిరించిమార్కొనన్

సీ. గీ. కడిమి నితఁడేయటంచు నిన్గంటి వేంక
టావనీశుండుతన పుత్రియైననుబ్బ
మాంబికను నీకొసంగెఁ బయఃపయోధి
చక్రపాణికి లచ్చి నొసంగినట్లు.

శా. నీ వాసాధ్విని బెండ్లియాడి హితులు న్క్షేమంబునం జెందఁగా
ధీవిన్ గంటివి రాయఁడప్ప యను పట్టిన్ దద్ధరాభర్త పా
రావారావృతమేదినీభరము దోర్దండంబునన్ బూనుమే
ధావుల్మెచ్చనటంచుఁ బలుకుదు రిలన్ దైవజ్ఞచూడామణుల్.

ఉ. దైవబలంబు దోర్బలము ధర్మబలంబుఁ బ్రమాబలంబు సే
నావరమంత్రిసోదరజనద్రవిణాదిబలంబులెల్ల ను
ర్వీవలయంబునం గలిగి వేంకటరంగనరేంద్రు రాజ్యల
క్ష్మీవిభవంబు శాత్రవులు చేకొన నూరకయుండఁ బాడియే.

క. మీయయ్యలైన యన్నా
రాయుఁడు తద్బంధువచనరచనల విని య
న్యాయపరులైన రిపుభూ
నాయకులజయించెఁ దత్క్షణంబున ననిలోన్.

మ. రిపులంబాఱఁగఁదోలి బొబ్బిలిధరిత్రీనాథునిన్ గ్రమ్మఱన్
నృపతుల్మెచ్చఁగఁ దత్పురిన్నిలిపెఁ బెంపేపార మీతండ్రి నే
రుపుతో వేంకటరంగభూవిభుఁ డపుత్త్రుండై హయస్యందన
ద్విపవిత్తాదులతోడ మీకొసఁగె మైత్రిన్ రాజ్యమాత్మీయమున్

* * * *

ఉ. ఖేచరసన్నుతారిభయ కృష్ణమహీయ విలాసవిభ్రముల్
యాచకరక్షకు ల్దశరథాత్మజతుల్యు లనంజెలంగు శ్వే
తాచలరంగభూపతి జనార్దనరాయనిసీతరామచం
ద్రోచితనాము వేంకటనృపోత్తముఁ గంటివి లోకులెన్నఁగన్

* * * *

వ అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన సంకల్ప సూర్యోదయం బను వేదాంతనాటకంబు నకుఁ గథాక్రమం బెట్టిదనిన

**End :**

చ. అనఘులు బ్రహ్మవిద్య ననయంబుపఠింతురు గాత యుర్వరి
త్రిని బగిపూర్ణధర్మముగరిష్ఠగతిన్ వసియించుఁగాత యి
య్యనమురవైరివాగ్విషయుఁడై కరుణాంబుధియై సువక్తయై
వినఁదగువాఁడునై మదిని వేమఱుఁ బ్రీతిఁ జెలంగుఁగావుతన్.

మాలినీ. నరకహర మురారీ నారదస్తోత్రపాత్రా
నరనుత యదునాథా నందగోపాలపుత్రా
సురవరవరదాశ్రీ సుందరీస్తుత్యగాత్రా
పరమపురుష దైత్యప్రాణవల్లీలవిత్రా.

**Colophon :**

ఇది శ్రీవేణుగోపాలకరుణాకటాక్షవీక్షణపరిలబ్ధసకలసామ్రాజ్యవిరాజమాన రావువంశకలశపారావారపరిపూర్ణచంద్ర సమాన, నిఖిలశాస్త్రవాసనాసముదితవిజ్ఞాన, శ్రీ అన్నారాయ పుత్ర సుబ్బమాంబికాగర్భ

శుక్తిముక్తాఫలోపమాన రాయరాహుద్వేశ్యాభుజంగసర్వజ్ఞాది మహా బిరుదాధేయ సమరవిదళితామిత్ర రాజాధిరాజమహారాజ తేజోనిధి మహారాజ శ్రీరాయడప్పరంగారాయనామధేయప్రణీతంబైన సంకల్ప సూర్యోదయం బను వేదాంతనాటకంబునందు నిశ్శ్రేయసలాభంబను దశమాశ్వాసము.

(బి-బి.) —

సమగ్రము (పదియాశ్వాసములు). ప్రాఁత యొకతీరుననున్నది. తప్పు లంతగా లేవు శైథిల్య గ్రంథపాతములు లేవు.

అద్వైతవేదాంత ప్రతిపాదకముగాఁ గృష్ణమిశ్రుఁడు ప్రబోధచంద్రోదయ నాటకమును రచియించినట్లు విశిష్టాద్వైత వేదాంత ప్రతిపాదకముగా వేదాంతదేశికులు రచియించిన సంకల్పసూర్యోదయ నాటకమున కిది ప్రబంధ రూపముగు తెలుఁగుసేఁత. రచయిత శ్రీరాయడప్ప రంగారావు. ఇతఁడు బొబ్బిలి నేలిన ప్రభువు. అన్నారాయనికిని సుబ్బమాంబకును బుత్త్రుఁడు. రాయరాహుద్వేశ్యాభుజంగసర్వజ్ఞేత్యాదిబిరుదములుగలవాఁడు. ఈ బొబ్బిలిరాజ్య మితనికి వేంకటరంగవిభునిచే నభిమానపూర్వకముగ నొసంగఁబడియెనఁట. సుప్రసిద్ధవీరుఁడగు గోపాలకృష్ణరంగారాయలకుఁ బుత్త్రుఁడగు నీవేంకటరంగరాయలు తీర్థయాత్ర చేయఁబోయినపుడు రాజ్యము శత్రువులపాలైపోఁగా నాతనిబంధువును గృతికర్త తండ్రియునగు నన్నారాయఁడాశత్రురాజులం బాఱఁదోలి మఱల నారాజ్యము నాతనికైవసమొనరించినట్లును, తర్వాత నాతఁ డపుత్రకుఁ డౌటచేత నీకృతిపతికి రాజ్యము నొసఁగినట్లును దెలియవచ్చుచున్నది. ముద్రితప్రతులయందుఁ బైయట్లుగాక వేంకటరంగవిభుఁ డీకృతికర్తను దత్తపుత్త్రునిగా గ్రహించెనని మార్పఁబడియున్నది. అందే కృతికర్త వంశాదివిషయకములగు పద్యములును ఆశ్వాసాంతగద్యములును వారి యభిప్రాయానుగుణముగ మార్పఁబడినవి. ముద్రిత గ్రంథమునందుఁ గృతికర్త కీతతండ్రులవృత్తాంతము పట్టుననే భేదముచూపట్టుచున్నది. తత్పూర్వులవిషయమున నంతగా భేదము చూపట్టదు.

ఈ గ్రంథకరణమునం దీకవికి గరిమెళ్ల సుబ్బయ్య యను నాతఁడు తోడుపడెనఁట. ఈ కవి కందాళ వేంకటార్యుని శిష్యుఁడు. కొటికలపూఁడి వేంకటకృష్ణసోమయాజి యీతని పురోహితుఁడు. విశేషముల నుదాహృతభాగమునం గాంచునది.

## R No. 429.

Palm-leaf. 12¾ × 1¼ inches. Foll. 41 Lines, 6 on a page Mode of writing, good but incorrect. In good condition.

Purchased in the year 1917-18 from M.R Ry Nidadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

భామకలాపము.

BHĀMAKALĀPAMU.

A kind of literary composition intended to be sung in accompaniment to gesticular representations It deals with the love pangs of Satyabhāma caused by separation from her lord, Kṛṣṇa.

Complete

**Beginning:**

శా. శ్రీవిఘ్నేశ్వరపాదపద్మములనే సేవించి నాయాత్మలో
భావింతుం బరమేష్ఠి నచ్యుతుని సద్భాలేందుమౌళిం దగన్
శ్రీవాగ్వాణి రమన్ హిమాచలసుతన్ శ్రీలొందమేల్సన్నుతుల్
గావింతుంగృతికర్తఁ బ్రోచుటకు నాకావ్యార్థ మీడేర్పఁగన్.

త్రిపుట, దరువు.

అంబుజాసనురాణి వారిరాణిగొలువాగా, అంబావో.
తుంబురునారదాదులు హెచ్చిపాడేరు, అంబావో.

**End:**

సీ. అంతరంగంబైన సంతోషమకరూడ
బాహ్యంబులికరూడ భాసురాంగి
సంగీతసాహిత్యసల్లాపమకరూడ
మటుమాయలికరూడ మందయాన
మురిపెంబుగలముద్దు మోహాలుబులకరూడ
కోపంబులికరూడ కోమలాంగి
సరసంబుసమరతుల్ జరుపుటలకరూడ
జాలంబులికరూడ జలజగంధి
ఇంతకపటంబునను జేసె నెమ్మె కాఁడు
వేడుకలుమీఱి యుదితాను నేకమయ్యె
మానినీ వినుమీ యింకమాటలేల
అకరూరుక్మిణియింటికి నరుగుమనవె!

నారాయణాచ్యుతానంత కృష్ణముకుంద కందర్పజనక మంగళమునీకు
మాధవగోవింద మధుసూదనోపేంద్ర కరిరాజవరద మంగళమునీకు
గోపాలజనపాల గోపాంగనాలోల కరుణాలవాల మంగళమునీకు.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

భామకలాప మనుపేరుగల యీ పీఠిభాగవతమున సత్యభామావిరహము వర్ణింపఁబడినది. కర్తపేరు తెలియదు.

---

## R. No. 430.

Palm-leaf. 17¼ × 1⅛ inches. Foll. 44. Lines, 5 on a page. Mode of writing, good and fairly correct. In fairly good condition.

Purchased in the year 1917–18 from M.R.Ry. Nidadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

(*a*) ఆంధ్రనామసంగ్రహము.

ANDHRANAMASAṄGRAHAMU.

Foll. 1*a*—29*a* Fol. 291(*b*) is left blank.

This is the same work as the one described under R. No. 4 (*a*) *ante.*

By Paiḍipāṭi Lakṣmaṇakavi.

Complete.

(వి.వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. శైథిల్య మించుకకలదు.

ఇది ఆర్ నెం 4 (*a*) లోన వర్ణితమైనదే.

---

(*b*) ఆంధ్రనామశేషము.

ĀNDHRANĀMAŚEṢAMU.

Foll. 30*a*—37*b*.

By Aḍidamu Sūrakavi. This is the same work as the one described under R. No. 4(*b*) *ante.*

Complete.

(బి.బి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

ఇది ఆర్ నె 4 (*b* రున వర్ణితమైనదే.

---

(*c*) ఆంధ్రభాషారత్నాకరము.

ĀNDHRABHĀṢĀRATNĀKARAMU.

Foll 38*a*—44*b*.

This is the same work as the one described under R ˢ o 39 (*b*) *ante*. By Paidipāti Lakṣmanakavi.

Contains the third Āśvāsa only

(బి-బి)—

మూఁడవయాశ్వాసము మాత్ర మున్నది. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

ఇది ఆర్ నె 399(*b*) రున వర్ణితమైనదే; కాని యీ రెంటను గద్యము కొంత భేదించుచున్నది. ఇందు గద్య మిట్లున్నది.

"ఇది శ్రీమదుమామహేశ్వర వరలబ్ధకవిత్వవైభవ పైఁడిపాటి యేకామ్రమంత్రితనూభవ లక్ష్మణకవిప్రణీతంబైన యాంధ్రభాషారత్నాకరంబను నైఘంటికశాస్త్రంబునందు సర్వమును దృతీయాశ్వాసము.

---

## R. No. 431

Palm leaf $11\frac{5}{8} \times 1\frac{1}{4}$ inches. Foll. 44. Lines, 5 on a page. Mode of writing, good and fairly correct. In injured condition.

Purchased in the year 1917-18 from M.R.Ry. Niḍadavōlu Sundaram Pantulu garu of Vizagapatam

(*a*) రామతీర్థ శ్రీరామసేవ

RĀMATĪRTHAŚRĪRĀMASĒVA.

Foll. 1*a*—14*b*.

Songs composed by Gōgulapāṭi Kūrmanāthakavi and addressed to God Śrī-Rāma worshipped at Rāmatīrtha, a village near Vizianagram (Vizagapatam district). These songs were intended to be sung during the performance of various acts of formal worship.

Incomplete.

**Beginning :**

సౌరాష్ట్రరాగం. త్రిపుటతాళం.

శరణుశరణుమహా!

శరణుశరణు అహల్యాపావన శరణు దశరథనందనా
శరణు తాటకప్రాణహరణా శరణు సీతావల్లభా!
సకలసురగణ యక్షకిన్నరసేవితపదపంకజా
నిఖిలమునిగణవనసరోరుహానిలయ మాగమగోచరా!

**End:**

రేగుప్తిరాగం, త్రిపుటతాళం.

మగువానిన్నెదనమ్మినదిరా నామాటగైకొనవేరాగదరా
తగవుమాలియింతదయజూడవైతివే మగువాబోధించేరామదనజనకనిన్ను.
ఎన్నాడు లేనిదియేమీ మా, కన్నెపైఁగోపము లేమీ
మన్నించిమాటాడవేమీ, ఇతి మాలినదయఁజూడవేమి
ఇన్నాళ్లూరా పతిద్ధేశుఁడనినుఁబాసియున్నాదిగాదురయెన్ని చెప్పినగాని——
(ది-ది.)——

అసమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పు లంతగా లేవు. శైథిల్యము గ్రంథపాతములుగలవు.

ఇందు శ్రీరామతీర్థమున వెలసిన రామదేవునిమీఁద గోఁగులపాటి కూర్మనాథ కవిచేఁ జెప్పఁబడిన పాటలు గలవు. ఇవి యీ దేవుని యుత్సవకాలమందుఁ బాడుదురు.

---

(*b*) లక్ష్మీనారాయణ సంవాదము.

LAKṢMĪNĀRĀYAṆASAṀVĀDAMU.

**Foll. 15*a*—44*b*.**

A Prabandha narrating the life incidents of Tirumaṅgaiyāḻvār, a Tamil Vaisnava saint, by Gōgulapāṭi Kūrmanāthakavi, son of Buccanāmātya and disciple of Tirumala Peddinṭi Sampatkumāra Vēṅkaṭācārya. The work was dedicated to God Śri-Rāma worshipped at Rāmatīrtha (Vizagapatam district).

Breaks off in the second Āśvāsa.

**Beginning :**

క. అతులితపదరేణుధురీ
కృతగౌతమమానిసుందరీపాషాణా
కృతికింగృతికృతనిజకథ
కృతికిన్ శ్రీరామతీర్థగిరిరఘుపతికిన్.

వ. సమర్పితంబుగా నా యొనర్పంబూనిన లక్ష్మీనారాయణసంవాదంబను మహాప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన.

**Colophon :**

ఇది శ్రీమన్నారాయణచరణదాస్యపవిత్ర గోఁగులపాటి బుచ్చనామాత్యపుత్త్ర శ్రీతిరుమలపెద్దింటి సంపత్కుమార వేంకటాచార్య దేశికానుగ్రహసనాథ శ్రీకూర్మనాథప్రణీతంబైన లక్ష్మీనారాయణసంవాదం బను మహాప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము

**End :**

సీ. అనవద్దివిజవిజ్ఞానముద్రితహృద్వి
తానమత్సంధాన తే నమోస్తు
దీనకారుణ్య                    మాన్యవ్ర
త్తైనథామజితేన తే నమోస్తు
మేనమోహితదైత్యసేనమోహితభక్త
ధీనమోదితపాప తే నమోస్తు
మాననిస్తులమానిమానసస్థ

(వి-వి.)——

అసమగ్రము. తొలియాశ్వాసము, మలియాశ్వాసముఁ గొంత వఱకుఁ గలదు. వ్రాఁత తిన్ననిది. శైథిల్యముకలదు. గ్రంథపాతములును గలవు

తిరుమంగయాళ్వారు చరిత్రమే, లక్ష్మీనారాయణ సంవాద మను పేర గోఁగులపాటి కూర్మనాథుఁడను కవిచేఁ బ్రబంధరూపమున రచియింపఁబడినది. కవి బుచ్చనామాత్యునికొడుకు. తిరుమలపెద్దింటి సంపత్కుమార వేంకటాచార్యుని శిష్యుఁడు.

---

**R. No 432.**

Palm-leaf. 16¼ × 1¼ and 17¼ × 1¼ inches. Foll. 184. Lines, 5 or 6 on a page. Mode of writing, fair but incorrect. In fairly good condition.

Purchased in the year 1917-18 from M. R. Ry. Niḍadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

## రామరసామృతసింధురామాయణము.

## RĀMARASĀMṚTASINDHURĀMĀYAṆAMU.

This is a Prabandha, based on the Telugu prose version made by Baṇṭupalli Rāmaya of the Rāmāyaṇa written in the Oriya language. The author of the Telugu Prabandha is Gaṇḍrēṭi Guravaya, son of Narasiṁhadāsāmātya of Kāśyapagōtra. He belongs to the caste called Sṛṣṭikaraṇa.

Breaks off in the Yuddhakāṇḍa

**Beginning** :

క. శ్రీలక్ష్మీమనోహర
నీరదకాలాంబర సురారినికరహరప్రలం (?,
బారిన కాలాంబరవిమలాం
భోరాశిగభీరనిఖిలభువనాధారా.

క. రామరసామృతమను నాక
రామాయణకావ్యసుకథ రచియించితి భువిఁ
దేమముఁ జెందుకొ ఆకుశుభ
నామకనీకేను సర్వేశం బొసగింతున్.

* * *

క. ఇకథాపూర్వమునందు ను
దకథనుదికథానవచించెఁదాఁగనోఢ్రముగా
నొకకథధరణీసుపర్వం
డకథ తెలుఁగునను వచనముయ్యె ధరిత్రిన్.

గీ. అక్షిపవచనకావ్య మలరారవచియించెఁ
జిత్రగుప్తవంశశేఖరుండు
ధరను బంటుపల్లి రామయామాత్యుండు
గురుగుణాఢ్యుఁడు సృష్టికరణవరుఁడు.

* * * *

సీ. పూర్వతపస్సుగాఁబోలును ఫలియించె
నేమొక్కో మామకాదృష్టరేఖ
యింతనిపాగను దిదేయరిదియె నాదు
జన్మమిన్నాళ్లకు సఫలమయ్యె
ననఘమౌరామరసామృతసింధువ
నే యొకసుకథరామాయణంబు

గలదది గ్రంథంబు గావింతు నాకుఁదోఁ
చినరీతి నితుల నెమ్మనములోను
బుద్ధిపుట్టించె శ్రీరామమూర్తి తనదు
పాదపద్మంబు నమ్మినభక్తజనుని
పైనిగరుణారసం బన్నల్పంబుగాక [?]
నుల్లమందున నిండుగానుండుఁగాదె.

**Colophon:**

ఇది శ్రీరామకృష్ణపాదారవిందమకరందపుష్పంధయ పార్వతీవరప్రసన్న చిత్రగుప్తకులశేఖర కాశ్యపసగోత్ర గండ్రేటిసోమనాథపౌత్త్ర నరసింహదాసామాత్యపుత్త్ర గురవయనామధేయప్రణీతంబైన రామరసామృతసింధురామాయణంబునందు సుందరకాండ సంపూర్ణము.

**End:**

క. కాచెఁ బాలుండై మా
రీచుమదమణఁచి సుబాహు వృజినస్వాంతున్
వేచదిపి గాధిసుతమఖ
మాచంద్రార్కముగ నాతఁడానందింపన్.

(వి-వి.)—

మొదటినుండి యుద్ధకాండముఁ గొంత కఁగలదు. వ్రాఁత యొక తరబడిగానున్నది తప్పులు గలవు. శైథిల్యము కలదు. గ్రంథపాతములు గలవు

రామరసామృతసింధువను పేరుగల యీ రామాయణమును, ఓఢ్రభాషలో నొకబ్రాహ్మణుఁడు వ్రాసిన గ్రంథమునుబట్టి బంటుపల్లి రామయ యను సృష్టికరణము తెలుఁగున రచియించిన వచనగ్రంథమును జూచి గండ్రేటి గురవయ యనుకవి రచియించినాఁడు. ఈతఁడును సృష్టికరణమే. కాశ్యపగోత్రుఁడు. నరసింహదాసామాత్యుని కొడుకు.

---

## R. No. 433.

Palm-leaf. $14\frac{5}{8} \times 1\frac{1}{8}$ inches. Foll 15. Lines, 6 on a page. Mode of writing, not good and not quite correct. In fairly good condition.

Purchased in the year 1917–18 from M R Ry Nidadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam

వేణుగోపాలశతకము.

## VĒṆUGŌPĀLAŚATAKAMU.

A centum of eulogistic stanzas in the Sīsa metre addressed to God Vēṇugōpāla, worshipped in the shrine at Bobbili. The author is Janārdana Raṅgārāya, a former Rāja of Bobbili

Contains the first 55 stanzas only.

**Beginning:**

సీ. సిరులవెలుంగుబొబ్బిలిపురవరమునఁ
బరగుశ్వేతాచలపతి నరవర
మందిరోత్తరభాగమందుఁ జెన్నొందుకుం
దనపుఁగప్పులసొంపుతళుకులొలుకు
పకిరారాపచ్చకంబములనీలపురాల
మేలిగోడలఁజాల మిక్కుటంపు
జేడామిను మొనలు బెనఁగుననుకడాని
గుమ్మముల్ గల గోపురంబులునలు
గవనులవెలయఁజెలఁగు మంగళతరాల
యమునరుక్మిణి సత్యభామాదిమదవ
తులుగొలువ నిల్చునీకు నతులుసలిపెద
భవ్యగుణజాల వేణుగోపాలబాల !

**End:**

సీ. ముంజేతమురుగులు మురిడీలు వెలుఁగదం
డలబాజుబందులు డంబుమీఱ
చౌలమేల్ముత్యంపు చౌకట్లు దనర శి
రంబునమణికిరీటం బెసంగ
నజూఁతబంగరు చంద్రహారముల్ తులకింపఁ
గొనచెవి బావిలీ మినుకులీన
మొలఁగుందనపునిగ్గు మొలత్రాడు చెలువొంద
వ్రేళ్లను రత్నముద్రికలు చెలఁగ
రమణనేతెంచు నీయొయ్యారంబుఁ జూడ
ముద్దుగులుకంగ దేవిడివద్ద నిలుచు
సతనుయుద్ధంబునకుయోధయైనరాధ
భవ్యగుణజాల వేణుగోపాలబాల !

(ఖ-వి.)—

అసమగ్రము. ఏఁబదియైదుపద్యములున్నవి. వ్రాఁత మంచిది కాదు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు కలవు.

"భవ్యగుణజాల వేణుగోపాలబాల" అను మకుటముగల యీ సీసపద్యముల శతకమున బొబ్బిలిపురమున రాజప్రాసాదమున కుత్తర దిక్కున వెలసిన వేణుగోపాలమూర్తి స్తుతియింపఁబడినాఁడు. కర్త బొబ్బిలిపాలకుఁ డగుజనార్దన రంగారాయప్రభుఁడు.

---

## R. No. 434.

Palm-leaf. 11 × 1¼ inches. Foll. 51. Lines, 5 or 6 on a page Mode of writing, bad but correct. In fairly good condition.

Purchased in the year 1917-18 from M R Ry. Nidadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam

(*a*) భల్లాణదండకము.

BHALLĀṆADAṆḌAKAMU.

Foll 1*a*—32*b*.

A poem describing the story of King Bhallāṇa composed in the Daṇḍaka metre by Naḍiminṭi Rāmajōgi, son of Lakṣmīnṛsiṁha. Reference may be made to R. No 280 *ante* for the story herein described

Complete.

**Beginning.**

దండకము శ్రీజానకీమానసాంభోజధామానవశ్యామశోభావరాభూతనీలాంబుదస్తోమభామామనఃకామకామాంతకస్తుత్యభాస్వద్గుణారామరామాభిరామామహావీరకోదండరామాసముద్దామసంగ్రామరంగస్ఫురద్భీమనానేర్చుచందంబునన్ నైమిశారణ్య :—

**End:**

నీయిష్టసంసిద్ధిగావింతు లెమ్మంచునాలోకనాథుండు శ్రీమల్లమావల్లమాంబాసమేతంబుగాఁగన్ రథారూఢుఁగావించి భల్లాణభూపాలుఁదోడ్తోంచురంభానటీనాట్యముల్ మీఱఁగా దుందుభిధ్వానముల్ మ్రోయఁగా నాత్మకైలాసముంజేర్చి భృంగీశ్వరాదిష్టవర్గంబులో నొకఁడింగాఁ గటాక్షించి సర్వప్రపంచావళీరక్షణాక్షీణదాక్షిణ్యదీక్షాత్ముఁడైయుండె దా

ఖ్యాయణీప్రాణనాథుండు శ్రీమద్వ్యసద్మాన్వయోత్పన్న కౌండిన్యగోత్రాఢ్య లక్ష్మీనృసింహపౌత్త్రభూరామయోగిప్రణీతైనదుత్తుంగభల్లాణరాడ్దండకంబొప్పు నాచంద్రతారార్కమై శ్రోతృగాత్రప్రజాంచచ్చుభోదర్కమై శ్రీమతే వీరకోదండరామాయ పట్టాభిరామాయతుభ్యం నమస్తే నమస్తే నమః॥

ఉ. రాణదలిర్పఁజెప్పిరఘురాముని కంకితమిచ్చినాఁడ భ
ల్లాణచరిత్రదండక మలత్క్యము సేయఁగఁబోక యాంధ్రగీ
ర్వాణరసజ్ఞులైనకవివల్లభులార పరీక్ష సేయుఁడ
క్షీణపదార్థగర్భరససిద్ధమదీయకవిత్వతత్త్వముల్,

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిదిగాదు. తప్పులు లేవు. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

ఈ భల్లాణదండకము, నడిమింటి రామయోగికవిచే రచియింపఁబడినది ఈతఁడు లక్ష్మీనృసింహుని కుమారుఁడు. ఇందలి కథకు డి.క్యా. ఆర్. నెం. 280 చూచునది.

(b) భద్రాద్రిరామదండకము.

BHADRĀDRIRĀMADAṆḌAKAMU

Foll. 33a—48b.

This is a poem in the Daṇḍaka metre composed in praise of God Śrī Rāma worshipped in the shrine at Bhadrācalamu. The author's name is not known

Complete.

**Beginning**:

దండకము. శ్రీజానకీచిత్తకాసారసంచారహంసా రఘూత్తంస ఘోరాసురధ్వంస కాకుత్స్థవంశాబ్ధి రాకాసుధాధామ నీలాంబుదశ్యామదివ్యాశుగస్తోమసంధానలీలాలసల్లాఘవా రాఘవా రామభద్రాజగద్భద్ర :—

**End**:

ఓ దేవ నీవుంగృపాంభోధివిఁగాన నాకుం బునర్జన్మమింతేనివారించి మీపాదపంకేరుహధ్యాన సేవన్ గృపన్ మించి రక్షింపుమో రామ ధారాధర శ్యామదైత్యేంద్రహృద్భీమ సద్భక్తహృత్పద్మ దామాయ భద్రాచలప్రేమ ధామాయ శ్రీరామదాసేశనామా నమస్తే నమస్తే నమః॥

(వి-వి.)—

సమగ్రము వ్రాంత మంచిది కాదు. తప్పులు లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

భద్రాద్రిరామస్తుత్యాత్మకమైన యీశతకమునకుఁ గర్త యెవ్వరో తెలియరాదు.

(c) రామదండకము.

**RĀMADANḌAKAMU.**

Foll. 49a—51b.

A poem in the Daṇḍaka metre praising Śrī Rāma The author's name is not known.

Complete.

**Beginning:**

శ్రీరామరామా త్రిలోకాభిరామా పరంధామనిష్కామసంపూర్ణకామాఖిలేంద్రాంతరంగాబ్ధిసోమా సద్దివ్యనామావిరాజద్గుణస్తోమ ... త్రికాలస్వరూపంబవాచ్యంబచింత్యంబనంతంబు—

**End:**

నిర్గుణబ్రహ్మమాత్రుండవైయొప్పు నీదివ్యతత్త్వంబు నీసంభృతాంచత్కటాక్షంబుచేతం గనుంగొంటిదేవా నమస్తే నమస్తే నమః॥

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత మంచిది కాదు. తప్పులు లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

శ్రీరామస్తుత్యాత్మక మగునీదండకమునకుఁ గర్త తెలియరాదు.

---

## R. No. 435.

Palm-leaf. 18½ × 1½ inches. Foll. 380. Lines, 6 or 7 on a page. Mode of writing, good but not correct. In fairly good condition.

Purchased in the year 1917-18 from M.R.Ry. Niḍadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

లక్ష్మణవిజయము.

**LAKṢMAṆAVIJAYAMU.**

A poetical work describing the story of the Rāmāyaṇa and composed by Behara Rāmakṛṣṇakavi, son of Bairāgi of Bhāradvāja gōtra

and a disciple of Tirukkacci Rāghavācārya He belongs to the Sṛṣṭikaraṇa class. This poet is also the author of the Nalacaritra, the Dharmāṅgacaritra, and the Jagannāthacaritra.

Complete in 8 Āśvāsas.

**Beginning :**

ఉ. శ్రీకళ్యాణధురీణు రావణశిరశ్ఛేదాస్త్రపారీణుఁ బు
ణ్యాకల్పోన్నతకౌశికాధ్వరతపోవ్యాపారనిర్వాణుఁ గం
శేకాలోజ్జ్వలచాపనిర్దళదకుంఠీభూతబిభ్రాణును
శ్లోకుఁ శ్రీకగనారదాదిమునిసంస్తుత్యామరత్రాణునిన్

* * * *

ఉ. కుప్పిలిసూర్మనాగ్రణిసుకోవిదుదాశరథిన్ సుధీమణిన్
అప్పలనార్యచంద్రువరవాలునృసింహులు నన్నయార్యున
య్యప్పనుకృష్ణజగ్గయల నాయతకీర్తిధురీణులైధరన్
మెప్పగు మేనమామల మనీషివరేణ్యుల నెంచి మ్రొక్కెదన్.

* * * *

చ. కనులకు నొప్పివచ్చికృతిగ్రంథము వ్రాయఁగ నడ్డమౌటచే
తను వెతనొంద సజ్జనని దన్పఁగ స్వప్నములోమదగ్రజా
తనుగొనివచ్చినాయన మృతస్థితురాలిది దీనినీకృతిన్
ఘనమతినుంచుమంచుఁబలుకన్ వినిమ్రొక్కి ఘటించితీగతిన్.

క. ఆతల్లి తన కుమారిక
తోతాండవకృష్ణదుగ్ధతోయధిశయనా
సీతాపతిరాఘవయని
గీతమ్ములు పాడి తానదృశ్యతనొందెన్.

* * * *

క. ఈతమ్ములు విద్యార్థులు
భూతలమునరామకృష్ణపూతాహ్వయవి
ఖ్యాతుండను సూరిజనో
పేతుండను శౌరికరుణవీతాఘుండన్.

క. కరిపతి హరిపతి నరపతి
వరకార్యధుగంధర ప్రవర్తకులై యి
ద్ధరణిఁ బ్రసిద్ధిం గాంచిన
కరణమ్ములలోన సృష్టికరణకులజుఁడన్.

క. సల ధర్మాంగ జగన్నా
థుల దివ్యచరిత్రలసితధూర్జటి శ్రీరా
ములకృతులిచ్చి రచించితి
నలువుగఁ జెప్పెదను లక్ష్మణవిజయ మొప్పన్.

క. శ్రీలక్ష్మణవిజయము గో
పాలవరేణ్యునకొసంగి భవబంధకముల్
దూలించెదనని ప్రజ్ఞా
శాలత విహరింతు శుభములం బొడగాంతున్.

* * * *

సీ. విభూతిరేఖలు శోభనాకారమ్ముగా
ఫాలభాగంబుపైఁ బ్రస్ఫురింప
భద్రముద్రితదివ్యరుద్రాక్షమాలికల్
గళసీమ నొకవింతఁ గదలుచుండ
తనుభూతివిస్ఫూర్తిహిమధామసుందరరుచుల్
పండువెన్నెలకాంతి నిండి వెలుఁగ
వ్యాకోచనవనళినీకషాయద్యుతుల్
సొంపారు కనుదోయి నింపుఁగులుక

శ్రీమహాదేవమూర్తి వేంచేసి నేను
గల్లమున నొకర్రే తెల్విగాఁ బరుండఁ
జదువుకొన్న సహస్రకోవిదులు నీకు
సాటిగారంచుఁ దానదృశ్యత్వమొందె.

**Colophon:**

ఇది శ్రీమత్సర్వమంగళా దేవతావరప్రసాదలబ్ధకవితావిశారద శ్రీమత్తిరుకచ్చి రాఘవాచార్యదేశికచరణదాస్యపవిత్రశ్రీమద్భారద్వాజగోత్రోద్భవ చంద్రశేఖరపౌత్త్ర బైరాగిపుత్త్ర విద్వజ్జనవిధేయ రామకృష్ణనామధేయప్రణీతంబైన శ్రీలక్ష్మణవిజయం బను మహాకావ్యంబునం దష్టమాశ్వాసము సర్వము సంపూర్ణము.

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పు లున్నవి. శైథిల్యమంతగా లేదు. గ్రంథపాతములు లేవు.

ఇది కొహారా రామకృష్ణకవి రచియించిన లక్ష్మణవిజయమను నెన్మిదాశ్వాసముల ప్రబంధము. రామాయణకథయే యిందలి యితివృత్తము. ఈ కవి తిరుకచ్చి రాఘవాచార్యుని శిష్యుఁడు. భారద్వాజ గోత్రుఁడు. బైరాగి కొమారుఁడు. స్పష్టీకరణము. ఇంతకుముందీతఁడు నల, ధర్మాంగద, జగన్నాథచరిత్రములను రచియించినాఁడట!

---

## R No. 436.

Palm-leaf. 17⅝ × 1¼ inches. Foll. 156. Lines, 6 on a page. Mode of writing, good and correct. In good condition.

Purchased in the year 1917–18 from M.R.Ry. Niḍadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

శేషధర్మములు.

SĒṢADHARMAMULU.

By Veṇuturupalli Viśvanāthakavi This is the same work as the one described under R No, 78 *ante*,

Wants the first Āśvāsa and a few stanzas in the beginning of th- second Āśvāsa.

(వి-వి.)—

గ్రంథారంభమున ముప్పది పత్రములు పోయినవి. తక్కిన గ్రంథ మెల్లఁగలదు. వ్రాఁత మంచిది. శైథిల్యము లేదు. గ్రంథపాత ములు లేవు.

ఇది ట్రై. క్యా. ఆర్. నె 78 రున వర్ణింపఁబడినదే.

---

## R. No. 437.

Palm-leaf. 15½ × 1⅜ inches. Foll 250. Lines, 5 or 6 on a page. Mode of writing, good (by two different scribes) and fairly correct. Four leaves are broken in the beginning. In injured condition.

Purchased in the year 1917–18 from M.R.Ry. Niḍadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

సురతాణీపరిణయము.

SURATĀṆĪPARIṆAYAMU.

A Prabandha describing the incidents that led to the marriage of a foster-daughter of the Sultan at Delhi with God Raṅganātha of Śrīraṅgam. The author is Vārāṇāsi Acyutarāmakavi, son of Yarrama

and Narasiṁhakavi of Bhāradvājagōtra ; and he states that the work was composed with the assistance of Daruvūri Appalācarya and at the instance of Mariṅgaṇṭi Bhaṭṭar Rāmānujācarya, who was the author of a number of works like Gaṇacaturthyupākhyāna. The work was dedicated to God Varāha-Nṛsimhasvāmi worshipped at Siṁhācalam. The date of composition of the work is given as Śaka 1716 The MS. under notice was written by Daruvūri Appalācārya

Complete in 6 Āśvāsas

**Beginning :**

సీ.గీ. అతఁడు గుణశాలి రిపువనవితతకీలి
భవ్యమఱిగఁటిభట్టరన్వయపుధౌరి
మాలి తారామనోహారిమహిత విద్వ
దబ్జగణహేళి! రామానుజార్యమౌళి.

క. వేడుక మీఱఁగ నతఁడొక
నాఁడు దమకు వాసమైతనర్చిన శ్రీగు
జ్యా?డాగ్రహారమునఁ గవి
రాడాప్తులతోడ సభనురంజిలి కరుణన్.

సీ. సురుచిరాపస్తంబసూత్రు భగద్వాజ
గోత్రువిద్వత్కవికోటిమిత్రు
ఘనవారణాసి సాంబనపౌత్రునరసింహ
సుకవికి నెల్లమాంబకు సుపుత్త్రు
రహిమీఱు నెనమంద్రరామయోగికిని దౌ
హిత్రుసద్గుణనుతిపాత్రు నుతన
యుండయితగు రామయోగికగ్రజుఁ గవి
నచ్యుతరామాఖ్యనలరునన్నుఁ
బ్రియము మీఱఁగబ్రిలిపించి పెద్దయును బ
హూకరించి కృపారసము నిట్లు
వలికె గాంభీర్యమృదువచః పటిమ మెఱయ
నచటికవివరులానందమంది వినఁగ.

శా. శ్రీరామాంఘ్రిసరోజ భక్తిగుణ వర్ధిష్ణుండవ ణవా
క్సూరాపూరితసత్కవిత్వసరసాంభోరాశి వార్యానుసే
వారంభుండవు మాకుశిష్యుఁడవు నీవన్నింటవిన్నాణి వా
కౌరాయచ్యుతరామనామసుకవీంద్రా సాంద్రతేజోనిధీ.

చ. మునుపు సమస్త సత్కవివిభుల్ రచియించిరనేక కావ్యముల్
వెనుకను నేను జెప్పితిఁ బవిత్రముగా మఱికొన్ని యిప్పుడీ
వనువుగ నొక్క కావ్యము రసాంచితవృత్తిరచించి శ్రీవరా
హ్వనరమ్యగేంద్రు పేరను సమర్పణ సేయుము మేలు సేకుఱున్.

క. అరయఁగ నది పరతానీ
పరిణయమన యక్షగానపద్ధతిగాము
న్విరచింపంబడె నిప్పుడు
విరచింపుము గద్యపద్య విశ్రుతకృతిగాన్.

గీ. ఎనయఁగానిట్లు పలుకఁటయేరచింప
నేరకయుఁ గాదు నీకృతి నేర్పు మేఱ
తెలియుటకుఁగాని నరసింహాదేవుకరుణ
నెనయరచియించు గురుకట్నమిదియుఁగాఁగ.

గీ. కృతులు విన్నఁ బ్రబంధము నెంచి చేయు
మనుచుఁ జెప్పె యాపేక్ష సేయక సహాయ
మగుచునుండుదు దీనికి హరిగిరీశుఁ
డైనకిరి నరహరి కర్త యగుటఁ జేసి.

* * * *

సీ. అవిపలిక యేధీరునర్మిలి తాత ద
యాళి శ్రీనివాసార్యమౌళి
యేనూగితండ్రి నానాసుగుణామృతాం
భోరాశి రంగార్యపుణ్యమూర్తి
యేకపీంద్రుని తల్లి లోకాభినుత పతి
వ్రతగుణనికురుంబ రంగమాంబ
యేపండితుని తమ్ము లెలమి నిశ్రీనివా
సార్య బుచ్చార్య రంగార్య లక్ష్మ
ణార్యులాత్రేయగోత్రజు లట్టిగుణయు
తుండు దరుపూరియప్పలార్యుండు తోడు
పడఁగ నేతత్ప్రబంధంబు పద్యకావ్య
ముగ రచింపఁ గడంగితి ముదముమీఱ.

**End:**

ఉ. ఈయితిహాస మెవ్వరు పఠించిన వ్రాసిన విన్నవారికిన్
శ్రీయు నమేయకీర్తి శుభసిద్ధియు దారతనూజవృద్ధివి

ద్యాయతబుద్ధిపెరాతుము నుదారతఁ గోరినయుల్లాసంగడిఁ
శ్రీయుతుఁడైన రంగఁడు ధరిత్రిని సత్కరుణార్ద్రచిత్తుఁడై.

* * * *

**Colophon:**

ఇది శ్రీజానకీరమణ చరణారవిందనిష్యంద మరందపానకందళి తానందస్వాంతసరోజ శ్రీనృసింహాకవిరాజ తనూజ భరద్వాజసగోత్ర పవిత్రసాంబనార్యపౌత్త్ర సకలసుకవిజనమిత్ర మఱింగంటిభట్టరు రామానుజాచార్య గురుకరుణాకటాక్ష లబ్ధసరసకవిత్వ భాగధేయవారణాసి యచ్యుతరామనామధేయ ప్రణీతంబైన సురతాణిపరిణయంబను శృంగారరసప్రధానమగు ప్రబంధంబునందు సర్వమును షష్ఠాశ్వాసము.

క. పదునాఱుమార్లపయి నేఁ
బది తొమ్మిదియయ్యె గద్యపద్యమ్ములు దీ
నఁదగుగథాశ్వాసములకు
మదనజనక భక్తజనకమలయమజనకా.

మ. విరచింపంబడె నీప్రబంధము జగద్విఖ్యాతిగా రామచం
ద్రరమే పశాలివాహన శకాబ్దాళిఁ రసాగతుమా
ధరచంద్రాంచిత సంఖ్యకాంతర రసన్మానోన్నతానందవ
త్సరసత్కార్తిక శుక్లసప్తమిని భాస్వత్సైరివారమ్మునన్.

క. క్షితిని భావాఖ్య వత్సర జ్యేష్ఠశుక్ల
పక్షమున ద్వాదశ గురువాసరంబు
సరికిసురతాణి కన్యకాపరిణయంబు
నాగర దరువూరియప్పలార్యుఁడు లిఖించె.

(వి-వి.)—

సమగ్రముకాని గ్రంథారంభమున నాల్గయిదు పత్రములు తునిఁగి పోయినవి. వ్రాఁతమంచిది. తప్పులు లేవు.

సురతాణీ పరిణయమను నీయాఱాశ్వాసముల ప్రబంధమున శ్రీరంగ నాథుఁడు తురుష్క కన్యకావల్లభుఁ డగుకథ వర్ణింపఁబడినది. గ్రంథ కర్త వారణాసి యచ్యుతరామకవి. భారద్వాజగోత్రుఁడు. ఎల్లమ కును నరసింహకవికిని గొడుకు. ఏనమంద్ర రామయోగికి దౌహిత్రుఁడు. ఈ గ్రంథమురచించుటలో దరువూరి యప్పలాచార్యుఁ డీకవికిఁ దోడు

పడినాఁడట ! తన గురువగు మతింగంటి భట్టరు రామానుజాచార్యుని ప్రేరణచే నీకృతిని కవిరచియించి వరాహగిరి నృసింహస్వామి కంకితము చేసినాఁడు. ఆ రామానుజాచార్యుఁడు గణచతుర్థ్యవాఖ్యానాది ప్రబంధములరచియించినాఁడట ! —— ఈ గ్రంథము శాలివాహనశకము 1776 అగు నానందసంవత్సరమున రచింపఁబడెను. కృతిరచనమునఁ గవికిఁ దోడ్పడిన దరువూరి యప్పలాచార్యుఁడే యీ ప్రతినివ్రాసినాఁడు. విశేషము లుదాహృతభాగములఁబట్టి గుర్తించునది. రామానుజాచార్యుని వంశవృత్తాంతము గలగ్రంథభాగము శిథిలముగానుండుటచే నుదాహరింప లేదు.

---

R. No. 438.

Palm-leaf. 11¾ × 1⅛ inches. Foll. 152. Lines, 5 or 6 in a page. Mode of writing, good but not quite correct. In injured condition.

Purchased in the year 1917-18 from M.R.Ry. Nidadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

పారిజాతము.

PĀRIJĀTAMU.

A Yakṣagāna describing the story of the bringing of the tree called Pārijāta from the heaven to the earth by Śri-Kriṣṇa; by Burijāla Lakṣmīnārāyaṇadāsa son of Nāgayāmātya of Kāśyapagōtra and a disciple of Tirumala Tātācārya. This was composed at the instance of Pālakoṇḍa Rāmabhadranṛpati.

Complete.

**Beginning:**

శ్రీకరంబుగఁ జంద్రశేఖరుపుత్త్రు
నేకదంతుని మదినిష్టసిద్ధులకు
నీకృతి నిర్విఘ్నమే పారఁజేయ
లోకైకవంద్యుమేలుగ భజియించి
నారాయణునకుఁ బ్రణామంబొనర్చి
క్షీరాబ్ధితనయను జింతనసల్పి
ధాతకు భక్తి వందనముగావించి
భూతేశు నాత్మలోఁ బొలుపొంద వేఁడి
వారిజభవురాణివాక్కుకొనవేఁడి

* * * *

నాకు దోఁచినరీతి నరులకింపొందఁ
బారిజాతంబు సద్భక్తిరచించి
పేరుగాధరణిలోఁ బెంపొందగాను.

* * * *

సీ. శ్రీవేంకటేశ్వరు సేవించి గణనాథు
పాదపద్మములకుఁ బ్రణతిచేసి
వ్యాసవాల్మీకుల కతిభక్తినతిసల్పి
కాళిదాసాదిసత్కవుల వేఁడి
సకలవిద్వజ్జనసమితిని నుతియించి
తిరుమలవంశప్రదీపకులగు
తాతార్యగురునకుఁ జేతులుజోడించి
ధరలోనఁబారిజాతంబువెలయ
పద్యగద్యద్విపదపదభరిత మగను
వరుసరచియింతుఁ బురిజాలవంశ జుఁడను
పాపయామాత్యపౌత్రుండఁ బరగనాగ
యాగ్రణికి నంతమాంబకునగసుతుఁడ

క. శ్రీరంగజల్లెడులక్ష్మీ
నారాయణదాసుఁడనెడు నామమువాఁడన్
చేరాకాశ్యపగోత్రుఁడ
ధీరులు మెచ్చంగ నీకృతినిరచియింతున్.

గీ. పాలకొండాన్వయుఁడు రామభద్రనృపతి
నన్నుఁదగినట్టి సంభావనలను దనిపి
కృష్ణునకుఁ బారిజాతమంకితమొనర్చి
చెప్పుమన యక్షగానమేఁ జేసితిట్లు.

**End :**

మాలిని. విలసితపటుచాపా విశ్వవిఖ్యాతరూపా
కలితగుణవిచారా కామినీచిత్తచోరా
సలలితఘనకీర్తీ సంతతానందమూర్తీ
జలజనయనశౌరీ సాధులోకోపకారీ

**Colophon.**

ఇది శ్రీమద్రమారమణీమణీనాథపాదారవిందసన్మిళింద శ్రీవేంకటేశ్వరవరప్రసాదలబ్ధకవిత్వవైభవ కాశ్యపగోత్రోద్భవ పాపయరాజ

పౌత్త్రి నాగయామాత్యపుత్త్రి లక్ష్మీనారాయణదాస ప్రణీతంబైన పారిజాతంబను యక్షగాన ప్రబంధంబునందు సర్వంబు నేకాశ్వాసము.

(వి.-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పులంతగా లేవు. శైథిల్యము గ్రంథపాతములు గలవు.

శ్రీకృష్ణుని పారిజాతాపహరణకథను దిరుమలతాతాచార్యుల శిష్యుఁడును కాశ్యపగోత్రుఁడును, నాగయామాత్యపుత్త్రుఁడును, నగు బురిజాల లక్ష్మీనారాయణదాసుఁడు యక్షగానముగా రచియించినాఁడు. పాల కొండ రామభద్రనృపతి యాతని నీగ్రంథమును రచియింపను త్సాహపెట్టినాఁడట.

---

R No. 439.

Palm-leaf. 14¾ × 1⅛ inches. Foll 21. Lines, 5 on a page. Mode of writing, fair but incorrect. In injured condition.

Purchased in the year 1917-18 from M.R.Ry. Nidadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam

చాంపేయశతకము.

CĀMPEYAŚATAKAMU.

A centum of stanzas in the Sīsa metre composed in praise of Śrī-Kṛṣṇa worshipped at Campakāraṇya; by Godavarti Appalācāryadāsa.

Complete in 109 stanzas.

**Beginning**:

సీ. శ్రీలచే నలరారు చిఁదంబుచక్రంబు
గదఖడ్గధనువులు కరములందు
ఘనతర శ్రీవత్సవనమాలికలు లచ్చి
తోఁబుట్టురతనంబు తోరమైన
యురమున మెఱయంగ నురుకిరీటాంగద
హారకాంచీకంకణాంగుళీయ
మంజీరకింకిణుల్ మహితతత్త్వాన
ములనొప్పనతిజగన్మోహనముగ
దేవకీగర్భమునఁబుట్టి తేజరిల్లు
నట్టినినుఁగొల్తు నందుని యనుఁగుఁబట్టి

వరగుణాధార చాంపేయవనవిహార
బాలగోపాల రాధికాకేళిలోల.

**End:**

సీ. తర్క-వైశేషికోదర్క-పాతంజల
వైయాసికీతంత్రవాగ్విశేష
పరిచయసాహిత్యపాండిత్యమిసుమంత
గలుగఁజేసితివని గర్వమంది
కోకిలికిశబ్దముల్ కొన్నిదొంతరపెట్టి
తద్దివ్యనామాంకితముగ గరపి
అలగొడవర్త్యప్పలాచార్యదాసుఁడు
పద్యశతకమొనర్చి నీపాదయుగళి ?
దార్చెఁ గైకొనియాచంద్రతారకముఁగ
బ్రబలఁజేయుము ధరణి శుభప్రచార
వరగుణాధార చాంపేయవనవిహార
బాలగోపాల రాధికాకేళిలోల 108

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁతమంచిదికాదు. తప్పులు మెండు. శైథిల్యము గ్రంథపాతములు గలవు.

"వరగుణాధార . . . . కేళిలోల" అనుమకుటముగలిగి చంపకారణ్యక్షేత్రవాసియగు బాలగోపాలస్తుత్యాత్మకమయిన యీసీసపద్య శతకమును గొడవర్తి అప్పలాచార్యదాసుఁడు రచియించినాఁడు.

---

R. No. 440.

Palm-leaf. 13¼ × 1 inches. Foll 49. Lines, 5 on a page. Mode of writing, good and correct. In good condition.

Purchased in the year 1917-18 from M.R. Ry, Niḍadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

సుకుమారీపరిణయము.

SUKUMĀRĪPARIṆAYAMU.

A Yaksagāna describing the story of the marriage of Nārada with Sukumārī, daughter of king Sṛñjaya; by Pōḍūri Vēṅkaṭadāsakavi.

A small portion is wanting in the end

**Beginning:**

ఉ. శ్రీధర మందరోద్ధర వశీకృతశంకర సిద్ధయక్షవి
ద్యాధరవైనతేయవిబుధస్తుతనామ దినేంద్రధామగో
త్రాధర ధీర దుర్ధరితదారుకశోరకుఠార చిత్రర
మ్యాధికవేంకటాచలవిహార కృపాకర వేంకటేశ్వరా !

భైరవిరాగం-అటతాళము.

వేంకటేశ తేనమోనమో, వేంకటేశ శ్రీవేంకటాగనివేశ, పంకజలోచన, పాపవిమోచన, దీనజనావన మౌనిసురార్చన దానవభంజన దాసహృద్రంజన మంజులభాషణ మణిమయభూషణ రంజితాశ్రితగణ రక్షితవారణ.

**End:**

వరాళిరాగం, ఆదితాళం.

ఎంతోభాగ్యముమాకు ఋషిగొల్లుండౌట, కెంతోపుణ్యముమాకు, ఎంతోభాగ్యము మాకు చింతలెల్లనుబాసె సంతతమత్యంతసంతోషమాయెను.

మున్నునేఁజేసినపుణ్యములెట్టివో అన్నియుఁజేకూడెనవనీసురేశ్వర.

మాన్యముగాను మాకన్యనుమానికిఁగన్యాదానముసేయగలిగె ధన్యాత్మక. ఎంతో.

విశ్వములో వేంకటేశ్వరకవి నేలువిశ్వాధ్యుఁడగు వేంకటేశ్వరు కరుణను.

(వి-వి.)—

గ్రంథాంత మల్పభాగము లేదు. వ్రాఁతతిన్నఁగానున్నది. తప్పులు లేవు. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

సుకుమారియను పేరుగల సృంజయరాజకుమారిని నారదమౌనివివాహమాడుకథయక్షగానముగాఁ బోడూరి వేంకటదాసకవిచే రచియింపఁబడినది.

---

## R No. 441.

Palm-leaf. $16\frac{1}{2} \times 1\frac{5}{8}$ inches. Foll. 156. Lines, 6 on a page. Mode of writing, good and correct. In a fairly good condition.

Purchased in the year 1917–18 from M.R.Ry. Nidadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

(*a*) పృథుచరిత్రము.

PRTHUCARITRAMU.

Foll. 1*a*—108*a*. Fol. 108 *b* is left blank.

By Paṭṭameṭṭa Sarasvati Sōmayāji. This is the same work as the one described under No. 569 of the Descriptive Catalogue of Telugu MSS., Vol. I.

Breaks off in the fourth Āśvāsa.

(వి-వి.)

అనుక్రమము. మొదటినుండి చతుర్థాశ్వాసమునఁ గొంతదాఁక గలదు. వ్రాఁత మంచిది. తప్పులు లేవు. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

ఇది డి. క్యా. నె 569 రున వర్ణింపఁబడిన గ్రంథమే.

---

(*b*) భారతము.

BHĀRATAMU.

Foll. 109*a*—156*a*.

By Tikkana Sōmayāji. This is the same work as the one described under No. 163 of the Descriptive Catalogue of Telugu MSS., Vol. I.

Incomplete. Contains the Strīparva.

(వి-వి.)—

స్త్రీపర్వమాత్రమున్నది వ్రాఁత మిక్కిలి మేలయినది. దోషములు లేవు. మంచిమంచి పాఠము లిందుఁగానవచ్చుచున్నది. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

ఇది డి. క్యా నె 163 రు చూచునది.

---

## R. No. 442.

Palm-leaf. 17 × 1¼ inches. Foll. 302. Lines, 6 on a page. Mode of writing, good and correct. In good condition.

Purchased in the year 1917–18 from M.R.Ry. Niḍadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

వచనవిచిత్రరామాయణము.

VACANAVICITRARĀMĀYAṆAMU.

This is the same work as the one described under R. No. 218 *ante*. By Gōpināthakavi.

Complete.

(తె-తె.)—

సమగ్రము. వ్రాఁత యందమైనది. తప్పులు లేవు. శైథిల్య గ్రంథపాతములు లేవు.

ఇది త్రై॥ క్యా. ఆర్. నె 218 రున వర్ణింపఁబడినదే.

---

## R. No. 443.

Palm leaf. 14 × 1⅜ inches. Foll. 77. Lines, 6 on a page. Mode of writing, good and correct. In good condition.

Purchased in the year 1917–18 from M.R.Ry. Niḍadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam

కాళిందీకల్యాణము.

KAḶINDĪKAḶYĀṆAMU.

A Prabandha describing the story of Śrī Kṛṣṇa's marriage with Kāḷindī, one of his eight chief consorts. The author of the work is Tumurāḍa Pāpakavi, son of Buccana of Bhāradvājagōtra. The work was composed at the instance of king Sannyāsi. A stanza given in the extract below mentions the names of his father, brothers, etc., but no information about his country is found therein.

Complete in 3 Āsvāsās.

**Beginning:**

ఉ. శ్రీసంయుక్తకృపారసార్ద్రవిమలాక్షిద్వంద్వసంప్రీతిచే
నాసుగ్రీవవిభీషణుల్ మహితరాజ్యారూఢులం జేయుసీ
తాసౌభాగ్యవతీకళత్రుఁడు దశరథాంజాతనేత్రుండు స
న్న్యాసిక్ష్మాపతికామితప్రదుఁడు మహాస్వాంతేప్సితంబీవుతన్.

* * * *

సీ. పరాజాతాతబలారి సింహాంకుఁడై
భాసిల్లె దెసల సన్న్యాసినృపతి
పమహీపుని తండ్రి రామచంద్రావనీ
పాలుండు సత్కీర్తి లోలుఁడలరు

పసామితల్లి సీతాసోమిదేవినాఁ
బరగుగుణంబుల భవ్యసాధ్వి
పభర్త పినతండ్రు లెసఁగిరిపొరుకుం
బునభోజభూపతి బుచ్చినృపతి
పజనేశ్వరు ననుజన్ము లెలమినరస
రాజ కృష్ణావనీశ్వర రామభద్ర
భూపకూర్మేంద్ర సన్న్యాసి భూమినాథు
లలరుచుండుదు రట్టి సన్న్యాసి విభుఁడు.

* * * *

శా. శ్రీరామాంఘ్రిసరోరుహద్వితయ సంసేవాపరస్వాంతునిఁ
భారద్వాజమునీంద్రగోత్రుఁ బ్రథితాపస్తంబసూత్రుఁ ఘనుఁ
సూరీంద్రుండుమురాడ బుచ్చనత నూజుఁ బాపనాఖ్యుఁ ననుఁ
జేరంబిల్చిసుధామయోక్తుల వచించెంబ్రీతిసంధిల్లఁగఁ.

**End:**

పద్మనాభము.

గాకేందు బింబాస్య పాకారిముఖ్యామరవ్రాతభీమాసురశ్రేపబాణా
కాకాసురత్రాణ సాకేతగేహాయుగ ప్రస్ఫురద్భాహసందీప్తదేహా
యాకాశరత్నప్రకాశా సురేశా మహాదేశబాణాసనధ్వంసదక్షా
ప్మాకన్యకాలింగితాంగాసువృత్తంగసన్న్యాసిరాజ్ఞానవాంభోజభృంగా.

**Colophon:**

ఇది శ్రీరామచంద్రకరుణాకటాక్ష లబ్ధోభయభాషా కవితావిచిత్ర భారద్వాజగోత్రపవిత్ర బుచ్చనార్యపుత్త్ర పాపనకవిప్రణీతంబైన కాళిందీకల్యాణంబను శృంగారప్రబంధంబునందు సర్వంబును దృతీయాశ్వాసము.

(వి-వి.)——

సమగ్రము వ్రాఁత మంచిది. తప్పులు లేవు. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

కాళిందీకళ్యాణమను పేరుగల యీ మూఁడాశ్వాసముల శృంగార ప్రబంధమున శ్రీకృష్ణుడు కాళిందిని బెండ్లాడుకథ వర్ణింపఁబడినది. గ్రంథకర్త తుమురాడ పాపకవి. భారద్వాజగోత్రుఁడు. బుచ్చన కొడుకు. సన్న్యాసిరాజుప్రేరేపణమున రచియించెను. ఈ సన్న్యాసిరాజునుగూర్చి యుదాహృతపద్యమునఁ జూచునది.

## R No. 444.

Palm-leaf. 13⅝ × 1 inches. Foll 219. Lines, 7 on a page. Mode of writing, good and correct. In good condition.

Purchased in the year 1917-18 from M.R Ry. Niḍadavōlu Sundaram Pantulu gāru of Vizagapatam.

బృహన్నారదీయము.

BṚHANNĀRADĪYAMU.

By Krottalaṅka Mṛtyuñjayakavi. This is the same work as the one described under R. No. 86 *ante.*

Complete.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పులు లేవు. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

ఇది ట్రై. క్యా. ఆర్. నెం. 86 లున వర్ణితమే.

---

## R. No. 445.

Paper 9¼ × 6½ inches. Foll. 189. Lines, 22 on a page. Mode of writing, good and correct In good condition.

Purchased in the year 1917-18 from M.R.Ry. Niḍadavōlu Sundaram Pantulu Gāru of Vizāgapatam.

లలితాంబోపాఖ్యానము.

LALITĀMBŌPĀKHYĀNAMU.

A Telugu poetical rendering of the Lalitōpākhyāna occurring in the Sanskrit Brahmāṇḍapurāṇa; by Ātukūri Pāpayakavi, son of Ādimūrtikavi of Parāśaragōtra and Apastambasūtra. This work was dedicated to God Amarēśvara (a form of Siva) worshipped in the shrine at Dhānyavāṭi (Amarāvati), Guntūr district

Complete in seven Āśvāsas.

**Beginning:**

శా. శ్రీగౌరీస్తనభద్రకుంభయుగళశ్రీగంధకస్తూరికా
సౌగంధ్యాన్వితచారువక్షుఁడు సుధాసారాభకారుణ్యాపి
ఙ్గాగోపాయితసర్వలోకుఁడు రమాఁచద్ధాన్యవాటీపురిం
ద్రాగారుం డమరేశ్వరుండు మము నిత్యంబుం గృపం బ్రోవుతఁ

* * * *

క. ముఖ్యంబగు బ్రహ్మాండా
భిఖ్యపురాణంబులోనఁ బెంపొంది జగ
త్ప్రఖ్యాతము లలితాంబో
పాఖ్యానము వెలయు సరసపండిత సభలన్.

గీ. అయ్యుపాఖ్యాన రాజంబు నాంధ్రభాష
సుప్రబంధంబు గాఁ జేసి సూరిజనము
మదిముదము నొందఁ జేయుదు సదయహృదయ
సాంబశివకరుణాకటాక్షంబువలన.

**End:**

హంసగమనము :—

పరిపాలితసురపాలక ప్రమథాధిప కరుణా
పరిపూరితనయనాంబుజ ప్రకటీకృతమహిమా
గిరిజాధిపగిరికార్ముక గిరి భృచ్చర సుగుణా
కర భాస్వరశరదోపమగళ వారిధిశరధీ.

**Colophon:**

ఇది భవానీ శంకర కరుణాకటాక్ష వీక్షాసుధారసాసారప్రసార సులబ్ధకవితావైభవాపస్తంబ సూత్రపరాశరగోత్ర విలసదాతుకూరివంశ సంభవ అయ్యనామాత్యపౌత్ర ఆదిమూర్తినామసత్కవిపుత్త్ర సకలసుకవిజనవిధేయ పావయ నామధేయ ప్రణీతంబైన లలితాంబోపాఖ్యానంబునందు సప్తమాశ్వాసము.

(వి-వి.)—

ఏడాశ్వాసములు మాత్రము గలవు. వ్రాఁత మంచిది. తప్పులు లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

బ్రహ్మాండపురాణాంతర్గతమగు లలితాంబోపాఖ్యానమను సంస్కృత గ్రంథమున కిది తెలుఁగుసేఁత. కర్త ఆతుకూరి పావయకవి. ఆదిమూర్తికవి కొడుకు.

---

## R. No. 446.

Palm-leaf. 18 × 1½ inches. Foll. 53. Lines, 8 on a page. Mode of writing, fair and correct. In fairly good condition.

Purchased in the year 1917-18 from M. R. Ry Nidadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

ప్రబోధచంద్రోదయము.

PRABŌDHACANDRŌDAYAMU

By Nandi Mallayya and Ghanṭa Siṅgaya. This is the same work as the one described under R.No 50 *ante.*

Complete.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంతయంత మంచిది కాదు. తప్పులు లేవు. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

ఇది త్రై. క్యా. ఆర్. నెం 50 రున వర్ణితమైన గ్రంథమే.

---

R. No. **447**.

Palm-leaf. 16¼ × 1¼ inches. Foll. 27. Lines, 5 or 6 on a page. Mode of writing, fair but contains mistakes. In fairly good condition.

Purchased in the year 1917-18 from M.R.Ry. Niḍadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

(*a*) గోవ్యాఘ్రచరిత్రము.

GŌVYĀGHRACARITRAMU.

Foll. 1*a*—5*b*.

This is the same work as the one described under R. No. 59(*b*) *ante.*

Complete.

(వి-వి.) —

సమగ్రము. వ్రాంతలిన్నది. తప్పులున్నవి., శైథిల్యము గ్రంథపాతములు లేవు.

ఇది త్రై. క్యా. ఆర్. నె 59 రున వర్ణితమే.

---

(*b*) కృష్ణమాచార్యసంకీర్తనము.

KṚṢṆAMĀCARYASAṄKĪRTANAMU

Foll. 6*a*—8*a* Fol 8*b* is left blank.

Same work as that described under R. No. 206(*a*) *ante*.

Contains the portion describing the greatness of the Tulasi plant.

**Beginning:**

దేవా కృష్ణమాచార్యులు వోరుగంటిలో పతివ్రతా గృహంబున కేఁగిన ఆ యింటి బ్రాహ్మణుఁడు దండప్రణామంబు చేసి స్వామీ మీరు విజయంచేసుట నా గృహంబు పావనంబాయెను. మేమూ కృతార్థుల మైతిమి. మాయింట ఆరగించి మమ్ముల రక్షించుమని విన్నపంబు చేసిన కృష్ణమాచార్యులు ఏమనుచున్నారు.

**End:**

ఈ దివ్య నామస్మరణ యెవరు వ్రాసినా యెవరు చదివినా యెవరు విన్నా గోసహస్రదానంబులు చేసిన ఫలంబుగలుగును పితృపితామహులు విష్ణుసాయుజ్యంబుగాంతురు సకల దోషములున్నా సర్వత్రాతా జేసిన పాపములున్నా నివారణమై ఆపదలు తొలగును.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పులున్నవి. శైథిల్యము గ్రంథ పాతములు లేవు.

ఇది త్రై. క్యా.ఆర్. నెం 206-(*a*) రు వర్ణితమగు గ్రంథమున నొక భాగమగును. ఇందు తులసీమాహాత్మ్యము వర్ణింపఁబడినది.

---

(*c*) గొడుగులవచనము.

GOḌUGULAVACANAMU.

Foll. 9*a*—16*b*.

Prose passages written in colloquial language and narrating that portion of the story of the Rāmāyaṇa, wherein Rāvaṇa holds a council of his ministers just previous to the declaration by him of war with Rāma. The name given to the work is not understood.

Complete.

**Beginning:**

శ్లో. శతయోజన విస్తీర్ణం శతయోజన మున్నతమ్
. . . . . . రావణేనాభిరక్షితమ్.

అన్నాఁడు గనుక అటువంటి లంకాపురీపట్నం యెటువలె నుండెనంటేను అరువదియోజనముల విస్తీర్ణమున్నూ నూరు యోజనంబుల నిడు

ళున్ను యెనిమిదికోట్ల వాకళ్లున్ను అరవైకోట్ల గోడకొార్లున్ను ముప్పై కోట్ల రచ్చకూటములున్ను.

**End:**

రానివారెల్లా మన విభీషణుపోయినత్రోవను పొమ్మనుచు వుత్తర గోపురంబు డిగ్గి రథంబుయెక్కి అంతఃపురంబునకు జనుచు తన మంత్రుల బిలిపించి లంక పదిలంబని అప్పగించి మందోదరింగాంచి యీ వృత్తాంతం బంతయు నెఱిగించి చెక్కిటచెయిచేర్చి ఆ రామచంద్రుల గుణపౌరుషం బులు గొనియాడుచు చింతింపుచుండెనయ్యావసరంబున.

ఈకథ వ్రాసిన చదివినవారికి భవరోగంబులు దొలంగి వైకుంఠపద విని బొందగలరు.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత చెడ్డదికాదు. తప్పులున్నవి. శైథిల్యము గ్రంథ పాతములు లేవు.

రావణుఁడు యుద్ధమునకుఁ బూర్వము, తన మంత్రులతో యుద్ధవి షయ మాలోచించుట మొదలగు కథాంశముగల యీ వచన భాగమేదో వచనరూపముననున్న రామాయణమందలిది కాఁదగును. ఈ భాగము నకు గొడుగులవచన మని పేరు. ఈ పేరి కర్థమేమో !

---

## (d) భారత సావిత్రి.

## BHĀRATA SĀVITRI.

Foll. 17*a*—23*b*.

A Telugu prose rendering of the Sanskrit Bhārata-Sāvitri. It is said to occur in the Bhāratasaṅgraha and gives a summary of the story of the Mahābhārata. The author's name is not known.

Complete.

**Beginning:**

క. శ్రీజానకీమనోహర
పూజితచరణారవింద పూర్ణానందా
రాజితరవికులవికసిత
రాజీవదళాయతాక్ష రంగద్వసతా.

వ. అవధరింపుము ధర్మరాజు ద్వారకానగరంబుననున్న శ్రీకృష్ణ దేవునిఁ బిలిపించి కౌరవులకు మాకు సంధిచేయవలెనని ప్రార్థించి రాయబారంబును వసుదేవుండు హస్తినాపురంబునకు జనునప్పుడు [!] కృపద్రోణగాంగేయాశ్వత్థామ కర్ణాదియోధులును, దుర్యోధనుండు లోనుగాఁగల కురుకుమార వర్గంబులుం జనుదెంచి యవ్వసుదేవనందనుంగాంచి భేరీ మృదంగాదితూర్యఘోషంబులు చెలంగ రాజమందిరంబునకుఁ జనుదెంచి పేరోలగంబుననున్న సమయంబున దుర్యోధనుండు దుష్టచతుష్టయంబునంగూడి.

**End:**

ఇది భారత సంగ్రహంబున భారతసావిత్రియనంబరగు నెవ్వరేనియు ప్రాతఃకాలంబున . . . . . స్వర్ణమాలికాలంకృతంబులైన వేయిధేనువులు సత్పాత్రంబుగా దానంబుచేసిన ఫలంబు గలుగునని వ్యాసవచనంబు గలదు. విన్నవారలు వ్రాసినవారలు పఠియించినవారు సకలైశ్వర్యాలు భోగంబు లనుభవించి పుత్త్రపౌత్రాభివృద్ధిజెంది యనంతరంబున విష్ణుసాయుజ్యంబు గల్గి సుఖంబునం బొందియుందురు.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత చెడ్డదికాదు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

సంస్కృతమునఁ గల భారతసావిత్రి కిది తెలుఁగువచనము. భారత సంగ్రహమందలిదట. భారతసావిత్రి కర్త యెవ్వరో తెలియదు.

(౬) రామనవరత్నములు.

**RĀMANAVARATNAMULU.**

Foll. 24 *a*—25*b*.

Nine stanzas (including the concluding stanza) in the Sīsa metre composed in praise of Śrī Rāma. The author's name is not given.

Complete.

**Beginning:**

సీ. శ్రీజానకీదేవి చెలువుగా వామాంక
తలమున ముద్దులుగులుకుచుండ
నగ్రభాగంబున నాంజనేయుఁడు నిల్చి
పాదంబు లొత్తుచు భక్తినెఱప

వెనుక నెమ్మనమున వినయుఁడై దనరారు
సౌమిత్రిమార్తికచ్ఛత్రమూన
నుభయపార్శ్వంబుల నొదిగి వింజామరల్
భరతశత్రుఘ్నులు పట్టికొలువ.
దండసుగ్రీవుఁడు విభీషణుండు నంగ
దుండు జాంబవదాదులునుండఁదల్లి
ఉల్లగావచ్చి చూడఁగా నల్లనికళ
లలరు నినుగొల్తు . . . పట్టాభిరామ.

**End;**

సీ. శ్రీరామలక్ష్మణు పేర నంకితమ్మౌ
నవపద్యనామ సుందరమ్ములైన
నవపద్య నవకమే నరుఁడైన భక్తితో
వ్రాసినఁజదివిన వరుసతోడ
సంగ్రహించిన విష్ణు సకల ఫలంబుకు
శ్రీరాములిచ్చును సిద్ధమెప్పు
డాయురారోగ్యంబు వైశ్వర్యములు గల్గు
నిష్టసంసిద్ధియు నెల్లవేళ
ప్రతిదినంబును మానక పరమనియతి
వినెడి పురుషుండు ధర సర్వజనులలోన
నుత్తమోత్తములగు వేదవేత్తలైన
వానితో సాటిరారు భూవలయమునను.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పులు లేవు. గ్రంథపాతములు లేవు.

శ్రీరామస్తుత్యాత్మకములయిన పది సీసపద్యము లివి ; వీని రచయిత పేరు తెలియఁబడదు.

---

(*f*) దశసీసములు.

DAŚASĪSAMULU.

**Foll. 26*a* — 27*b*.**

This consists of ten stanzas in the Sisa metre composed in praise of God Visnu. The name of the author is not known.

Complete.

**Beginning:**

సీ. పాలమున్నీటిలో ఫణిరాజశయ్య పై
యోగనిద్రాసక్తి నున్నవాని
కోటిసూర్యప్రభ మేటికిరీటముల్
వేయుమస్తకముల వెలయువాని
కౌస్తుభమణియును గర్ణకుండలములు
కమలనేత్రంబులు గలుగువాని
సిరియును భూదేవి చరణంబులొత్తంగఁ
గరుణారసము చాలఁ గలుగువాని
తలఁతు నుతియింతు ధ్యానింతుఁ దగ భజింతు
నన్నుఁ గృపతోడఁ బ్రోవు మనాథనాథ
శ్రీమనోనాథ మాధవ శ్రీయనంత
పద్మనాభ దయానిధీ పరమపురుష.

**End:**

సీ. విన్నపం బవధారు విశ్వేశ యీవది
సీసముల్ చెప్పితిఁ జిత్తగించు
ఇవి కడుభక్తితో నేప్రొద్దునుతిసేయు
పఠనసేయుఁ మహానుభావులకును
ఆయురైశ్వర్యంబునతిశుభప్రదములు
విష్ణుకీర్తనములువినుటబుద్ధి
కోరినకోరికల్ కొనసాగఁగాఁజేసి
ధనధాన్య పుత్త్రపౌత్త్రాభివృద్ధి.
సకల సంపత్కరంబులు సౌఖ్యములును
గలుగఁజేయు దృఢాంగులఁగానొనర్పు
శ్రీమనోనాథ మాధవ శ్రీయనంత
పద్మనాభ దయానిధీ పరమపురుష.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పులు లేవు. గ్రంథపాతములు లేవు.

"శ్రీమనోనాథ . . . . . పరమపురుష" అనుమకుటము గలిగి విష్ణుస్తుత్యాత్మకములగు నవది సీసపద్యము లివి. వీని రచయిత యెవ్వరో.

## R. No. 448.

Palm-leaf. 15 × 1½ inches. Foll. 15. Lines, 6 on a page. Mode of writing, good and correct. Good.

Purchased in the year 1917–18 from M.R.Ry. Niḍadavōlu Sundaram Pantulu Gāru, Vizagapatam.

బ్రహ్మాండవచనము.

BRAHMĀṆḌAVACANAMU.

This is a prose work in which the mode of creation of the universe is described. The name of the author is not known.

Complete.

**Beginning**:

దేవా శివుండు పార్వతీదేవికి సకలలోక పరిభ్రమాణ రహస్యంబుఁ జెప్పిన తెఱంగు నీకు జాతుర్లక్షగ్రంథసంకీర్తననామోచ్చారణంబు సేయుచునుండి మీకు విన్నపంబు సేయుచున్నవాఁడను. దేవా శివుండు కైలాసోపరిభాగంబున సుఖాసీనుండై పేరోలగంబునను్న సమయంబునఁ బార్వతీదేవి సాష్టాంగదండప్రణామంబులాచరించి కరకమలంబులు మొగిడ్చి దేవా సకలజీవదయాపరుండవు. ఉత్పత్తిలయంబులకుఁ గారణకర్తవైన :—

**End**:

శౌనకాదిమహామునులకు సూతుండు డెలింగించెనని యీ మహావ్యాఖ్యానంబు అఖిలపురాణసారంబని వేదవ్యాసుండు నిర్దేశించెనని మహాకులాచలసాగరద్వీపసోమసూర్యులుగలంత కాలంబు విద్యాభాగవతరసాయనంబై వర్ధిల్లుచుందురు.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పులు లేవు. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

ఇందు బ్రహ్మాండసృష్టిక్రమము వర్ణింపఁబడినది. కర్తయెవ్వరో !

---

## R. No. 449.

Palm-leaf. 18 × 1⅜ inches. Foll. 42. Lines, 10 in a page. Mode of writing, good but not quite correct. Injured.

Purchased in the year 1917–18 from M.R.Ry. Niḍadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

సత్యభామాసాంత్వనము.

SATYABHĀMĀSĀNTVANAMU.

An erotic poem narrating the story of how Kṛṣṇa consoled his passionate spouse Satyabhāma. It was composed by Kāmēśvara Kavi, and was dedicated to Muddaḷagari, who was the brother of Cokkanātha, the king of Madura, and who reigned at Tanjore for a short period. As the MS. is in an injured condition the genealogy and other particulars of the patron are not extracted here.

Breaks off in the fourth Āśvāsa.

(వి-వి.)—

మొదటినుండి నాల్గవయాశ్వాసమునఁ గొంతవఱకుఁ గలదు. వ్రాఁత చక్కనిది. తప్పు లంతగా లేవు. శైథిల్యము గలదు. గ్రంథపాతములంతగా లేవు.

సత్యభామాసాంత్వనమను నీ నాల్గాశ్వాసముల శృంగారప్రబంధమున శ్రీకృష్ణుఁడు సత్యభామనూరార్చుకథ వర్ణింపఁబడినది. గ్రంథకర్త కామేశ్వరకవి. మధురరాజగు చొక్కనాథనాయని సోదరుఁడును, గొలఁదికాలము తంజావూరి రాజ్యమునకుఁ బాలకుఁడునునయిన ముద్దళగరికీకృతియంకితము సేయఁబడినది. పుస్తక శైథిల్యముచేఁ గృతిపతి వంశవృత్తాంతమిక్కడ నుదాహరింపరాదయ్యె.

---

## R. No. 450.

Palm-leaf. 17½ × 1¼ inches. Foll. 48. Lines, 6 on a page. Mode of writing, not good and not correct. Injured.

Purchased in the year 1917–18 from M.R.Ry. Niḍadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

వీరశైవాచారసంగ్రహము.

VĪRAŚAIVĀCĀRASAṄGRAHAMU.

This is a Telugu rendering in 3 Āśvāsas of the Sanskrit Śaṅkarasaṁhitā of the Skāndapurāṇa. Śivarāmaliṅgakavi, pupil of Sōmaśekharadēva, chief of the Gōkarṇa mutt, composed this work and gives in a stanza the date of its composition which is —

Sunday, the third day in the dark fortnight of the month of Āśvija in the year Pramādīca corresponding to the Śaka year 1655.

**Complete.**

**Beginning :**

క. శ్రీపార్వతీశమాధవ
తాపసహృదయాబ్జ భృంగధనదార్చితవి
ద్యోపాయనిలయనిర్మల
శ్రీపతిచిత్తాంతరంగ శ్రీగురులింగా!

సీ. గీ. పరమశివతత్త్వశాస్త్ర మేర్పడ వెలుంగు
నరయఁగాస్కాందమను పురాణాంతరమునఁ
ఘనులుశంకరసంహితాఖ్యాన మనఁగ
నది తెనుంగున రచియింతు నభినవముగ.

**End :**

సీ. చనినట్టిశాలివాహన శకాబ్దంబులు
పాటింపవేయునార్నూటిమీఁద
నిరవందఁగానేఁబదేనుప్రమాదీచ
విమలవత్సరమునాశ్వీజమందు
బహుళతృతీయలోభానువాసరమున
రచియించినట్టినిర్ణయచరిత్ర
వీరశైవులసదాచారసంగ్రహాతదాఁ
ఖరిపూర్ణమయ్యెఁప్రబంధరీతి

సముచితాచారనిష్ఠులుసాధుజనులు
నంతరింద్రియబాహ్యేంద్రియాదులెల్ల
నాత్మలింగాభిమానసాధ్యానుభవులు
శివసమర్పకులైయభ్యసింపవలయు.

* * * *

**Colophon :**

ఇది శ్రీమదఖండ సచ్చిదానందనిత్యపూర్ణైక లింగైక్యనిష్ఠాకరవీర మాహేశ్వరసందోహాచరణ కమలషండమకరందపానమత్తద్విరేఫాయమానమానసతావద్గోకర్ణమఠాధీశ్వరపంచవర్ణిగయతిరాయపట్టభద్రశ్రీ సోమశేఖరదేవ దివ్యశ్రీపాదారవిందచుంభరుండైన శ్రీనందికేశ్వరకరసరజగర్భోద్భవుండైన శివరామలింగప్రణీతంబైన స్కాందపురాణోత్తర శంకరసంహితాఖ్యానంబగు వీరశైవాచారసంగ్రహంబునఁ దృతీయాశ్వాసము.

(బి-బి.)—

సమగ్రము. వ్రాఁత మంచిదికాదు. తప్పులు కలవు. శైథిల్యము కలదు. గ్రంథపాతములు లేవు.

స్కాందపురాణమందలి శంకరసంహితకిది తెలుఁగు. కర్త శివరామలింగకవి. గోకర్ణమఠాధీశ్వరుఁడయిన సోమశేఖరదేవునిశిష్యుఁడు. ఇయ్యది శకవర్షము 1655 లకు సరియైన ప్రమాదీచ సంవత్సరాశ్వీజ బహుళ తృతీయ భానువారమున రచియింపఁబడెనఁట.

---

## R. No 451.

Palm-leaf. $12\frac{5}{8} \times 1\frac{3}{8}$ inches. Foll 46. Lines, 5 on a page. Mode of writing, fair but in correct Slightly injured. Laves are irregularly arranged.

Purchased in the year 1917-18 from M.R.Ry. Niḍadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

మైరావణచరిత్రము.

MAIRĀVAṆACARITRAMU.

This work is written in stanzas of various metres—such as Dvipada, Mañjari, Kanda etc—and in prose bits. The story conta'ned herein is the same as the one described under R. No. 141(c, *ante*. The author's name is not known.

Complete.

**Beginning:**

శ్రీకాంతహృదయేశ ! శ్రితమనోల్లాస
వైకుంఠనాయక వైభవాకార
కాకుత్స్థకులవీర కలుషసంహార
లోకేశవరభక్త, లోకసంహార
నిగమాంత సర్వేశ నిర్గుణాకార
రామాభిరామ నిర్జరవైరిభీమ.

*  *  *  *

**End:**

నటుమీదట రామభద్రుఁడు హనుమత్సీతాలక్ష్మణభరతశత్రుఘ్నపరివారంబుగా గొల్వ సకలజనంబులానందంబుగా నిష్టానుగ్రహ దుష్టనిగ్రహంబుగా రాజ్యభారంబు శాయుచుండెనపుడు.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంతయొకతీరుననున్నది. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములంతగా లేవు. పత్రములు తాటాకులుగానున్నవి.

ఇందలికథ ఆర్. నెం 141(c) యున వర్ణింపఁబడినదే. కర్తయెవ్వరో తెలియదు. ఇందు ద్విపద, మంజరీ, కందము మొదలగువృత్తములు, వచనములు గలవు.

---

R. No. **452**.

**Palm-leaf.** $15\frac{1}{8} \times 1\frac{1}{8}$ inches. Foll. 101. Lines, 5 on a page. Mode of writing, good but incorrect. Good.

Purchased in the year 1917–18 from M.R.Ry. Nidadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

తాళలక్షణటీక (సమూలము).

TĀLALAKṢAṆAṬĪKA (WITH TEXT)

Foll. 1*a*—23*b*.

The Sanskrit text Tālalakṣaṇa described under No. 12992 of the Descriptive Catalogue of Sanskrit MSS. together with the Telugu meaning thereof.

A list of additional matter found from fol. 24*a* to end is given below in the Telugu remarks.

Incomplete.

**Beginning:**

కల్యాణగుణసంపన్నం కర్ణాంతాయతలోచనమ్
కౌసల్యాతనయం రామం కలయే కమలాపతిమ్.

ఇహ ఖలు సకలభరతమండితమండలాఖండలసకలభరతప్రవర్తకశిఖామణిః కోహలాచార్యనామకః పరమకారుణికః కశ్చిద్విపశ్చిత్సకలలోకోపకారాయ . . . తాళస్వరూపం సప్రపంచం ప్రతిపాదయితుకామ . . . సర్వేశ్వరనమస్కారాత్మక మంగళాచరణపూర్వకం చికీర్షితం ప్రతిజానీతే విష్ణుమితి :—

టీక. ఈ అవతారికకు అర్థము :—ఈలోకమందు సకల . . . . . . తాళస్వరూపమును లెస్సగా ప్రతిపాదించేనని ప్రతిజ్ఞ సేయుచున్నాడు.

శ్లో. విఘ్నేశం లోకగురుం ప్రణమ్య శిరసా వక్ష్యార్థసందర్భకం
కీర్తిప్రీతికరం జనస్య లఘునా కాలేన కామప్రదమ్
సేవ్యం సద్వ్యతిభిర్ద్రుతప్లుతపదం న్యాసాంత లోకత్రయం
తాళానాం కథయామి లక్షణమహం పూర్వోక్తశాస్త్రక్రమాత్.

అథ ప్రస్తారః.

End :

శ్లో. ప్రస్తారేష్వధికం విజానీయాదల్పం ప్రత్యధికం మహత్
ఇచ్ఛాతాళాంలిఖేత్పూర్వం వక్షణాద్యమ ? గామినమ్.

టీక. తనమనస్సునకువచ్చిన తాళం తాళగతమైన అంగం మొదట వ్రాసి ఈ ప్రస్తారమునందు అధికం ప్రతి . . . . అల్పమైన అంగం మహత్తుగాఁ జేసుకొని ప్రస్తారం వృద్ధిపొందించుకున్నది భవేత్ - అవుతున్నది. కడపట " ఈ తాళాధ్యాయం సంపూర్ణంగా వ్యాఖ్యానపూర్వకంగా . . . ఆలవెల్లి అన్నప్ప వ్రాసినాడు " అనికలదు.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పులున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

ఇది సంస్కృతము డిస్క్రిప్టివు క్యాటలాగు నెం 12992 రున వర్ణిత మగు గ్రంథమునకే తెలుఁగుటీక. సంస్కృతమూలముకూడ నున్నది. సంస్కృతగ్రంథము కోహలాచార్యకృతమట ! ఇందు, దాళలక్షణము చెప్పఁబడినది.

మఱి యీ పుస్తకమునందీ క్రింది విషయములుగూడ సంస్కృతశ్లోకములు తెలుఁగుటీకయుఁగాఁ గలసియున్నవి.

1. సూళాదిసూటాకర-తాళాల ప్రకరణము.
2. రత్నాకరప్రకారము (సంగీతరత్నాకరమందలి విధము ?)
3. మద్దెలగాని లక్షణము.
4. డోలు లక్షణము.
5. భరతశాస్త్రప్రవర్తకులు.
6. పేరణలక్షణము (తెలుఁగుపద్యాలు).
7. నభలక్షణము (తెలుఁగుపద్యాలు).

8. సప్తతాళాలకు అలంకారము.
9. అక్షరకాలసప్తతాళ నిర్ణయము.
10. ఆదిభరతము.
11. తాళాధ్యాయం దర్వులుమిశ్రితం.
12. భావాధ్యాయము.

గ్రంథముఖపత్త్రముల నీవిధమున వ్రాఁతకలదు:—ఇది చెప్పిన వారు కోహాళాచార్యులవారు కళావిలాసంవారి మతం యీశాస్త్రం, ఆంజనేయులవారిమతం 1 ప్రకారం చింతామణిమతం 1 ప్రకారం.

1. తాళకళావిలాసం.
2. సంగీతవిద్యావినోదం,
3. సంగీతమణిదర్పణం.
4. చతురసభావిలాసం.
5. కాత్యాయనీమతం.
6. ఆంజనేయమతం.
7. జైనమతం.
8. శార్ఙ్గదేవునిమతం.

ఈ శాస్త్రం శార్ఙ్గదేవునిమతం.

భరతభాష్యవ్యాఖ్యానకర్తలు.

1. భటులవారు.
2. లోలటులవారు.
3. త్రిశంఖులవారు.
4. కపర్దులవారు.
5. కోహాళాచార్యులవారు.

---

R. No. **453**.

**Palm-leaf.** 15½ × 1¼ inches. Foll. 36. Lines, 6 on a page. Mode of writing, fair but contains plenty of errors. In fairly good condition.

Purchased in the year 1917–18 from M.R.Ry. Niḍadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

(*a*) గంగావివాహము.

**GAṄGĀVIVĀHAMU.**

**Foll. 1*a*—19*b*.**

A poem composed in a form of the Mañjarī metre and describing the story of God Śiva's marriage with Gaṅgādēvi. The plot here is not of Purāṇic origin and is original. The name of the auther is Gaṅgādharayya.

Complete.

**Beginning :**

శ్రీకంఠసత్పుత్రి . . . . . .
కాకోదరస్తోత్ర కాళికాపుత్రి.

* ** * *

విద్యలమొదలైన విఘ్నేశనీకు
కడియపుటట్లు కమ్మనుండ్రాళ్లు
మంచితేనెయు మంచి పంచదారయును
అరటిపండ్లనుకరియావులజున్ను
నల్లనిచెఱకులు తెల్లచెఱకులును,

* * * *

**End :**

ఈపుణ్యచారిత్ర మీశ్వరుపేర
శిరువకోడూర్పుర క్షేత్రనివాసి
రామేశ్వరునిపేర . . . .
కరమర్థినర్పించె గంగాధరయ్య

* * * *

ఈగంగకళ్యాణ మెవ్వరుగాని
చదివిన విన్నను సర్వేశుకృపను

* * * *

వ్రాసినవారికి వైభవోన్నతులు
శ్రీయును నెన్నాళ్లు శివుడు నెన్నాళ్లు.

(వి-వి)—

సమగ్రము. వ్రాంత తిన్ననిదే. తప్పులు మెండు. శైథిల్యము పాతములు లేవు.

గంగావివాహమను పేరుగల మంజరీవికారమనఁబడు నీ పదమున శివుఁడు గంగాదేవిం వివాహమాడు కథ క్రొత్తగా వర్ణింపఁబడినది. గ్రంథకర్త పేరు గంగాధరయ్య.

(b) రుద్రాక్షమాహాత్మ్యము.

## RUDRĀKṢAMĀHĀTMYAMU.

**Foli. 20a—36a. 36b. is left blank.**

**A poem, describing the greatness and sanctity of the Rudrākṣa bead. It was composed by Parvatamantri Linganāmātya in the Dvipada metre.**

**Complete.**

**Beginning:**

ద్విపద. శ్రీవిశ్వనాథుండు శ్రితశంకరుండు
దేవాదిదేవుండు దేవపుంగవుఁడు
పద్మాక్షవరదుండు పద్మార్చితుండు

* * * *

వేయేఁడుఁ జూచిన నెల్లరుద్రాక్ష
ఫలమహాత్త్వంబది ప్రబలమైయుండు
సొలుపారనవియెట్లు భువినుద్భవించె
వదలకధరియించు వారికిఫలము.

**End:**

ఇందేందుధర శక్తికామ్యాంతరంగ
శివకృపాంచితగాత్ర శ్రీవత్సగోత్ర
ప్రవిమలలింగ మెూక్త భవ్యచారిత్ర

* * *

లీలపర్వతమంత్రి లింగనామాత్య
విరచితముగ సర్వ వేదోక్తమగుచు
శ్రీరమ్యమై సర్వ సేవ్యమైయొప్పు
వీరమాహేశ్వరాచారసంగ్రహణ
మందులోనొప్పు రుద్రాక్షమాహాత్మ్య
మందమైయొప్పును నఖిలలోకముల
ధరణినినాచంద్ర తారార్కముగను.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిదే. తప్పులున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

రుద్రాక్షమాహాత్మ్యమను పేరుగల యీ ద్విపద గ్రంథమున, రుద్రాక్షఫలము మహిమ వర్ణింపఁబడినది. గ్రంథకర్త పర్వతమంత్రి లింగనామాత్యుఁడు.

R. No. 454.

Palm-leaf. 18⅜ × 1¼ inches. Foll. 147. Lines, 5 or 6 on a page. Mode of writing, good but containing mistakes. Good.

Purchased in the year 1917-18 from M.R.Ry Nidadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

(a) శారదారామాయణము.

ŚĀRADĀRĀMĀYAṆAMU.

Foll. 1*a*—55*b*.

A work intended to be sung and narrating the story of the Rāmāyaṇa. The name of the author is not known.

Complete.

**Beginning:**

ఎంచివిఘ్నేశ్వరుని ముందుఁబూజించి
శారదాంబనేర్పడ బ్రస్తుతించి
సతకవులనెల్లను మనసునను౦చి
రాముడవధరించినవద్దనుంచి
చెప్పఁదొడఁగెదను గుణచర్యలెంచి

**End:**

అంబు, ఇది శారదరామాయణంబు
విన్నవారలకుఁ జాలఁబుణ్యంబు
మేలైనట్టి రామనామంబు
మధురమైనట్టి యమృతసారంబు
వేంకటేశ్వరునిపాలిదైవంబు
చేసినాడయ్యా యీపురాణంబు
రామచంద్రులమూర్తిమంతంబు

*    *    *    *

దొరికినంతలోసకల పుణ్యంబు
భాగ్యవంతులుసారవంతంబు
పాపనాశంబు, బహుపూజితంబు
అవుశారదా ? కరుణానిధీ ?

(వి-వి.)—

సమగ్రము వ్రాఁత మంచిది తప్పులున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

శారదారామాయణమను పేరుగల యీగేయప్రబంధమున రామాయణ కథ వర్ణింపఁబడినది. కర్తపేరు తెలియదు.

---

(b) ధర్మాంగదచరిత్రము.

DHARMÂṄGADACARITRAMU.

Foll. 56a—124b.

This is a poem in the Dvipada metre dealing with the story of the celebrated "snake song" in Telugu (vide R. No. 417), by Bommaganṭi Narasiṁhakavi.

Complete.

**Beginning :**

ద్విపద. శ్రీరుక్మిణీశ రాజితకీర్తిసాంద్ర
సారసదళనేత్ర సజ్జనాధార
ధారాధరశ్యామ ధర్మసంచార
చారుమంజులభావ జగదేకపాల
పాలితామరసత్య భామసులోల
లోలమానససుర లోకమందార

* * * *

చేసితి ధర్మాంగ చరితంబు నేను
వాసిగాఁగవులెల్ల వర్ణనచేయ

చారుమదీయవంశం బెట్లనిన :—

సరసంబుగా యజుశ్శాఖయనంగ
గురుతైనకౌండిన్య గోత్రంబునందు,
కరమర్థి శ్రీబొమ్మకంటివంశాబ్ధి
పరచంద్రుఁడగు మాధవాఖ్యుండనంగ
పరమవైష్ణవమూర్తి భవ్యసద్వృత్తి
ఆతనిపత్ని సర్వాంబను సాధ్వి
అరయంగనరసింహుఁ డందురునన్ను
విరచింతునీకథ విఖ్యాతిగాను

**End :**

ఘనమైన తత్కథాక్రమ మెట్టిదనిన.
ఘనముగా శ్రీబొమ్మ కంటినరసింహుఁ

వరయుగ శ్రీకృష్ణు కర్పితంబుగను
సిరియునాయువుగల్గు సిద్ధంబుభువిని.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పు లున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

ధర్మాంగదచరిత్ర మను పేరుగల యీ ద్విపదకృతియందు "పాము పాట" కథ వర్ణింపఁబడినది. గ్రంథకర్త బొమ్మకంటి నరసింహాకవి.

---

(*e*) భారతసావిత్రి.

BHĀRATASĀVITRI.

Foll. 125*a*—147*b*

This is the same work as the one described under R. No. 447 (*d*) *ante*.

Complete.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పులు లేవు. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

ఇది పై ఆర్. 447(d) లోన వర్ణింపఁబడినదే.

---

## R. No 455.

Palm-leaf. 17½ × 1¼ inches. Foll 65 Lines, 6 on a page. Mode of writing, good and apparently correct. Good.

Purchased in the year 1917–18 from M.R.Ry. Niḍadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

జాతకదర్పణము.

JĀTAKADARPAṆAMU

This is a Telugu poetical rendering of an astrological work of the same name in Sanskrit by Yellumahanti Nārasiṁhapātra, apparently of Siṣṭu-Karaṇa caste. The subject matter dealt with in the work may be known from the author's colophon itself which is given below.

Complete, but without introduction.

**Beginning:**

క. సకలనతభక్తవత్సలు
నకునళినీపతికి సూర్యనారాయణమూ
ర్తికి సర్వవేదమృదుభా
షికి సంతతమఖిలదైవచింతామణికిన్.

వ. అంకితంబుగా నారచియింపంబూనియున్న సకలజన మహోపకరణంబగు జాతక దర్పణంబునకు భావప్రకరణంబులెట్టివనిన.

**End:**

స్రగ్విణి.

ఆదినారాయ ? ణ్లోక దేవాగ్రణిన్
వేదవేదాంతసంవేద్యపారీణునిన్
నాదబిందుప్రధానప్రభాతీతునిన్
నేఁదలంతున్ సదా నెమ్మితో భాసురున్.

**Colophon:**

ఇది శ్రీసూర్యనారాయణవరప్రసాదలబ్ధకవితా మాధుర్యప్రభావశ్రీమత్కోఱుకొండభట్టరు కొండమాచార్యగురువరప్రసాదపాత్ర సుకవిజనమిత్ర నాగేశ్వరగోత్ర యల్లుమహాంతి పరశురామపాత్ర పౌత్ర గోపాలకృష్ణపాత్రపుత్త్ర నారసింహపాత్ర ప్రణీతంబైన జ్యోతిశ్శాస్త్రంబున జాతకదర్పణంబను మహాకావ్యంబునందు సంజ్ఞాప్రకరణంబును, ఆయుర్భావప్రకరణంబును, తనుభావప్రకరణంబును, ధనభావప్రకరణంబును, సహజభావప్రకరణంబును, వాహనభావప్రకరణంబును, పుత్త్రభావప్రకరణంబును, షష్ఠభావప్రకరణంబును, కళత్రభావప్రకరణంబును భాగ్యభావప్రకరణంబును, రాజ్యభావప్రకరణంబును, లాభభావ ప్రకరణంబును, వ్యయభావ ప్రకరణంబును ననునీ పదుమూఁడు ప్రకరణంబులుగల సర్గంబును నేకాశ్వాసము.

(ఖి-వి.) ---

కృత్యవతరణిక తక్కిందకిక్కిన గ్రంథమెల్లఁగలదు. వ్రాఁత మంచిది. తప్పులంతగా లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

జాతకదర్పణమను పేర సంస్కృతమునఁగల జ్యోతిషగ్రంథమునకిది తెలుఁగుసేఁత. ఇందుఁగల విషయములుమీఁద నుదాహరింపఁబడిన గద్యమునఁ జూడనగును. గ్రంథకర్తయెల్లుమహాంతి నారసింహపాత్రుఁడు. పిష్టకరణమగును.

## R. No. 456.

Palm-leaf. 10¾ × 1 inches. Foll. 190. Lines, 6 on a page. Mode of writing fair but incorrect. In fairly good condition.

Purchased in the year 1917–18 from M.R.Ry. Niḍadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

(*a*) కృష్ణవిలాసము.

### KṚṢṆAVILĀSAMU.

Fol 1*a*—49*b*.

A collection of stanzas and passages from various Prabandhas and dealing with the amorous sports of Śrī-Kṛṣṇa. The compiler is Kumāra Acyuta Rāmarāja. There are quotations from works like Manucaritra of Peddanāmātya, etc. The latest of the authors quoted is Kūcimañci Timmakavi.

Contains the first three Āśvāsas.

**Beginning:**

ఉ. శ్రీలకుఁ దానకంబగుచు. జెన్నలరారెడు వెండి కొండపై
మేలికడాలిడాల్ హాయులు మెఱేడు జాబిలి రాలమేడలో
వేలుపుఱేఁడునల్వయును వెన్నుఁడుఁగొల్వఁగ మంచుకొండబా
చూలిని గూడివేడుకలఁ జొక్కెడు లేనెల తాల్పుఁగొల్చెదన్.

వ. అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నాకొనర్పంబూనిన సకలశృంగార ప్రబంధసార శ్రీకృష్ణలీలా విలాసంబను నత్యంతశృంగార ప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన :—

**End:**

మ. దళితారాతి నికొటభాసురవియద్గంగా జటాజూటమం
జులరాజార్ధకిరీట ఘోరసమరక్షోణీవిరాఘాటని
స్తులవేదత్రయ ఘోటపాటితమహోదోషాటవీఝాటని
ర్మలధౌతాచలకూట గ్రాహ్యమ్యత్పురోద్ఘాటనా.

**Colophon:**

ఇది శ్రీమదుభయభాషాకవిమిత్రాల్లసాని పెద్దనామాత్యకూచిమంచి తిమ్మరాజాదిసకలసుకవిసార్వభౌమప్రణీతానేక శృంగార ప్రబంధసార శ్రీకుమారాచ్యుత రామరాజ ప్రయత్నసంధానిత శ్రీకృష్ణవిలాసంబను నత్యంతశృంగార ప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము.

(వి-వి.)—

మూఁడా శ్వాసములున్నవి. వ్రాఁతచక్కనిదిగాదు. తప్పులున్నవి. శైథిల్యములేదు. గ్రంథపాతములు లేవు.

అల్లసాని పెద్దనామాత్యుని మనుచరిత్రము మొదలగు శృంగారప్రబంధములనుండి రసవంతములగు శృంగారపద్యముల నేర్చి శ్రీకృష్ణుని శృంగార విలాసముల వర్ణనమువచ్చునట్టుగా నిక్కృ గ్రంథమును గుమారాచ్యుతరామరాజు కూర్చినాఁడు. ఈ రాజు విషయమేమియుఁ దెలియరాదు. ఇందుఁ గూచిమంచి తిమ్మకవిప్రభృతులపద్యములుగూడఁ గూర్పఁబడినవి.

---

(b) నీలాసుందరీపరిణయము.

NĪLĀSUNDARĪPARIṆAYAMU.

Foll. 50*a*—106*b*.

This is the same work as the one described under R. No. 62(b) *ante*. By Kūcimañci Timmakavi.

Complete.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిదిగాదు. శైథిల్యముగలదు. గ్రంథపాతములు లేవు.

ఇది ఆర్. నె 62(*b*) రున వర్ణింపఁబడినదే.

---

(c) పారిజాతాపహరణము.

PĀRIJĀTĀPAHARAṆAMU.

Foll 107*a*—190*b*.

This is the same work as the one described under R. No. 185(*a*) *ante*. By Nandi Timmakavi.

Incomplete.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁతమంచిదిగాదు. తప్పులున్నవి. శైథిల్యము కలదు గ్రంథపాతములు లేవు.

ఇది ఆర్. నె 185(*a*) రున వర్ణితమైన గ్రంథమే.

## R No. 457.

Palm-leaf 17 × 1¼ inches. Foll. 75 Lines, 6 on a page. Mode of writing, fair but containing mistakes. In fairly good condition.

Purchased in the year 1917–18 from M.R Ry. Niḍadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

శ్రీనివాసవిలాసము.

### ŚRĪNIVĀSAVILĀSAMU.

A composition in the Yakṣagāna form narrating the story of the marriage of God Śrīnivāsa worshipped at Tirupati with a Ceñcu girl. The name of the author is not known. When the main work is finished a portion of the story is again written in an expanded and developed form.

Contains neither the beginning nor the end.

**Beginning:**

ద్విపద. నారాయణుఁడు జగన్నాథుఁ డచ్యుతుఁడు
జగములురక్షించుసంసక్తిఁజిత్త
మిగురొత్తనచ్చటనెలమివసించి
తానరసద్భక్తబృందములెల్లనెవుడు
తనరూపనామసందర్శనస్మరణ
మునఁజేసియొసఁగునిష్ఠులనభీష్టములః

*　　*　　*　　*

పంకరు హాపరిమళాంతర
కుంకుమగంధాంకుర ద్విగుణమ్మృగనాభీ
పంకాంచితవాసితమై
పంకజముఖిపొలుపుదెలుపుపవనమువీచెన్.

క. అతఁడవ్వాతజాత సంకేతమరసి
ఖ్యాతిగాఁబద్మినీ జాతినాతిరీతి
గరిమతోఁ దెల్పుచున్నదిగంధవహము
నొంటుగాదని యావంకనొనర నేఁగె.

*　　*　　*　　*

**End:**

దరువు　　కాంభోది.

ఏమనియనవచ్చునావిభునడకలకింతినేఁడూ, అయిన
నే ముందునోచిననోముగాకవాని నేమనందూ

అందఱు చూడగానధమంపు సవతిపోరందనాయె
ఓ యిందువదన వాండు ఎగ్గుసిగ్గు రెండెఱుగడాయె.
యేమందునమ్మ యి దేమందుగుణమో! మున్నింత లేదే,
యింతకాముకుఁడని ముందు దెలిసితే గట్టిగాదె.
ఈ రీతినడకలునడచేటివారలు ఎందఱౌందరుందురే,
కొమ్మావారలునిటువలె నన్నింటికి తోడుకో వచ్చినారటే.

వ. అయ్యవసరంబున :—

(b) **Beginning:**

శ్రీకరంబుగను మా చెంచువారెల్ల
జోకతోనుండేటి చోటులువినుము
శ్రీగిరిరాజ్యంబు సింహాచలంబు
బాగొప్పునరుణాద్రివట్టిసాచలము.

* * * *

మాకులంబునఁగల్గుమర్యాదలెల్ల
శ్రీకరంబుగమీకుఁ జెప్పెదవినుము
సరవితోనోబలసామినిదక్కఁ
గురిచేసి యితరులఁ గొలువంగరాదు
బంగారు సొమ్ములేర్పడనెన్నియున్న
సంగతినెమిలిపించముబూనవలయు.

**End:**

* * * *

దరువు ఆటతాళం వరాళిరాగం.

* * * *

అందంపు పెరావితేనెలానిముద్దుగొనుచునన్ను
సందిట బిగియంగబట్టిసకియవిడియమొసగె. సంతోష.

* * * *

కలికిసిగ్గేలనాతో బలుకుమనిమనసుదీర
వలరాజు కేళిలోనకళలంటి నెమ్మిమీఱ.

(వి-వి.)—

కృత్యారంభమును సమాప్తియును లేవు. వ్రాఁత కొంత తిన్నది కొంత తిన్ననిదికాదు. శైథిల్యము, గ్రంథపాతములు లేవు.

శ్రీనివాసవిలాసమను పేరుగలరసవంతమయిన యీ యక్షగానము సంకీరుపతి శ్రీనివాసమూర్తి చెంచుఁగన్నియను బెండ్లాడుకథ వర్ణింపఁబడినది. కర్త పేరు తెలియదు. ఈ పుస్తకమున ముందీగ్రంథరచన యొక విధముగా ముగిసినతర్వాత నందునడిమి కొంతభాగముమరలఁ గొంత భేదముతో విషయమువిస్తృతముగా వ్రాయఁబడియున్నది. దానికి(b) సంజ్ఞతో నాద్యంతములు చూపఁబడెను.

---

## R. No. 458.

Paper. 8¾ × 6¼ inches. Foll. 26. Lines, 28 on a page. Mode of writing bad and incorrect. Slightly injured

Purchased in the year 1917–18 from M.R.Ry. Nidadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

రుక్మిణీపరిణయము.

RUKMINĪPARIṆAYAMU.

A composition in the form of Yaksagāna describing the story of the marriage of Śrī-Krsna with Rukmiṇī. The author is Caudari Rāmadāsakavi, son of Gurvappa of Kolucunūḷḷa gōtra.

Complete, but the first fol. is wanting.

**Beginning :**

కోరికొలుచునూళ్లగోత్రోద్భవుండు
వెలయుమత్తనధీరువేంకమాంబకును
నలువొందనుదయించెనాయఁడుపుణ్య
గరిమనాతనిపత్నిగంగమాంబకును
వరతనూజుండగు వన్నెమీఱంగ
గురుతరపుణ్యుండు గుర్వప్పసుగుణి
అరయనాతనిపత్ని కాయరుంధతికి.

*   *   *   *

కోరిసన్నుతిసేయఁగొనమాంబకును
వారికిద్దఱికిని వరకుమారుండు
రమణాశోనుదయించెరాయప్పఘనుఁడు
అమరంగనతనికిననుజుండనేను
తనరిచౌదరిరామదాసుఁడనావాడ
వసరశ్రీరఘురామువరమునఁజేసి.

*   *   *   *

సిరిమించ కబ్బమ్ము చెప్పఁగా నేర్తు
సరగ సంగీతంబు పాడఁగా నేర్తు
వరుసఁ జిత్రంబుగ వ్రాయఁగా నేర్తు
సరవిఁ బ్రబంధముల్ చదువఁగా నేర్తు.

* * * *

నిరుపమంబగు రుక్మిణీవిలాసంబు
గరిమమించిన యక్షగానంబుగాఁగ
వినిపింతు నా కథావిధ మెట్టిదనిన.

**End:**

ధరను జౌదరి రామదాసాహ్వయుండ
కరుణించరయ్య సత్కవులైనవారు
వారిధి యెన్నాళ్లు వసుధ యెన్నాళ్లు
మేరువు నెన్నాళ్లు మిన్ను నెన్నాళ్లు
శ్రీవిష్ణుఁ డెన్నాళ్లు సిరియు నెన్నాళ్లు.

* * * *

వాసిగా నన్నాళ్లు వసుధలోపలను
నాచంద్రతారార్కమై యుండుఁగాత.

(వి-వి).—

సమగ్రము. మొదటిపత్రము పోయినది. వ్రాఁత మంచిది గాదు తప్పులున్నవి. శైథిల్యమున్నది. గ్రంథపాతము లల్పముగా గలవు.

శ్రీకృష్ణుఁడు రుక్మిణిని బెండ్లాడుకథను చౌదరి రామదాసకవి యక్షగానముగా రచియించినాఁడు. కవి శూద్రుఁడు ; కొలిచునూళ్లగోత్రుఁడు; గుర్వప్పకొడుకు.

---

## R. No. 459.

Palm-leaf. 13¾ × 1¼ inches Foll. 360. Lines, 6 or 7 on a page. Mode of writing, good but incorrect.

Purchased in the year 1917–18 from M.R.Ry. Niḍadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

స్కాందపురాణము (శివరహస్యఖండము).

SKĀNDAPURĀṆAMU (ŚIVARAHASYAKHAṆḌAMU).

This is the same work as the one described under No. 322 of the Descriptive Catalogue of Telugu MSS, Vol. I.

**Contains up to the end of the 4th Kāṇḍa (Yuddhakāṇḍa).**

(వి-వి.)—

మొదటినుండి యుద్ధకాండాంతమువఱకుఁ గలదు. వ్రాఁత మంచిది. తప్పులున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

ఇది డిస్క్రిప్టివు క్యాటలాగు నె 322 రుగ వర్ణితమయిన గ్రంథమే.

---

## R. No. 460.

Paper $8\frac{5}{8} \times 7$ inches. Foll. 23 Lines, 23 on a page. Mode of writing bad and incorrect. Injured.

Purchased in the year 1917–18 from M.R.Ry. Niḍadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

కళాశాస్త్రము (వచనము).

KALĀŚĀSTRAMU (PROSE).

A treatise in Telugu prose dealing with certain erotical topics collected from Sanskrit works like Ratirahasya of Kokkōka, etc. By Allūri Purusōttamakavi.

Incomplete.

**Beginning:**

శ్రీశైలము భీమకాళేశము మహేంద్రగిరియును నీ మూఁడు స్థలంబులు లింగాధిష్ఠానంబులు గావున నిట్టి లింగస్థలంబులకు మూఁటికి నంతర్భూతంబగు దేశంబు త్రిలింగదేశం బనం బరగునట్టి త్రిలింగదేశంబునందలిదగు విశాఖపట్టణమండలాగ్రేసరంబునకు నాయకరత్నంబగుచు కీర్తిమయమగు శ్వేతముఖులచే కీర్తనీయంబై వెలయు విజయనగరపట్టణాగ్రేసరంబునందు వసియించియున్న శ్రీరాజవేణుగోపాలునకు సంకితంబుగ నేఁజేయంబోవు కళాశాస్త్రంబునకు కథాక్రమం బెట్టిదనిన :—

**End:**

గాఢచుంబనముచేతను నేత్రములయందుండుకళను ద్రవింపజేయు వలయును. పంచాంగుళముచేతను మూర్ధకళను ద్రవింపజేయునది

(వి.-వి).—

అసమగ్రము. వ్రాఁత మంచిదిగాదు. శైథిల్యముకలదు.

కొక్కోక రతిరహస్యాదులనుండి కామశాస్త్రవిషయముల నేర్చి తెలుఁగుమాటలుగా నీగ్రంథమును అల్లూరి పురుషోత్తమనామధేయుఁడు కూర్చెనట.

R No. **461**.

**Paper.** $10\frac{3}{4}\times7\frac{1}{2}$ inches. **Foll.** 42. Lines, 25 on a page. Mode of writing fair but contains mistakes. In fairly good condition.

Purchased in the year 1917-18 from M.R.Ry. Niḍadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

(*a*) మిత్రవిందాపరిణయము.

MITRAVINDĀPARIṆAYAMU.

Foll. 1—30 and 30-*b* is left blank.

A Prabandha in four Āśvāsas describing the story of Śrī Kṛṣṇa's marriage with Mitravinda (one of his chief consorts); composed by Janārdana Raṅgarāya, (son of Rāyaḍappa Raṅgarāya, the author of the Saṅkalpasūryōdaya) both of them being Rajas of Bobbili.

Complete.

**Beginning:**

శా. శ్రీసీతోజ్జ్వలచంద్రికాన్వితుఁ డరిశ్రేణీమనోభీకరుం
డానందాంచితసద్గణావనుఁడు దివ్యత్యాగుఁ డుద్యత్కళా
వాసుం డద్భుతవిభాసుఁ డత్యమలసర్వజ్ఞావతంసుండు [శో(?)]
భానూనాస్త్రిఁడు రామచంద్రుఁ డనుకంపన్ మమ్ము సత్ప్రీతిఁ బ్రోవు
[తన్.

* * *

క. హరిచరణాబ్జంబున ని
ర్జరఝురితో వెలమవారు జనియించిరి యా
దొరలందు రావువారలు
ధరయేలిరి రిపులు కుధరదరులను జొరఁగ.

గీ. వారిలోపల నె(న)ంచఁ బోతవసుమతీశ
మౌళిపూర్వమహీశులఁ బోలి నవ్య
మేలుకొని పాలకడలిని శేషుఁ గడన
కరణి సర్వజ్ఞుఁ డనుపుత్త్రుఁ గనె నతండు

తే-గీ. ఘనరె సర్వజ్ఞనృపతి యాతనియనంత
రమున మహిఁ యేలె లింగపరంగరాయ
ధరణిపతి శత్రురాజులు తల్లడిల్ల
సకలబాంధవమిత్రులు సంతసిల్ల.

ఇట గ్రంథపాతముగలదు.

గీ. ఆర్యులుసుతింపఁదనరుమదగ్రజన్ము
రాణి వేంకటరమణాంబ రమణఁదలఁతు.

**End:**

మాలిని. రఘుకులకలశాంభోరాశిసంపూర్ణచంద్రా!
మఘుభుగ్హితభూభృన్మండలీనిర్జరేంద్రా!
మఘువగజసుధారుక్కాన్యసత్కీర్తిసాంద్రా!
యఘుతిమిరదినేంద్రా హరిశ్రీరామచంద్రా!

**Colophon;**

ఇది శ్రీమైథిలీమనోహర కరుణాకటాక్షవీక్షణ పరిలబ్ధభాస్వదైశ్వర్య మృదుమధురోభయకవితావిచిత్ర రావుకుల సుధాశరధిసంపూర్ణయామినీ కళత్ర సకలవిద్వజ్జనవినుతసచ్చరిత్ర రేచర్లగోత్రపవిత్ర శ్రీమదన్నారాయ పౌత్రరాయరాహుత్తద్వైశ్యాభుజంగసర్వజ్ఞాదిమహాబిరుదాధేయ రాజాధిరాజరాజతేజోనిధి మహారాజశ్రీ రాజారాయడప్పరంగారాయపుత్త్ర శ్రీ నిజబాంధవోద్యానవనచైత్ర కాంచనపటిత్సంచయసమంచితగాత్ర భండనాఖండదోర్దండసముద్దండమండలాగ్రక్రూరధారా ఖండితామిత్ర బుధజనవిధేయసమరాజేయ పోషితసత్కవినికాయ దానగుణరాధేయ గాంభీర్యకరుణాదిసద్గుణకౌసలేయ శ్రీమద్రాజాధిరాజరాజకందర్పరాజతేజోనిధిమహారాజశ్రీరాజాజనార్దనరంగారాయనామధేయప్రణీతం బైనమిత్రవిందాపరిణయం బనుమహాప్రబంధంబునందు సర్వంబును జతుర్థాశ్వాసము.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత యంత మంచిదిగాదు. శైథిల్యము లేదు. గంథపాతములు కలవు.

శ్రీకృష్ణుఁడు మిత్రవిందను బెండ్లాడుకథను, బొబ్బిలిపురాధీశ్వరుఁడగు జనార్దనరంగారాయప్రభువు మిత్రవిందాపరిణయ మనుపేర నాల్గాశ్వాసముల గ్రంథముగా నిట్లు రచియించినాఁడు. ఈ కవి సంకల్పసూర్యోదయకర్తయగు రాయడప్ప రంగారాయప్రభువు కుమారుఁడు

---

(*b*) రామప్రభుశతకము.

RĀMAPRABHUŚATAKAMU.

Foll. 31*a*—42*a*. Foll. 42 (*b*) is left blank.

This is the same work as the one described under R. No. 179. *ante.*

Contains 111 stanzas.

(వి-వి).—

సమగ్రము. ౧౧౧ పద్యములున్నవి. వ్రాఁత మంచిది కాదు. తప్పులున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

ఇది ఆర్. నె 179 రున వర్ణింపఁబడినదే.

---

R. No. 462.

Paper. 8 × 6½ inches. Foll. 103. Lines, 23 on a page. Mode of writing fair but incorrect. Good.

Purchased in the year 1917–18 from M.R.Ry. Niḍadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

శైవాగమశిఖామణి.

ŚAIVĀGAMAŚIKHĀMAṆI.

A treatise in Vīraśaiva religion dealing with the sanctity and greatness of Vibhūti (sacred ash), Rudrakṣa beads, Liṅga (phallic emblem of worship), Śivapūja, etc. The author is Neppalle Appanārya, son of Brahmaliṅgārya and disciple of Ivvaṭūri Rāmanārādhya.

Complete in 5 Āśvāsas.

**Beginning:**

శా. శ్రీశైలేశుని మల్లికార్జునుని దిక్చేలున్ శివానాయకున్
నీశానీ(?)భవరోగభేషజుని లోకైకాధినాథున్ వియ
త్కేశున్ అవ్యయలోకభక్తవరదున్ గీర్వాణసంసేవితున్
దాశరదప్రదదున్ నిరంతరము సద్భక్తిన్ ప్రశంసించెదన్. ?

* * * *

గీ. అనఘునివటూరివంశమహాబ్ధిశశిని
వీరనార్యాత్మజుని సారవినుతయశుని
సకలపరవాదిమత్తేభశస్తహారిని
రామనారాధ్యమద్గురుస్వామిఁగొల్తు.

**End:**

మాలినీ. తరుణశశికలాపా తాపసాధీశ . . పా
సురరిపుమదభంగా శుభ్రగంగోత్తమాంగా
శరనిధిఘనతూణా శార్ఙ్గహస్తప్రమాణా
ధరణిధరనివేశా దక్షుయాగప్రకాశా!

**Colophon:**

ఇది శ్రీమదివ్వటూరి రామనారాధ్యచరణాంబుజసేవాధురీణ శైవశాస్త్రార్థపారీణ సరసకవితాచాతుర్య అనవరతగాంభీర్య వీరమాహేశ్వరాచారనిరత సకలసద్గుణభరిత కౌండిన్యసగోత్రపవిత్ర బ్రహ్మలింగార్యసుపుత్ర నెప్పల్లె అప్పనార్యప్రణీతం బైనశైవాగమశిఖామణి యను ప్రబంధంబునందుఁ బంచమాశ్వాసంబు సర్వంబు సంపూర్ణము.

(వి-వి).—

సమగ్రము. (అయిదాశ్వాసములు). వ్రాఁత యంత మంచిది కాదు. తప్పులు మెండు. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

భస్మరుద్రాక్ష శివలింగమాహాత్మ్యములును, దద్ధారణమువలన ఫలములును, మఱియు శివపూజాదుల మాహాత్మ్యములును ఇందుఁ జెప్పఁబడినవి. గ్రంథకర్త నెప్పల్లె అప్పనార్యుఁడు. ఇవ్వటూరి రామనారాధ్యుని శిష్యుఁడు. కౌండిన్యగోత్రుఁడు. బ్రహ్మలింగార్యుని కొడుకు.

---

## R. No. 463.

Paper. 7¾ × 6½ inches. Foll. 47. Lines, 21 on a page. Mode of writing, fair but not quite incorrect. Good.

Purchased in the year 1917–18 from M.R.Ry. Niḍadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

రాఘవచరిత్రము.

RĀGHAVACARITRAMU.

This is the same work as the one described under R. No 421 *ante* By Kavirāyani Rāmabhadrakavi.

Complete.

(వి-వి).—

సమగ్రము. వ్రాఁతయంత మంచిదికాదు. తప్పులంతగా లేవు. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

ఇది ఆర్. నె 421 దున వర్ణింపఁబడినదే.

## R. No. 464.

Paper. $8\frac{3}{4} \times 6\frac{7}{8}$ inches. Foll. 28. Lines, 18 on a page. Mode of writing good but incorrect. Good.

Purchased in 1917-18 from M.R.Ry. Niḍadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

బసవకల్యాణము.

BASAVAKALYĀṆAMU.

A Yakṣagāna composition giving an account of the life of Basaveśvara. The author is Anumōda Sanyāsikavi.

Complete in one Āśvāsa.

**Beginning:**

శ్లో. శ్రీగంగానందకందాయ చిదానందస్వరూపిణే
వందితామరబృందాయ వృషభాయనమోనమః.

చ. శ్రీలలితంపువీరవ్రతసింధు సుధాకరులౌపురాతనుల్
లాలితరుద్రులుఁ బ్రమదలక్షణవంతులనేకకోటులఁ
జాలనుతించెదఁ మహితసౌఖ్యముతో బసవాదిముఖ్యసం
స్థాలన పాదపద్మములు భక్తిని మ్రొక్కినుతించి కొల్చెదఁ.

**End:**

మాలినీ. సకలభువనపాలా సర్వదేవానుకూలా
ప్రకటనిగమలోలా ప్రాణికోట్యానుమూలా
ప్రకటితకరశూలా పాపసంహారశీలా
సుకరశరణజాలా సూర్యబింబానుకూలా.

**Colophon:**

ఇది శ్రీభక్తమాహేశ్వర పాదారవిందమకరందపానానందమిళింద మానస శ్రీమద్గిరిమఠమల్లియభాగి చంద్రశేఖరాహ్వయమహాస్తాంబుజసంభూతభక్తుల యెలుకాహ్వయకరుణాకటాక్షవీక్షణ అనుమోదసన్న్యాసి నామప్రణీతంబైన శ్రీబసవకల్యాణయక్షగాన ప్రబంధంబునందు సర్వంబును నేకాశ్వాసము సంపూర్ణము.

(వి-వి.)——

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పులున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

బసవకల్యాణమను పేరుగల యీయక్షగానమున బసవేశ్వరుని చరిత్రము వర్ణింపఁబడినది. గ్రంథకర్త అనుమోదసన్న్యాసికవి.

## R. No. 465.

Paper. 8⅝ × 7 inches. Foll. 39. Lines, 22 on a page. Mode of writing bad and incorrect. Good.

Purchased in 1917–18 from M.R.Ry. Niḍadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

తారకబ్రహ్మరాజీయము.

TĀRAKABRAHMARĀJĪYAMU.

This is the same work as the one described under R. No. 347 *ante*.

By Rādhāmādhavakavi.

Contains the 1st and the 2nd Aśvāsas.

(వి-వి.)——

ప్రథమద్వితీయాశ్వాసములు మాత్రమున్నవి. వ్రాఁతయంత తిన్నఁగా లేదు. తప్పులున్నవి శైథిల్యము, గ్రంథపాతములు లేవు.

ఇది ఆర్. నె 347 లోన వర్ణితమే.

---

## R. No. 466.

Paper. 8¼ × 7 inches. Foll, 35. Lines, 22 on a page. Mode of writing fair but incorrect. Good.

Purchased in 1917–18 from M.R.Ry. Niḍadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

సకలలక్షణసారసంగ్రహచింతామణి.

SAKALALAKṢAṆASĀRASAṄGRAHACINTĀMAṆI.

A treatise on prosody by Uppulūr Veṅkatareḍḍi of Āpastambasūtra and Kāśyapa gōtra. It is mostly a compilation from Āppakavīyamu and other works.

Complete in 3 Paricchēdas.

**Beginning:**

క. శ్రీశైలకన్యకాప్రా
ణేశవియచ్చరయోగిహృదయనివేశా
కాశవసనాశనేశా
కాశధునీనిభయశఃప్రకాశ మహేశా!

గీ. వసుధనుప్పలూరి వంశాంబునిధి చంద్రుఁ
డైతనర్చు వేంకటార్యమణికి

ప్రియతనూభవుండు వెంకటరెడ్డినాఁ
బరగినాఁడ దేవ పార్వతీశ!

సీ. అవధరింపుము దేవతాగ్రణిదశవిధ
చ్ఛందముల్ శోధించి యందులోన
రాజిల్లుపద్యసమాజంబు లిఖియించి
నాకవిత్వంబొకింతయు రచించి
సకలలక్షణసార సంగ్రహచింతామ
ణియనంగఁ బేరిడి ప్రియమెసంగ
నీకర్పణము సేయనర్తుఁ బ్రాకటకారుణ్య
దృష్టిచేఁ గనుఁగొని దీనియందు
తప్పులున్న సుక్షమియించి యొప్పుగాఁబ
రిగ్రహించిధరాస్థలి వృద్ధిఁబొందఁ
జేయు నీపాదజలజాత సేవకుండ
భక్తహృదయాంబుజనివేశ పార్వతీశ?

**End:**

మత్తకోకిల. వారణాసురబాహుగర్వనివారణా శుభకారణా
తారకాచలవాసపోషితదాసమేరు శరాసనా
సారవేద మయసజ్జన ప్రకరక్రియా
సారశైవలినీజటాగ్ర యశస్సమస్త సురాగ్రణీ?

**Colophon:**

ఇది శ్రీమదుమామహేశ్వర చరణారవిందధ్యానానంద కందళిత హృదయసరసీరుహ చందనకుంద మందాకినీకీర్తి ప్రకాశసకలదిగ్దేశ ధరణీశపూజిత సలలితాపస్తంబసూత్ర కాశ్యపసగోత్రపవిత్ర ఉప్పలూరి కులకలశపారావారరాకాసుధాకర వేంకటార్యమణిపుత్ర సుకవిబుధ విధేయ వేంకటరెడ్డి నామధేయ ప్రణీతంబైన సకలలక్షణసారసంగ్రహచింతామణియను మహాలక్షణ గ్రంథంబున సర్వంబును దృతీయ పరిచ్ఛేదము.

(వి-వి.)—

సమగ్రము. మూఁడు పరిచ్ఛేదములు. వ్రాఁత చెడ్డదిగాదు. తప్పులున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

ఇది యొకలక్షణ గ్రంథము. గణవృత్త లక్షణములు యతిప్రాస లక్షణములు విభక్త్యాది లక్షణములు నిందుఁగలవు. ఉపాకపేయా ది

ప్రసిద్ధలక్షణ గ్రంథము లందలి విషయములే మార్చి యుండున్నవిగాని క్రొత్తవిశేషము లేమియు లేవు. గ్రంథకర్త ఉప్పలూరి వేంకటరెడ్డి. ఆపస్తంబ సూత్రుఁడు, కాశ్యపగోత్రుఁడు.

---

## R. No. 467.

Paper. 13⅛ × 8½ inches. Foll. 7. Lines, 58 on a page. Mode of writing good but not quite incorrect. Much injured

Purchased in 1917-18 from M.R.Ry. Nidadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

ఇందుమతీపరిణయము.

INDUMATĪPARIṆAYAMU.

By Pantula Brahmadēvakavi. As the MS. contains many omissions and injuries on account of its injured condition extracts are not given here.

Breaks off in the 3rd Āśvāsa.

(వి-వి.)—

మొదటినుండి తృతీయాశ్వాసమునఁ గొంతవఱకుఁగలదు. వ్రాఁత చక్క నిది కానిజీర్ణమై యుఱుకుగానున్నది. తప్పు లంతగా లేవు. శైథిల్యము గ్రంథపాతములు గలవు.

పుస్తక శైథిల్యముచే గ్రంథవిషయ మిక్కడ వివరింపరాదయ్యె. ఈ గ్రంథమును రచించిన యాతఁడు పంతుల బ్రహ్మదేవకవి.

---

## R. No. 468.

Palm-leaf. 10 × 1 inches. Foll. 154. Lines, 5 on a page. Mode of writing, fair but not quite correct Good.

Purchased in 1917-18 from M.R.R.y. Nidadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

(a) సీతావిజయము.

SĪTĀVIJAYAMU.

Foll 1*a*—63 *a* and 63 *b*. is left blank.

A poem narrating the story of the destruction of Śatakanṭharāvana by Sīta, by Penumalli Bāpayāmātya, son of Kōnayāmātya. There is a reference here to the sacred place called Visṇusamvēdyamu which is said to be on the bank of the river Kauśiki, a branch of the Godāvari. This work is also called Visṇusamvēdyamāhātmyamu.

**Beginning:**

క. శ్రీపార్వతీమనోహర
యాపద్మభవాది దేవతార్చితవరచి
ద్రూపజగన్మయ భూతివి
లేపనధవళాంగ రామలింగమహేశా.

వ. దేవా యవధరింపుము రోమశమహామునింగని ధర్మరాజు వినయంబున మ్రొక్కి సీతావిజయ కథాశ్రవణ కుతూహలుండై శతానన వధ ప్రకారంబు వినవలతుం జెప్పవేయన.

**End:**

మాలిని. నిగమనిచయస్ఫోటా నీరజారిందుజూటా
నగపతివరచాపా నవ్యథావళ్యరూపా
(?)సుగుణమ గజహారా సుందరీమానచోరా
యగణితబలశీలా యద్రిజామానలోలా.

**Colophon:**

ఇది శ్రీరామేశ్వర చరణారవిందభజనానంద ఫలవరప్రసాదలబ్ధకవితారచనవిశేషచారిత్ర పెనుమల్లి కోనయామాత్యసత్పుత్త్రబాపయామాత్య ప్రణీతంబైన శ్రీవిష్ణుసంవేద్యమాహాత్మ్యంబునందు సీతావిజయంబున సర్వంబు నేకాశ్వాసము.

(వి-వి.)

కృత్యవతరణిక తక్కఁ దక్కిన గ్రంథమెల్లఁగలదు. వ్రాఁత తిన్ననిదిగాదు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

సీతావిజయమను నామాంతరముగల యీ విష్ణు సంవేద్య మాహాత్మ్యమున, సీతాదేవి శతకంఠరావణుని జంపుట మొదలగు కథ వర్ణింపఁబడినది. విష్ణు సంవేద్యమను పుణ్యక్షేత్రము (కౌశికీ తీరమునఁగలదట) ప్రస్తావమిందుఁగలదు. గ్రంథకర్త పెనుమల్లి బాపయామాత్యుఁడు. కోనయామాత్యుని కొడుకు.

---

जगन्नाथाष्टकादि।

**JAGANNĀTHĀṢṬAKĀDI.**

Foll. 64a—154.

See the Sanskrit part of the Triennial Catalogue of MSS.

## R. No. 469.

Paper. $8\frac{5}{8} \times 6\frac{3}{4}$ inches. Foll. 19. Lines, 32 on a page. Mode of writing, good and correct. Good.

Purchased in the year 1917-18 from M.R.Ry. Niḍadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

సంకల్పసూర్యోదయము.

SAṄKALPASŪRYŌDAYAMU.

By Rāja Rāyadapparaṅgarāya, Raja of Bobbili. This is the same work as the one described under R. No. 428 *ante.*

Contains the first Āśvāsa complete, and the second incomplete.

(వి-వి.)—

మొదటినుండి ద్వితీయాశ్వాసమునఁ గొంతవఱకుఁగలదు. వ్రాఁత చక్కనిది. తప్పులు లేవు. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

ఇది ఆర్. నెం 428 రున వర్ణింపఁబడినదే.

---

## R. No. 470.

Paper $8 \times 6\frac{3}{8}$ inches. Foll. 32. Lines, 21 on a page. Mode of writing good but fairly correct. Good.

Purchased in 1917–18 from M.R.Ry. Niḍadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

వీరభద్రవిజయదండకము.

VĪRABHADRAVIJAYADAṆḌAKAMU.

A composition in the Daṇḍaka metre and in praise of God Śivā who is described here as having destroyed Dakṣa's sacrifice. The author is Śaṅkhula Cōḍayakavi, son of Lingaya.

Complete.

**Beginning :**

శ్రీమన్మహాభద్రకాళీ ముఖాంభోజహేళీ లసచ్చంద్రమౌళీ చరద్వైభగ వోదగ్రజాగ్రన్మహాయుద్ధకేళీ నటద్బాహుజంఝామరుద్ఘుంజితోద్యన్మహామోఘమేఘావళీపూర్వగీర్వాణ దోర్గర్వపర్వంసహాభృద్ధరాఖర్వదంభోళి మాంపాహి గాంభీర్యసంవత్సముద్రా సదా ఘోరరౌద్రా జగద్భద్రనిర్నిద్రకారుణ్యా పీఠ్యార్థకోట్యర్కసంకాశరుద్రా మహావీరభద్రా భవత్కోమలాబ్జోపమానాంఘ్రియుగ్మంబునా చిత్తమందుంచి ధ్యానించిపూజించి పూదండగానుండగానిండుగా దండకంబొప్పగాఁజెప్పి యర్పించెదన్ నీకదెల్లన్న:—నయ్యాదిదేవుండు.

**End:**

మహావీరభద్రుండు సర్వేశ్వరానుగ్రహప్రాప్తుండై యుండె దేవావళుల్ సంతసంబొందుచుఁ శంభునింగొల్చుచుఁ దార్నిజస్థానముం జేరి రాదక్షుండుఁ శంభునింగొల్చియుండెఁ భువిఁ నిత్యకళ్యాణసంయుక్తిగాఁ బూర్ణమైనట్టి యీ దండకంబాత్మసంసిద్ధిచే వీరభద్రార్పణంబై వెలుంగఁ రచించెఁ వదించంగ విశ్వేశ్వరానుగ్రహప్రాప్త ధారాకవిత్వామృత శ్రీసమేతుండు మాహేశ్వర శ్రీపదాంభోజ భక్తుండు లింగయ్య పుత్త్రుండు శ్రీశంఖులఖ్యాత సద్వంశుండుఁ జోడయాఖ్యుండు సన్మార్గుండీ సచ్చిదానంద కళ్యాణకృద్దండకంబెవ్వరైనఁ బ్రియంబొందఁగాఁ బాఠముం జేసినఁ వ్రాసినఁ జూచినఁ బుద్ధినేర్పొప్పఁగాఁ జెప్పి విన్పించినఁ విన్నవారిఁ మహావీరభద్రుండు శ్రీమంతులంజేయు ధీమంతులంజేయు వాక్సిద్ధిఁబొందించు సత్పుత్త్రపౌత్త్రాయురారోగ్యభాగ్యంబు లొందించునైర్మల్య మద్వాక్యముల్ సత్యముల్ చేయుమీ విశ్వనాథా ! సదాపూరితానందబోధా జయశ్రీసనాథా నమస్తే నమస్తే నమః.

(వి.వి.)—

సమగ్రము. వ్రాఁతచక్కనిది. తప్పులంతగా లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

వీరభద్ర విజయదండకమను పేరుగల యీ దండకమున దక్షయజ్ఞము, సతీమృతి, పార్వతీజననము, మొదలు మన్మథపునరావిర్భావము, దక్షపునర్యాగము, వీరభద్రోత్పత్తి, దక్షయాగనాశనము, వీరభద్ర విజయము, శివస్తుతి, యను విషయములు గలవు. గ్రంథకర్త శంఖులచోడయ కవి, లింగయ్యపుత్త్రుఁడు.

---

## R. No. 471.

Paper. 7¾ × 6½ inches. Foll. 66. Lines, 22 on a page. Mode of writing bad and incorrect. Fair.

Purchased in the year 1917–18 from M.R.Ry. Niḍadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

మదనసాయకావిలాసము.

MADANASĀYAKĀVILĀSAMU.

An amorous Prabandha dealing with the story of the marriage of Ṛtudhvaja (a king of the solar race) with Madanasāyakā, daugh-

ter of a Gandharva named Tumburu. The author of the work is Caduvulā Sōmaliṅgakavi, son of Vēṅkaṭācalamayya and Annapūrṇa and grandson of Guruliṅga and Nannamāmba. The work is dedicated to God Mallikārjuna worshipped at Śrīśaila.

Breaks off in the fourth Āśvāsa.

**Beginning :**

క. శ్రీగిరిజాసతుర్కుచలి
ప్తాగురుకాశ్మీరచందనాంకితవక్షో
భాగప్రాగల్భ్యుండగు
శ్రీగిరిమల్లేశు నాత్మఁ జింతింతునొగిన్.

* * * *

ఉ. అందముమీఱ నాగిరికి నబ్బురమొప్పఁగ నేఁగుదెంచినా
యందునభక్తిచేతను నయంబలరారెడు నూఱుకందముల్
పొందుగఁబుష్పమాలవలెఁ బూన్చితివందుకు సంతసంబు నే
నొందినవాఁడనైతిఁదగ నుర్విని షట్స్థలరాజవంశజా!

గీ. కావునను నీవునొనఁగూర్చు కావ్యమధిక
భక్తితోమాకొసంగినఁబరమమహాని
గణనమగునైహికాముష్మికములుగల్గు
సురుచిరసమాఖ్య చదువులసోమయాఖ్య.

గీ. అనినిరాకారమందిన యంతనేను
మల్లికార్జునదేవుఁడమందకృపను
వచ్చికృతివేఁడుటకు మదిమెచ్చిపూర్వ
పుణ్యసంపత్ఫలంబులుపొందెననుచు.

**Colophon :**

ఇది శ్రీమద్గురులింగజంగమచరణ కరుణాకలితసదభ్యాసోచిత నవరసాలంకారకవితాధురంధర ఘనయశోబంధురగారుత్మతద్యుతి * గోత్రపవిత్ర సకలలింగాంగసంఘపావనీయ చదువులవంశామృతపారావారపూర్ణచంద్రోదయ గురులింగనన్నమాంబాసుపుత్త్రి వేంకటచలమయాన్నపూర్ణాంబికా గర్భశుక్తిముక్తాఫల సోమలింగాహ్వయ ప్రణీతంబైన మదనసాయకా విలాసంబను శృంగార ప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.

**End :**

సీ. త్రిదివరాజ్యాధిపతి నికాయ్యసాన్నిధ్య
శుభవారిజాతప్రసూనమనఁగ

ప్రాచీమదేభకుంభాభ్యంతరాళశుం
భత్ప్రభాంకితవజ్రపట్టమనఁగ
తారాపథాంబుజాతదృగాంచెలి ? కర
సంభృతసితసారసంబనంగ
వారిదస్వాస్థానమంటపాంతరవజ్ర
పంజరస్థితసితపక్షమనఁగ
తిమిరఫలభుక్కళేబర స్థిరతభూత
హారణకృతాలికమలాక్షకరవిభాస
చక్రమనఁదగితోఁచె నిర్వక్రుఁడగుచు
సుందరకరుండు నానిండుచందురుండు.

(వి-వి.)—

మొదటినుండి నాల్గవయాశ్వాసమునఁ గొంతవఱకుఁగలదు. వ్రాఁత మంచిదికాదు. తప్పులున్నవి. శైథిల్యము, గ్రంథపాతములు లేవు.

మదనసాయకా విలాసమను పేరుగల యీ శృంగార ప్రబంధము చదువుల సోమలింగ కవిచే రచియింపఁబడినది. ఈతఁడు వేంకటాచల ముకొడుకు. ఈ కృతి శ్రీశైల మల్లికార్జునున కంకితము సేయఁబడినది.

---

## R. No. 472.

Paper. 8 × 6½ inches. Foll. 99. Lines, 22 on a page. Mode of writing fair but not quite incorrect. Fair.

Purchased in 1917-18 from M.R.Ry. Niḍadavolu Sundaram Pantulu Garu of Vizagapatam.

బ్రహ్మోత్తరఖండము.

BRAHMŌTTARAKHAṆḌAMU.

This is the same work as the one described under No. 33 of the D. Cat. of Telugu MSS., Vol. I, but with full colophon which gives the author's name as Paṭṭameṭṭa Sōmanātha Sōmayājin.

Complete, but without the prefatory portion.

**Beginning:**

క. శ్రీమల్లింగారాధ్య
స్వామికటాక్షాప్తసకలవైభవయొల్ల
క్ష్మామండలేంద్రసుమనో
గ్రామావేశునకు సిద్ధరామేశునకున్.

వ. నిశ్చితాంతఃకరణభక్తి సమన్వితంబుగా నారచియింపంబూనిన బ్రహ్మోత్తరఖండంబను మహాఖ్యానంబునకుఁ గథావిధానం బెట్టిదనిన.

**End:**

శా. కారుణ్యాకరబిక్కనోలి వసుధాకాంతావతంసేంద్రకా
మారెడ్డిక్షితిపానుసంభవ జగన్మాన్యప్రభావాఢ్యమ
ల్లారెడ్డిప్రభుశేఖరాంఘ్రిభవయెల్లారెడ్డిభూపాలచే
తోరాజీవనిజైక్యభావన సుధాతుష్టద్విరేఫార్భకా!

* * * *

క. ఎల్లారెడ్డినృపార్చిత
ఫుల్లాంబుజహల్లకౌఘపూజాసంభా
రోల్లాసజాతకుండలి
వాల్లీసకముఖ్యతాండవార్భటిలోలా!

**Colophon:**

ఇది శ్రీభవానీశంకరకింకరతాఖిలప్రియంకర కవితాపట్టభద్ర పట్టమట్టవేంకటామాత్యపుత్త్రి హారితసగోత్ర ఆపస్తంబసూత్రసాధుమేధావిరాజి సోమనాథసోమయాజి ప్రణీతంబైన బ్రహ్మోత్తరఖండంబను మహాప్రబంధంబునందుఁ బంచాక్షరీప్రభావంబును మహాశివరాత్రిమాహాత్మ్యంబును కృష్ణచతుర్దశీ మహిమంబును ఉభయత్రయోదశీ ప్రదోషకాలపూజావిధానంబును సోమవారవ్రతవిశేషంబును సీమంతినీప్రభావంబునునందు జిత్రకథయును విభూతిమాహాత్మ్యంబును రుద్రాక్షమాహాత్మ్యంబును శ్రద్ధాభక్తివిశేషంబును ఉమామహేశ్వర వ్రతలక్షణంబునునందు జిత్రకథయును ననుకథలంగల సర్వంబును బంచమాశ్వాసము.

(వి-వి.)——

కృత్యవతరణిక తక్కఁదక్కిన గ్రంథమెల్లఁగలదు. వ్రాఁతమంచిది తప్పులంతగా లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

ఇది తెలుఁగు డిస్క్రిప్టివుక్యాటలాగు నెం 33 రు న వర్ణింపఁబడినదే. గ్రంథకర్తృ విషయాదిక మిక్కడ స్పష్టముగాఁ దెలియవచ్చుచు నక్కడ వ్రాయఁబడిన విషయవివరణముకు సిద్ధాంతపఱుచుచున్నది. సూతసంహిత యీ పట్టమెట్టసోమనాథకవి కృత్యంతరము. సూతసంహితారచనానంతరము సోమయాజియై యీ కృతిని రచియించినాఁడు.

R. No. 473.

Palm-leaf. 15 × 1½ inches. Foll. 275 Lines, 6 on a page. Mode of writing, fair but not quite incorrect. Much injured.

Purchased in the year 1917–18 from M.R.Ry. Niḍadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

(a) భార్గవపురాణము.

BHĀRGAVAPURĀṆAMU.

Foll. 1—210b.

This is a Telugu rendering in 7 Āśvāsas of the Sanskrit Bhārgavapurāṇa in which is given an account of the Tamil Śrī-Vāiṣnava saints called Āḷvārs and Divyasūris. The author's name is Kāṇḍūri Vēṅkaṭa dāsakavi, son of Lakṣmanācārya of Bhāradvājagōtra and disciple of Tīrumala Tātācārya. Information regarding the genealogy of the poet is found in the Telugu extracts given below.

Complete.

**Beginning:**

శా. శ్రీసమ్యక్సదనోరువక్షము విరాజిల్లంగ సచ్చందన
శ్రీసమ్మేళిత సుందరాంగమమరన్ శిష్టాగ్రణీస్తుత్యులౌ
శ్రీసేనేశసుపర్ణశేషముఖు లర్థింగొల్వ సానందుఁడౌ
శ్రీసింహాచలనారసింహు మదిలో సేవింతు నెల్లప్పుడున్.

* * * *

గీ. నూతన గ్రంధరచనావినోది వగుట
గానుపించెను గానభార్గవ పురాణ
మాంధ్రముగఁజేయు లోకవిఖ్యాతి వెలయ
వేంకటాచార్య నామాట విని ముదమున.

మ. ధరలోనన్ మునుయజ్ఞమూర్తి యన సిద్ధఖ్యాతిచే మించి యం
తరహీన్ భాష్యకృదంఘ్రిపూజనకళాధౌరేయుఁడౌ దేవరా
డ్గురు రాజేంద్రుఁడు జ్ఞానసారముఖ సద్గోష్ఠ్యంబులంగూర్చి శాం
డురివంశాగ్రణియౌచు భాసిలెగుణాఢ్యుల్ మెచ్చ గూటస్థుఁడై.

శా. * * * * ల
శ్రీరమ్యుండున హోబలార్యమణి సత్కీర్తిం జెలంగెన్ భువిన్.

గీ. అమ్మహాత్ముని తనుజాతుఁ డఘువిదారుఁ
డుభయవేదాంతధర్మ మహాన్నతుండు

భాష్యకారమతావనోద్భాసిసత్య
సంగరార్యుఁడు సింగరాచార్యుఁ డలరు.

గీ. కనియె నాతఁడు నలువురాఘనసుతులను
దనరు లక్ష్మమ్మయనెడు సతీకాంతయందు.

సీ. వేదవేదాంతార్థ విజ్ఞానబోధకుం
డగుచుశోభిల్లె ననంత గురుఁడు
ప్రతివాదితిమిరమార్తాండుఁడై తనరారె
సద్గుణివల్లభాచార్యమౌళి
సకల దాసస్తోమసౌరథరాజమై
కడుఁగీర్తి నొప్పె వేంకటగురుండు
రామానుజమతాబ్ధిరాజబింబం బన
నలరారె రామానుజార్య ఘనుఁడు.
నిట్లు వెలసిరి నలువురు నిద్ధమహిమ
సుందవ్యూహా ! మఱియందులోన
నతుల వేంకటగురుఁడు రామానుజార్యుఁ
డును జిరాయువులైయుండి రనఘగతిని.

* * * *

గీ. అంతశ్శృంగార లక్ష్మీనారాయణార్య
తనయ వినయాదిసుగుణ వితానయగుచు
వరలు వల్లమయనెడి సద్వనితఁ బరిణ
యంబు నొందెను రామానుజార్య గురుఁడు.

వ. అమ్మహాపతివ్రతాతిలకమ్మునందు.

శా. శ్రీరాంభోనిధిచంద్రుఁగన్నకరణి౯ శ్రీసింగరాచార్యుని౯
శ్రీరామానుజ పాదపద్మయుగళీసేవారతు౯ దాసమం
దారంబౌహారితత్త్వపాలనమహోదారు౯ గృపాధారుని౯
శ్రీరామానుజదేశికుండు గనియె౯ శిష్టుల్ ముదంబందఁగ౯.

శా. శ్రీమత్సింగరదేశికుండుగనె లక్ష్మీతుల్యబుచ్చమ్మనే
భామారత్నమునందు నార్యజనసంభావ్యు౯ శతారాతివా
చామాధుర్యకథార్థముల్ తెలుపుదాసస్తోమ రక్షాపరు౯
రామగ్రంథమహార్థదానచతురు౯ రామానుజార్యుంవగ౯.

గీ. ఇట్లురామానుజాచార్యుఁ డెలమి మీఱఁ
బుత్త్రపౌత్త్రాభివృద్ధిగాభూతి వెలసె
నగ్రజుండైన శ్రీవేంకటార్యగురుని
కర్థిఁగల్గిరి సప్తసంఖ్యాక సుతులు.

సీ. రామసోదరమతరక్షాధురీణుండు
తిరుమంగళాచార్య దేశికుండు
సకల జనావనసమధికగుణశాలి
సింగరగురురాజపుంగవుండు
. . . . . . . . .
పరిపూర్ణ గురుఁడు
లక్ష్మణమునివలె లక్షింపఁదగినట్టి
లక్షణాఢ్యుండైన లక్ష్మణుండు
రంగరాజసమానుండు రంగగురుఁడు
ననఘగుణశాలిరామానుజార్యమౌళి
సాధువినుతుండు శ్రీజగన్నాథవర్యు
డలరు చుండిరి సప్తమహార్షు లనఁగ.

సీ. అవతరించిరి వేంకటార్యు లాచార్యులు
తిరువేంగళాభిఖ్య దేశికునకు
విద్వదగ్రసరుండు వేంకటాచార్యేంద్రుఁ
డవతరించెను సింగరార్య మణికి
శ్రీకృష్ణమాచార్యాది శిష్టులార్యు రుగల్గి
రలపరిపూర్ణార్యులను ఘనునకు
వేంకటార్యుఁడు గల్గె విజ్ఞాన పూర్ణుండు
రంగార్యసద్గురు పుంగవునకు.
సంభవించియు నిత్యవిశాలకీర్తి
పూర్ణులై వేదశాస్త్రాదిపూర్ణు లగుచు
నలరు చుండిరి పుత్త్రపౌత్త్రాభివృద్ధి
భాష్యకృన్మత పాలనభవ్యు లగుచు.

వ. పూర్వోక్తశ్రీసింగరాచార్య పుత్త్రసప్తకంబులోనాలవపురుష
ప్రకారంబు (ంశంబు ?).

మ. ధరలోలక్ష్మణదేశికుండు కరుణాధారేయుండై వేదశా
స్త్రరతిన్ . . . చ్చుచున్ ద్రవిడవేదప్రాప్యభావంబులన్
బరమజ్ఞానులతో వచింపుచును శుంభద్ధైర్యసంపూర్ణుండై
పరిపూర్తిన్ వెలయించెదిక్కులయశఃపద్మారిబృందమ్ములన్.

సీ. గీ. అనుచు బుధులెల్ల వర్ణింప నలరుచుంట
సాలఘణిహారకృష్ణమాచార్య తనయ
సరసరామానుజాఖ్యాక సారసాక్షి
భార్యయయ్యెను లక్ష్మణాచార్యమణికి.

వ. అట్టి శ్రీద్వారకాతిరుపతి శ్రీవేంకటేశ్వరవర ప్రసాదసాంగత్యం బగు రామానుజాంగనా లక్ష్మణాచార్య రూపదాంపత్యంబున కుద్భవించిన వాఁడవౌటను శ్రీగరుడాచలనారసింహ కృపాపాత్రుఁడ వౌటను మేము నీకు నియమించిన శ్రీభార్గవపురాణంబు తెనుంగుసేయు సామర్థ్యంబు గలిగియుండు.

**End:**

భుజంగప్రయాతము.

సుమంగళంసదాస్తుతే యశోజితాంబికాపతే
సుమంగళం సదాధృతప్రసూనసాయకాకృతే
సుమంగళం సుమంగళం భవచ్ఛ్రియస్సుమంగళం
సుమంగళంభవత్పదాబ్జ సుస్థిరాంతరంగిణామ్.

**Colophon:**

ఇది శ్రీమన్నాధమధురకవి యతినాథసనాథవకుళాభరణ చరణ రంగపురీరమణ కృపాసంప్రాప్తకవిత్వరూపగుణానుభవకైంకర్య శ్రీమత్తిరుమల తాతాచార్య దేశికపదారవిందాశ్రయ భారద్వాజగోత్రపవిత్ర పరమపావనచర్య కాండూరిలక్ష్మణాచార్యతనూభవ భగవద్భాగవత సేవామహోల్లాస వేంకటదాసప్రణీతంబైన శ్రీభార్గవపురాణంబను దివ్యసూరిచరిత్రంబునందు శ్రీవైకుంఠంబున . . . . . ద్వాదశమహాయోగిపూజాఫలవైభవంబును భాగవత ప్రభావంబుఁదెల్పుటయును న్నది సర్వంబును సప్తమాశ్వాసము.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత మంచిదికాదు. తప్పు లంతగా లేవు. శైథిల్యము మెండు. గ్రంథపాతములున్నవి.

సంస్కృతమునఁగల భార్గవపురాణమున కిది తెలుఁగు. ఇందు దివ్యసూరులనఁబడు నాళ్వార్ల చరిత్రము వర్ణింపఁబడినది. షడాశ్వాసములు గల యీ గ్రంథమును గాండూరి వేంకటదాసకవి రచియించెను. ఈతఁడు కాండూరి లక్ష్మణాచార్యుని కొడుకు, తిరుమల తాతాచార్యుల శిష్యుఁడు, భారద్వాజగోత్రుఁడు. ఉదాహృతపద్యములఁబట్టి కవి వంశవృత్తాంతాదివిషయము తెలియఁదగును.

(b) तारकब्रह्ममाहात्म्यम्.

TĀRAKABRAHMAMĀHĀTMYAM.

Foll. 211a—275b.

See Sanskrit part of this Catalogue.

---

## R. No. 474.

Paper. 8½ × 6¾ inches. Foll. 41. Lines, 31 on a page. Mode of writing, good and correct. Good. Written only on one side of the paper.

Purchased in the year 1917–18 from M.R.Ry. Niḍadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

(a) పురుషోత్తమచరిత్రము.

PURUṢŌTTAMACARITRAMU.

Foll. 1—32a. 32b is left blank.

This prose work gives an account of how Puruṣōttama, son of Pamiḍipāṭi Paṭṭābhirāmayya, a Brahmin resident of Isukapalli (of the Māṇikkārao Zamin), became a great magician. The author is Allūri Lakṣmīnṛsiṁhakavi, son of Puṇḍarīkākṣāmātya of Bhāradvājagōtra.

Complete.

**Beginning:**

శా. శ్రీకాంతాత్మజు నబ్జనేత్రుసభవుం సృష్టిం స్థితిన్నాశముం
చీకంజేయననుగ్రహించి విబుధానీకంబు దుష్టాఘముం
శ్రీకైవల్యపదంబుఁ జేరఁగభృశార్తిన్బొందఁగాఁజేయునా
తృష్ణాకామప్రదసింహవక్త్రయుడు సౌఖ్యప్రాప్తి మాకెప్పుడుం.

*  *  *  *

గీ. ఆమిథునమున కుద్భవమైతిమేము
ముగురమగ్రజు లతితపోమూర్తులుపురు
షోత్తముఁడు రాజరాజేశ్వరోత్తముఁడుదద
నుజుఁడ లక్ష్మీనృసింహాఖ్యనుతచరితుఁడ
. . . జన్మపావన మనితలంచి.

క. ప్రత్యంగిరకుఁ ద్రినేత్రకు
సత్యాకారకుఁ ద్రి లోకసాక్షికభవకుఁగ
ప్రత్యూషారుణ వర్ణకు
నత్యధ్యక్షకుజితాది మానురతతికిఁగ.

గీ. అర్పణంబుగనాజగదంబ సాద
రానుకంపాతిశయమున నేను జేయు
నట్టి పురుషోత్తమచరిత్రయనెడుగద్య
కావ్యమున కెట్టులనఁగను గథ తెఱంగు.

వ. శ్రీమద్వసుంధరామండలమండనాయమానంబును విచిత్రచిత్రిత ద్వారతోరణవేదికా . . .

**End:**

పిమ్మటఁ బంచవాసరంబులు జరుగుడుఁ బురుషోత్తముండు సహధర్మిణీసహితుండై యతివిచిత్రమహిమలజనుల నానందితులఁ జేయుచు నర్థిసత్కారంబులఁగావించుచు నఖిలేశ్వరిఁబూజించుచు నధికకాలంబు సుఖంబునంబరగె.

* * * *

మాలిని. చలితదనుజదైత్యా శంకరస్తుత్యచర్యా
దళితకలుషజాలా ధర్మరక్షాసుశీలా
కలితకమలవాణీ కాలజీమూతవేణీ
లలితగుణకలాపా లక్ష్మసూర్యప్రతాపా.

**Colophon:**

ఇది శ్రీబాలాత్రిపురసుందరీ కరుణాకటాక్షవీక్షణసంలబ్ధ సరసకవితాధురంధర అల్లూర్యుపాధ్యాయబంధుర భారద్వాజసగోత్రపవిత్ర పుండరీకాక్షామాత్యపుత్త్ర బుధజనవిధేయ లక్ష్మీనృసింహనామధేయ ప్రణీతంబగు పురుషోత్తమచరిత్రంబను గద్యకావ్యంబున సర్వంబు నేకాశ్వాసము.

(వి-వి.)—

సమగ్రము వ్రాఁతమంచిది. తప్పులు లేవు. శైథిల్యము, గ్రంథపాతములు లేవు.

జంగన్నారావు మాణిక్యారావుగారి జమీనులోని యినుకపల్లె యను గ్రామమునఁగల పమిడిపాటి పట్టాభిరామయ్యయను బ్రాహ్మణునకుఁ

కుమారుఁడగు పురుషోత్తమాఖ్యుఁడు నానాదేశములందిరిగి మహామాంత్రి కుఁడయిన చరిత్రాంశ మీవచనప్రబంధమున వర్ణింపఁబడినది. దీనికిఁ కర్త యల్లూరి లక్ష్మీనృసింహుఁడు.

---

(b) అపరోక్షానుభూతి.

**APARŌKṢĀNUBHŪTI.**

Foll. 33 *a*—41 *b*.

A versified translation of the Sanskrit philosophical work called **Aparōkṣānubhūti** of Śaṅkarācārya (described under No. 4540 of the Des. Catalogue of Sanskrit MSS. Vol, IX). The translator's name is not given.

Incomplete.

**Beginning :**

మ. పటురౌద్రంబున విశ్వరూపమలరన్ బ్రహ్మాండభాండంబుల
న్నిటనాకుర్హ్మడి నాశమేర్పడమహా నేత్రాగ్ని చే దగ్ధమా
నటుగావించిన నిష్ప్రపంచముగ నన్యం బెప్పుటన్ లేని పి
మ్మట శేషించిరి ముఖ్యకారణులు ధీమంతుండు దానిద్దఱున్.

**End :**

వ. . . . . . పరమాత్మయను తానన వేఱులేక యేకంబై నిస్సంశయంబై యొప్పునని సంకల్పప్రవృత్తి ప్రకరణం బితిహాసమార్గంబుగా వినిపించిన విని యజ్ఞవర్యుం డత్యంతామోదభరితమానసుండై మఱియును.

అసమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పులున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

అపరోక్షానుభూతి యను సంస్కృతవేదాంతగ్రంథమునకుఁ దెలుఁగుపద్యములు. కర్త యెవ్వరో ?

---

R. No. **475.**

Paper. $12\frac{3}{4} \times 8\frac{3}{8}$ inches. Foll. 138. Lines, 35 on a page. Mode of writing, good. Fair.

Purchased in 1917–18 from M.R.Ry., Niḍadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

రామకథాసుధార్ణవము.

RĀMAKATHĀSUDHĀRṆAVAMU

A Prabandha in 7 Taraṅgas narrating the story of the Rāmāyaṇa, by Tumurāḍa Pāpakavi. It is based on the Telugu prose work called Vicitra-rāmāyaṇa, which was a translation by Gōpīnātha from an Oriya work of the same name by Siddhēndrayōgi. The author composed the Prabandha at the instance of one Pakki Lakṣmīnṛsiṁham who belonged to Śiṣṭukaraṇa class and who was the daughter's son of Gōpīnātha referred to above.

Complete

**Beginning:**

క. శ్రీమజ్జననిజనకుల
కోమలపాదాంబుజములకుఁ బ్రొక్కి గురు
స్వామి వినుతించి నెమ్మదిఁ
బ్రేమాతిశయంబు చాలఁ బెనఁగొనుచుండన్.

* * * *

సీ-గీ. అట్టిలక్ష్మీనృసింహసమాహ్వయుండు
పక్కికులవార్ధి చంద్రుండు పరగుచుండు.

* * * *

క. ధీరుని దుమురాడకుల
క్షీరాంబుధిపూర్ణచంద్రు శ్రీరామకృపా
సారజనితోరుకవితా
పారవిభూషణుని బాపనాఖ్యునినన్నున్.

* * * *

సీ-గీ. గోకనకవస్త్రకన్యాద్యనేకదాన
ములను విప్రులకనుదినమును నొసంగ
నతఁడు భూకల్పకంబనఁ నలరుచుండె
గోపినాథుండు సత్కీర్తిదీపితుండు.

వ. మఱియు నతండు వినుము.

గీ. మున్ను సిద్ధేంద్రయోగియన్మునివరుండు
సకలకథలను బొందుగా సంఘటించి

పరగరచియించెనుతర్కశభావచేత
నదియుఁదనరె విచిత్రరామాయణమన.

క. అదియాఱమూలాగ్రంబుగఁ
ఇదివితదద్భుతకథాప్రసంగతులను దా
మదిమెచ్చి గోపినాథుఁడు
విదితంబుగఁ దెలుఁగువచనవిధముగఁ జేసెన్.

గీ. దానిలోవలికథలు సంధానపఱిచి
భువినిరామకథాసుధార్ణవమనంగఁ
గృతిని జేయింపునాకునంకితముగాను
మానితశుభావ్యాపకీర్తిలక్ష్మీనృసింహా !

**End:**

క. సిద్ధేంద్రుండుతర్కశవా
గ్బద్ధముగరచించిదీనిఁబఠియించినవా
రిద్ధరనిఖిలైశ్వర్యస
మృద్ధింగనియుండుదురుసుమీయనిపలికెన్.

* * * *

మాలిని.—శయగరసకలార్థాత్మాసురార్థార్జితార్థా
. . యుతకరచాపాత్మాళితానేకపాపా
వియదుపమితకాయా వేదవేదాంతగేయా
నయముఖగుణలత్మానారసింహావనేత్మా !

**Colophon:**

ఇది శ్రీరామచంద్రకరుణాకటాక్షలబ్ధోభయభాషాకవితావిచిత్ర భారద్వాజగోత్రపవిత్ర బుచ్చనార్యపుత్ర పాపయకవి ప్రణీతంబైన రామకథాసుధార్ణవంబునందు సర్వంబును సప్తమతరంగము.

(వి.వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పు లంతగా లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

రామకథాసుధార్ణవమను పేరుతో నేడుతరంగములుగా విభక్తమైన యీ ప్రబంధమున రామాయణకథ వర్ణింపఁబడినది. గ్రంథకర్త యగు

రాడ పాపకవి. ఓఢ్రభాషలో సిద్ధేంద్రయోగి రచించిన విచిత్రరామాయణమునుబట్టి తెలుఁగున గోపీనాథుఁడు రచించిన వచనగ్రంథమును జూచి యీ పద్యగ్రంథము నీకవి రచించినాఁడు. పకిర లక్ష్మీనృసింహమను శిష్టుకరణమీకవి నీగ్రంథము రచియింపఁ బురికొల్పెను. గోపీనాథుఁ డీలక్ష్మీనృసింహునకు మాతామహుఁడు.

---

## R. No. 476.

Paper. $8\frac{1}{2} \times 6\frac{1}{2}$ inches. Foll. 86. Lines, 22 on a page. Mode of writing good but incorrect. Good.

Purchased in the year 1917-18 from M.R.Ry. Niḍadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

(a) ప్రబోధచంద్రోదయము.

**PRABŌDHACANDRŌDAYAMU.**

Foll. 1a—75b.

A Telugu rendering in the Prabandha form of the Sanskrit Prabōdhacandrōdaya which is an allegorical drama by Kṛṣṇamiśra. embodying the philosophical tenets of the Advaita Vēdānta. The author of the Telugu work is Koṭikalapūḍi Vēṅkatakṛṣṇa Sōmayājikavi, son of Veṅkaṭarāma of Haritasagōtra. He wrote other works such as Dilīpacaritra, etc., Koṭikalapūḍi Kōdaṇḍarāmakavi is the son of this poet.

Complete in three Āśvāsas.

**Beginning:**

మ. మృగతృష్ణాసలిలంబుఁబోలె సతతం బేతత్త్వమం దజ్ఞతన్
జగము న్మీలితమై నిమీలితమగున్ స్రగ్భోగిభోగోపమం
బగునీవిశ్వము క్రమ్మఱన్ బుధులకజ్ఞాతాసనాద్యర్చితం
బగుతత్త్వముఁగొల్చెదన్ నిరుపమానానందసౌఖ్యార్థినై.

మ. భ్రమదంతర్గతనాడికానియమితప్రాణోద్ధృత (!) బ్రహ్మరం
ధ్రమునిర్గత్వరమానసాబ్జనిహితానందంబు యోగీశ్వరో
త్తమపూజ్యంబు చెలంగు గాత శిశుప్రత్యగ్జ్యోతిలాలాటనే
త్రముభంగిన్ బ్రకటీకృతంబయి జగద్వ్యాపిత్వమార్జించుచున్.

వ. నాంద్యంతమున సూత్రధారుం డిట్లనియె.

**End:**

క. అనివిష్ణుభక్తిఁ బలికిన
విని సంమోదంబుఁ జెంది విద్యాన్వితుఁడా
ఘనుఁడాత్మసపరివారముఁ
గనిరానిషాత్రింతుఁడయ్యెఁ గమనీయగతిన్.

* * * *

క. వాఘీప్రమతీశశక్ర
వ్యాఘ్రాజినధరకిరీటవాసవరత్నా
శ్లాఘ్యాఘ్రాణితపదపల్లవ
శీఘ్రఫలప్రదకటాక్షసీతాధ్యక్షా!

**Colophon:**

ఇది శ్రీజానకీరమణీరమణచరణార్పితమనశ్శతపత్త్రి హారితసగోత్రపవిత్ర కొటికలపూఁడి వేంకటరామాఖ్యసుపుత్త్ర సకలసుకవినికరసంస్తుత్య సద్గుణవిరాజి వేంకటకృష్ణసోమయాజి ప్రణీతంబయిన ప్రబోధచంద్రోదయంబను మహాప్రబంధంబునందు సర్వంబును దృతీయాశ్వాసము.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

కృష్ణమిశ్ర కృతమగు ప్రబోధచంద్రోదయమను సంస్కృతనాటకమును బట్టి తెలుఁగున నీ ప్రబంధమును గొటికలపూఁడి వేంకటకృష్ణసోమయాజికవి రచించినాఁడు. ఈతఁడు హారితసగోత్రుఁడు. వేంకటరామాఖ్యునిపుత్త్రుఁడు. దిలీపచరిత్రాదికము లీకవి యితరకృతులు. కొటికలపూఁడి కోదండరామకవి యీతని కుమారుఁడు.

---

(*b*) सर्वसारोपनिषत्.

SARVASĀRŌPANIṢAD.

Foll. 76*a*—86*b*.

See the Sanskrit part of the Triennial Catalogue.

R. No. 477.

Paper. 8⅜ × 6⅛ inches. Foll. 62. Lines, 22 on a page. Mode of writing, bad and incorrect. Injured.

Purchased in the year 1917–18 from M.R.Ry. Niḍadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

(*a*) ఉషాపరిణయము.

USĀPARIṆAYAMU.

Foll. 1*a*—38*b*.

A poem in a form of the Sīsa metre narrating the story of the marriage of Uṣā, Bāṇāsura's daughter, with Aniruddha, Kṛṣṇa's grandson. By Naḍiminṭi Rāmajōgi.

Incomplete.

**Beginning:**

శ్రీరామరఘురామసీతాపతీరామ
రక్షించుమమ్మునేలురామవోరామ
హరిరామరఘురామఅఖిలలోకాధార
నిన్నువేఁడెదనయ్యనీరదాకార
అపరాధినపరాధినసమానగుణధామ
శరణయ్యమాపాలి జానకీరామ
మత్స్యావతారమైమటిసోమకునిజంప
జగములేలినయట్టిస్వామినినుఁదలతు.

* * * *

నాతుదోచినరీతి నీకంకితముచేసి
యనిరుద్ధునీచరితమమరజెప్పెదను.

* * * *

రాణించినడిమింటిరామజోగియనంగ
వాసికెక్కినకవీశ్వరుఁడుతాజెప్పె

* * * *

**End:**

తలదూసిశోకలోపలనుచ్చిపోవంగ
నిలువున్నపాటనేనీల్గెనశ్వములు
నడిగంటివడ్డబాణాలప్రాణముపోయి
చచ్చిబావనిలాగుసారథుల్ పడిరి

దివ్యాస్త్రములతాకుదెబ్బనేకడతేరి
కొలువున్నలాగునేకూలిరారథులు
రథులుసారథులపైరథులమీదగుఱ్ఱాలు
వారిమీదరథాలుకూలెవింతగను
పదులు నూరులు వేలు బహులక్ష బహుకోట్లు
ఒక్కొక్కదెబ్బనే యుర్విగూలిరి గా.

(వి-వి.)——

అసమగ్రము. వ్రాఁత మంచిదికాదు. తప్పులున్నవి. శైథిల్యము గ్రంథపాతములుగలవు.

బాణాసురుని కూఁతురగు నుషను, అనిరుద్ధుఁడు పెండ్లియాడు కథను స్త్రీసవికారమనఁదగు పదమున నడిమింటి రామజోగియనుకవి యిట్లు చక్కఁగా వర్ణించినాఁడు.

---

(*b*) తారకబ్రహ్మము.

TĀRAKABRAHMAMU.

Foll. 39*a*—56*b*.

A work in verse describing the greatness of Rāma. The author is Koṭikālapūḍi Vēṅkaṭakṛṣṇa Sōmayāji Kavi.

Contains a portion of the 4th Āśvāsa and the 5th Āśvāsa complete.

**Beginning :**

గీ. రత్నములు గొంటకైనను రాష్ట్రిమాత్ర
మించుటకునైనరణమొనరించలేదు
చాలలేకున్నజనుమునీజోలిరాను
సమరమొనరించితేనినిఁజంపువాఁడ!

క. రామా! విను నిను రణమున
భీమగతింద్రుంచి విజయభేరీధ్వనులు
ద్దామాకృతిఁదివిఁగ్రమ్మఁగ
మామకనగరమునకేఁగిమఱియామీఁదన్.

**End :**

చ. ధరణిరహస్యతంత్రమగుతారకమంత్రమహత్త్వమెల్లమీ
కెటుకపడంగఁజెప్పితినిదెవ్వరుభక్తినివిందురల్లవా

రురువుగఁబుత్త్రపౌత్త్రధనయోగముగల్గిచిరాయువొందిశ్రీ
హరిపురికంతమందుఁజనియందువసింతురునిత్యభూతితోఁ.

సీ. ఇదివినువారును జదువువారును వ్రాయు
వారును బహురత్నవసుమతీతి
లాన్నదానఫలంబు యజ్ఞకోటిఫలంబు
సకలతీర్థోదకస్నానఫలము
గురుమంత్రశతపురశ్చరణఫలంబును
గాంతురు కనకార్ధకాంచనంబు.

(బి-బి.)—

నాల్గవయాశ్వాసము గొంతనుండి యైదవయాశ్వాసము తుదదాఁక గలదు. వ్రాఁత తిన్ననిది. తప్పులంతగాలేవు. శైథిల్యము గ్రంథపాతములుగలవు.

ఇందు రామమాహాత్మ్యము వర్ణింపఁబడినది. ఈ గ్రంథైకదేశమునుబట్టి యింతకంటె నెఱుఁగరాదు. కర్త కోటికలపూఁడి వేంకటకృష్ణసోమయాజికవి.

---

(c) విశ్వనాథశతకము.

**VIŚVANĀTHAŚATAKAMU.**

**Foll.** *57a*—*62b*.

A centum of stanzas in different kinds of metre in praise of God Śiva. The author's name is not known.

Contains 1 to 97 stanzas.

**Beginning:**

శా. శ్రీకల్యాణగుణౌఘశీలహిమధాత్రీభృత్సుతాలోల వా
ణీకాంతాధిపనారదప్రముఖమౌనీంద్రావళీదేవతా
నేకార్యాశ్రితపాలవైభవ సుఖానీకోల్లసత్కాశికా
భూమాకైలాసపురీంద్రశైలశివశంభూ ! విశ్వనాథప్రభూ !

**End:**

మ. పలుకేబంగరువాయెనేపిలిచితే బాగాయెఁగాకేమిహా
తెలిసెన్ నీగుణమెల్ల నేటికి జగద్విఖ్యాతిగానిట్లు నే

వలభ_క్తిᴇ నిను వేఁడుకొ న్నవరమివ్వం జూడవేమందునీ
చెలి మింతేకద నమ్మినందుకును గాశీవిశ్వనాథప్రభూ !

శా. రాయారానీమనసేమియుᴇ గరుగదేరా దీనసంరక్షణో
పాయంబుᴇ . . . నీ కృపా పేమదిᴇ నమ్మితిᴇ
నాయంబేననుఁ బ్రోవనీకు . . . నాయందుఁ గార్పణ్యముᴇ
బాయం జేలునెభ_క్తరక్షణ . . . విశ్వనాథప్రభూ !

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథపాతములుగలవు.

"విశ్వనాథప్రభూ" అను మకుటముగల యీ శతకము శివస్తుత్యాత్మకము. కర్త యెవ్వరో !

---

R. No. 478.

Paper. $7\frac{3}{8} \times 6$ inches. Foll. 70. Lines, 25 on a page. Mode of writing good and correct. Good.

Purchased in the year 1917–18 from M.R.Ry. Niḍadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

వీరరాఘవకృతులు.

VĪRARĀGHAVAKṚTULU.

A collection of songs composed in praise of Gods Rāma and Kṛṣṇa by Tōlēṭi Vīrarāghavakavi, a follower of the Suklayajuśśākhā and of Bhāradvāja Gōtra.

Complete.

**Beginning :**

ఉ. శ్రీమహిజాకళత్ర సరసీరుహనేత్ర పవిత్రగాత్ర సు
త్రామముఖాఖిలామరవితానకృతస్తుతిపాత్ర పాతక
స్తోమలతాలవిత్ర ఖరదూషణకాననవీతిహోత్ర పూ
ర్వామరజైత్ర చక్రజితవైరిమహోఘ [హ] వవీరరాఘవా !

తే-గీ. వీరరాఘవనీపేర వేడ్కమీఱ
నంకితంబుగ సత్కృతులాచరింతు

సకలకవివర్యులెల్లనుసంస్తుతింప
నవనినాచంద్రతారార్కమై వెలుఁగ.

* * * *

కళ్యాణిరాగము - ఏకతాళము.

స్వాహావధూనాయకా, సకలాదిత్యసమితిసత్ఫలదాయకా,

పల్లవి॥

దేహధారులెల్ల దేవదేవనీకుజోహారుగావించిశుభములుగాంతురు॥ స్వాహా॥

* * * *

కరుణవీరరాఘవ, దాసునికృతులు, చరితార్థముగఁజేయవా,
యరయగబరమార్థసరణికైనినుఁగోరి స్మరియించెదనునన్నాదరలీలరక్షించు॥

**End:**

వసుదేవదేవకీవనితాత్మజాత శ్రీవాసుదేవకృష్ణా మేలుకో !
అసురారులెల్లనిన్నాసతోఁజూడంగ నరుదెంచియున్నారు మేలుకో !

* * * *

తొలికోడికూసెను జలజమిత్రుఁడుపొడుపు, మలయందుఁబొడమెను మేలు
కో సలలితతోలేటికులవీరరాఘవా, మలకృతులనాలింప మేలుకో !

* * * *

ఈకృతుల్ నిరతంబు నెగడినభక్తిఁ
గైకొనిచదివినఁగలిగించుముక్తి
పూనిపఠించినఁబొందుగావిన్న

* * * *

భాగ్యభోగ్యాయురారోగ్యముల్ కూర్చి
యోగ్యులఁగాఁజేయుముర్విలోఁజేర్చి.

**Colophon:**

ఇది శ్రీమద్వీరరాఘవేశ్వర వరప్రసాదలబ్ధ కవితామాధుర్యధుర్య శ్రీశుక్లయజుశ్శాఖ భారద్వాజగోత్రోద్భవతోలేటివంశపయఃపారావార రాకాసుధాకర శ్రీకృష్ణమాభిఖ్య శ్రీవేంకమాంబాతపఃఫలజనితసుకవిజనవిధేయ శ్రీవీరరాఘవనామధేయప్రణీతంబైన శ్రీవీరరాఘవకృతులు సమాప్తము.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత తిన్ననైనది. తప్పులు లేవు. శైథిల్యగ్రంథ పాతములు లేవు.

రామ, కృష్ణస్తుత్యాత్మకమగు గేయము లిందుఁ గలవు. గ్రంథకర్త తోలేటి వీరరాఘవకవి. శుక్లయజుశ్శాఖాబ్రాహ్మణుఁడు. భారద్వాజ గోత్రుఁడు.

---

R. No. 479.

Paper. 11 × 8¾ inches. Foll. 38. Lines, 20 on a page. Mode of writing, good and apparently correct. In good condition.

Purchased in the year 1917–18 from M.R.Ry. Niḍadavōlu Sundaram Pantulu Gāru, of Vizagapatam.

గౌరీసంవాదము.

GAURĪSAṀVĀDAMU.

A poem narrating the story of the marriage of God Śiva with Gaṅga (the Ganges) and the quarrel between Gaṅga and Gaurī, the wives of God Śiva. The author is Rāmacandra, son of Sāntamahanti of Nāgēndra Gōtra and belongs to the caste of people known as Śiṣṭukaraṇa.

Complete.

**Beginning:**

శా. శ్రీమత్తేజసరిభూధరప్రభువరాంఘ్రీస్వంద్వమస్మన్మన
స్సీమన్ నిల్పుచుఁదత్ప్రసాదమహిమన్ జెన్నొందిధన్యస్థితిన్
భీమబ్రహ్మలవేఁడిశ్రీసతిభవానీవాణులంగొల్చిసు
త్రామాఖిస్తుతమూర్తిదంతిముఖువిద్యావార్ధిఁబ్రార్థించెదన్.

* * * *

గీ. దేవభాషాకవులవినుతించితెనుఁగు
కవులనెమ్మదిఁబొగడికుకవులఁదెగడి
ఘనునిశ్రీవత్సగోత్రపావనునిఁ దిరుమ
లార్యమద్గురుసద్భక్తినలరమ్రొక్కి.

క. వాయువ్యపురాణోద్భవ
మైయలగౌరీవివాదమనుకథగలదే

నాయతమతినగుచునునది
యీయెడఁదెనిఁగింతువారిగిరీశుబికరుణ౯.

*　　*　　*　　*

క. వనజభవుఁడాత్మకల్పిత
మునునై నెగడొందువిశ్వము౯బరిశీలిం
పనుమదిఁగోరి నిజాలో
కనములఁబుట్టించెసృష్టికరణములనాగి౯.

సీ. ఆసృష్టికరణాన్వయశ్రేష్ఠుఁడనఁదగు
రామనతత్సూతిరామకృష్ణుఁ
డారామకృష్ణునకాత్మజన్ములుసాంత
మయుశేఖరుఁడుకూర్మనయునఁగ
నందగ్రజునకుసాంతనుకుపాపమనాఁగ
దనరినసాధ్వికిఁ దనయుఁడనఁగ
బ్రబలినవాఁడనురామనాభిఖ్యుండ
నాశైశవాదిసింహాద్రివసీధ
వరహానగహరిదివ్యాంఘ్రివనజయుగళి
తతమతింగొల్చితత్ప్రసాదప్రభావ
మునఁ గవిత్వంబు రచియింప బూనినాఁడ
ఘనధరాధరగోత్రపావనుఁడ భువిని.

క. గౌరీసంవాదంబును
భూరిచరిత్రంబుచెప్పఁబూనితిఁగరుణా
సారమునాయెడఁగూర్చియు
జారుమతిందిద్దరయ్యసత్కవులారా !

**End:**

మాలిని. శతదళనిభనేత్రా చారునీలాభ్రగాత్రా
పతగవరతురంగా భక్తచేతోబ్జభృంగా
అతులితగుణధామా యాగభృత్సార్వభౌమా
జితదితిసుతయూథా సింహశైలాధినాథా !

**Colophon:**

ఇది శ్రీమద్వరాహనృసింహావరప్రసాదలబ్ధకవితావినోద సకలసుకవి
నా నుమోద నాగేంద్రగోత్రపవిత్రసాంతమహాంతిపుత్ర చతురమ్మదుపధ

సంధానరామచంద్రాభిధానప్రణీతంబైన గౌరీసంవాదంబనుకథను సర్వంబునేకాశ్వాసము.

గ్రంథాంతమందీపద్యమున్నది :—

క. అంగజజనకునికృపను బ్లి
వంగా బ్దాశ్వీజబహుళప్రతిపదసరికిన్
గొంగాళరామచంద్రుండు
గంగాగౌరీవివాదకథ వ్రాసెమహిన్.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంతమంచిది. తప్పులంతగా లేవు. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

గౌరీసంవాదమను నీప్రబంధమున, శివుండు గంగను బెండ్లియాడుటయు, గంగాగౌరీ సంవాదమును వర్ణింపబడినది. గ్రంథకర్త సాంత మహాంతి రామచంద్రకవి. శిష్టుకరణకులుండు.

---

R. No. **480.**

Paper. 85/8 × 7 inches. Foll. 35. Lines, 24 on a page. Mode of writing, not good and not correct. Contains many omissions. Injured.

Purchased in the year 1917–18 from M.R.Ry. Niḍadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

(*a*) మేఘసందేశము.

MĒGHASANDĒŚAMU.

Foll. 1*a*—9*b*.

A Telugu rendering of the Sanskrit Mēghasandēśa of Kālidāsa by Kotikalapūḍi Vēṅkaṭakṛṣṇa kavi.

Contains the second Sarga only.

**Beginning:**

క. శ్రీవైదేహీలోచన
జీవంజీ వానవరత సేవితరా
జైవాతృక సన్నిభవద
నావిర్భూతస్మితేక్షణావితభక్తా.

వ. అవధరింపుము క్రమ్మఱ నమ్మేఘునకు యక్షుండిట్లనియె.

మ. చపలాన్వితుని సేంద్రచాపుని సగర్జానాదునిన్ సాంబున
భ్రువదస్థున్ నినుసాటి చేసికొను తత్ప్రాసాదముల్ శీతరు
గ్లపనల్ చిత్రరుచుల్ మృదంగనినదోల్లాసంబురత్నస్థలుల్
విపులోన్నత్యము గల్గిత త్తదుచితావిర్భూత లీలాగతిన్.

చ. కరమున మంజులాబ్జ మలకంబున ఫుల్లనవీనమల్లికో
త్కరము ముఖంబునం ధవళితం బగు లోధ్రరజంబు కొప్పునన్
గురువకమున్ జెవిన్ దళుకు గులుకు శిరీషముపావటన్ భవ
త్కరుణ జనించునీప మొగిదాల్చి చెలంగుదు రిందురవ్వురిన్

**End :**

వ. అభిహతుండంచున్నైనఁ గృపనైన వియుక్తుండటంచున్నైన లో
నతిశయబుద్ధి మానుచు మదర్థము దౌత్య మొనర్చి ప్రా
ర్థితరుచి నిష్టదేశములఁ బ్రీతిఁజరింపు తటిద్వియోగమీ
గతిఁదృటిరైన నీకు ననఘాలభియింపకయుండుఁగావుత౯.

* * * *

క. ఖండిత ఫాలాంబకకో
దండధ్వని చకితమేరు ధరణీధరవే
ధోండాధీశ్వర రఘుకుల
మండన వాల్మీకి వినుతమహితచరిత్రా.

**Colophon :**

ఇది శ్రీ జానకీరమణ చరణసమర్పితమనశ్శతపత్ర హారితసగోత్ర కోటికలపూఁడికుల పవిత్ర శివరామయశాస్త్రి వేంకటరామయ పుత్త్రి విద్వజ్జన విధేయ వేంకటకృష్ణ నామధేయ ప్రణీతంబైన మేఘ సందేశంబను మహాకావ్యంబునందు సర్వంబు ద్వితీయాశ్వాసము.

(వి-వి.)——

అసమగ్రము. వ్రాఁత మంచిదికాదు. తప్పులున్నవి. శైథిల్యము, గ్రంథపాతములు గలవు.

ఇది కాళిదాసుని మేఘసందేశమునకుఁ దెనుఁగు. మొదటి సర్గమునకుఁ దెనుఁగుపద్యము లీ ప్రతిలో లేవు. ద్వితీయసర్గము పద్యములున్నవి. గ్రంథకర్త కోటికలపూఁడి వేంకటకృష్ణకవి.

(*b*) ప్రబోధచంద్రోదయము.

PRABŌDHACANDRŌDAYAMU.

Foll. 10*a*—24*b*.

This contains the prefatory portion by Koṭikalapūḍi Vēṅkaṭakṛṣṇa Sōmayāji for the Prabandha called Prabōdhacandrōdaya of the same author.

Incomplete.

**Beginning :**

శా. శ్రీ సీతాపిసుతుండ హీనగుణుఁడా జిస్తుత్యుఁడధ్యాత్మవి
ద్యాసంపత్ప్రదుఁడబ్జలోచనుఁ డహల్యాపావనఖ్యాతుఁ డ
త్యాసన్నాప్తగణార్చితుండచల ధర్మాధారుఁడ ర్యాన్వితుం
డి సత్కావ్యవధూటిఁ దానతులసాహిత్య స్పృహం బ్రోవుతన్.

*　　*　　*　　*

క. వేదాంతజ్ఞుం డనఘు జ
నాదరణీయుండు మామకాచార్యుండౌ
కోదండరామతీర్థుల
పాదాబ్జంబులకు మ్రొక్కి ప్రస్తుతి సేతున్.

*　　*　　*　　*

ఉ. విప్రకులాగ్రగణ్యుఁడు పవిత్రచరిత్రుఁడ నేకవేదశా
స్త్రప్రతిభాప్రవీణుఁడు విశాలయశోదళి తాంధకారుఁ డా
ర్యప్రియుఁడన్నదానపరుఁడై తగు కృష్ణకవిన్ మదీయవృ
ద్ధప్రపితామహున్ మఱిఁ బితామహసన్నిభు సన్నుతించెదన్.

**End :**

మ. క్షితిలో సర్వధరాధినాయక శిరశ్ఛేదక్రమం బేకవిం
శతిపర్యాయముగా నొనర్చి బహుయజ్ఞంబుల్ ప్రయాగాదిస
న్నుతదేశంబులఁ జేసి కశ్యపునకత్యుద్రంబుగా . . . .
ద్రతభూమండల మిచ్చి పూనెముని వృత్తిన్ భార్గవుం . . .

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత మంచిదికాదు. తప్పులు లేవు. శైథిల్యము గ్రంథపాతములు గలవు.

కొటికలపూఁడి వేంకటకృష్ణ సోమయాజి రచియించిన ప్రభోధ చంద్రోదయ ప్రబంధమున కిది కృత్యవతరణిక.

(c) శార్దూలశతకము.

SĀRDŪLAŚATAKAMU.

Foll. 25*a*—35*a*. Fol. 35*b* is left blank.

The author Vikkirala Raṅgācārya here in condemns the Zamindar Rājagōpāla of Veṅkatagiri.

(వి-వి.)—

నూఱు పద్యములు, వ్రాఁత తిన్ననిది. తప్పులు లేవు. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

శార్దూల శతకమను పేరుగల యీ శార్దూల వృత్త శతకమునకుఁ గర్త విక్కిరాల రంగాచార్యుఁడు. ఈతఁడు వేంకటగిర్యధీశ్వరుఁడగు రాజగోపాల నృపాలుని యెడ ద్వేషించి యాయన దోషము లెన్నుచు నిందుఁదూషించినాఁడు. ఆద్యంతము లుదాహరింప రానివి.

---

R. No. 481.

Palm-leaf. 18 × 1¼ inches. Foll. 27. Lines, 6 on a page. Mode of writing, not good and incorrect. Injured.

Purchased in 1917–18 from M.R.Ry. Niḍadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

గొల్లకలాపము.

GOLLAKALĀPAMU.

Similar to the work described under R No. **429**.
Incomplete.

**Beginning:**

క. దంతిని భయానవినుమా
కాంతను గవగూడి వేఱుగాఁజూచియు నా
కాంతుండీయెడలను నా
చెంతకు రాఁడాయె నేమిసేతునె కొమ్మా.

**End:**

దరువు. మధుకరాలకనాదు మగనితోడి తేవే
బుధవారపు సొమ్ములిత్తునే.

(వి-వి.)—

ఆద్యంతములందు శైథిల్యమెక్కువ. వ్రాఁత చిక్కుగానున్నది. తప్పులున్నవి. గ్రంథపాతములున్నవి.

ఈ యక్షగానమున శ్రీకృష్ణునిపారిజాతాపహరణ కథ వర్ణింపఁ బడినది. ఇది ఆర్. నె 429 రున వర్ణింపఁబడినదాని వంటిదే. కర్త పేరు తెలియదు.

---

R. No. 482.

Palm-leaf. 16½ × 1¼ inches. Foll. 41. Lines, 6 on a page. Mode of writing, fair but incorrect. Injured.

Purchased in 1917–18 from M.R.Ry. Niḍadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

హయలక్షణవిలాసము.

HAYALAKṢAṆAVILĀSAMU.

This is the same work as the one described under R. Nos. 105 (*a*) and 395 *ante*; but the arrangement of stanzas here differs from that found in those MSS. and the work is also divided into Adhikāras. In the last few leaves, certain prescriptions for the treatment the diseases of horses are given.

Incomplete.

**Beginning**:

క. శ్రీరమణీముఖపద్మ
స్మేరాంచితమధురహాసుసేవానిపుణో
దారభ్రమణవిహార
స్ఫారుఁడు కృతిపతికి నిత్యసంపదలొసఁగున్.

**End**:

ఉ. గాయక సత్కవీంద్ర బుధకల్ప మహీరుహమైన దొడ్డ భూ
నాయకు కీర్తియెంత సురనాగమహా . . . . కృతిన్
దోయధి సప్తకావృతచతుర్దశభూమి వెలుంగుచుండ బ్ర
హ్మాయువు శ్రీయునయ్యెడు మహామహిమోత్త మగండభూవరా.

క. కరివరదునిఁ గమలాసను
నిరుగురువుల విద్య శిక్ష యిచ్చిన . .
నొగిఁ గ్రియ విద్యకు
గరకలితాబ్జములు మోడ్చి కామయఁ గొల్తున్.

(వి-వి.) —

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పులున్నవి. శైథిల్యము గ్రంథ పాఠములుగలవు.

ఇందు మ్మనుమంచి భట్టారకుఁడు సాళువకంప భూపతి కంకితముగా రచియించిన హాయ లక్షణవిలాసము కొంతవఱకుఁగలదు. ౨౩ వ పత్రముసుండి కల గ్రంథభాగము మీఁదఁ బేర్కొన్న హాయలక్షణ విలాసాంతర్గతముగాఁ దోఁపదు. ఈ తర్వాతి గ్రంథభాగమున "సూర్యవంశోద్భవుఁడా! ఉత్తమగండ భూవరా! భీమతనూజా! ఎలదాయ సింహామా! అని సంబోధనములున్నవి. ఇవి సాళువకంప భూపతికి సంబంధించినవి కావు. గ్రంథాంతపద్యమున దొడ్డ భూపతి నామమున్నది. ఈ గ్రంథభాగముఁగూడ నశ్వములమంచి చెడ్డలు రోగములు ఔషధములు మొదలగునవి చెప్పఁబడినవి. ఈ గ్రంథభాగమునకుఁ గర్త యెవ్వరో ఈ యుత్తమగండ భూపతి యెవ్వరో తెలియరాలేదు.

---

## R. No. 483.

Paper. 12¾ × 8 inches. Foll. 61. Lines, 36 on a page. Mode of writing good and apparently correct. Good.

Purchased in 1917-18 from M.R.Ry. Niḍadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

సహస్రకంధరరామాయణము.

SAHASRAKANDHARARĀMĀYAṆAMU.

A poetical work describing the destruction by Rāma of the demon Sahasrakanṭha (thousand-headed) Rāvaṇa and Rāma's departure to the celestial world The author of the work is Muddu Lakṣmīnārāyaṇakavi, son of Vēṅkaṭēśvara of Kauśikagōtra and a disciple of Maṇḍapāka Kāmakavi. The undermentioned poets are herein commended:—Maṇḍapāka Pārvatīśvarakavi, Kollūri Brahmasūri, Kollūri Kāmā Śāstri, Pantula Brahmakavi, Dvivēdi Narasiṁhabudha, Cellapiḷḷa Narasimhasvāmi and Dūsi Vēṅkaṭārāmabudha.

Complete in six Āśvāsas.

**Beginning :**

శా. శ్రీమంగాసతి గబ్బిగుబ్బలపయిన్ శ్రీ గంధముంబూసి త
త్సీమన్ప్రేమ నఖక్షతంబులనుపన్ జిత్తంబునం బ్రీతితో
సామిన్నవ్వుచుఁ బెళుకుఁగన్నుఁగవచేఁ జకోరంగనీక్షింపఁద
ద్భామన్నెగిటఁ జేర్చు వేంకటపతిన్ ధ్యానింతు నశ్రాంతమున్.

ఉ. పాయనిభక్తిఁ గొల్చెద నపార కృపాయుతరమ్య దృష్టి జా
లాయతచంద్రికా ప్రముదితాశ్రిత శిష్యచకోరు మాయుపా
ధ్యాయుని మండపాకకుల జాంచితకామయ పండితేంద్రునిన్
ధీయుతు సాహితీవిభవ దీపితు సత్కవితాధురంధరున్.

క. ముదమున మద్గురుపుత్త్రున్
మృదుల మధురసుకవితాధురీణువరకళా
స్పదు మండపాకకులజు
విదితయశునిఁ బార్వతీశు వినుతి యొనర్తున్.

క. అతులితసుకవిత్వాలం
కృతసురుచిరసాహితీ పరిస్ఫుటవిద్యా
న్వితుమజ్జననీభగినీ
సుతుని న్గొల్లూరి బ్రహ్మసూరిం గొల్తున్.

గీ. కావ్యనాటకలసదలంకారసహిత
సాహితీయుతు న్యాయశాస్త్రప్రవీణు
మహితుమన్మాతృభగినీకుమారు సుకవి
ననఘుఁ గొల్లూరు కామశాస్త్రి నిభజింతు.

చ. సరస కవీంద్ర వందితవిశంకట సత్కవితావి భాసితున్
గురు తరధీయుతున్ నృపతి కుంజరరంజిత వాగ్విరాజితున్
సురుచిరసాహితీ విభవశోభిత దీప్త గుణప్రజాంచితున్
బరమకళాసమున్నతుని? బంతుల బ్రహ్మకవిన్నుతించెదన్.

క. ప్రకటాలంకార విలా
సకరోభయసాహితీ విశారదు మత్సా
లకు సద్ద్వివేదినరసిం
హాకళాధరు సత్త్వగుణ సమంచితు నెంతున్.

శా. ఆయుర్వేద విశారదుండు సుకవిత్వాలంకృతాత్మాసము
చ్ఛ్రాయుం డన్వహ వేంకటేశ్వర పదాంచద్ధ్యాన సక్తాత్ముఁడున్
ధీయుక్తుండు మదీయమిత్త్రుఁడు సముద్దీప్యత్ప్రభాభాషితుం
డైయింపొందిన చెళ్లపిళ్ల నరసింహస్వామి నే నెంచెదన్.

క. సలలితవాగ్వ్రజనిర్జిత
బలభిద్గురు మద్గురున్సుభద్రగుణధరున్

గొలిచెదఁ గళాభిరామున్
విలసత్కవిసోము దూసి వేంకటరామున్.

క. కాకరపర్తి కులాబ్ధిని
శాకరు గురు మత్పితృవ్యజామాత మదు
త్సేకకరు లక్ష్మణాఖ్యు శు
భాకరు విద్యానిధిం గృపాంచితు నెంతున్.

తే. గీ. కార్యఘటనాసమర్థుఁ డవార్యదాన
జనిత కీర్తి సురాపగా సలిలధౌత
బహుళమార్గణ దారిద్ర్య పంకనిచయుఁ
డెసఁగుఁ బసుమర్తి కనకమల్లేశ్వరుండు.

**End :**

మాలిని.——

సదమలగుణ శీలా సత్య సంకల్పఖేలా
విదళితరిపుజాలా విశ్రుతానందలోలా
మదన శతశుభాంగా మాని బృందాఘభంగా
పదనమదమరేంద్రా పన్నగాద్రీంద్రచంద్రా.

**Colophon :**

ఇది శ్రీమద్వేంకటేశ్వరవరప్రసాదలబ్ధకవితావిచిత్ర కౌశికసగోత్ర పవిత్ర ముద్దు వంశకలశపారావారరాకాసుధాకర వేంకటేశ్వర పుత్త్ర శ్రీరామచంద్ర చరణకమలధ్యాన పరాయణ లక్ష్మీనారాయణ కావ్యంబునందు సర్వంబును షష్ఠాశ్వాసము.

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పు లంతగా లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

ఇందు శ్రీరాముని సహస్రకంఠ రావణవధాది వృత్తాంతమును గడపట సరయూస్నాన మొనర్చి వైకుంఠమున కరుగుటయు వర్ణింపఁబడినది. గ్రంథకర్త ముద్దులక్ష్మీనారాయణకవి. మండపాక కామకవి శిష్యుఁడు. కౌశికసగోత్రుఁడు. మండపాక పార్వతీశ్వరకవి, కొల్లూరి బ్రహ్మసూరి, కొల్లూరు కామశాస్త్రి, వంతుల బ్రహ్మకవి, ద్వివేది నరసింహబుధుఁడు, చెళ్లపిళ్ల నరసింహస్వామి, దూసి వేంకటరామబుధుఁడు, కాకరపర్తి లక్ష్మణబుధుఁడు, నను కవులు ప్రశంసింపఁబడిరి.

## R. No. 484.

**Paper.** 7⅞ × 6⅜ inches. **Foll.** 26. **Lines,** 17 on a page. **Mode of writing** bad but not quite incorrect. Good.

Purchased in the year 1917–18 from M.R.Ry. Niḍadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

వ్యాసభుజ స్తంభము.

VYĀSABHUJASTAṀBHAMU.

This work describes the story of how Vyāsa's arm lifted for pronouncing a curse on Benares, was stopped by God Śiva and how eventually the former was driven out of the same Kṣētra. The author is Robbi Vīrabhadruḍu, son of Rāmalinga of Dāsumayagōtra.

Complete in two Āśvāsas.

**Beginning:**

క. శ్రీజామిపురవిహారసు
ధీజనమందారపార్శ్వ తీసతిహృదయాం
భోజవిహారపరాత్పర
రాజితరాజితగిరీవరమలవిహారా !

సీ. భువనంబులన్నియుఁ బుట్టింపఁబోషింప
నణఁగింపనితరుల కలవియగునె
కాలునినణఁగించి గ్రక్కునఁ బోషింప
నీవెగాకొరులట్లు ప్రోవనగునె
మృత్యువునణఁగించి మృత్యుంజయుండన
నీవెగాకన్యుల నెన్నఁనగునె
ముల్లోకములఁబ్రోవఁ బూనినవిషమును
నీవెగాకన్యులు నిలుపఁగలరె
నీప్రభావంబు వర్ణింప నీరజాస
నాహిభర్తలకైనను నలవియగునె
నేననఁగ నెంతవాఁడ నహీనచరిత
యస్మదాభీష్టమొనరింపు మభవ ! యీశ !

**Colophon:**

ఇది శ్రీమత్సకలజనానుగ్రహపాత్రదాసుమయగోత్రపవిత్రసాహిత్యవర్యపౌత్రి రామలింగార్య పుత్త్ర వీరభద్రప్రణతంబైన వ్యాసభుజ స్తంభంబను గ్రంథంబున సర్వంబును ద్వితీయాశ్వాసము.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత చక్కనిదికాదు. తప్పు లంతగా లేవు. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

శివుఁడు వ్యాసునిభుజమును స్తంభింపఁజేసినకథ యిందు వర్ణింపఁబడినది కర్తరొబ్బి వీరభద్రుఁడు.

---

## R. No. 485.

Palm-leaf. $8\frac{1}{4} \times 1\frac{1}{8}$ inches. Foll. 47. Lines, 5 on a page. Mode of writting, bad and incorrect. Fair.

Purchased in the year 1917-18 from M.R.Ry. Niḍadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

గొల్లకలాపము.

GOLLAKALĀPAMU.

This is similar to the work described under R. Nos. 429 *ante*. Incomplete.

**Beginning:**

క. ఘనులార! ధీరవిద్వ
జ్జనులార! సమస్తసభలఁ జాతురిమెరయన్
వినరయ్య గొల్లకథయున
తన రేడునాత్రేయపురవుఁ దమ్మయకవితన్.

**End:**

క. లోకేశ నీకుమిక్కిలి
లోకములో నలవిగాని విషమదిపుట్టెన్
లోకములు నిలువరింపుము
నాకంబులుగూడి బ్రహ్మస్తుతిగావించిర్. (?)

(వి-వి.)—

అసమగ్రము. వ్రాంత జిలుగై చదువరాకయున్నది. శైథిల్యము గ్రంథపాతములు హెచ్చు. తప్పులు మెండు.

ఇది ఆర్. నె 429 రు పర్ణితమగుదానివంటిది. సముద్ర మథన కథ యిందుఁగలదు. కర్త ఆత్రేయపురపు తమ్మయ.

R. No. 486.

Palm-leaf. $18\frac{3}{4} \times 1\frac{1}{2}$ inches. Foll. 187. Lines, 6 on a page. Mode of writing, good but not quite correct. Injured.

Purchased in the year 1917-18 from M.R.Ry. Niḍadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

(a) నాగరఖండము (వచనము).

NĀGARAKHAṆḌAMU (PROSE).

Foll. 1a—45a. and Fol 45b is left blank.

This is a Telugu prose rendering of the Sanskrit Nāgarakhaṇḍa of the Skānda Purāṇa and a poetical version of the same is described under R. No. 294 *ante*. The work was written by Pullaṁbhaṭla Narasiṁha Śāstri at the instance of Maṇḍa Vīranna, a gold-smith of Vizagapatam.

Complete.

**Beginning:**

వారు యెవరు యెవరు అంటే వశిష్ఠుండున్ను, ఋష్యశృంగులున్ను విశ్వామిత్రులు, అత్రి గౌతములు, భృగువు, జమదగ్ని, భరద్వాజులు మొదలయినవారు తపస్సు చేసుకొంచూవుండగా ఆ నైమిశారణ్యమునకు వ్యాసశిష్యులైన సూతులువచ్చిరి.

**End:**

ఈలాగున బదరికాశ్రమమందు కుమారస్వామి ముఖతావిన్నవారై ఆ కుమారస్వామిని చాలా స్తోత్రంచేసి నీమహిమలోకోత్కృష్టమైనది. దేవతాసేనాధిపతివి. అందఱికి నానందకరుఁడవు. నీమహిమ అవాఙ్మానసగోచరమని మన్నిచేసి మహర్షులు వెళ్లినవారైరి.

ఇది శ్రీ స్కాందపురాణంలో నాగరఖండం విశ్వకర్మమాహాత్మ్యం. ఉమామహేశ్వరకళ్యాణం పదమూడో అధ్యాయం తెనుగున చెప్పబడ్డ వచనకావ్యం సంపూర్ణం.

ద్విపద. శ్రీ మీఱఁగలుములు చెన్నొందుచున్న
బాగొప్పవైశాఖ పట్టంబునందు
విశ్వకర్మకులుండు విబుధులుమెచ్చ
మండవీరన్న నే మహితోత్సవుండు
నాగరఖండంబు నయమార్గమునను
అర్థంబు తెనుగున ననుమతితోడ
సెలవియ్యవలెనని శరణనిపలుక

పుల్లభట్లాన్వయ పుణ్యాత్ముండు
నరసింహశాస్త్రులు నయతత్త్వవేత్త
కళ్యాణగరిమను కవులు మేలనఁగ
దెనుఁగునవచియింపఁ దెల్లంబుగాను
నిమిషకవి వెంకన్న నిండైనభక్తి
పరమేశ్వరునియందుఁ బాయకనిలిపి
వ్రాసియర్పణజేసె వ్రాఁతతప్పునిన
దయచేసిక్షమియుంచి దాక్షిణ్యబుద్ధి
నన్నుమన్నించుఁడీ నయవేత్తలార
ధరణిపైనాచంద్ర తారార్కముగను
వర్ధిల్లవలెఁగృతి వైఖవంబలర.

(ని-ని.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పు లున్నవి. శైథిల్యము కలదు. పాతములు లేవు.

ఇందలి విషయములు త్రై-క్యా. ఆర్ నె 294 రున వర్ణించిన గ్రంథమందలిదే. సంస్కృత నాగరఖండమునకిది తెనుఁగువచనము. విశేషములకుదాహృతభాగముఁగనునది.

---

(*b*) మూలస్తంభము.

MŪLASTAṀBHAMU.

Foll. 46*a*—103*a*.

This is a Telugu prose version of the Sanskrit work described under R. No. 2791 of the Sanskrit Part, Vol. III, of this catalogue.

**Beginning:**

శ్రీసదాశివుండు సుఖాసీనుండై ఉన్న సమయంబున జగన్మాతయగు పార్వతీదేవి సాష్టాంగదండప్రణామంబుగావించి, కరకమలంబులు మొగిచి దేవా సకల జగదుత్పత్తిస్థితిలయంబులకు కారణకర్తవై మూర్తిత్రయంబును దదీయాంతర్గంబైన మూఁడులోకంబులు, చతుర్భువనంబులవరుసయును స్థావరజంగమాంతకంబైన యైశ్వలయపంచంబును (?), ప్రళయకాలంబును నేవిధంబునం గలిగియుండు నవ్యుతం బెట్లువుట్టెనంతయుం దెలియ నానతియిమ్మనిన

**End :**

వాయువువలన సమాది వాయుపంచకమాయెను. ఆకాశమువలన నంతఃకరణపంచకమాయెను. ఈవిధంబుగా వేదంబు చెప్పుచున్నది.

(వి-వి)—

వ్రాఁత తిన్ననిది. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములు లేవు. ఇందు విశ్వకర్మవిషయమే వర్ణింపఁబడినది.

---

(c) पुष्पबाणविलासः.

PUṢPABĀṆAVILĀSAḤ.

Foll. 104*a*—105*b*

See the Sanskrit Part of this Catalogue.

---

(d) पुष्पबाणविलासव्याख्या.

PUṢPABĀṆAVILĀSAVYĀKHYĀ.

Foll. 106*a*—136*a* Fol 136*b* is left blank.

See the Sanskrit Part of this Catalogue.

---

(e) वास्तुशास्त्रम्—सान्ध्रटीकम्.

VĀSTUŚĀSTRAM (WITH TELUGU MEANING).

Foll. 137*a*—160*a* Fol 160*b* is left blank.

See the Sanskrit Part of this Catalogue.

---

(f) ఆంధ్రనామసంగ్రహము.

ĀNDHRANĀMASAṄGRAHAMU.

Foll. 161*a*—180*a*.

This is the same work as the one described under R. No. 4 (*a*) *ante*

Breaks off in the Nānārthavarga.

(వి-వి.)—

నానార్థవర్గమునఁ గొంతవఱకుఁ గలదు. వ్రాఁత యంత మేలైనది కాదు. తప్పులు కలవు. శైథిల్యము కలదు.

ఇది ఆర్. నెం 4 (a) రున వర్ణింపఁబడినదే.

(g) స్వర్ణకారకులాచారవిషయము.
SVARṆAKĀRAKULĀCĀRAVIṢAYAMU.

Foll. 181*a*—187 *b*.

Deals with the eligibility of the five industrial castes for Vedic sacraments as described under R. No. 186 *ante*, Vol II.
Probably complete.

**Beginning**:

శ్రీవిశ్వకర్మవంశజులైన పాంచాననంవారి చతుర్వేదాధ్యాయము-
లం మంత్రాలుకు విశ్వకర్మ ఋషీశ్వరుఁడు. విశ్వకర్మదేవతయని
ఆశ్వలాయన అనుక్రమణికయందు చెప్పినది. "విష్ణుర్యోనింకల్పయతే"
అనే మంత్రానకు త్వష్టఋషీశ్వరుఁడు త్వష్టదేవతయని ఆశ్వలాయన
అనుక్రమణికయందు మఱిన్ని చెప్పినది.

**End**:

ఈలాగున సమస్తమైన వేదశాస్త్రశ్రౌతశ్రుతీతిహాసపురాణాల
యందు బ్రహ్మవిద్వాంసులు పరిశీలనచేయఁగా విశ్వకర్మ సమస్తమైన
లోకములను పుట్టించినాడని దేవతలను మనుష్యులను పుట్టించినాఁడనిన్ని
సృష్టిస్థితి సంహారకర్తయనిన్ని, దేవత్వము, దేవతాశ్రేష్ఠత్వము. దేవ
ర్షిత్వము. దేవ పురోహితత్వము? దేవవర్ధచెతు(కి)?త్వము కద్దు అనిన్ని
వజ్రం, కమ్మరం, కంచర, కాశి, కంసాలపనిచేసే పంచాననంవారి వంశ
కర్త అనిన్ని. వీరికి ఉపనయనం, వేదం, ఆధానం, యజ్ఞంకద్దు అని వ్రాయిం
చిన ధర్మశాసననిర్ణయం.

(వి-వి.)—

సమగ్రమే. వ్రాఁత తిన్ననిది. తప్పులున్నవి. శైథిల్య మిం
చుక కలదు.

ఇందుఁ గంసాలివారికి యజ్ఞాదివైదికకర్మము లాచరించుటకుయో
గ్యతకలదనుట మున్నగు విషయములు చెప్పఁబడినవి. కర్త యెవ్వరో?

---

## R. No. 487.

Palm-leaf 11¼ × 1¼ inches. Foll. 32. Lines, 5 on a page. Mode of writing, good but incorrect. Injured.

Purchased in the year 1917–18 from M.R.Ry. Nidadavōḷu Sundaram Pantulu Gāru of Vizagapatam.

గొల్లకలాపము.

GOLLAKALĀPAMU.

A work similar in composition to the work described under R. No. 429.

This deals with the story of the churning of the milky ocean. The author is Vēṅkaṭadāsa.

Incomplete.

**Beginning**:

గొల్లభామవచ్చెను, చల్లోయని, గొల్లభామ వచ్చెను;
గొల్లభామవచ్చె మెల్లమెల్లనపాల, వెల్లిబుట్టుపాలు చల్లపెరుగుదెచ్చి
గొల్లభామవచ్చెను.

**End**:

మ అమరవ్రాతములోనఁజొచ్చిదివిజుండై రాహువీయూషపా
నముసేయంగను జంద్రభాస్కరులు నారాయణుం
డమరారాతిశిరంబు చక్రహతిఁద్రుంచె సుధాశక్తిమై
నమరత్వంబునఁబొందెమూర్ధము తదీయాంగంబు నేలంబడన్.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత మంచిది. తప్పులున్నవి. శైథిల్యము గ్రంథపాతములు గలవు.

గొల్ల కలాపమను పేరుగల యీ వీథినాటకమున సముద్ర మథనకథ వర్ణింపఁబడినది. కర్త వేంకటదాసుఁడు.

---

R. No. **488**.

Palm-leaf. 1¼ × 11¼ inches. Foll. 92. Lines, 5 on a page. Mode of writing, good but incorrect. Good.

Purchased in the year 1917–18 from M.R.Ry Niḍadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

(*a*) లక్ష్మణమూర్ఛ.

LAKṢMAṆAMŪRCHA.

Foll. 1*a*—61*a* Fol. 61*b* is left blank.

Similar to the work described under R. No. 252 *ante*. The author is Cāpa Gōpāla. This work also is composed in the form of songs.

Complete.

**Beginning :**

శివుని కేశవున్నైన చిత్తమునదలచితే
శివలోకవైకుంఠపురమొకటిగలదు
కాలకంటకుసుతుఁడుఘనవిద్యలకు గురువు
కంఠమునబైలెల్లగణనాయకుండ
ఏకదంతుఁడనీవుమాకుసహాయముకమ్మీ
లోకగణనాథుఁడావాకునారమ్మీ
మూఁడుకన్నులవేల్పుముద్దుకుమారుఁడా
మూషకావాహనా మొక్కెదను నీకు

* * * *

ఆచంద్రతారకముగ అయోధ్యరాముకథ
చాపగోపాలుడును తెలిగించిచెప్పె.

* * * *

మరుగుచొచ్చినవానిమరికొన్నిబోధించి
అకర్కడొకపర్వతముహస్తమునబట్టి
అకర్కడొకపర్వతముహస్తమునఁబట్టుకొని
రావణునిపైలగువుయేసెసుగ్రీవు.

**End :**

శీఘ్రమున తొల్లియుండియుండినచోట
ద్రోణాద్రిపర్వతము యేర్పాటుగాను
యెప్పటిరూపమున యేర్పాటుగానిలిపి
మహావేగమునమళ్లిరమ్మిహన్మంతా.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములు లేవు.

ఇది ఆర్. నె 252 రున వర్ణింపఁబడిన దానికన్న వేఱయినది. కర్త చాప ? గోపాలుఁడఁట. పాటగానే రచియింపఁబడినది.

---

(*b*) బాణాసురయుద్ధము.

**BĀṆĀSURAYUDDHAMU.**

**Foll. 62*a*—83*b*.**

The fight between Lord Kṛṣṇa and Bāṇāsura is herein described in the form of songs.

Complete.

**Beginning:**

అహ్లాదమునలేచియసురేంద్రుఁడున్నట్టి
పట్ణంబుచేరువను బాగుగానిలచె
హాలుపైనయొకవింత పూఁతోటలలోన
నలతనున్నఫౌజు యేలాముదీర్చి
తీరైనహొంబట్టు డేరాలలోపలను
నీలవర్ణుఁడుదా నిలిచెనంతటను

**End:**

ఏమిచెప్పఁగవచ్చు . . . బు
భక్తుఁడైపోరాడి పరవశుండయ్యె
ఆనందమునఁబొంది యాదివిష్ణుండంత
శంఖంబుపూరించె జనులుమెచ్చగను
. . చేతనబలంబులనెల్లమేలుకొల్పెనుశౌరి
మేలుకొల్పెనుశౌరిమేలుగానపుఁడు

(వి-వి)—

సమగ్రమే. వ్రాఁత తిన్ననిది. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములుగలవు

ఇందుకృష్ణబాణాసురయుద్ధము గేయరూపమున వర్ణింపఁబడినది. కర్త తెలియరాదు.

---

## नीतिशास्त्रम्—आन्ध्रटीकासहितम्.

**NĪTIŚĀSTRAM.** (with Telugu meaning).

Foll. 84*a*—92*a*. Foll 92*b* is left blank.

See the Sanskrit Part of the Triennial Catalogue of MSS.

* * * *

**R. No. 489.**

Paper $10\frac{7}{8} \times 9\frac{3}{4}$ inches. Foll 52. Lines, 20 on a page. Mode of writing, good and apparently correct. Injured.

Transcribed in the year 1917-18 from a MS. of M.R.Ry. Boḍḍapāṭi Vēṇkaṭēśvara Rao Gāru of Ramaṇapūḍi, Guḍivāḍa taluk, Kistna district.

వేదాంతవిచారణము.

VĒDĀNTAVICĀRAṆAMU.

Foll. 1a—48b. Foll. 49a—52a deal with certain Vēdāntic topics.

This prose work deals with certain aspects of the Advaita Vēdānta in a popular manner.

Complete.

**Beginning**

ఓం వేమనసద్గురవేనమః గురుబ్రహ్మపాదపద్మములు నమ్మిన వారు శివరామదీక్షితులవారి అచలబోధను తుర్యాతీతంప్రతిపాదించేమార్గం :—

నిశ్శబ్దపూర్ణానందబోధగురు తెలిగితే శరీరం యేమిలేదు. కోటి మాటలకు ఇదేజ్ఞాపకము. అంతకంటెయెక్కువలేదు గనుక ఇదిమరవవద్దు. కలలోశరీరం మేలుకుంటే యేమిలేదు అనినిశ్చయంవున్నట్టు వుండవలెను. ఈలాగైతేభ్రాంతిరహితం. మూలములేని యీగుర్తెరిగే శరీరముతోటియేమియున్నదని ఆశపడ్డభ్రాంతిరహితంకాదు. ఏమీ లేని మూలములేని గురుతెరిగెశరీరం వున్నన్నభ్రాంతి రజ్జుసర్పభ్రాంతి.

**End :**

ఈ ఉత్తబట్టబయలువలనవేదాలు భగవద్గీతలు పుట్టనేలేదు. ఈ ఉత్తబట్టబయలుకు జ్ఞానాజ్ఞానాలు విద్యావిద్యలుసదసత్తులు పుట్టనేలేదు. అత్యంతవిలక్షణం ఈ ఉత్తబట్టబయలు మనుపేవున్నవి. ఈ వాక్యం సంతతంమరవకయుండవలెను వుంటే యేమితోచదు. అక్షరం పాపం. క్షరంపాపమే. ఈ ఉత్తబట్టబయలే నిరాకారంనిర్గుణం నిర్వికారం నిరంజనం. “ నిర్గుణోऽక్రియో యోనిత్యోనిత్యముక్తోస్మినిర్మలః, అవర్ణస్థూలమహ్రస్వమదీర్ఘమజమవ్యయమ్ ; అరూపగుణ వర్ణాఖ్యంతద్బ్రహ్మేత్యవధారయేత్. ” బ్రహ్మాట మహేశ్వరుడట ఛీఛీ ! లోకులమాటలు, కాకులకూతలు ఛీఛీ ! తనకుతానేస్వతస్సిద్ధం.

**Colophon :**

శ్రీమద్గురుశివరామ దీక్షితప్రభావే వేదాంతవిచారణే ఉత్తరభాగే అమృతరసప్రకరణం చతుర్థోధ్యాయః.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత మంచిది. తప్పులు దిద్దంబడినవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

వచనరూపమునను న్న యీ వేదాంత గ్రంథము అచలబ్రహ్మమును ప్రతి పాదించుచున్నది. కర్తపేరు తెలియరాదు. గద్యమందున్న శివరామ దీక్షితనామము గ్రంథకర్తగురునిదై యుండదగును.

గ్రంథాంతమున అయిదుపుటలపై అష్టపాశములు పంచక్లేశములు అవస్థాత్రయము వివరింపబడినవి.

---

## R. No. 490.

Paper. 100 × 9¾ inches. Foll. 16. Lines, 20 on a page. Mode of writing, good and correct. In fairly good condition.

Transcribed in the year 1917–18 from a Ms. of M. R. Ry. Jayanti Jōganna Gāru of Haṁsavaram, Tuni taluk, Godavari district.

మాధవరాజీయము.

MĀDHAVARĀJĪYAMU.

A treatise in astrology dealing with the influence of planets on the fortune of a person as made out from the relative position they occupy in his horoscope. This appears to be the Telugu rendering of the Sanskrit work of this name, a copy of which is described under R. No. 2469(*a*) of the Sanskrit part.

Incomplete. The name of the scribe and the date of transcription are given below in the Telugu extracts.

**Beginning.**

లాభాధిపతి భాగ్యమందు భాగ్యాధిపతిలాభమందున్ను భాగ్యలాభా ధిపతులకు సంబంధంవున్నా సరేవే. ధనాధిపతి పంచమమందు పంచ మాధిపతి ధనమందువుండవలెను. ధనాధిపతిలాభమందు లాభాధిపతిధన మందు పంచమాధిపతిపంచమమందు భాగ్యాధిపతిలాభమందు వుంటే విశే షధనమున్నూ భాగ్యమున్నువుంచుంది.

**End:**

కర్మాధిపతికి రవికుజులతోటి సంబంధంవుంటే క్షత్రియమూలమైన ధనాగమంవస్తుంది. పంచమాధిపతిన్ని గురుడున్ను ఉచ్చస్థులైవుంటే పు త్రులు భాగ్యవంతులనిచెప్పవలెను. మిథునలగ్నానకులాభమందు వుంటే భ్రాతృవులతోటి బహువిరోధంవుంచుంది,

గ్రంథాంతమందిట్లున్నది :—

శో భకృత్సం మాఘ బ ౧౩ శుక్రవారం జయంతి వెంకటాచలంగా రికి శ్రీపాదవెంకటరాయడు మాధవరాజీయ్యం యనమండవెంకట రెడ్డి వ్రాసిన ప్రతినున్నక్రమానను వ్రాసి శ్రీరామార్పణంగా యిచ్చెను.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత మంచిది. తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

ఇది యొకజ్యోతిషగ్రంథము, ఇందుద్వాదశభావఫలములు చెప్పఁబడినవి. ఇది మాధవరాజీయమను సంస్కృతగ్రంథమునకుఁ టీకయయి యుండును.

---

## R. No. 491.

Paper $10\frac{3}{8} \times 9\frac{3}{8}$ inches. Foli. 36. Lines, 20 on a page. Mode of writing, not good and not correct. Good.

Transcribed in the year 1917–18 from a MS. obtained through the Sub-Magistrate of Kovvur, Kistna district.

యాజ్ఞవల్కిచరిత్రము.

YĀJNAVALKICARITRAMU.

This Prabandha in three Āśvāsas describes the origin of the sage Yājñavalkya and the incidents that led to the study of the white Yajurvēda as distinct from the black Yajurvēda. Gaṭṭuprabhu, the author of this work, was the son of Yellanāmātya and dedicated it to Uddaṇḍa Liṅgāmātya. The stanzas describing the genealogy of the patron are left out in this MS. The author also wrote Kucēlōpākhyāna, Rambhārāvaṇasamvāda and Surābhāṇḍēśvara.

Complete.

**Beginning:**

శా. శ్రీమత్పర్వతకన్యకాకుచయుగ శ్రీగంధకాశ్మీరవం
ద్రామోదాతి విశాలవక్షుఁడు మహాబాహాద్వత్త్రావతకోటావ్యయ
గ్రామాధీశుఁడు శేషభూషుఁడు దయాగంభీరుఁడుద్దండలిం
గామాత్యాగ్రణికిచ్చుఁగాత సుతపౌత్రానేకసౌభాగ్యముల్.

* * * *

మ. అనఘోద్దండకులావతంసుఁడగు లింగామాత్యునాశీర్వచ
స్స్వనదివ్యామృతభవ్యసూక్తిశివునిన్ వాక్రుచ్చి గంగానదీ
కనదుత్తుంగతరంగఘుంఘుమితవాక్ప్రౌఢిన్ విజృంభించిత
ద్ఘనవంశంబు దిగంతరాళములఁ బ్రఖ్యాతంబుగా నెన్నఁగన్ (నెన్నెదన్ ?).

వ. తత్ప్రకారం బెట్టిదనిన :—

(వంశవర్ణనపద్యములు వ్రాయఁబడియుండలేదు.)

వ . . . . . శుక్లయజుర్వేదపారాయణులైన ప్రథమశాఖాన్వయ ప్రభుశిఖామణులు ఒకనాఁడు సూర్యోపరాగ పుణ్యకాలమందు సప్తనదీసంగమేశ్వరమందిరప్రాకారగోపురద్వారంబున సుఖాసీనులై యిష్టగోష్ఠీవినోదంబులఁ బ్రొద్దు పుచ్చుచుండి స్వశాఖాయుక్తుండగు మంజుభాషణుండను పౌరాణికునిఁ గనుంగొని యిట్లనిరి.

క. మనవంశమునకుఁ గర్తగు
మునివరుఁడౌ యాజ్ఞవల్క్యముఖ్యచరిత్రం
బనుక్రమమున విరచింపుము
వినవలతుము సకలలోకవిఖ్యాతముగన్.

వ. అనిన మహాత్ములారా! మీరడిగిన యాఖ్యానంబు స్కాందపురాణంబున శౌనకాదిమహామునులకు సూతునిచేత వక్కాణింపఁబడియె నందుఁ బూర్వంబున శ్రీమన్నారాయణుని నాభికమలంబునం బు . . . . బ్రహ్మరాతి తేజంబు సునందగర్భంబునఁ బంచవర్షంబు లుండుటయు నంత గర్భస్థుఁడైన యర్భకునకు వైకుంఠుఁడు వచ్చి బ్రహ్మోపదేశంబు చేయుటయు నంత . . లుండు మాతృగర్భంబున వెడలుటయు, నాతనికిఁ గణ్వమార్కండేయ గౌతమవసిష్ఠాది మహామునులు యాజ్ఞవల్క్యయను నామధేయంబొసంగుటయు; నమ్మహామహ . . . తజ్జనకుండు చౌలోపనయనాదులు చేయుటయు, వేదాదివిద్యాభ్యాసంబు గావించుటయు సాత్యవతేయుండు భూప్రదక్షిణంబరుగుటయు . . . టయు నమ్మాణవకుఁడు వైశంపాయనునివద్దఁ జదువుటయు వైశంపాయనునకు బ్రహ్మహత్య సంభవించుటయుఁ, దద్బ్రహ్మహత్య . . . సునందానందనుండు పరిహరించుటయుఁ, దత్ప్రభావంబు నకందలు సహింపకుండుటయు, నతఁడు జనకచక్రవర్తిపురంబునకుఁ జనిమంత్రాక్షతస్పర్శన మాత్రంబున నశుష్కస్తంభంబులఁ బల్లవింపఁజేయుటయుఁ, దద్బ్రహ్మరాతిసుతుం

డుగురువాక్యోల్లంఘనంబు సేయుటయు, సేదంబుమఱలం గ్రక్కుటయుఁ, దద్వేదంబాప . . . బాది పరమపురుషులు బాదరాయణునను మతంబునభక్షించుటయు, నిట్లుయాజ్ఞవల్క్యుగాయత్రీ మహాదేవి నారాధించుటయు, నాశక్తిసూర్యునిరథసమీపంబున శుక్లయజుస్సు నభ్యసించుటయు, నతండుగంధర్వుని శాస్త్రవాదంబునం గెలిచి నిజాశ్రమంబునకువచ్చుటయుఁ, గాత్యాయనియను దానినివివాహంబగుటయు, దత్కాలంబున జనకుండధ్వరంబు సేయుటయు, నచ . . . . , యమిసభామధ్యంబున నహంబ్రహ్మాంబని స్వర్ణధేనువుదానంబు ప్రథమతః అందుటయు, దత్కారణంబునమునులు విరోధించుటయు, నమ్మహాత్ముండు చండాలు . . . . . చ్చిపిదపఁ బరిగ్రహించిననిర్జీవకాంచన గోగణంబులనపహరింపఁ జేయుటయుఁ దత్ప్రకారంబున భంగపడి మహర్షులందఱునరవిందసంభవుపాలికింజనుటయుఁ దత్పితామహుండు గార్గియనుదానింగల్పించియతనిఁ బరిభవంబునొందించుమనుటయు నమ్మహాభాగవతియతనితోడం బ్రతి ఘటింపక కూడివర్తించుటయు నుద్దాలకుండు కలహించుటయు, శాకల్యుడు తత్ప్రసాదంబున సాకల్యంబుగావర్తింపఁ జేయనేరక పరమారుణమంత్రంబునఁగుశఘాతంబునఁ బ్రాణంబువిడుచుటయు, మహర్షులప్రార్థనంబున నతనిమగుడం బ్రతికించుటయు, భారద్వాజ శాండిల్య కశ్యపప్రముఖులైన తాపసులు పుత్త్రిభావంబున యాజ్ఞవల్క్య యుఁదామును బ్రథమశాఖాన్వయాను గుణులైనడచుటయు దీనిని సవిస్తరంబుగా . . . . చ్చెదనని సభాస్థితులకుం మంజూభాషణుం డిట్లనియె.

**End:**

భుజంగప్రయాతము.

సమసావనీనాథ సంస్తూయమానా
హిమతీగభాకీర్తి హేలానిదానా
విమాలిన్యవిజ్ఞాన(?)విద్యావిధానా
ప్రమాదాదిహీనప్రభావప్రధానా.

**Colophon:**

ఇది శ్రీమద్భ్రమరాంబికావర ప్రసాదలబ్ధకవితాధురంధర పూర్వకవి ప్రయోగశబ్దానుబంధబంధుర సరసకవిమిత్ర ఎల్లనామాత్య పుత్త్రిఘట్టుప్రభునామధేయ ప్రణీతంబైనయాజ్ఞవల్క్యచరిత్రంబను మహాకావ్యంబునందుసర్వంబును దృతీయాశ్వాసము సంపూర్ణము.

గ్రంథాంతమందిట్లున్నది :—

శుక్లవత్సర చైత్రశుక్లే ౫ గురువాసరేదక్షిణదేశే ఆరణిగ్రామేయాజ్ఞవల్క్యనరామనాథేన అనుముకొండసంప్రదాయ విశిష్టేన దత్తమిదం పుస్తకమ్ కూచిమంచ్యాగ్నిమన్నారు శాస్త్రిణః.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిదిగాదు. తప్పులున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతము లక్కడక్కడగలవు.

మూఁడాశ్వాసముల యీప్రబంధమున శుక్లయజుర్వేదశాఖా ప్రవర్తకుఁడగు యాజ్ఞవల్క్యమహర్షి చరిత్రమువర్ణింపఁబడినది. కర్త గట్టుప్రభువు. ఈతఁడే కుచేలోపాఖ్యాన రంభారావణసంవాదములకునుగర్త. కృతిపతియుద్దండలింగామాత్యుఁడు. ఆతనివంశవర్ణనపద్యములు పుస్తకమున విడువఁబడుటచేనాతనిఁ గూర్చియిందేమియుఁ దెలుపరాదయ్యె.

---

R. No. 492.

Paper. $10\frac{7}{8} \times 9\frac{3}{4}$ inches. Foll. 10. Lines, 20 on a page. Mode of writing, bad and correct. In good condition.

Transcribed in the year 1917–18 from a MS. of M.R.Ry. Boḍḍapāṭi Vēṅkaṭēśvara Rao Gāru, Ramaṇapūḍi, Guḍivāḍa Taluk.

అపరోక్షానుభూతి.

APARŌKṢĀNUBHŪTI.

Foll. 1*a*—9*a*. Foll. 9*b* and 10 are left blank.

Deals with the realization of the Brahman as conceived in accordance with the Advaita Vēdānta. The work is written in the form of an allegorical story like the Prabōdhacandrōdaya.

A fragmentary portion without the beginning or the end

**Beginning:**

మ. పటురౌద్రంబున రుద్రరూపమలరన్ బ్రహ్మాండభాండంబుల
న్నిటినాకుక్ష్మడినాశమేర్పడ మహానేత్రాగ్ని చేదగ్ధమా
నటుగావించిన నిష్ప్రపంచముగ నన్యంబెచ్చటన్ లేనిపి
మ్మట శేషించిరి ముఖ్యకారణులు ధీమంతుండు తానిద్దఱున్.

క. అయ్యోదధీమంతునితో
నెయ్యంబుననిట్టులనియె నేఁబుట్టినచో
టెయ్యది నామర్మవిధం
బెయ్యది వివరంబుననరనికఁ దెలియవలెన్.

**End.**

నావివాదంబులసందడిఁ లోఁజిక్కి చిక్కొక్కి వితరకుతరకంబుల కోర్వక యలసి వేసరి పూర్వదుఃఖంబు స్మరించుచు ఘనతరదావంబున బరమాయాసంబుంబొంది తెప్పిరిలుచు.

వి-వి.)—

ఆద్యంతములు లేవు. వ్రాఁత మంచిదిగాదు. తప్పులున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

ముఖపత్త్రమున నపరోక్షానుభూతి యనుపేరున్నది. కాని యుక్తగ్రంథము భాగమాత్రమేయుండుటచే గ్రంథనామము కర్తృనామము మొదలగునవి యెఱుఁగరాదయ్యె. ఇందు అద్వైతవేదాంతసిద్ధాంతముచొప్పున నపరోక్షానుభూతి ప్రకారము కథారూపమునఁ జెప్పఁబడినది.

---

## R. No. 493.

**Paper 10¾ × 9¾ inches. Foll. 80. Lines, 20 on a page. Mode of writing good but contains mistakes. In good condition.**

Transcribed in the year 1917–18 from the MS. acquired through the Sub-Magistrate of Kovvur.

### యాజ్ఞవల్క్యవిజయము (ద్విపద).
### YĀJÑAVALKYAVIJAYAMU (DVIPADA).

This is a Prabandha in 6 Kāṇḍās narrating the story of Yājñavalkya, by Calla Guravayya, son of Pērayya belonging to the white Yajurvēda. The author bears the title " Bālasarasvati ' and composed the work at the instigation of Kṛṣṇāpātruni Vēṅkaṭamantri who also belonged to the class of the white Yajurvēda Brahmins. Particulars regarding the patron are given in the extracts.

Incomplete.

**Beginning :**

ద్విపద. అగ్రభాగంబున నతిమోదమునను
సుగ్రీవుఁడునువాలి సుతుఁడునుగొల్వ
విక్రమస్ఫూర్తిచే విల్లసిల్లిభూమి
చక్రంబుపాలించు స్వామినిహృదయ
కమలంబులోపల ఘనయోగమార్గ
విమలుండనైభక్తి వివరంబుతోడఁ
గనుఁగొనికీర్తించి ఘనతగమ్రొక్కి
వినుతవిక్రమమహో విశ్వేశుఁడైన
పరమేశునభవుని బ్రహ్మాండమయుని

* * * *

వైభవంబునయాజ్ఞవల్క్యవిజయము
ప్రాభవంబునఁజెప్పఁ బరగి మోదమున
సలలితంబై నట్టి జన్మకాండయును
విలసిల్లుచుండెడు వేదకాండయును,
ధృతిమహనీయమైత్రేయకాండయును
బ్రతిభనుండెడు పరబ్రహ్మకాండయును
నారూఢితోడుత యజ్ఞకాండయును
శ్రీరమ్యమగువిశ్వజిత్కాండయునఁగ
సమరపటాకాండంబు లంచితస్ఫురణ
విమలతతోడుత వివరింతునిపుడు
వరలబ్ధమగు యాజ్ఞవల్క్యవిజయము
సిరులురంజిల్లగ శ్రీరామచంద్రు
నకునంకితంబుగా నవరసంబులును

* * * *

దుర్గావరప్రసాదుఁడవుకవిత్వ
మార్గమెఱింగిన మహితపుణ్యుఁడవు
కాలసరస్వతిప్రౌఢనామమున
ధీలలితుండవై దికుటిలమించి
తనిగారవించిన నద్దిఁగైకొనుచు
ఘనతరసంతోషకవితచే నమున

విలసితంబగుకొండపీటికిఁగలుగు
స్థలకరణంబును సజ్జనగుణుఁడు
వెలయుకృష్ణాపాత్రు వేంకటమంత్రి
తిలకునివంశంబు తెఱఁగువర్ణింతు
గురుతరమైనట్టి కొచ్చెర్లకోట
వరమంత్రియయమరాఖ్యవనితలక్ష్మమ్మ
కునునుదయించెను గోత్రవర్ధనుఁడు
ఘనుఁడుమాదనమంత్రి గంభీరగుణుఁడు
అతనికిసతితిర్మలమ్మయనంగ
వితతవిఖ్యాతిచే విలసిల్లి రెలమి
నావధూవరులకు నాత్మజుఁడైన
కేవలపుణ్యుండు కేసప్రధాను
కతనికి భార్యతిప్పమ్మయనంగ
నుతికెక్కి రెలమి మనోవిలాసమున
నాపుణ్యులకుఁగల్గె నతిధర్మశాలి
శ్రీపతిపదపద్మసేవాధురీణు

* * * *

తనరంగనాచంద్రతారార్కముగను
ఘనముగఁబెంట్లిసుంకములుమాన్పించి
వినుతికెక్కినకీర్తి విజయుండనంగ
నెఱామహాపాత్రుఁడెలమిజన్మించె

* * * *

ఆతనికిగోపమ్మయను సాధ్వి చెలఁగ
ఆదంపతులకును నధికవిక్రముఁడు

* * * *

సర్వజ్ఞగుణుఁడుకృష్ణామహాపాత్రు

* * * *

జనియించెసంపూర్ణచంద్రునిమాడ్కి
నొనరంగనతనికినుత్తమాంగనయు
ననుపమగుణశీలయమ్మమాంబనఁగ
మంజులవాక్కలమద్వంశసగణి
గరిమతోవర్ణింతుఁగ్రమముననిపుడు
సిరులురంజిల్లెడు శ్రీకొండపల్లి
పురముననుండెడు భూసురవరుఁడు
చల్లయనంతయసాధ్వియజ్ఞమ్మ
సలలితంబుగఁదాను సత్పుత్త్రిఁగనియె
దిప్పయమంత్రి వర్ధితయశోధనుని
నొప్పుగనతఁడు దానొగిఁబెండ్లియయ్యె
వీరమాంబను విమలాంగియనంగ
నారూఢినిద్దఱకత్యంతప్రేమఁ
దనయులు పేరప్రధానిమల్లాఖ్యుఁ
డొనరఁగూనయమంత్రియునుగల్గిరపుడు
నాపేరమంత్రికినర్ధాంగలక్ష్మి

* * * *

ఎల్లమాంబయనంగనింపువహించి
నిరువురకునుగల్గిరనయంగసుతులు
గురవయాఖ్యుండును గురువాహ్వయుండు
పొగసైనమల్లికార్జునుఁడనఁబరగి
మగఁటిమితోరాజమాన్యులైనట్టి
యనఘులు గలిగిరి యందగ్రజుఁడను
వలనైనశ్రీయాజ్ఞవల్క్యవంశజుఁడఁ
గొలఁదిగఁగౌండిన్య గోత్రచరిత్రుఁడను

**End:**

కొలఁదిమీఱినయట్టి కోటియజ్ఞముల
ఫలము గల్గును మహాపంచాపాతకులకు
గురుతరంబుగనైదుకోటులఫలము
వరుసనిర్వదియొక్కవంశంబువారు
కరమర్థితోడ స్వర్గారూఢులగుచు

సుందరుమనములనుల్లాసులగుచు
షః సంబుతోడభోజనముఁగావించి

* * * *

ఇరువురకుదయించిరీప్సితమతిని
ఖరగంగనెత్తియపాత్రుండనంగ
ప్రేమంబుమీఱఁగఁబాపమంత్రియును
సమితసుందరుఁడెల్ల నార్యుండుదనరె
ఘరసమూర్తివిలాసచతురుఁడైనట్టి
వరయశోధనుఁడుగుర్వయమంత్రిఘనుఁడు
నలుగురుగలిగిరినవగుణోజ్జ్వలులు

* * * *

ధీగౌరవంబువర్తిల్లినయట్టి
యాగుర్వమంత్రికినతిపుణ్యశీల
కొండమాఁబయనంగఁ గోమరువహించె
దండిగ సతతాన్నదానంబులొసఁగి
యాయిద్దఱికుఁగూర్మియైననందనుఁడు
ధీయుతగుణుఁడు మంత్రియుగంధరుండు

* * * *

ఆరూఢిరాయసింహాసనంబైన
విలసితంబగుకొండవీటికిఁగలుగు
స్థలకరణంబును సజ్జనగుణుఁడు
శ్రీవేంకటేశ్వరాంచితవరలబ్ధ
పావనశీలుండుపరగజన్మించి
వేంకటమంత్రిప్రావీణ్యంబు మెఱసి

* * * *

అతనికిఁబ్రియభార్యలైదుగురగుచు

* * * *

అలఘుపెరాపంబుననగ్రభామినికి
నానరనిద్దఱుతనయులుగల్గిరెలమి

* * * *

రామచంద్రుండు నురసికుండైనట్టి
యామహామహుండెల్లనామాత్యవరుండు
ఇద్దఱుతనయులైయేపుమీఱుచును
దద్దయు వేంకటాధన్యుండు తనరం
జతురతశ్రీరామచంద్రునింపుగను

* * * *

(వి-వి.)—

మొదటి నాల్గుకాండములు సమగ్రముగాను, నయిదవకాండము సమగ్రముగాను గలదు. వ్రాంత చక్కనిది. తప్పులున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములున్నవి.

యాజ్ఞవల్క్యవిజయమను పేరుగల యీ ద్విపదగ్రంథ మైదు కాండములు గలది. ఇందుయాజ్ఞవల్క్యమహర్షి చరిత్రము వర్ణింపఁబడినది. గ్రంథకర్త చల్ల గురువయ్య; పేరయ్య కొడుకు. శుక్లయజుశ్శాఖబ్రాహ్మణుఁడు; బాలసరస్వతియను బిరుదనామముగలవాఁడు. కృతిప్రేరకుఁడు కృష్ణాపాత్రుని వేంకటమంత్రి. ఈతఁడును శుక్లయజుశ్శాఖబ్రాహ్మణుఁడే. ఈతనిఁగూర్చి విశేషముల కుదాహృతగ్రంథభాగమును జూచునది.

---

## R. No. 494.

Paper. $10\frac{7}{8} \times 9\frac{3}{4}$ inches. Foll. 64. Lines, 20 on a page Mode of writing, good but incorrect. In good condition.

Transcribed in the year 1917–18 from a MS. of M.R.Ry. Rāyavarapu Narasayya Garu, Kottapalli, Godavari district.

వాస్తుసారసంగ్రహాలక్షణము. (సటీకము).

VĀSTUSĀRASAṄGRAHALAKṢAṆAMU. (WITH MEANING).

A treatise in architecture dealing mainly with the construction of dwelling houses. The author is Pērusōmala Gaṇapayāmātya, son of Maṅgamāṁbā and Vēṅgalāṁātya, and grandson of Gaṇapayāmātya of Vāsiṣṭhagōtra and Āśvalāyanasūtra.

Complete.

**Beginning :**

శా. శ్రీమత్సింహగిరిస్థలీవిభుఁడు చిన్మయమూర్తిసమస్తదేవతా
గ్రామణివారిజాసనశుక స్తవనీయ పదారవిందుఁడు

ద్ధామయశోధురంధరుఁడు తామరసాక్షుఁడు పేరుసోమల
గ్రామనివాసుఁడాశ్రితశరణ్యుఁడు కృష్ణుఁడుమమ్ముఁబ్రోవుతన్.

* * * *

క. నిరతమువిద్వత్సంగతిఁ
దిరముగఁదద్గ్రంథమహిమ తెలియుటకతనన్
విరచింతుఁబద్యఫణితుల
సరసంబగువాస్తుసారసంగ్రహమవనిన్.

సీ. శ్రీకృష్ణపదపద్మసేవాధురంధర
వాసిష్ఠగోత్రసంభవుఁడుఘనుఁడు
ననుపమానాశ్వలాయనమానిసూత్రుండు
విద్వత్కవీశ్వరవినయపరుఁడు
శ్రీమంతుడగు పేరుసోమలశివరాజ
వంశవార్ధికినిజైవాతృకుండు
కమనీయగుణకీర్తిగణపరాజయమంత్రి
పౌత్త్రుఁడౌ పరమపవిత్రచరిత
మల్లమకువేంకనామాత్యమణికిసుతుఁడు
సకలసిద్ధాంతగణితశాస్త్రజ్ఞలెంచ
వాస్తుశాస్త్రంబుగావించివార్తగాంచి
మహిని జెలువొందుగణపయామాత్యకవిని.

క. వాస్తుగతుల్ బహువిధములు
విస్తారమొనర్పగ్రంథవిస్తారములన్
బ్రస్తావనకొలఁదినిగృహ
వాస్తువుమాత్రంబొనర్తువసుధం దెలియన్.

**End :**

కంచములుతొల్చిచల్లినఫలము.

సీ. ఎలమిభుజియించుకంచముల్ తొలిచిచల్లు
దిశలఫలమెత్తుసురపతిదిక్కుమొదలు
గాఁగఁ గల్మియు మానభంగంబు మృతియు
జెనులు పిరియును భగయు భూతియునుగృష్ణ.

**Colophon :**

ఇదిశ్రీమదనగోపాలస్వామి కృపాకటాక్షవీక్షణ ప్రసాదాసాదిత సకలగణితగుణితప్రశస్తవాస్తు విస్తారశాస్త్రాంబురాశి ప్రమథనమందరాచలాయమానబుధజనావేశశ్యానవ్యాద్యచరిత్ర మహాశ్వలాయనసూత్ర వసిష్ఠగోత్రపవిత్ర పేరుసోమలగణపయామాత్యపౌత్ర వేంగళామాత్యమంగమాంబికాగర్భశుక్తిముక్తాఫలవిరాజమాన సూరిజనవిధేయ గణపయామాత్యప్రణీతంబైన వాస్తుసారసంగ్రహాలక్షణంబనెడిది సర్వంబును నేకాశ్వాసము.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పులున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

ఇండ్లుకట్టుటకు శుభాశుభస్థితులు మొదలగునవి యిందు వర్ణింపఁబడినవి. కర్త పేరు సోమల గణపయామాత్యుఁడు. ఆశ్వలాయనసూత్రుఁడు. విశేషముల కుదాహృతగద్యముఁ జూచునది. ఇందుఁబద్యములకుఁ టీకయుఁ గలదు.

---

## R. No. 495.

Paper. 10¾ × 9¾ inches. Foll. 182. Lines, 20 on a page. Mode of writing, good but incorrect. In good condition.

Transcribed in the year 1917–18 from the MS. obtained through M.R.Ry. V. Prabhākara Śāstri Gāru, Telugu Pandit, Government Oriental MSS. Library, Madras.

సాంబోపాఖ్యానము.

SĀṀBŌPĀKHYĀNAMU.

A Prabandha describing the incidents leading to the marriage of Sāṁba (son of Śrī-Kṛsna) and Lakṣaṇā (daughter of Duryōdhana); by Mōcarla Nannaya, son of Mādhavāmātya of Bhāradvājagōtra. For other particulars refer to the extracts given below

Complete in 5 Āśvāsas.

**Beginning :**

శా. శ్రీమద్గోపనితంబినీహృదయ రాజీవాంతరోల్లాసలీ
లామోదభ్రమరాయమాణమహిత శ్లాఘ్యప్రభావుండుసు

క్షేమానందమెలర్ప దాసులఁగటాక్షించుచుఁ గృపాలోలుఁడై
శ్రీమోచర్లపురాధి వాసుఁడధిక శ్రీలుల్లసిల్లన్ దయన్.

* * * *

క. అస్మద్దేశికవరుల స
తిష్ఠితులగు చక్రవర్తితిరుమలగురులన్
విస్మయ మొప్పఁగ నేను స
దాస్మరణ మొనర్చువాఁడఁ దాత్పర్యమునన్.

* * * *

సీ. ధరనాంధ్రకవితాపితామహు నన్నయ
భట్టు సద్భక్తితోఁ బ్రణుతి చేసి
భారతసాగరోత్తారణనిపుణుఁ డి
క్కనసోమయాజుల వినుతిచేసి
హరివంశభారతాఖ్యానావధాన స
జ్జనను నెఱ్ఱాప్రెగ్గడను భజించి
ప్రేమమదీయమాతామహావశవి
హరుఁ బింగళిసూరపార్యుఁ దలఁచి.
గీ. వెలయ శ్రీనాథ భట్టారకులకుఁ బోత
రాజకవివర్యునకు మ్రొక్కి రామలింగ
పెద్దనార్యులఁ గొనియాడి బిరుదులైన
వర్తమానకవీంద్రుల వరుసఁ దలఁచి.

* * * *

గీ. అట్టియన్నపరాజపుణ్యములమూల
కందమైనట్టి పార్వతినందముగను
బెండ్లియైపుత్త్రికులఁ గాంచెఁ బృథివిజనులు
మేలుమేలనిపొగడ భూమీశులలర.
వ. వారెవ్వరంటేని
క. మన్ననతో నాగేంద్రుఁడు
చెన్నొందఁగ నారదుండు శ్రీకంఠులనన్
సన్నుతకీర్తిపవిత్ర సు
ఖోన్నతితో వెలసిరంచితోన్నతగరిమన్.

* * * *

గీ. అట్టిపేరమ్మవలన నెయ్యంబుమీఱ
సుతులఁ గాంచెను నాగేంద్రుఁ డతులభాగ్య

రాశియైనట్టి యన్నపరాజవరుని
ప్రథితబలశాలి శ్రీరామభద్రుఁడనఁగ.

గీ. సరవిషట్సహస్రశాఖాభిమాన ప్ర
యత్నమున నియోగిరత్నమనఁగ
సకలజనులు మెచ్చ జగతిపైనాగేంద్రు
నన్నపార్యుఁడొప్పె నాల్గుదిశల.

క. శ్రీమాంకూరుఁడు తమ్మిడిఁ
గామించెన్ రాజధానిగా స్థలపతియై
క్షేమముతో వీరమ యను
భామన్ వరియించెఁ గాంచెఁ భాగ్యయశంబుల్.

* * * *

తే. గీ. దొరసిపుట్టిరి వేదచతుష్టయంబు
భాతిగాన్పింప వీరమాంబకును నన్న
పార్యునకు సంభ్రమోచితకార్యులగుచు
ధరణి నెన్నంగ నాదిమధాతలనఁగ.

వ వారిలోన.

* * * *

క. ఓజను బింగళిసీతమ
రాజతనూజాతనూబ్జరంబు గనిక్తన్
రాజసమున మాధవుఁడతి
తేజంబునఁ గొనియెఁ దనసతిగ సింగమ్మన్.

క. ఆసింగమాంబ మాధవుఁ
డశ్రాంతప్రౌఢిమీఱ ననురాగమునన్
ఖేశనిభాస్యులసుతులఁ బ
రాశరమునిసముల ముప్వురం గని రెలమిన్.

వ. వారెవ్వరంటేని

ఉ. శ్రీమహితుండు బంధుసరసీజదినేశుఁడు సూరమంత్రి శ్రీ
రామకటాక్షలక్షణపరంపరయుక్తుఁడు పిరరాఘవుం
డామహితాత్ములిద్దఱు మదగ్రజులైనను గారవింపనా
నామము పెద్దలెన్నుదురు నన్నపరాజను చుమ్ ప్రియంబునన్.

* * * *

శా. కాశీఖండము వేడ్కతో ద్విపదగా గావించి నేనిచ్చితిన్
వాసిన్ మీఅనరాంకితంబుగను దానన్ లాభమేమంచు ను
ల్లాసంబొప్పఁగ సర్వలక్షణములన్ లక్షించి సాంబోదయం
బా సర్వేశ్వరు కంకితంబుగను జేయంబూనియున్నట్టిచోన్.

**End :**

పంచ. పరాపరేశ్వరా ప్రపన్నభవ్యమానసోజ్జ్వలా
క్షరాక్షరస్వరూపతత్త్వసారశౌనకార్చితా
ధరాధరిత్రినాయకప్రధానయుక్తిశాలకా
మురాసురప్రధానదైత్యభూరిగర్వభంజనా.

**Colophon :**

ఇది శ్రీమద్బాలగోపాలవరప్రసాదలబ్ధ కవిత్వచాతుర్యధుర్య మోచర్లాన్వయపయఃపారావారసుధాకరాపస్తంబసూత్ర భారద్వాజసగోత్ర పవిత్ర మాధవామాత్యపుత్త్ర సుజనానందవిధేయ నన్నయనామధేయ ప్రణీతంబైన సాంబోపాఖ్యానంబను మహాప్రబంధంబునందు సర్వంబును బంచమాశ్వాసము

(వి-వి.)——

సమగ్రము. వ్రాఁతమంచిది. తప్పులున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

అయిదాశ్వాసముల యీ ప్రబంధమున సాంబుఁడు లక్షణను బెండ్లాడు కథ వర్ణింపఁబడినది. గ్రంథకర్త మోచర్ల నన్నయ, మాధవామాత్యుని కొడుకు, భారద్వాజగోత్రుఁడు. విశేషములకు దాపృత గ్రంథభాగముఁ జూచునది.

---

## R. No. 496.

Paper. $10\frac{7}{8} \times 9\frac{1}{8}$ inches. Foll. 68. Lines, 20 on a page. Mode of writing, good but incorrect. In good condition.

Transcribed in the year 1917-18 from a MS of M.R.Ry. Bhaṭlapenumarti Tāṇḍava Kṛṣṇayya Gāru of Bhaṭlapenumarti, Divi taluk, Kistna district.

వల్లభాభ్యుదయము.

VALLABHĀBHYUDAYAMU.

Foll. 1*a*—67*a* Foll. 67*b* and 68 are left blank.

A Prabandha in four Āśvāsas describing the sanctity and holiness of Śrīkākuḷakṣētra on the bank of the river Kistna. The work is a Telugu rendering of the story occurring in the Sanskrit Brahmāṇḍapurāṇa by Bhaṭlapenumarti Kōdaṇḍarāmakavi of Haritasagōtra and a disciple of Tirumala Tātācārya.

At the end of the MS. there is a stanza giving the date of the completion of the work and the name of the poet which stanza is extracted below.

Complete

**Beginning :**

శా. శ్రీమత్కాకుళనాథు మాధవు విరించిప్రార్థనాధీను సు
త్రామాశ్మోపమ మేచకాంగు నతమాభా(?) రుఁ సుపార్శ్వ ని
త్యామర్త్యాపచితాబ్జపద్ద్వయు సరోజాక్షుఁ జగద్వల్లభ
స్వామిఁ సద్గుణు నాశ్రయించెదనభీష్టప్రాప్తికిన్నిష్ఠతోఁ.

*　　*　　*　　*

శా. శ్రీపత్యంఘ్రిసరోజసంశ్రితజనాశీర్వాదలబ్ధప్రతి
ష్ఠాపర్యాప్తిత (?)నాంధ్రకావ్యరచనాసామర్థ్యుఁడై వజ్జవ
ర్యాపస్తంబసుసూత్రపాత్రపరిచర్యాభట్లపెన్మర్తిస
ద్గోపామాత్యతనూజసాధుహృదయాకోదండరామాహ్వయా!

**End:**

స్రగ్విణి. శ్రీరమావల్లభా క్షీరవారాశిసం
చార ఘోరాఘసంసారరత్నాకరో
త్తార పాదారవిందాన తానీకమం
దార బృందారకాధార నారాయణా!

**Colophon :**

ఇది శ్రీమత్తిరుమలతాతార్యగురుచరణారుణాబ్జయుగళ సమాశ్రయణదురితలతాలవిత్ర హారితసగోత్రపవిత్ర భట్లపెనుమర్తికులోద్భవ గోపాలసచివతనూభవ విద్వజ్జనవినుతాభిరామ కోదండరామ ప్రణీతంబయిన బ్రహ్మాండపురాణోత్తరఖండంబున శ్రీవల్లభాభ్యుదయంబను శ్రీకాకుళక్షేత్రమాహాత్మ్యంబునందు సర్వంబును జతుర్థాశ్వాసము.

గ్రంథాంతమందీపద్యమున్నది :

గీ. విక్రమాఖ్యాబ్ద కార్తిక విశదపక్ష !
పూర్ణమాసికి వల్లభాభ్యుదయ మెల్ల !
పూర్తిగావించె భట్లపెన్మర్తివంశ !
రత్నమీభువిఁ గోదండరామసుకవి.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పులున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

నాల్గాశ్వాసముల యీప్రబంధమునఁ గృష్ణాతీరమందుఁగల శ్రీకాకుళక్షేత్ర మాహాత్మ్యము వర్ణింపఁబడినది. సంస్కృతబ్రహ్మాండపురాణాంతర్గతముగానున్న సంస్కృతగ్రంథమునకిది తెలుఁగుసేఁత. గ్రంథకర్త భట్లపెనుమర్తి కోదండరామకవి హారితసగోత్రుఁడు తిరుమల తాతాచార్యుల శిష్యుఁడు. విశేషములకుదాహృతగ్రంథభాగమును గాంచునది.

---

## R. No. 497.

Paper. $10\frac{7}{8} \times 9\frac{3}{4}$ inches. Foll. 38. Lines, 20 on a page. Mode of writing, good but incorrect. In good condition.

Transcribed in the year 1917–18 from a MS. of M.R.Ry. Caduvula Rāmalingayya Gāru of Narasāpuram, Kistna district.

చిఱుతొండభక్తకథానిధానము.

CIṚUTONḌABHAKTAKATHĀNIDHĀNAMU.

This work is in the form of a Yakṣagāna, and treats of the story of a Śaiva devotee called Ciṛutonḍa. The author is Vāle Kōṭayakavi, son of Rācayya.

Another work based on this story appears under R. No. 278 *ante*.

Complete

**Beginning :**

శా. శ్రీకాంచీపురమధ్యగేహవిలసత్సింహాసనాధ్యాసియై
పాకారిప్రముఖామరార్చితపదద్వంద్వుండునై యొప్పు నా
యేకామ్రేశ్వర లింగమూర్తి సకలాభీష్టంబులిచ్చున్ గృపా
సేకంబింపఁగ మంచికంటికులజశ్రీనాగలింగయ్యకున్.

* * * *

**End:**

క. అనిసూతుఁడు శౌనకముఖ
మునివర్యులకిట్లుపలికె మోదంబలరన్
మనుకొనియట్లురచించితి
ఘనచిరుతొండకథ యక్షగానముగాఁగన్.

**Colophon:**

ఇది శ్రీమద్గురుమహాదేవవరప్రసాదలబ్ధనిగమాగమోక్తవీరశైవాచార సిద్ధాంతప్రవీణ వాలెవంశసుధాపయోనిధి శీతకిరణ ఉచ్చయాభిధాన పౌత్ర రాచయ్యపుత్త్ర పట్సలపల్లింగావధాన ఇష్టప్రాణభావైక్యసుఖానూన గురులింగజంగమభక్తిప్రధాన కోటయ్యాభిధాన విరచితంబైన బసవ పురాణోక్తచిఱుతొండభక్తకథానిధానం బనుయక్షగానంబు సర్వం బును సంపూర్ణము.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పులున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

చిఱుతొండభక్తకథానిధాన మనునీయక్షగానమునఁ జిఱుతొండ భక్తుని చరిత్రమువర్ణింపఁ బడినది. గ్రంథకర్త వాలెకోటయకవి.

---

R. No. **498**.

Paper. $10\frac{3}{8} \times 9\frac{3}{8}$ inches. Foll 22. Lines, 20 on a page. Mode of writing, bad and full of mistakes. In good condition with many omissions.

Transcribed in the year 1917–18 from a MS. of M.R.Ry. Śaraṇyācārlu of Rāghavapuram.

నవరాత్రచరిత్రము.

NAVARĀTRACARITRAMU.

A poem describing the grandeur of the Dasara festivals as celebrated by a king called Varigoṇḍa Ramana. The author is Kumāra Śaraṇyārya, son of Śaraṇyārya of Kauśikagōtra.

Complete.

**Beginning:**

ఉ. శ్రీమిథిలావనీశసుత చెన్నగువామనిజాంకసీమ ను
ద్దామవిభూషణావళులు దాల్చి వసింపఁగఁదేజమొందు శ్రీ

రామునిపాదపద్మమకరందము గ్రోలి విశుద్ధబుద్ధినై
కోమలవాఙ్నిబద్ధరసగుంభితవాక్యకథాచమత్కృతిన్.

క. వరిగొండరమణధరణీ
వరునవరాత్రోత్సవ. . వాహ్యాళిలస
చ్చరితంబూహించిసవి
స్తరముగనుతియింతుఁదద్విధంబెట్లనినన్.

**End:**

మాలిని. సకలగుణనివేశా. సర్వలోకప్రకాశా
సుకవివినుతమూర్తీ శోభనోల్లాసకీర్తీ
అకలుషసుచరిత్రా యాజిభూమీశపుత్త్రా
ప్రకటసమరకేళీ రామభూపాలమౌళీ.

**Colophon:**

ఇది శ్రీమద్విద్వజ్జనానుగ్రహపాత్ర కౌశికగోత్రపవిత్ర శరణ్యార్య పుత్త్రకుమారశరణ్యానామధేయప్రణీతంబైన నవరాత్రచరిత్రంబను చాటు ప్రబంధంబునందు సర్వంబునేకాశ్వాసము.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది కాదు. తప్పులు మెండు శైథిల్యము లేదు. గ్రంథపాతములు గలవు.

వరగొండరమణుఁడెవరో తెలియరాలేదు. ఆయనచేసిన శరన్నవరాత్రోత్సవమందలి వైభవమిందు వర్ణింపఁబడినది. గ్రంథకర్త కుమార శరణ్యార్యుఁడు. కౌశికగోత్రుఁడు. శరణ్యార్యుని కుమారుఁడు.

---

## R. No. 499.

Paper. 10¾ × 9¾ inches. Foll. 76. Lines, 20 on a page. Mode of writing, not good and not correct. In good condition.

Transcribed in the year 1917-18 from a MS. of M.R.Ry. Munnaṅg Lakṣmīnṛsiṁha Śarma Gāru, Ellore, Kistna district.

కాళిందీపరిణయము.

KĀLINDĪPARIṆAYAMU.

A Prabandha describing the story of the marriage between Śrī-Kṛṣṇa and Kālindī. (one of his eight chief consorts). The author is Cāmarti

Śēṣagirirāyakavi, son of Vēṅkaṭamantrin and grandson of Pāpayāmātya of Kaṇvagōtra.

Fol. 74 is left blank, and in foll. 75 and 76 the prefatory portion of this work is copied instead of in the beginning.

Complete in five Āśvāsas.

**Beginning :**

ఉ. శ్రీకమలాక్షు జక్కునను జెక్కులు ముద్దిడి తమ్ములంపు డా
లాకలకంఠి పోనడవ నల్లన నవ్విన నట్లసేయు త
త్కోకకుచం గవుంగిటను గూర్చి తదాప్తిఁ దొలంగఁ జేయు సం
శ్లోకుఁడు రుక్మిణీవిభుఁడు సొంపుగ నింపుగ మమ్ముఁ బ్రోవుతన్.

* * * *

ఉ. శ్రీగిరిజామనోహరుని చిన్నిమిటారపుటోరచూపు నా
పైఁ గలుగన్ సమస్తజనవర్ణనశీలుఁడనై చరింతు భూ
భాగమునందు స్వస్తవము భావ్యముగాదని పల్కుఁడాల స
ద్రాగవిరాగ శేషగిరిరాట్కవిచంద్రుఁడఁ కీర్తిసాంద్రుఁడన్.

**End :**

మ. ఇది బ్రహ్మైక్యవిశేషశాస్త్రకథనాహేలామనోలోలితా
స్పదసంభావితధీరశిష్యపరిషేవితస్తుత్యసన్నిష్ఠసౌ
ఖ్యదభామర్తికులీన శేషగిరిరాయాస్మత్కృతంబై తగం
పాదవాశ్వాసము భానుజాపరిణయంబున్ బంచసంఖ్యాకమై.

**Colophon :**

ఇది శ్రీమదుమారమణకరుణాకటాక్షవీక్షాసుధారసపరిలబ్ధసరస కవితాభినందిత రసికజనసముదయసకలరాజసభాంతరాళజేగీయమాన అఘటనఘటనచాతురీసామర్థ్యసమారంభితయుక్తకార్యనిర్వాహక సదయహృదయ నిరంతరానుష్ఠితతైలధారావదవిచ్ఛిన్న శుద్ధబుద్ధ బ్రహ్మతత్త్వసాక్షాత్కార విద్వజ్జనవిధేయ, భామర్తివంశపయఃపారావార సంపూర్ణపూర్ణిమాత్రేయ పాపయామాత్యపౌత్ర వేంకటమంత్రిపుత్త్ర కణ్వసగోత్రపవిత్ర విబుధమిత్ర సుందర శేషగిరిరాయ కవిపురందర ప్రణీతంబైన కాళిందీపరిణయంబను మహాప్రబంధంబునందుఁ బంచమాశ్వాసము.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత చక్కనిదిగాదు. తప్పులున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

కాళిందీపరిణయమను పేరుగల యైదాశ్వాసముల యీశృంగార ప్రబంధమున శ్రీకృష్ణుఁడు కాళిందిని వివాహమాడు కథ వర్ణింపఁబడినది. ఇందయిదాశ్వాసములు మాత్రముగలవు. గ్రంథకర్త చామర్తి సుందర శేషగిరిరాయకవి. కణ్వగోత్రుఁడు. వేంకటమంత్రికొడుకు.

75, 76 పత్రములందు గ్రంథావతరణిక పద్యములు వ్రాయఁబడినవి.

---

## R. No. 500.

**Paper.** 10⅞ × 9⅛ inches. Foll. 28. Lines, 20 on a page. Mode of writing, good and correct. In good condition.

Transcribed in the year 1917-18 from a MS of M.R.Ry. Munnangi Lakṣmīnrsiṁha Śarma of Ellore, Kistna district

(*a*) నమశ్శివాయశతకము.

NAMAŚŚIVĀYAŚATAKAMU.

Foll. 1 *a*–11 *b*. Fol. 12 is left blank

A centum of stanzas in Gītā metre in praise of God Śiva etc., by Cāmarti Śēṣagirikavi.

Complete in 108 stanzas.

**Beginning :**

గీ. శ్రీమదఖిలజగజ్జాలజీవనాయ
భక్తజనహృదయాంభోజభాస్కరాయ
నిన్ను సతతంబు మదిలోన నిల్పనాయ
మథితగజదనుజాయ నమశ్శివాయ.

గీ. గురువులేక నరుండెట్లు పరమసుఖము
గాంచు ; నెట్లన్న నదినీఁదఁగాఁదలంచు
వానికిఁ బ్లవంబు లేకున్న వశమె చెపుమ
మథితగజదనుజాయ నమశ్శివాయ.

**End :**

గీ. విమలకణ్వసగోత్రుండ వేంకటాఖ్య
మంత్రిరాట్తనయుండఁ జామర్తిశేష

గిరికపీంద్రుండ నిది చిత్తగింపవయ్యా
మథితగజదనుజాయ నమశ్శివాయ.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పులు దిద్దఁబడినవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

"మథితగజ దనుజాయ నమశ్శివాయ" యను మకుటముతో ముగియు నీ శతకమున లోకనీతులు, ఈశ్వరస్తుతి, మొదలగు విషయములు ప్రతిపాదింపఁబడినవి. కర్త చామర్తి శేషగిరి కవి.

---

(*b*) రామకథాసుధాలహరి.

RĀMAKATHĀSUDHĀLAHARI.

Foll. 13*a*—26 *a*. Fol. 27 contains 5 stanzas in praise of Nīlakaṇṭhaguru. Foll. 26*b* and 28 are left blank.

A poem in 100 stanzas of different kinds of metre dealing with the story of the Rāmāyaṇa. The author is Cāmarti Śēṣagirirāyakavi.

The date of the completion of the composition of this work is śaka 1796.

Complete in one Āśvāsa.

**Beginning**:

ఉ. శ్రీవరనీలలోహితవిరించనులన్ ముద మొప్ప నెంతు స
ద్భావలయాధిపత్యము విభూతిచిరాయువుఁ గోరి యిందిరా
ర్యావచనాబ్జనేత్రలరయంబునఁ గొల్చెద భాగ్యవశ్యవా
చావిభవాప్తి వేఁడి గిరిజాసుతు నెంతు నిజాభివృద్ధికై.

గీ. వ్యాసవాల్మీకిశుకగంధవహజకాళి
దాసభాసభర్తృవాగనుశాసనాది
కవివరుల నెంచి నే రామకథ వచింతుఁ
బద్యశతకంబుగా నతి హృద్యఫణితి.

**End**,

సీ. అనిమిషులింపఁగ మోదమందివారలఁదమ
తమలోకములకంపి తరణితనయు
ముఖ్యవానరులకుఁ బుణ్యజనాధిపు
లకు బహుమానముల్ప్రకటితముగ

సల్పి పావని భవిష్యద్బ్రహ్మ గావర
మిచ్చి నిషాదుల నెచ్చు చేసి
స్వనివాసములకుఁ బోవఁగ న్నాజ్ఞయొసఁగి దా
రాజ్యంబు పాలించె రామవిభుఁడు.

ముఖ్యకథలఁ జెలంగుని సౌఖ్యదాయి
లలిత రామకథాసుధాలహరియనెడి
చరిత మెవ్వరైన నిరతంబు చదివి రేని
గరిమ సకలార్థసిద్ధులు గలుగకున్నె.

**Colophon:**

ఇది శ్రీమదుమారమణకరుణాకటాక్షవీక్షాసుధారసపరిలబ్ధ సరస కవితానందితరసికజననికాయ చామర్తివంశపయఃపారావార సంపూర్ణ పూర్ణిమాత్రేయ పాపయామాత్యపౌత్ర వేంకటమంత్రిపుత్త్రి విబుధమిత్ర సుందరశేషగిరిరాయ కవిపురందర ప్రణీతంబైన రామకథాసుధాలహరి యను పుణ్యప్రబంధంబు సర్వంబు నేకాశ్వాసము.

శాలివాహనశకం ౧౭౯౭ యువనామసం॥ మార్గశిర శు ౫ భాను వారం వరకు సంపూర్ణముగా చెప్పబడినది.

---

## R. No. 501.

Paper. $10\frac{7}{8} \times 9\frac{1}{4}$ inches. Foll. 12. Lines, 20 on a page. Mode of writing, good and correct. In good condition.

Transcribed in the year 1917-18 from a MS. of M.R.Ry, Sātulūr Kṛṣṇamācāryulu Gāru of Taṇuku, Kistna district.

రామానుజశతకము.

RĀMĀNUJAŚATAKAMU.

A centum of stanzas in praise of Rāmānujācārya, the well known propounder of the Viśiṣṭādvaita Vēdānta; by Śāntalūri Tirumalakavi, son of Gōpālācārya.

Complete

**Beginning:**

శా. శ్రీవేదార్థవిచారనిశ్చితమహాశేషాహిపర్యంక ల
క్ష్మీవాసాభిధమూలతత్త్వముమదిం జింతించి తన్మూర్తి యా
దేవాధీడ్గురుపాదసంశ్రయముచే దీపించు మాతండ్రి వో
రా వే కావవె నీవె యేలవె నుతుల్ రామానుజార్యాగ్రణీ!

శా. శేషీభూతసమస్తశేషివగుచున్ శేషావతారుండవై
దోషాకారుండనైన నన్నుఁ బరిశుద్ధుం జేయ వేంచేసితో
పాషండాదిసమస్తదుష్టనివహాప్రధ్వంసదీక్షానిష
ర్గా షాడ్గుణ్యసుపూర్ణదివ్యహృదయా ! రామానుజార్యాగ్రణీ !

* * * *

**End** :

శా. భారద్వాజుఁడుఁ దిర్మలాఖ్యుఁడను గోపాలార్యపుత్రుండ స
త్సారప్రాభవశాంతలూరికులసంజాతుండ యుష్మద్గుణ
శ్రీరంజిల్లఁగ భక్తిఁబద్యశతముం జెల్వొప్పనర్పింతు మ
త్ప్రారంభంబు ఫలింపఁజేకొనుదయన్ రామానుజార్యాగ్రణీ !

(వి-వి.)—

సమగ్రము. ౧౦౮ పద్యములున్నవి. వ్రాఁతఘరకునిది. తప్పులు లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

" రామానుజార్యాగ్రణీ " యను మకుటముతో ముగియు నీ శతకమున విశిష్టాద్వైతమతప్రవర్తకుఁడగు రామానుజాచార్యుఁడు స్తుతింపఁబడెను. కర్త శాంతలూరి తిరుమలకవి. గోపాలాచార్యుల కొడుకు.

---

## R. No. 502.

Paper $10\frac{7}{8} \times 9\frac{3}{4}$ inches. Foll. 46. Lines, 20 on a page. Mode of writing, not good and contains mistakes In good condition.

Transcribed in the year 1917-18 from a MS. of M.R.Ry, Caduvula Rāmaliṅgayya Gāru of Narasāpuram, Kistna district.

శివతత్త్వసారము.

ŚIVATATTVASĀRAMU.

This work which is composed in stanzas of the Kanda metre treats of the superiority of Śiva over all other gods and of the greatness of the devotees of God Śiva, etc. The name of the work is not found in it, but from the 388th stanza the author is known to be Mallikārjuna Paṇḍitārādhya. There is reference in the work to Śrīpati Paṇḍitārādhya, Baṇḍāru Basavanna etc.

Incomplete; contains 491 stanzas.

**Beginning :**

క. శ్రీపతివాక్పతిముఖ్యమ
హాపురుషులు నెఱుఁగఁజాలరతివాఙ్మనస
వ్యాపారమైన నీనిజ
రూపము నేనెట్టిదని నిరూపింతుశివా !

క. ఒందంగ శివునితత్త్వం
బందఁగ విజ్ఞానమేకమజమణుచరమా
నందంబని .యెఱుఁగానియ
నిందితముగ నిట్టిదనఁగ నేరవు శ్రుతులున్.

క. వాదేమియనంతావై
వేదాయను వేదములును వివిధవిధములన్ (?)
వాదిడివెదకెడినన్నుమ
హాదేవా ! నిన్నెఱుంగ నన్యులశలమే.

*                    *                    *                    *

క. ఒందేమి మల్లికార్జున
పండితుఁడన నుంథుకంటెఁ బ్రమథులలో నె
న్నండొకొ నీయాజ్ఞో న్నతి
నుండంగాంతునని కోరుచుండుదు రుద్రా !

*                    *                    *                    *

క. ఒకరుఁడె దైవము శివుఁడని
నికరముసేయుటకుమిడిచె నిప్పులుచీరన్
ప్రకరుక శ్రీపతిపండితుఁ
డకరజముగ విజయవాఁడ నలజమ్మిశివా !

**End :**

క. స్నానములకు దానములకు
మానములకు హోమములకు మదిఁజేకొనఁడీ
శానుఁడు నమ్మినభక్తికి
మానక . . . . .

(వి-వి.)——

అసమగ్రము. ౪౯౧ పద్యములున్నవి. వ్రాఁత యంతమంచిది కాదు. తప్పులు మిక్కిలి యెక్కువ. గ్రంథపాతములు లేవు. శైథిల్యము లేదు.

శివతత్త్వసారమను పేరి గ్రంథము ముఖపత్రమున నున్నదేగాని గ్రంథమునఁగానరాదు. ఇందలి పద్యములన్నియుఁ గందములే. శివపారమ్యము, గణాడంబరము, శివభక్తమాహాత్మ్యము, మొదలగు విషయము లిందు వివరింపఁబడినవి. గ్రంథకర్త వీరశైవమతప్రవర్తకులలోఁ బ్రధానుఁడగు మల్లికార్జున పండితారాధ్యుఁడు. ఈ విషయము ३०० పద్యమునఁ జెప్పఁబడినది. శ్రీపతి పండితారాధ్యుఁడు, బండారు బసవన్న, ప్రభృతులగు వీరశైవులు మఱికొందఱుకూడ నిందుఁ బేర్కొనఁబడినారు. మల్లికార్జున పండితారాధ్యునకుఁ గొంతతర్వాతికాలమందున్న పాల్కురికి సోమనారాధ్యుఁడు, "శివతత్త్వ సారగద్యపద్యసమితిశివుని। మహిమఁ దెలిపినట్టి మల్లికార్జున పండి। తయ్యగారిఁ దలఁతు ననుదినంబు" అని శివతత్త్వసారము, మల్లికార్జున పండితారాధ్య కృతముగా ననుభవసారమునఁ బ్రస్తుతించినాఁడు. పాల్కురికి సోమనారాధ్యుఁడీ మల్లికార్జున పండితారాధ్యుల చరిత్రమునే "పండితారాధ్య చరిత్ర" మను పేర ద్విపదకృతిగా రచియించుటయేకాక యందు, అద్వైతాది మతాంతరనిరాసముపట్టున నీ శివతత్త్వసారమందున్న పద్యములనే కొన్నింటిని గొంచెమువార్చి కూర్చుకొన్నాఁడు.

---

## R. No. 503.

Paper. $10\frac{7}{8} \times 9\frac{3}{8}$ inches. Foll 38. Lines, 20 on a page. Mode of writing, not good and not correct. In good condition.

Transcribed in the year 1917-18 from a MS. of M.R.Ry. Prativādibhayaṅkaram Aṇṇan Vēṅkaṭarāghavācāryulu Gāru, Gūṭāla, Godavari district.

**యతిరాజశేఖరవచనములు.**

YATIRĀJAŚĒKHARAVACANAMULU.

One hundred and eight prose passages in praise of Rāmānuja, also called Yatirāja. It explains the principles of the Viśiṣṭādvaita Vēdānṭa. The author's name is not given, but he is said to be the son of Paravastu Vēṅkaṭācārya.

Complete.

**Boginning:**

శ్రీగార్గ్యవేంకటాచార్యశ్రీపాదకమలాశ్రయమ్ ।
జ్ఞానవైరాగ్యసంపన్నం రామానుజగురుంభజే॥

శ్రీ వైకుంఠనాథహృదయస్వరూపా గుణానంత్యంబులచేత ననంతుండవనియును, ప్రకృష్టజ్ఞానబలసంపన్నతనివాసశయ్యాసనపాదుకాంశుకోపధానవర్షాతపవారణాది శరీరభేదంబుల శ్రియఃపతికిఁ దత్తదవసరోచిత సేవ శేషిభావంబులందిన కతంబున శేషుఁడనియును, ప్రఖ్యాతిగాంచిన నిత్య

సూరివర్య మండితుండనవలసి, యశేష ప్రాచీన దేశికాశయ నిశ్చయ క్రమంబున జ్ఞానీత్వాత్మైవమే మతమిత్యుక్త స్థలజ్ఞానిశబ్దంబున కర్థంబు నీవేయాటచేత భగవదర్చనంబులెల్లఁ దదనంతరాత్మభూతభవత్పర్యంతంబు పర్యవసానంబులెయ్యెఁగావున సతతోత్సవంబులు సంతత మంగళంబు లును దేవరవారికే ఘటించె. మేలుమేలు మమ్మేలు శేషనగరాధినాథ రామానుజ నమోనమో యతిరాజశేఖరా !

**End:**

. . . అట్లగాను బాలుండను, నీవు పరవస్తు విఖ్యాతినొందిన వేంకటాచార్య సూపంబమరి నన్నుఁ గన్నవాడవు. రక్షించుతండ్రివి పోషించుతల్లివి మెచ్చుదొరవు ఇచ్చుదాతవు తోడగుబంధుండవు జోడగు మిత్రుండవు అఖిలంబులున్నీవె నన్ను నీ కారుణ్యశీతల కటాక్షామృత ధారాపరంపరలగ్రమ్ము నీ హృదయంబు నా కభిముఖంబుగానిమ్ము కైంకర్య విరోధుల భంజింపుము. నీ యాడికంబులు చేయుటకు అను మతిచ్చి కైకొమ్ము. కైకొని ప్రసన్నుడవుగమ్ము. శేషనగరాధినాథ రామానుజ నమోనమో యతిరాజశేఖరా !

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత చకరానిదిగాదు. శైథిల్యము లేదు. గ్రంథ పాతములు లేవు.

"రామానుజనమో యతిరాజశేఖరా" యను మకుటముగల యీ నూటయెన్మిది వచనములందు, విశిష్టాద్వైత సిద్ధాంతములు తెలుపఁ బడినవి. రామానుజ యతిరాజు స్తుతింపఁబడినాఁడు. గ్రంథకర్త పేరు తెలియదు. పరవస్తు వేంకటాచార్యుల కొడుకట.

## R. No. 504.

Paper. $10\frac{1}{4} \times 9\frac{3}{4}$ inches. Foll. 11. Lines, 20 on a page. Mode of writing, not bad. Good.

Transcribed in 1917–18 from M R.Ry. Boḍḍapāṭi Vēṅkaṭēśvara Rao Gāru, Karnam, Ramanapūḍi, Gudivāḍa taluk.

నిగమాంతసమగ్రవాగ్రసాయనము.

NIGAMĀNTASAMAGRAVĀGRASĀYANAMU.

This is a Telugu poetical work on Advaita Vēdānta in the form of a conversation between Nārada and Purūravas. The name of the author of the work is not known.

Incomplete.

**Beginning :**

ఉ దేహము వాయుసంచలనదీపిక ; పుత్త్రకళత్రమిత్ర సం
దోహము స్వప్నకాలమునఁ దోఁచినసందడి ; రాజ్యభోగ స
న్నాహము జంత్రపుం బ్రతిమనాట్యము ; సంపదయింద్రజాల ; మీ
యైహికసౌఖ్యమేమి సుఖమంచుఁదలంపుదుమయ్యనారదా !

సీ కామరోషాదిదుష్టారిశత్రువర్గ ప్ర
తాపప్రధానసాధనము ధనము
సకలావగుణపుంజ సంశ్రయాశారూప
దారుణనిగళబంధనము ధనము
జన్మపరంపరాసంపాదనానేక
ఘనకర్మజాలవర్ధనము ధనము
కైవల్యసంప్రాప్తి కారణవైరాగ్య
ధర్మమార్గావరోధనము ధనము
కలిగి గర్వంబు తగిలి దుఃఖంబు మదికి
పెనుచునజ్ఞానపావకేంధనము ధనము
స్వప్నలబ్ధపదార్థంబుచందమునను
దలఁచిచూడంగవట్టిదంధనము ధనము.

**End :**

శా. ప్రారబ్ధంబునమేనమే ననుభవంబౌచున్నఁదత్సాక్షి వై
యారూఢస్థితిసర్వకాలములసర్వావస్థలంజిత్సుధా
ధారాపానసుఖాప్తిసర్వగతశుద్ధ బ్రహ్మమేనంచుశం
కారాహిత్యమునొందుమీయదియె మోక్షప్రాప్తిభూవల్లభా.

సీ. ఆసక్తిలేకయత్నాయత్నతఘటించు
నవిషిద్ధసుఖముల ననుభవించు
ప్రారబ్ధవశతనాపదసంపదలువచ్చు
నగపునుబ్బునుమదిఁగలుగనీకు
కర్తవుగాకకార్యములుశాస్త్రీయంబు
లైనట్టికార్యము . . .

(వి-వి.)—

ఆద్యంతములు లేక నడుమ నొకపట్టుమాత్రమున్నది. వ్రాఁత చెడ్డది కాదు. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

ముఖపత్రమున "నిగమాంతసమగ్రవాగ్రసాయనము, (అను) నారదపురూరువస్సంవాదమని యీగ్రంథము పేరువ్రాయ బడియున్నది. కర్త తెలియరాదు. ఇందు అద్వైతవేదాంత విషయము తెలుపఁబడియున్నది.

---

## R. No. 505.

Paper. 10⅝ × 8½ inches. Foll. 24. Lines, 25 on a page. Mode of writing, fair and not quite correct. In good condition.

The arrangement of the pages is not in proper order.

Presented in the year 1917–18 by M.R.Ry. Tōlēṭi Dakṣiṇāmūrti Gāru of Pēkēru, Tanuku taluk, Kistna district.

పావులూరిగణితము.

### PĀVULŪRIGAṆITAMU

A Telugu poetical rendering of Mahāvīrācāryā's Gaṇitasārasaṅgraha in Sanskrit, by Pāvulūri Mallana Kavi, son of Gaurama and Śivvana of Gārgya Gōtra and Āpastambasūtra, and a chieftain of Pāvulūru in Kammanāḍu. The author's grandfather who was also named Mallana, received as a grant the village called Navakhaṇḍavāḍa near Pīthapura (Pittapuram) from Rājarājabhūpāla, an Andhra king.

Incomplete.

Fol. 9*a* contains the **Beginning**:

శా. శ్రీకంఠం సగుణం సమస్త జగతాం కర్తార మీశం గురుం
భూతోయానల చంద్ర సూర్య పవన వ్యోమాత్మ మూర్తింవిభుమ్
నిత్యానందమయోఽపి యో గిరిజయా సాకం ప్రజావృద్ధయే
మాయాయోగ ముపైతి తం శివకరం వందే శివం శ్రేయసే.

క. ప్రణమిల్లి శివునకీక్రియ
నణిమాదిగుణాస్పదునకు నభినవసంఖ్యా
మణిదీప్తి సారసంగ్రహ
గణితసముద్రంబుఁదలఁపఁ గడగితిఁ బ్రీతిన్

* * * *

క. కావునగణితము తెనుఁగున
గావింపంగణఁగితిని సుకవిమల్లుఁడగా

రీవల్లభ చరణసరో
జావ్జాసితచిత్త మధుకరాత్ముఁడజగతిన్.

క. ఇలఁ గమ్మనాటిలోపల
విలసిల్లిన పావులూరి విభుఁడను సూత్రా
కలితాపస్తంబద్విజ
కులతిలకుఁడ వినుతగార్గ్య గోత్రోద్భవుఁడన్.

ఉ. శ్రీలలనేశుఁడంధ్రనృపశేఖరుఁడై చనురాజరాజ భూ
పాలకుచేతఁ బీఠపురిపార్శ్వమునన్ నవఖండవాడయున్
ప్రోలువిభూతితోఁబడసి భూరిజనస్తుతుఁడైన సత్కళా
శీలుఁడు రాజపూజితుఁడు శివ్వనపుత్త్రుఁడు మల్లఁడున్నతిన్.

ఉ. శ్రీనిలయుండు శివ్వనయుఁ జిమ్మనయున్ గుణసూర్యదేవుఁడున్
ధీనిధిప్రోల నార్యుఁడును దేజమునన్ రవితుల్యులైన యీ
సూనులనల్వురంబడసి సూరిజనస్తుత సత్యభారతీ
జ్ఞానులఁ బద్మగర్భువదనంబులు నాలుగుఁబోల వారిలోన్.

క. గోత్రపవిత్రుఁడు సద్గుణ
పాత్రుండగు శివ్వనకును జతిహితశుభ చా
రిత్రారుంధతి గౌరమ
ధాత్రీ సతికిద్దఱకును దనయుఁడ జగతిన్.

Fol. 23*a* contains the **Colophon**:

ఇది శ్రీవీరాచార్యకృతి పావులూరి మల్లనామాత్య విరచితంబైన సారసంగ్రహగణిత శాస్త్రంబునందు ద్వితీయభాగహారం సంపూర్ణము.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁతయంత మంచిదిగాదు. శైథిల్యము గ్రంథపాతములు లేవు. పత్రములు తాఱుమాఱుగానున్నవి.

ఇది గణితశాస్త్రగ్రంథము. సంస్కృతమున, మహావీరాచార్యుఁడు రచియించిన సారసంగ్రహగణితమున కిది తెలుఁగు. దీనికర్త పావులూరి మల్లనకవి. గార్గ్యగోత్రుఁడు. ఆపస్తంబ సూత్రుఁడు. గౌరమకును శివ్వనకును గొడుకు. కమ్మనాటిలోనిదగు పావులూరికి విభుఁడు. ఈతని తాత పేరుగూడ మల్లనయే. అతఁడు ఆంధ్రరాజగు రాజరాజ భూపాలకుచేతఁ బీఠపుర (పిఠాపురం) పార్శ్వమున నవఖండ

వాడయను గ్రామమును ఖడసినాఁడు. మీఁదఁ జెప్పఁబడిన రాజరాజ భూపాలుఁడు రాజమహేంద్రపురము రాజధానిగాఁ దెలుఁగుదేశ మేలిన చాళుక్యరాజగు రాజరాజు కాఁదగును.

---

## R. No. 506.

Paper. 13⅝ × 8½ inches. Foll. 543. Lines, 29 on a page. Mode of writing, good and fairly correct. In good condition.

Purchased in the year 1917-18 from M.R.Ry. Niḍadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

### విచిత్రరామాయణము (పద్యకావ్యము).

### VICITRARĀMĀYAṆAMU (POETRY).

This is a poetical version of the Vacanavicitrarāmāyaṇa of Gōpīnātha which work is a Telugu prose rendering of Siddhēśvaradāsa's Rāmāyana in the Oriya language The author of the poetical work is Kommāji Sōmanāthaśilpācārya, son of Vīrēśvaraśilpācārya of Kāśyapasagōtra and disciple of Lakṣmaṇārya. He was under the patronage of Dhanañjaya Dhāṭrāja, chief of Pārvatīpura and was presented with a palanquin by Vikramadēva Gajapati, king of Nandāpura (Jeypore).

Complete in 3 Khaṇḍas.

**Beginning:**

శా. శ్రీకైవల్యపదార్థ సిద్ధికొఱకై సేవింతు సన్నుక్తిశోఁ
ఖాకారి ప్రముఖాఖిలామరశిరోభాగాగ్రకోటీర ర
త్నాకోభ్రాజితరుద్ధ గద్దగిత దీప్తోత్కృప్త సత్పాదనా
ళీకద్వంద్వను గల్గుభక్తజనపాళీ శూలిన శ్రాంతముఁ.

* * * *

గీ. తెనుఁగు కవులగునన్నయ తిక్కయజ్వ
పోతనామాత్యముఖ్యుల పుణ్యయశుల
నామనంబునఁగీర్తింతు నయవినయవి
హీనులయినకుకవులఁద్రుణీకరింతు.

క. కారణగురు ఘనచరణాం
భోరుహయుగళంబు హృదయపుటమునవిడిగొం
పారఁగమదక్షరాభ్యా
సారంభాచార్యు లక్ష్మణార్యుఁదలఁతున్.

* * * *

వ. అట్టి శిల్పిప్రజాపతి వంశంబునందుఁ గాశ్యపసగోత్రంబును, నాపస్తంబసూత్రంబును, నథర్వణశాఖయుఁ, దత్పురుషప్రవరయుంగలిగి.

* * * *

గీ. అట్టిగుర్వాంబ వీరనాఖ్యావహులకు
ప్రథమముననొకరా పుత్త్రిఁదుద్భవమునొంది
బాల్యమున మృతుఁడైన పిమ్మటననేక
దినములనపత్యచింత చేదిగులునొంది

* * * *

వ. . . . . . . . . . . . . . . అంత నాసోమేశ్వరవరప్రసాదంబువలన నాదంపతులకేను తనయుండనై రామయ గురునాథాహ్వయుల కగ్రజుండనై జననంబునొంది సోమనాథ నామధేయంబునం దనరి గురువిబుధజన శిక్షితాభ్యాస శిల్ప కవిత్వ ప్రముఖ నిఖిల విద్యావిశారదుండనై గణాధిపప్రసాదాతిశయభాసురుండనై యొకనాఁడు మదీయాంతరంగంబున.

సీ. పృథులసాలగ్రామ పీఠశోభితమైన
చారునందాపురా స్థానమందు
శ్రీశంకరాన్వయ క్షీరవారిధి శశి
ఝూడ్బండ పాదుషా సకలరాజ
మకుట మాణిక్యరుఙ్మండిత చరణుఁడౌ
శ్రీవిక్రమాహ్వయదేవ గజప
తీంద్రుచే మెప్పువహించి మేల్ శాయిమా
న్యాలకీ మొదలగు బహుమతీలు
గాంచితినిసప్త శతిజపియించితఖిల
దైవతోపాస్తి సలిపితి దానధర్మ
వ్రతతపోధ్యయనముల వరత మొనర్చి
తఖిలవిద్యలెఱింగితినైనమఱియు.

* * * *

సీ. తొలిమహాయుగమునందున బ్రహ్మసంభవుం
డైన వాల్మీకిసంయమివరుండు
శతకోటిసద్గ్రంథ సంహితగా రామ
చరితంబొనర్చెఁ దచ్చరితము బహు

చరితంబులయ్యె నందిరవా విచిత్ర రా
మాయణమవని కన్యాత్మజులకుఁ
జదివించె నస్మావచరితముత్తరభూని
వాసి సిద్ధేశ్వరదాసుఁడనెడు
విప్రవరుఁడోఫ) భాషఁగావించెనదియుఁ
జిత్రగుప్తకులోద్భవ శ్రేష్ఠుఁడైన
గోపినాథుండు వచనంబు గూర్చెదాని
గద్యపద్యాత్మకముఁ జేయఁగడఁగినాఁడ.

* * * *

సీ. శ్రీరామభద్రుచరిత్రమా నీమహా
కావ్యఁబు నిర్మింపఁగాఁగడంగె
వింధ్యాచలప్రాంత విపినభూప్రాగ్భాగ
లాంగలీనామ తరంగణికిని
బశ్చిమదిశయందుఁ బద్మమందిరకుని
వాసమైబుధజనోల్లాస మగుచు
సకలవిశిష్టవంశజులచే విలసిల్లి
వివిధయశస్స్ఫూర్తి వినుతికెక్కు
శ్రీధనంజయధాత్రీరాజ శేఖరుండు
రమణభావింపనుచితవర్త నలసద్వి
భూతిఁజెలువొందు పార్వతీపురవరాగ్ర
నలినవనహేళి శ్రీసోమనాథసుకవి.

శా. రాజీవాసనముఖ్యదివ్యులకుఁ జేరన్ రానికైవల్య వి
భ్రాజత్సౌఖ్యముఁగోరి శంభుఁగృతికర్తంగా రచించెన్ వచ
శ్శ్రీఁజెల్వారఁగజానకీరమణుచారిత్రంబు సద్భక్తిఁగో
మ్మాజీవంశపయోధి సోముఁడగు సోమాభిఖ్యుఁడు రీవ్వస్థలిన్.

* * * *

ఉ. పాండునృపాలనందనులు పారదహీరపటీరచంద్రికా
పాండురపద్మచందన విభాసితకీర్తివిహారులున్నతా
ఖండలవైభవోజ్జ్వలు లఖండితశౌర్యయుతుల్సమస్త భూ
మండలనాథసేవితులమానుషసత్యగుణాఢ్యులెంతయున్,

**End :**

21.

క. వర్గచతుష్టయలసదప
వర్గఫలప్రదసుభక్త వర్గావనప
డ్వర్గవిదూరదురంహో
వర్గధ్వంసన విదర్పవర్తనమూర్తీ.

**Colophon:**

ఇది శ్రీమదుమామహేశ్వరదివ్యచరణారవిందధ్యానానందకందళిత స్వాంతనిశాంత కాశ్యపసగోత్రపవిత్ర వీరేశ్వరశిల్పాచార్యపుత్ర నిఖిల శిల్పవిద్యావిజ్ఞానకళాధౌరంధర్య సోమనాథశిల్పాచార్య ప్రణీతంబైన శ్రీమద్విచిత్రరామాయణంబను మహాకావ్యంబునందుత్తరఖండంబునందుఁ దృతీయాశ్వాసము సంపూర్ణము.

(వి-వి.)—

సమగ్రము. పూర్వ, ద్వితీయోత్తరఖండములని మూఁడుఖండములును వరుసగ నొక్కొకఖండమునను 8, 13, 3 ఆశ్వాసములును గలవు. వ్రాఁత తిన్ననిది. తప్పులంతగా లేవు. శైథిల్య గ్రంథపాతములు లేవు.

ఇందు రామాయణకథ చిత్రకథలతో వర్ణింపఁబడినది. ఓఢ్రదేశవాసియైన సిద్ధేశ్వరదాసునతఁడు దీనిని తొలుత నోఢ్రభాషను రచించెను. దానిని గొని శిష్టుకరణమగు గోపీనాథుఁడు వచనరూపమునఁ దెలిఁగించెను. ఈ ప్రకృతగ్రంథమద్దానికిఁబద్యాత్మకము. దీనిరచయిత కొమ్మాజీ సోమనాథ శిల్పాచార్యుఁడు. వీరేశ్వరశిల్పాచార్యుని పుత్త్రుఁడు. కాశ్యపసగోత్రుఁడు. లాంగలీనది సమీపమునను౦డు పార్వతీపురాధిపతియగు ధనంజయధాత్రీరాజు ప్రాపువడసినవాఁడు. నందాపుర (జయపుర) రాజ్యాధీశుఁడగు విక్రమదేవ గజపతివలనఁ బాలకిమున్నగువానిని బహుమతిగాఁబడసినవాఁడు. ఈతనిగురువు లక్ష్మణార్యుఁడు.

---

R. No. **507**.

Palm-leaf. 17½ × 1¼ inches. Foll. 140. Lines, 6 on a page. Mode of writing, fair but incorrect. Slightly injured.

**Purchased in the year 1917–18 from M.R.Ry. Niḍadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam,**

వరాహపురాణము.

VARĀHAPURĀṆAMU.

This is the same work as the one described under R. No. 411 ante. By Haribhaṭṭa. A stanza in the Sīsa metre showing the date and the name of the scribe is given below.

Complete.

(బి-బి).—

సమగ్రము. వ్రాఁతయంత మంచిదికాదు. తప్పులు లేకపో లేదు. శైథిల్యము కలదు. గ్రంథపాతములు లేవు.

గ్రంథాంతమున—

" సీ. శాలివాహనశక సంవత్సరంబులు
చంద్రర్తుగిరిచంద్ర (1761) సంఖ్యదనర
వలనొప్పఁగ వికారి వత్సరశ్రావణ
శుద్ధతృతీయను సోమవాస
రమునవరాహపురాణంబు ప్రతినున్న
క్రమముగబుధజన ప్రతతియలర
బుగ్గతవంశోద్భవుఁ డగు నరసప్పకు
తనయుఁడౌసింహాద్రి వినయమునను
సాంతముగవ్రాసెనీకృతి చదువువారి
కఖిలసంపచ్చిరాయువులవనియందుఁ
గలుగుపరలోకసౌఖ్యము ల్వెలయుచుండు
నిందిరేశునిసత్కృపా దృష్టివలన." అని యున్నది.

---

## R. No. 508.

Paper. 8 × 6¼ inches. Foll. 87. Lines, 24 on a page. Mode of writing not good and not correct. In good condition.

Purchased in the year 1917–18 from M.R.Ry. Niḍadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

గణచతుర్థ్యుపాఖ్యానము.

GAṆACATURTHYUPĀKHYĀNAMU

Foll. 1a—8b. Foll. 9a—87b are left blank.

Similar in subject matter to the Gaṇanāthābhyudaya described under R. No. 35 2(a) *ante*.

The author is Nāgavarapu Rāmacandrakavi, son of Nṛsiṁhārya and grandson of Candra of Ātrēyagōtra.

Complete.

**Beginning:**

క. కరములు మోడ్చి నుతించెద
నిరతము ధరణీశమౌళి నిస్తులమణిరు
గ్వరశోభిత సత్పదమం
కరుణాళుండగు వేంకటేశు ఘనగురువర్యున్.

* * * *

చ. భువనహితంబుగాఁగ శివపుత్త్రుని సచ్చరితంబు వేడ్కనా
గవరపురామచంద్రకవి గారవమొప్ప రచించెగాన స
త్కవివరులార మీరలది తప్పులు గల్గిన దిద్దిచక్కఁగా
సవరణ చేయఁగోరెద రసజ్ఞులు మెచ్చ సభాంతరంబునన్.

* * * *

క. చందురుఁ జూచిన నిందం
జెందంగత మేమి యేమిచేసెను శశియున్
ముందెవరివలన శాపము
జెందెనొ తద్వృత్తమంత చెప్పుమనుటయున్.

**End:**

మ. ఘనుఁడాకంసవిభంజనుండు కమలాకాంతామనోహరుఁడీ
ఘనరత్నంబును దెచ్చియిచ్చు కథనాకర్ణించినం జెప్పినన్
వనజారాతిని జూచుదోషమున నిందంబొందరెన్నండుపా
వనులై చెందెదురెల్లభోగములు న్వైకుంఠధామంబునన్.

**Colophon:**

ఇది శ్రీరామచంద్రకరుణాకటాక్షలబ్ధకవిత్వవైభవ సుకవిజనమిత్ర యాత్రేయగోత్రపవిత్ర చంద్రాహ్వయపౌత్ర నృసింహాభిశ్వంభరామ రార్యపుత్త్రాచలధైర్య నాగవరపుసద్వంశవారాశిచంద్ర రామచంద్రవిరచితంబైన గణచతుర్థ్యుపాఖ్యానంబను గ్రంథంబు సర్వంబు నేకాశ్వాసము.

(వి-వి)—

సమగ్రము. వ్రాఁత మంచిదికాదు. తప్పు లున్నవి. శైథిల్య గ్రంథపాతములు లేవు.

ఇందు గణనాధుని జననాదికము, శ్యమంతకోపాఖ్యానము వర్ణింపఁ బడినది. కర్త నాగవరపు రామచంద్రకవి. నృసింహాచార్యుని పుత్త్రుఁడు.

---

## R. No. 509.

Paper. 11 × 9¾ inches. Foll. 40. Lines, 20 on a page. Mode of writing, fair but incorrect. In good condition.

Transcribed in the year 1917-18 from a MS. of M.R.Ry. Boḍḍapāti Vēnkaṭēśvara Rao Gāru of Ramaṇapūdi, Gudivada taluk, Kistna district.

(*a*) प्रणवसारम्—सान्ध्रतात्पर्यम्.

PRANAVASĀRAM WITH TELUGU MEANING.

Foll. 1*a*—24*a* Fol. 24*b* is left blank.

See the Sanskrit part of the Catalogue.

---

(*b*) షట్స్థలదర్పణము.

ṢAṬSTHALADARPAṆAMU.

Foll. 25*a*—30*b*.

A treatise in Vīra Śaiva religion by Siddhanātha. It is written in the form of Tārāvali which consists of 27 stanzas.

Complete in 29 Sīsa padyas.

**Beginning:**

సీ. శ్రీరాజయోగప్రసిద్ధికేమూర్తివి
స్ఫూర్తియంగ్లిక్యసుఖకరంబు
నయనాగ్రచంద్రమండలవీథికేమూర్తి
పరమాణుసదృశరూపప్రదంబు
స్ఫటికభాండస్థదీపముగీతి స్ఫూర్తి
దేహాయంబేమూర్తి తేజరిల్లు
జలకుంభసముదాయజలజమిత్రునిమాడ్కి
పెక్కువైయేమూర్తి పికరిల్లు
నట్టిశివలింగమూర్తి నశ్రాంతసరణి
ధరణిఁబ్రార్థించి షట్స్థలదర్పణంబు
లీలనొకసీస తారావళియు రచింతు
భక్తహృత్పద్మభృంగశ్రీ (గురు) బ్రహ్మలింగ!

**End**

సీ. ప్రణుతవేదాంతసారములైన శ్రీవీర
శైవశాస్త్రార్థముల్ సంగ్రహించి
సిద్ధనాథసమాఖ్యఁ జెంది నేనిరతంబు
షట్థ్సలదర్పణం బనఁగఁగవిత
నూతనమ్మృదువచోగతినవవింశతి
సీసపద్యములుల్లసిల్లఁ జేసి
యాద్యంతములకుఁ బద్యద్వయంబు లొనర్చి
క్రమ్మఱ నాద్యంతగణుతిఁగూర్చి
సీసతారావళిని రచించితి ధరిత్రి
గుఱుతు మీఱంగ దీనితకుర్ వలుదీర్చి
ధీరులీస్వానుభావంబుఁ దెలియవలయు
భక్తహృత్పద్మభృంగ శ్రీబ్రహ్మలింగ !

(వి-వి.)—

సమగ్రము. ఇర్వది తొమ్మిది సీసపద్యములు. వ్రాఁత మంచిది కాదు. తప్పులు మెండు. శైథిల్యగ్రంథపాతములు లేవు.

ఇది యొక తారావళి. ఇందు శైవవేదాంతము ప్రతిపాదింపఁబడి నది. గ్రంథకర్త సిద్ధనాథుఁడు.

---

(*c*) అష్టావక్రగీతలు.

ASṬĀVAKRAGĪTALU.

Foll. 31*a*—36*b*.

This is based apparently on the Sanskrit Aṣṭāvakragītā and treats of the means of emancipation of the soul according to the Advaita Vēdānta.

**Beginning ;**

క. విపరీతజ్ఞానంబున
జపలతసుఖుగూడిబుధుఁడు సత్వరజితుఁడై (?)
యెపుడును గామమె కోరుచు(ను) (?)
నిపుణుండది తృణముగాఁగ నెమ్మదిఁదలఁచున్.

**End:**

గీ. ఎఱుక లేమిఁగాదె యీరీతినూరక
కర్మనిష్ఠసల్పఁగడఁగు టెల్ల
దానిగోడవదేల తత్త్వవేద్య నెఱింగి
యొకట సౌఖ్యవృత్తి నున్నవాఁడ.

(వి-వి).—

౫౮ గీతములు కందములు. వ్రాఁత మంచిది కాదు. తప్పులు మెండు. శైథిల్యగ్రంథపాతములు కలవు.

ఇందద్వైతవేదాంతము ప్రతిపాదింపఁబడినది. కర్త యెవ్వరో తెలియరాదు.

---

(*d*) అండపిండబ్రహ్మాండవివరము.

ANḌAPIṆḌABRAHMĀṆḌAVIVARAMU.

Foll 37*a*—40. Fol. 40*b* is left blank.

Explains the nature of the universe and the things therein from the Vedantic standpoint.

**Beginning:**

బాహ్యానకు అండాండమనఁగా భూచక్రము, పిండాండమనఁగా స్థావరములు, పర్వతములు, తరువులు మొదలగు చరాచరములెల్లను. బ్రహ్మాండమనఁగా ఆకాశము. అంతరానకు, అండాండమనఁగా గుడ్డు. పిండాండమనఁగా బిందువ. అనేదే పాప. బ్రహ్మాండమనఁగా మహాపాప మధ్యమున వెలింగెడు కళ.

**End:**

ఈ క్రమమున బ్రహ్మమందు మనము లీనముచేసిన దన్మయమును బొంది మనస్సు అనేది నిర్విషయమైయుండునుగాన నప్పుడష్షమహాత్ముల బ్రహ్మైవాహామనియు అనెడి న్యాయముచే బ్రహ్మమును దానని తెలియవలయును. ఈ ప్రకారం అనుభవముచే వాక్యార్థాలకు భావము చేసుకొని యనుభవము కావలెను.

(వి-వి.)—

వ్రాఁత మంచిదికాదు. తప్పులున్నవి. శైథిల్యము లేదు.

ఇందును వేదాంత విషయమే చెప్పఁబడినది. కర్త యెవ్వరో తెలియరాదు.

## R. No. 510.

Paper. 11 × 10⅝ inches. Foll. 27. Lines, 20 on a page. Mode of writing good but incorrect. In good condition.

Transcribed in the year 1917–18 from a MS. of M.R.Ry. Boḍḍapāṭi Vēṅkaṭēśvara Rao Gāru of Ramaṇapūḍi, Gudivāda taluk, Kistna district.

కపిలగోసంవాదము.

KAPILAGŌSAṀVĀDAMU.

This is the same work as the one described under R. No. 309 *ante* By Koṇḍubhaṭṭa

Contains apparently the fourth Āśvāsa incomplete.

(వి-వి.)—

నాల్గవయాశ్వాసమునందలి కొంతభాగము కావచ్చును. వ్రాంత మంచిది. తప్పులున్నవి. శైథిల్యగ్రంథపాతములు లేవు.

ఇది త్రై.క్యా. ఆర్. నె 309 లున వర్ణింపఁబడిన గ్రంథమే.

---

## R. No. 511.

Paper. 8½ × 5¾ inches. Foll. 44. Lines, 22 on a page. Mode of writing not good and not correct. In fair condition.

Purchased in the year 1917–18 from M.R Ry. Niḍadavōlu Sundaram Pantulu Gāru of Vizagapatam.

(*a*) పురుషోత్తమశతకము.

PURUṢOTTAMAŚATAKAMU.

Foll. 1*a*—8*b*. Fol. 8*b* is left blank.

A centum of stanzas in praise of Puruṣōttama. By Puṇḍarikākṣa. Complete.

**Beginning**:

ఉ. ధాతను సృష్టికిఁ స్థితికి దైత్యవిభేదిని సంహారక్రియఁ
భూతపతిఁ సృజించి పలుపోకలఁబోయెడి నీదుమాయ నా
థా ! తవపాదభక్తులను దప్పక ప్రోచును గానిదుష్టమా
నీతలు చేయదెప్పుడును శ్రీపురుషోత్తమ దేశికోత్తమా.

* * * *

**End**:

ఉ. మోక్షఫలప్రదాతవని మ్రొక్కులు వేయును మ్రొక్కి యాకృతిన్
మోక్షముకోరి నీకొసఁగి పుణ్యుఁడనైతిని నేను బుండరీ
కాక్షుఁడ నేటిదాసుఁడను ఘన్నగునర్యయమంత్రిపుత్త్రుఁడన్
శిక్షకుఁడన్ భవత్కృపను శ్రీపురుషోత్తమదేశికోత్తమా.

ఉ. శ్రీకర బ్రహ్మవిష్ణుశశిశేఖరముక్తిప్రదాకరాకరా
నాకనివాసశత్రుగణ నాశక రాఘనచంద్రశేఖరా
ప్రాకటపాదభక్తి భవబంధవిమోచక రాగణాకరా
శ్రీకనకాద్రిధీరస్థిర శ్రీపురుషోత్తమ దేశికోత్తమా.

(వి-వి.)—

సమగ్రము. జిల్లుబ్రాఁత. తప్పులున్నవి. శైథిల్యము కలదు. గ్రంథపాతము లేదు.

శివస్తుత్యాత్మకమగు నీ వృత్తపద్యశతకమును బుండరీకాక్షుఁడను నాతఁడు రచియించెను.

---

(*b*) పావులూరిగణితము.

**PĀVULŪRIGAṆITAMU.**

Foll. 9*a*—35*b*.

The leaves are of different size.

This is the same work as the one described under R. No. 505. By Pāvulūri Mallanna.

Contains the 3rd, 4th, 6th, 7th and 9th Vyavahāras. Foll 35*b*—44*b* contain mathematical problems composed apparently by a different author.

(వి-వి.)—

అసమగ్రము. తృతీయప్రకీర్ణకము, చతుర్థత్రైరాశికము, షష్ఠక్షేత్రగణితము, సప్తమఖాతగణితము, నవమసువర్ణగణితము—ఇవి మాత్రము గలవు. తృతీయప్రకీర్ణకగణితము మొదలు నవమ సువర్ణగణితమునకుఁ బైఁబడి కొంతగ్రంథము గలదు. వ్రాఁత మంచిదే. తప్పులున్నవి. శైథిల్యపాతములు కలవు.

ఇది త్రై. క్యా. ఆర్. నె. 505 రున వర్ణింపఁబడినది. ఇందుఁ గడపటఁ గొన్ని గణితవిషయములను దెలుపు పద్యములు. "సీ. శ్రీధాన్యపురనాథ ! శృంగారసాగర ! విన్నపంబవధారు విభవచంద్ర !" ఇత్యాది సంబోధనలుగల యవి యుండుటచే నిందు భిన్నరచనముగూడ కొంత చేరినట్లు తోఁచుచున్నది.

---

R. No. **512**.

Palm-leaf. 16×1⅝ inches. Foll. 265. Lines, 6 on a page. Mode of writing, fair but contains mistakes. In good condition.

Presented in 1917-18 by M.R.Ry. Nellūri Subrahmaṇya Śāstri Gāru, Aṇḍraṇgi, Kistna district.

(*a*) मूलस्तम्भपुराणम्—आन्ध्रटीकासहितम्.

MŪLASTAṀBHAPURĀṆAM with Telugu meaning.

Foll. 1*a*—103*a*. Fol. 103*b* is left blank.

See the Sanskrit part of the catalogue.

(*b*) విశ్వకర్మపురాణము (వచనము).

VIŚVAKARMAPURĀṆAMU. (Prose).

Foll. 104*a*—265*a*. Fol. 265*b* is left blank.

A treatise written in colloquial prose and dealing with the origin and account of Viśvakarma as found in the Nāgara khaṇḍa (R No. 294) of the Skānda Purāṇa. The name of the author is not known.

Complete.

**Beginning:**

శ్రీ మహాదేవుండగు మహాదేవుని హృదయంబున జగన్మాతగు పార్వతీసాష్టాంగదండప్రణామంబు గావించి లేచి కరంబులు మొగిడ్చి వికసితవదనారవిందయై కాలంబులకు కారణకర్తలైన మూర్తిత్రయంబును, తదీయాంతర్గతంబైన యీ విశ్వప్రపంచంబును బ్రళయకాలంబును నేవిధంబునం గలిగియుండె నమృతం బెట్లు పుట్టె నంతయుం దెలియ నానతీయవలయునని విన్నవించిన నద్దేవుండు.

**End:**

యీ మహావచనకావ్యంబు లోకశ్లాఘ్యంబై . . . .
పంచముఖ జనితులైన పంచాననద్విజుల కులాచారవిస్తారవర్ణిత శైవాచార

సంపన్నత్వంబును గలిగి, విశ్వప్రపంచకర్తృత్వంబుగలిగిరి. యిది వేద శ్రుతివాక్యంబులు తథ్యంబని మార్కండేయమునివరుల కానతిచ్చిన కథాక్రమంసంపూర్ణము.

(వి-వి.)—

సంపూర్ణము. వ్రాంత యొకతరబడిగానున్నది. తప్పులున్నవి. గ్రంథపాతశైథిల్యములు లేవు.

ఇందు విశ్వకర్మ జననాదిచారిత్రమిట్లు వచనరూపమున వర్ణింపఁబడినది. (ఆర్. నె 294 రు చూ.) కర్తఎవ్వరో ? వ్యావహారికభాష.

---

## R. No. 513

Paper. 10¾ × 9¾ inches. Foll. 157. Lines, 20 on a page. Mode of writing, good and fairly correct. In good condition.

Transcribed in the year 1918–19 from a Ms. of M.R.Ry. Gurujāda Vēṅkaṭarāmadās Pantulu Gāru of Vizianagaram, Vizagapatam district.

(c) సీమంతినీ పరిణయము.

SĪMANTINĪPARIṆAYAMU.

This Prabandha is composed with a view to point out of the efficacy of observing certain vows on Mondays in a specified month and is based on the story found in the Brahmōttarakhaṇḍa of the Skānda Purāṇa. The author is Penumalla Sōmanāmātya, son of Nīlayamantrin of Bhāradvājagōtra and disciple of Ellanārādhya. He was a minister of the prince Pūsapāṭi Tammabhūpāla. He states that he was induced to write this work by the eulogy of some of his learned friends who described his genealogy, and stated that he was a descendent of Pillalamarri Pinavīrabhadra, author of the Jaiminībhārata, etc. It is further stated that the Pillalamarri family lived at Penumerlla and was therefore called after the latter name.

Complete in 5 Āśvāsas excepting a few stanzas in the prefatory portion.

**Beginning:**

. . . . . . . . . . . ను
త్తమవతుంబు గృహ్యంబు చేసిన జగత్కల్యాణపుంధాత్రిని
త్యమహేంద్రాది సుపర్వ సర్వ శుభదోదంచత్కృపాలోక
యాగమవాక్యస్తుత లక్ష్మితోడగును మత్కావ్యక్రియాసిద్ధికిన్.
* * *

సీ. కౌండిన్యగోత్రజా ఘనుఁడైన కేదార
 గురు పౌత్త్రు నయగారికుల పవిత్రు
పార్వతీహృదయేశ పదపద్మపూజనా
 పరుఁడైన విశ్వేశగురుని పుత్త్రుఁ
బరమ పాతివ్రత్యభవ్యసద్గుణ కదం
 బకు నారమాంబకుఁ బ్రాణనాథుఁ
వినయభూషణుఁడైన వీరభద్రగురుండు
 శాశ్వతకీర్తి విశ్వేశ్వరుండు
ననఘు కేదారగురుఁడు లింగనయు ననఁగ
వెలయు పుత్త్రులు సేవింప నలరుచున్న
శైవశాస్త్రరహస్య విజ్ఞానచతురుఁ
బ్రస్తుతించెద నెల్లనారాధ్యవరుని.

* * * *

ఉ. నన్నయభట్టుఁ గావ్యరచనాచణుఁ దిక్కన సోమయాజి వి
ద్వన్నుతు నెఱ్ఱాప్రెగ్గడను ధన్యుని నాచనసోముఁ గీర్తి సం
పన్ను హుళిక్కి భాస్కరుని బమ్మెర పోతకవీంద్రశేఖరుల్
సన్నుతిసేతు వారికగుణామహిమంబు లభించు కోరికన్.

* * * *

సీ. వినుత భరద్వాజమునిరాజగోత్రశే
 ఖరుఁడు పిల్లలమఱ్ఱి గాదిరాజు
పినవీరు నన్వయంబున జనించిన గుణో
 న్నతుఁడు నీలయమంత్రి నందనుఁ డనఁ
జిరపుణ్యసాధన శ్రీశైలమందిర
 భ్రమరాంబికావధూప్రాణనాథు
మల్లేశ్వరస్వామి మహనీయ కరుణావ
 లోకంబు గాంచిన లోకనుతుఁడు.
సకల సుకవిజనానందజనకమధుర
నవ్యతర కావ్యకల్పనా నల్పయోగ
సర్వసర్వంసహాధిపాస్థానచిరయ
శోఘనుఁడ సోమమంత్రీంద్ర సుకవి నేను.

* * * *

సీ. గీ. మోహానుండు భారద్వాజమునివరుండు.

* * * *

సీ. కవివర్ణనీయుఁ డాగాదిరాజు వివేక
ఘనుఁడు పిల్లలమఱ్ఱియను పురమున
నధివసించుటఁ జేసి యాపేర విఖ్యాత
మై ప్రకాశించె నయ్యన్వయంబు
మహనీయకీర్తి నమ్మంత్రిశేఖరుఁ డంతఁ
దన ధర్మసతియందుఁ దగినయట్టి
సంతతి లేదన్న చింతాభరముఁబూని
యతి ధైర్యసంపన్నుఁడౌటకతన
శివునిఁగూర్చి తపంబు నేఁజేసి పుత్త్ర
రత్నములఁ గాంతునన్నట్టి యత్నమూగని
యాత్మగృహమున నన్నదానాది కార్య
భరము సోదరవర్గముపాలనుంచి.

*  *  *  *

సీ. గీ. ఇక్కడికి దక్షిణంబున నొక్కశైల
గుహ దనరు నందులోపల మహితమూర్తిఁ
దేజరిల్లెడు భారతీతీర్థులన్న
యతివరుం డాశ్రితవ్రాతహితకరుండు॥

సీ. ఆ యతీంద్రునకు సహస్ర వర్షములపై
నెనమ నూఱబ్దంబు లిచటఁ జనియె
మతిమంతులయినట్టి మనుజోత్తములకైన
నొనరింపఁడతఁడు మంత్రోపదేశ
మతనిసన్నిధికి నీవరిగి సాష్టాంగప్ర
ణామంబుచేసి నానావిధములఁ
బ్రార్థించి యమ్మహాబాహు చిత్తమునందుఁ
గరుణపుట్టించి యేకరణినైన
మంత్రముపదేశమైవచ్చి మాగృహమున
భద్రకాళీయుతంబుగాఁ బ్రమద మొప్పు
నున్న నన్ను విలోకించి యుచితరీతి
నియమయుక్తిఁ బ్రవృత్తిచే నిలిచితేని.

*  *  *  *

క. ఆ గాదిరాజు వనిత మ
హాగుణవతి పరమసాధ్వి యన విశ్రుతయౌ

నాగాంబరూపలీలా
భోగాఢ్యులఁ గవలవారిఁ బుత్త్రిలఁ గాంచెన్.

క. ఘనుఁ డందులోన రెండవ
తనయుఁడు వీరేశ్వరుండు తాన యగుటచే
జనియించు సమయముననే
జనులెల్ల నుతింప నొకరిజడ ధరియించెన్.

సీ. అతిలాలితాకారు లాకుమారులు పెద
వీరభద్రుఁడు పినవీరభద్రుఁ
డన్న నామములచే నధికప్రసిద్ధులై
యభివృద్ధిఁ గాంచి రనంతరమునఁ
బెదవీరభద్రుఁడు పృథివీశనుతకార్య
దక్షుఁడై కర్ణాటధరణి కరిగి
వాసిగా రాయసింహాసనమ్మున నుండి
యధికులౌ రాయదాయాదులకును
మఱియు డెబ్బదివేల సామంతులకును
బానెయధికారియై మహాస్థానములందు
సకల మంత్రి వరేణ్యులు సన్నుతింప
భూనుతంబైన కీర్తి విస్ఫూర్తిఁ గనియె.

సీ. మహనీయ పిల్లలమఱ్ఱివంశభవుండు
గాదిరాజసుతుండు ఘన యశుండు
వీరేశ్వరుని యవతారమే యితఁడంచు
జను లెన్నఁదగిన సౌజన్యశాలి
పినవీరభద్రుండు పిన్నప్రాయము నందు
నఖిలశాస్త్రంబులు నభ్యసించెఁ
గాళిదాసాది సత్కవులకు హెచ్చుగా
బహుకావ్యవిరచన ప్రౌఢిఁ గాంచె
వాణి యిల్లాలుగాఁ గవిశ్రేణి కెల్లఁ
బ్రభుతరాశ్చర్యకరమైన బిరుదుపూనెఁ
దుహిన గిరిరాజ రామసేతువులనడుమ
నితని కెనయైన కవివరుం డెందుఁ గలఁడు.

సీ. అవతారదర్పణం బన్న కావ్యముఁ జేసె
నారూఢి నారదీయంబు పలికె

మహనీయమగు మాఘమాహాత్మ్యము రచించె
శాకుంతలము చెప్పె సరసఫణితి
నొక్కరాతిరియందు నొనరించె మధురవా
క్ప్రౌఢిచే జైమినిభారతంబు
లలితమహా మానసోల్లాస సారంబన్న
కబ్బంబు భాషించె నబ్బురముగ
మఱియు బహురూపకావ్య నిర్మాణనిపుణుఁ
డగుచు నుతిగాంచె సకలదిగంతరములఁ
గు కవిజనగర్వ తిమిర సంకోచకృత్ప్ర
భాతరవియైన పినవీరభద్రసుకవి.

గీ. భాగ్యనిధియైన పినవీరభద్ర సుకవి
కాత్మజులు సంభవించి రుదారమతులు
ఘనుఁడు వీరన్నయును జగద్గణ్యపుణ్య
ధనుడుఁ మల్లేశ్వరుండన్న ధర్మపరులు.

* * * *

సీ. మహనీయ తేజుఁ డామల్లేశ్వరుం డంతఁ
దన కార్యదక్షతాఘనతఁ జూచి
మెచ్చి యాకటకేంద్రుఁ డిచ్చిన పెనుమళ్ల
యన్న గ్రామమునందు నధివసించె
నాఁటనుండి తదీయ నామంబుచేత న
య్యన్వయంబు ప్రకాశమందుచుండె
నట్టి మల్లేశ్వరుం డనవద్యసుగుణాసం
పన్నుఁడైనట్టి వీరన్నమంత్రి
రూపమదనుండు సోమేశ్వరుండు నన్న
సుతులనిద్దఱ భువనవిశ్రుతులఁగాంచె
వారలిరువురు సౌభ్రాత్రవర్తనమున
నుత్తమచరిత్రమునఁ గీర్తినొందిరందు.

సీ. అగ్రజుండైన వీరన్నవంశమున సం
భవమందె సర్వనామాత్యమౌళి
యమ్మంత్రివరుఁడు పెద్దాంబాఖ్యయౌ ధర్మ
సతియందు నల్గురు సుతులఁగాంచెఁ

పెదబసవయ్యయుఁ జినబసవయ్యయు
నమ్మన తిమ్మన యన్నవారి
నా నలుగురిలోన నతిగుణాఢ్యుఁడు సోమ
నామాత్యమౌళి భావమ్మకాంత
యందు ఘనుఁడైన నర్సనామాఖ్యుఁగాంచె
నతఁడు మతిశాలియనెడు(దైన) వెంకాంబయనెడు
వెలఁదినుద్వాహమై యభివృద్ధిఁగాంచు

*  *  *  *

సీ. జయవాటికాపురాశ్రయమైన దుర్గాంబ
కృపఁగాంచెనే నృపాగ్రేసరుండు
మాధవవర్మతుమాధవో తమవంశ
భూషణుండయ్యెనే భూభుజుండు
కరినారిహృదయభీకర మన్నెసులాను
బిరుదంబు పూనె నే నరవరుండు
సకలయాచకుల యాశాపూర్తినొనరించు
నతిదానశూరుఁడే యవనినేత
భువనవర్ణితుఁడైన యాపూసపాటి
తమ్మభూపాలకుని సమ్ముఖమ్మునందు
మంత్రివై తద్దయాసుధామయకటాక్ష
మహిమఁ గాంచితివయ్య సోమప్రధాన.

*  *  *  *

క. అనుచు సభాసదులందఱు
వినయంబునఁ బలుకునట్టి విశదోక్తులచే
మనమున నత్యానందముఁ
గని యిట్లువచించితిఁ బ్రకాశితబుద్ధిన్.

సీ. మును నామనంబున జనియించె నొక నవ్య
కావ్యంబు రచియించు కౌతుకంబు
సరసులైనట్టి యీసభ్యులు పలుక వా
క్యముల చందంబును నట్టిదయ్యె
బ్రహ్మాండపురాణంబునందు బ్రహ్మోత్తర
ఖండంబునందు విఖ్యాతమైన

సీమంతినీనామ సీమంతినీమణి
చారిత్ర మంధ్రభాషనురచించి
యాప్రబంధంబు శ్రీ పర్వతాగ్రభూమి
యందు భ్రమరాంబతోఁగూడ నలరుచున్న
యట్టిమల్లేశ్వరునకు సమర్పణంబుఁ
జేసినసమస్తశుభములు చెందుననుచు.

**End:**

వనమయూరము. నీలగళనీరనిధి నిశ్చలనిషంగా
బాలశశిమౌళి కరభావితకురంగా
శూలధరకుండలిత సుందరభుజంగా
హాలహాలభోజన వృషాధిపతురంగా.

**Colophon:**

ఇది శ్రీశైలనివాస భ్రమరాంబాసమేత మల్లేశ్వర కృపాపాత్ర భారద్వాజగోత్రపవిత్ర సకలసుకవిస్తుత్య సోమనామాత్య ప్రణీతంబైన సీమంతినీకల్యాణంబను మహాప్రబంధంబునందుఁ బంచమాశ్వాసము సంపూర్ణము.

గ్రంథాంతమున నీక్రింది పద్యములున్నవి :—

సీ. అచలాత్మజామనోహారియౌ శృంగారి
పరమోత్తమాంగుఁడై పరగుజాణ
కంజాతనేత్రుఁడై కడునొప్పు దేవుండు
హారిదంబరాభిఖ్య నలరు భోగి
ఘనగోత్రధర్మంబు కరముపాయని శూరుఁ
డాగ్యాభిపూజ్యుఁడైనట్టి మేటి
శుచి వసుదాకాగశోభగల్గు మహాత్ముఁ
డఖిలజగద్వంద్యుఁడైన ఘనుఁడు
అమ్మహాదేవుఁ డీశ్వరుండైన రాముఁ
డఖిల శుభములొసంగ బెంపలరు ధరణిఁ
బూతసద్గుణపేటి శ్రీ పూసపాటి
గోత్రజాచ్యుతరామ రాట్కుంజరుండు.

శా. కల్యాణాస్పదమౌ తదాజ్ఞఁ గడువేడ్కన్ వ్రాసెఁ బెంపొప్పఁ గా
సల్యానూను కృపావిభూతిని మదాశ్వాసంబు సీమంతినీ

కల్యాణంబునఁ గాళ్లకూరికులుఁ డాఖ్యా సూరనార్యుండు మాం
గల్యాధికృత మార్గశీర్ష సితపక్ష ద్వాదశీ శార్వరీ.

(వి-వి.)—

కృత్యారంభ పద్యభాగము కొంత కొఱఁతగా గ్రంథమెల్లఁ గలదు. వ్రాఁత చక్కనిది. తప్పులంతగా లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

సీమంతినీకల్యాణమను పేరుగల యయిదాశ్వాసముల యీ ప్రబంధమున సోమవాసర వ్రత మాహాత్మ్యము వర్ణింపఁబడినది. గ్రంథకర్త పెనుమళ్ల సోమకవి. నీలయమంత్రి కొడుకు. భాగద్వాజ గోత్రుడు ఎల్లనారాధ్యుని శిష్యుఁడు. పూసపాటి తమ్మభూపాలుని యొద్ద మంత్రిగా నుండినవాఁడు. ఆప్తులగు విద్వాంసులు కృతి రచింపఁ దన్నుత్సాహపెట్టి వంశాదివర్ణనము చేయఁగాఁ దాను గృతి రచించినట్లీతఁడు చెప్పుకొన్నాఁడు. జైమినీభారతాది కృతికర్తయగు పిల్లలమఱ్ఱి పినవీరన యీతని వంశమునకుఁ బూర్వుఁడని యిందుఁగలదు. పిల్లలమఱ్ఱివారే పెనుమళ్లలో వసించుటచేతఁ బెనుమళ్లవారనఁ బరగిరట! ఇందలి వంశవర్ణనమునుబట్టిచూడ నీగ్రంథకర్త యా పినవీరనకుఁ బెక్కుతరములు తర్వాతివాఁడగుచున్నాఁడు. శృంగార శాకుంతలమునందుఁ బిల్లలమఱ్ఱి వీరన కాశ్యపగోత్రుఁడని స్పష్టముగాఁ జెప్పఁబడియున్నది. భారద్వాజ గోత్రుఁడగు నీతఁడా పినవీరన వంశమువాఁడగుననుట విశ్వాస్యము గాకున్నది. మఱియు, డిస్క్రిప్టివు క్యాటలాగు నె 14 రు నఁ గల ప్రాఁత తాటియాకు పుస్తకము ముఖపత్రమున వ్రాయఁబడిన గాదిరాజు వంశక్రమముతో నిది సరిరాకయున్నది.

ఈ ప్రతికి మాతృక పూసపాటి అచ్యుతరామరాజుగారి యాజ్ఞ చొప్పునఁ గాళ్లకూరి సూరనార్యునిచే వ్రాయఁబడినది. ప్రత్యాశ్వాసాంతమునను నాతఁడా యచ్యుతరామరాజుగారిని బొగడుచుఁ బద్యములను రచించి చేర్చియున్నాఁడు.

---

## R. No. 514.

**Palm-leaf.** 14¾ × 1⅝ inches. **Foll.** 161. **Lines,** 5 on a page. **Mode of writing,** not good and not correct. **In good condition.**

**Purchased in** 1918-19 **from** M.R.Ry. Tennēṭi Nārāyaṇa Śāstri Gāru of Nandabalaga, Vizagapatam district.

* * * *

నీలకుంతలావిలాసము.

## NĪLAKUNTALAVILĀSAMU.

Foll. 1—130 *a* Fol 130 *b* left blank.

A Prabandha narrating the story of Nīlakuntalā who was married to Rāmarāja He is said to have become a Śaiva devotee but his unfaithful wife accused a Śaiva devotee named Munnūrı Chikkaya of misconduct. Her wickedness was however exposed at the end but all attained salvation by the grace of God Śiva. The author is Tunagāla Nīlakaṇtha kavi, son of Nīlaya and Mallanna.

Complete in three Āśvāsas.

**Beginning :**

సీ. . . . . . .
కాయల రుచులతోఁ గలసి పెనఁగ
సురభిపికస్వరస్ఫూర్తి వీణారవ
లీల . . . నల్లికలు గాఁగ
కెంపుల పసుల ముక్కెఱ సొంపు కెమ్మోవి
పసల మాటు . . పల్బుసలు సేయ
తాటంకముల ధగద్ధగలు చెక్కుల జగా
జిగికి నచ్చికలు బుచ్చికలు పడఁగ
గీ. నలఘువేణి ఘుమంఘుమితానురాగ
పుష్పగంధేచ్ఛ దాసాన పుష్పలిడ్వ
తానగానానుకూల వీణాను మోద
వాదనాస్వాదయౌం వాణి నేఁ దలంతు.

* * * *

**End :**

చ. గగనధునీతరంగవాంత కంకణలోల జటాకటాహాజి
ష్మగకులరాట్కళాభరణ వార్ధినిషంగ వృషారుహోద్ధగ
ద్ధగితసుధాంగ నిర్మలసుధాకరఖండకలాప హైమవ
న్నగతనయాప్రసన్నవదనాబ్జ నభోమణి దేవతాగ్రణీ.

* * * *

కరకమలకురంగా గర్వితానంగభంగా
పరిహృతసురబాధా భైరవస్వామినాథా !

**Colophon :**

ఇది శ్రీమన్మహేశ్వర కరుణాకలి[తాష్మద్రసోచిత] కవితాసామ్రాజ్య
గురులింగజంగమారాధన తునగాల నీలయామాత్య సుపుత్త్ర మల

మాంబాగర్భ పేటికారత్నస్వరూప నీలకంఠ నామధేయ ప్రణీతంబైన నీలకుంతలావిలాసంబను మహాశృంగార ప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిదికాదు. తప్పులున్నవి. శైథిల్య గ్రంథ పాతములు లేవు.

నీలకుంతలావిలాసమను మూఁడాశ్వాసముల యీ శృంగార ప్రబంధమున రామరాజను నాతఁడు నీలకుఁతలయను నొక రాజస్త్రీని వివాహమాడుటయు, నొక శివయోగిచే నాతఁడు శైవదీక్షఁగొని తలారి రామయ్యయను పేరఁ బరఁగుటయు, నతనిభార్యయగు నా నీలకుంతల దుశ్చారిత్రమువలన మున్నూరి చికరీయయనునాతని శివభక్తి మాహాత్మ్యము వెల్లడి యాగుటయు, నంతమున నందఱు శివలోకప్రాప్తి లగుటయు నను కథలు వర్ణింపఁబడినవి. కర్త తునగాల నీలకంఠ కవి. తండ్రి నీలయ.

(*b*) శ్రీముఖలింగశతకము.

ŚRĪMUKHALIṄGAŚATAKAMU.

Foll. 131*a*—14*th* 2 *b*.

A centum of stanzas in the Kanda metre eulogizing God Śiva worshipped as Śrīmukhaliṅga; by Amalāpurapu Sanyāsi kavi.

Complete in 108 stanzas.

**Beginning:**

క. శ్రీకర కపర్దనిహిత ని
శాకర సుగుణాకరా నిషంగీకృత ర
త్నాకర సన్మునిలోక వ
శీకర కరుణాంతరంగ శ్రీముఖలింగా! ౧.

క. అసమప్రజ్ఞుఁడ కవివ
ర్యసమాజహితుండ భాస్వదమలాపురవం
శ సముద్భూతుఁడ సన్న్యా
సి సమాఖ్యుఁడ నన్నుఁ బ్రోవు శ్రీముఖలింగా. ౨.

**End:**

క. చిందములఁ గుందముల నర
నిందములన్ నగు యసమున వెలసిన దొర నా
డెందమలరింపు మదవద
రిందమ కౌతుక మెసంగ శ్రీముఖలింగా!

క. ఇతి శ్రీముఖలింగాభిధ
శతకము పెంకెకులవార్ధి శశి మురుమళ్లా
ఖ్యాతనూజుఁడు రామస్వా
మి తగం బఠియించె బుధులు మేలని పొగడన్.

అని యిట్లు గ్రంథాంతమునఁ గలదు.

(వి-వి.)—

సమగ్రము. ౧౦౮ కందపద్యములు. వ్రాఁత మంచిదికాదు. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములు లేవు.

శివస్తుత్యాత్మకమగు నీశతక మమలాపురపు సన్న్యాసికవిచే రచియింపఁబడినది.

(c) పంచముఖేశశతకము.

PAÑCAMUKHĒŚAŚATAKAMU.

**Foll. 143a—151b.**

**A centum of stanzas in the Kanda metre eulogizing God Śiva worshipped in the sacred Shrine at Sālūr. The author is Amalāpurapu Sannyāsi kavi.**

**Complete.**

**Beginning:**

క. శ్రీరమ్యగిరికుమారీ
నారీమణిచిత్తచోర నాగాధిప కే
యూరా జగదాధార య
పార కృపాపారసనివేశ పంచముఖేశా! ౧.

క. పురశాసన సాలూరీ
పురసంతతఖేల సకలబుధలోలా సు
పురసాత్కృతదర్వీకర
[illegible]సనివేశ పంచముఖేశా!

**End.**

క. పురణింపఁగ మహాదమలా
పురకుల సన్న్యాసిరచిత భూరిశతకముఁ
స్ఫురణన్ గైకొను కరుణన్
పరమకృపారసనివేశ! పంచముఖేశా!

(వి-వి.)—

సమగ్రము. ౧౦౨ పద్యములు. వ్రాఁత మంచిదికాదు. శైథిల్యపాతములు లేవు. తప్పులున్నవి.

"పరమకృపారసనివేశ పంచముఖేశా" యను మకుటముగల యీశతకమున సాలూరున నెలకొన్న యీశ్వరుఁడు స్తుతింపబడియెను. కర్త అమలాపురపు సన్న్యాసికవి.

(*d*) గౌరీరమణశతకము.

GAURĪRAMAṆAŚATAKAMU.

**Foll.** 152*a*—161*a*. Fol. 161(*b*) is left blank.

A centum of stanzas in the Kanda metre in praise of God Śiva. The author's name is not known.

Complete in 101 stanzas.

**Beginning:**

క. శ్రీ లక్ష్మీనాథప్రియ
హాలాహలభక్ష దేవతారివిపక్షా
బాలశశాంకకళాధర
కైలాసనగేంద్రరమణ గౌరీరమణా. ౧.

**End:**

క. కాళీయరిపుసఖ లాలా
జాలముగా నీదుకథలు చదువు జనములన్
హేలాలావన మొనరింతురు?
కైలాసనగేంద్రశరణ గౌరీరమణా. ౧౦౧.

(వి-వి.)—

సమగ్రము. ౧౦౧ పద్యములు. వ్రాఁత మంచిదికాదు. తప్పులున్నవి. శైథిల్యపాతములు లేవు.

ఈ కందపద్యశతకము శివస్తుత్యాత్మకము. కర్త యెవ్వరో?

## R. No. 515.

Paper. 11 × 8¾ inches. Foll. 119. Lines, 20 on a page. Mode of writing good but not quite correct. In good condition.

Transcribed in 1918-19 from the Ms. of His Highness Sītala Rāmasubba of Wadwan.

శాకుంతలము.

ŚĀKUNTALAMU.

This Prabandha narrates the story of the marriage of Śakuntalā with Dusyanta as found in the Mahābhārata and Kālidāsa's Śākuntala. The author is Pillalamarri Pinavīrabhadra, son of Gādayāmātya of Kāśyapagōtra. The work was dedicated to Cillara Vennāmātya. The work is also called Śrngāraśākuntala His other works are Avatāra darpaṇamu, Nāradīyamu, Māghamāhātmya, Mānasōllāsasāra, Jaiminībhārata.

Complete in 4 Āśvāsas.

**Beginning :**

శా. శ్రీవత్సాంకుఁడు భక్తవత్సలుఁడు లక్ష్మీప్రాణనాథుండు రా
జీవాక్షుండు సమస్తభూతభువనక్షేమంకరానేకరూ
పావిర్భావుఁడు వాసుదేవుఁ డనుకంపావాసుఁడై దాన వి
ద్యావిఖ్యాతుని మంత్రివెన్నని నితాంత శ్రీయుతుం జేయుతన్.

* * * *

సీ. గీ. పృథివి కవతంసమణిదైన చిత్రుగుంట
తానకంబుగ నవతారమైనవాఁడు
భైరవస్వామి సకలసంపదల నొసఁగి
మనుచుఁ జిల్లర వెన్నయామాత్యవరుని.

* * *

క. ఇట్టులమగుమతి భారత
ఘట్టమునకు నడవ యచ్చుఁగట్టిన కవితా
పట్టాభిషిక్తు నన్నయ
భట్టోపాధ్యాయుఁ దలఁచి వరమప్రీతిన్.

గీ. ఉభయకవిమిత్రు సత్యంతశుభచరిత్రు
భానుసమతేజుఁ గొమ్మయప్రభు తనూజు

సుకృతవిభ్రాజిఁ దిక్కనసోమయాజిఁ
బ్రణుతబహుదేశకవిరాజిఁ బ్రస్తుతించి.

సీ. నన్నపార్యుఁడు (ని?) ప్రబంధప్రౌఢవాసనా
సంపత్తి సొంపు పుట్టింప నేర్చుఁ
తిక్కనయజ్వ వాక్ఫక్కికామోదంబు
చెలువుఁ గర్ణముల వాసింప నేర్చు
నాచిరాజుని సోము వాచామహాత్మ్యంబు
సౌరభంబులు వెదచల్ల నేర్చు
శ్రీనాథభట్టు భాషాసుగుంభంబుల
పరిమళంబులఁగూడఁబఱచ నేర్చు
మహితగుణశాలి పిల్లలమఱ్ఱివీర
నార్యుఁ; డాయింటఁ బైతామహంబగుచును
వెలయుచున్నది నేఁడు కవిత్వలక్ష్మి
యఖిలసత్కవినికరంబు నాదరింప॥

క. ఆ సుకవిచేత శివభజ
నాసకునిచేతఁ గాశ్యపాన్వయుచేతన్
భాసురనవకవితాల
క్ష్మీసదనునిచేత వలయుఁ గృతిచెప్పింపన్.

మ. అని సాధ్వీమణి నాగమాంబకును విద్యాభారతీజాని గా
దనకుం బుత్రుని వీరభద్రపదపద్మధ్యానశుద్ధాంతరం
గుని నన్నుం బిలిపించి లోనఁ దనకోర్కుల్సందడింపంగ మ
న్ననదైవారఁగ గారవించి పలికెన్ గంభీరవాక్ప్రౌఢిమన్.

సీ. రచియించినాఁడవు రమణీయవాగ్రీతి
నవతారదర్పణం బభినవముగఁ
బలికినాఁడవు తేటపడఁజేసి నారదీ
యము సత్కవిశ్రేణి యాదరింపఁ
జెప్పినాఁడవు శేముషీ విశేషంబున
మాఘమాహాత్మ్యంబు మంజుఫణితిఁ
గావించినాఁడవు ఘనబుద్ధి మానసో
ల్లాససారము సముల్లసితశయ్య

భారతీతీర్థయతిసార్వభౌమగురు కృ
పాతిశయులకు కవితావిభూతి గల్గి
గారవముగాంచినాఁడవు కవులచేత
విమల హాటూకి నిర్నిద్ర! వీరభద్ర!

గీ. కలదు చాలంగఁ బ్రేమ నీవలన నాకు
వేడుకనడిగెదఁ గవులెల్ల వేడుకపడఁగ
షట్సహస్రకులోద్భవసచివులందు
సుకృతిఁగాఁజేయు నాకొకసుకృతిఁ జేసి॥

* * * *

సీ గీ. భారతప్రోక్తకథ మూలకారణముగఁ
గాళిదాసుని నాటకక్రమము కొంత
తావకోకికి నభినవ శ్రీవహింపఁ
గూర్చిఁ గృతిసేయు నాకు శాకుంతలంబు.

* * * *

సీ. పంటనృపకాసుభములకుఁ బాలవెల్లి
కదనజయలక్ష్మి తొలుచూలు గన్నతల్లి
విపులభుజదర్పగర్విత విమతరాజ
రాజి వ్యాధ్యల్లి ధర సోమరాజువల్లి

క. ఆ నగరము పైతామహ
మైన నిజస్థానముగ సమంచితలక్ష్మీ
దా నొంది మంత్రిమేడన
జానుగ భజియించె సప్తసంతానములన్.

క. అ మేడన మంత్రికి సా
ధ్వీమణి మాచాంబకున్ శ్రుతిత్రయముగతిన్
రామత్రయంబు పోలిక
నాముష్యాయణులు గలిగిరనుపమతేజుల్.

* * * *

(చిల్లర యెల్లయ్య, వెన్నయ్య, నాగరాజు).

క. ఆ నాగసచివధీమణి
శ్రీనాయకుఁ డిందిరను వరించిన కరణిన్

మానవతీతిలకముఁ బృ
థ్వీనుతగతిఁ బోతమాంబ వివహాంబయ్యేన్.

ఉ. ఆ పురుషావతంసమున కానుచరిత్రున కుద్భవించి రు
ద్దీపితకీర్తి వెన్నయయు ధీనిధి మేడనయున్ సమస్తవి
ద్యాపరమేష్ఠి యాదెనయు ధార్మికుఁ డెట్టినయున్ సుధానుస
ల్లాపుఁడు వీరభద్రుఁడును లాలిత నీతికళాధురంధరుల్.

* * * *

సీ. విలసితంబైన కావలి వెన్నమారాధ్య
మణిదత్తమగు శైవమంత్రశక్తి
సమధికస్ఫూర్తితో శాశ్వతైశ్వర్యబీ
జంబైన శంభుపూజాఫలంబు
ప్రమథాధిపతిఁగూర్చి భక్తితోఁగావించు
సోమవారవ్రతసుకృతగరిమ
యన్నమాంబిక కంధరాంతరంబునఁ జాల
శోభిల్లు మంగళసూత్రలక్ష్మి
సకలసౌభాగ్యములకును సాధనములుఁ
గారణంబులుఁ దగు బోధకములుగాఁగ
సచివసంఘంబులోనఁ బ్రశస్తిగాంచె
విశ్వనుతకీర్తి చిల్లర వెన్నమంత్రి.

* * * *

క. కౌండిన్యగోత్రునకు ను
ద్దండాహితసచివమతి లతాదాత్రునకున్
ఖండితచింతామణికిఁ బ్ర
చండ వచోవిభవ విష్ణుశయ్యాఫణికిన్.

క. అన్నాంబికాసమంచిత
హృన్నలినాదిత్యునకు మహీదివిజానీ
కౌన్నత్యునకును జిల్లర
వెన్నామాత్యునకు సతతవిస్తుత్యునకున్.

**End:**

సతతసుకృతభాజా సంతత శ్రీవిరాజా
క్షితిజనసురభూజా చింతితత్యాగభోజా
ప్రతినవరవితేజా ! భవ్యభాషాపరాజా
హతవిమతసమాజా యన్నమాంబామనోజా !

**Colophon:**

ఇది శ్రీభారతీతీర్థగురుచరణకరుణాలబ్ధ సిద్ధసారస్వత పవిత్ర గాదయామాత్యపుత్ర యారాధితామరవీరభద్ర పిల్లలమఱ్ఱి పినవీరభద్ర ప్రణీతంబైన శాకుంతలశృంగారకావ్యంబునందు సర్వంబును జతుర్థాశ్వాసము.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత చక్కనిది. తప్పులంతగా లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

శృంగార శాకుంతలమను పేరుగల యీ నాల్గాశ్వాసముల రసోత్తర ప్రబంధము భారతాభిజ్ఞాన శాకుంతలములనుబట్టి రచియింపఁబడినది. ఇందు శకుంతలాదుష్యంతుల చరిత్రము వర్ణితము. గ్రంథకర్త పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి. గాదయామాత్యుని కొడుకు. కాశ్యపగోత్రుఁడు. కృతిపతి చిల్లర వెన్నామాత్యుఁడు. విశేషముల కుదాహృత పద్యములఁ జూచునది. ఇతని యితరకృతులు అవతారదర్పణము, నారదీయము, మాఘమాహాత్మ్యము, మానసోల్లాససారము, జైమినీ భారతము.

---

## R. No 516.

Paper. 8¼ × 5⅝ inches. Foll. 33. Lines, 28 on a page. Mode of writing, fair but not quite correct. In good condition.

Purchased in the year 1918-19 from M.R.Ry Peṇḍyāla Vēṅkaṭasubrahmaṇya Śāstri Gāru of Masulipatam, Kistna district.

భానుమతీపరిణయము.

BHĀNUMATĪPARIṆAYAMU.

This Prabandha in four Āśvāsas relates the story of the marriage between Sahadēva, the younger brother of Yudhiṣṭhira, and Bhānumatī, daughter of Śrī-Kṛṣṇa's paternal uncle. The author of the work is Reṇṭūri Raṅgarāja, son of Cinaraṅganāmātya of Śrīvatsagōtra.

Complete; but some stranzas in the prefatory portion are wanting.

**Beginning:**

ఉ. శ్రీమహితాత్మహస్తసరసీజగతంబగు వెన్నచే మనః
క్షోమలరీతిచేతసులకుం దగఁజూపి రటత్కటీతటీ

సీమ సువర్ణఘంటికలచేఁ బ్రకటంబుగఁ జాటునట్టి నా
స్వామిని బాలకృష్ణుఁ గడుఁ జకఁని ముద్దులతండ్రిఁ గొల్చెదన్.

* * * *

**End :**

శా. ఆశాకూఢతరప్రతాప నృపరాజస్థాపనాచార్య పూ
ర్వాశాధీశ్వరభోగమాధవ తదీయారాధనాకల్ప త
ద్గోశుంభద్ఘనకీర్తి రాజిత మహాక్రూరారిసంహార భూ
మీశాశాసితలోక సారసమహాబాహాస్త్రేషోల్లస . . .

**Colophon:**

ఇది శ్రీరామచంద్రసాంద్రకృపారసపరిపాకలబ్ధ కవితామాధురీధురీణ శ్రీవత్సగోత్రపవిత్ర రెంటూరిచినరంగనామాత్యపుత్ర సౌజన్యవిధేయ రంగరాజనామధేయ ప్రణీతంబైన భానుమతీపరిణయంబను మహాప్రబంధంబునందు సర్వంబును జతుర్థాశ్వాసము.

(వి-వి.)—

సమగ్రము ; కాని యవతారికయందుఁ గొంతభాగము లేదు. వ్రాఁత యొకతీరుగా నున్నది. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములు లేవు.

నాల్గాశ్వాసముల యీప్రబంధమున శ్రీకృష్ణుని పిన తండ్రి కూఁతురగు భానుమతికిని యుధిష్ఠిరసోదరుఁడగు సహదేవునకును జరిగిన వివాహకథ వర్ణింపఁబడినది. కర్త రెంటూరి గంగరాజు. చినరంగనామాత్యుని పుత్త్రుఁడు. శ్రీవత్ససగోత్రుఁడు.

---

R. No. 517.

Paper. 10¾ × 9¾ inches. Foll. 36. Lines, 20 on a page. Mode of writing, fair but incorrect. In good condition.

Transcribed in the year 1918–19 from the Ms. of M.R.Ry. Vaḍḍādi Vēṇugōpālabhūpati Gāru of Māḍugula, Vizagapatam district.

తుపాకిశాస్త్రము.

TUPĀKIŚĀSTRAMU.

A treatise dealing with the Mantras to be repeated and the medicines to be used in discharging the gun effectively. The herbs required for treating certain diseases chiefly connected with the humour, technically known as Vāta, are also mentioned.

Complete.

**Beginning:**

కోవెలచెక్కర వర్ణావాలతో రోటవేసి కుమ్మి మరగబెట్టి నాళంలో పోసి ఘుడియవుంచి వెలిపివేసి ఆపిప్పి పొగవేసేది। ఈ తుపాకిని దుప్పిని వేసినా, గొత్తెనువేసినా నెమలినివేసినా మసరుబడితే యీ కదుగు కడిగి తేతీర్పు.

**End:**

పైత్యకుష్ఠు బగ్గెలువున్నవాళ్లకు అవుషధం బావంచులు నీళ్లనూరి గచ్చకాయలంతేసి మాత్రలు ఇచ్చేది. పైని గేదెచల్లరాసి నూరి నాన బెట్టి రాసేది. కుదురును.

తంకెపువిత్తులు చల్లతోనూరి లోపలికి యిచ్చేది. పైకి గాడిద గణపవేళ్లు పల్లేరువేళ్లు నూరి రాసేది. నీళ్లతో మర్దనా ఇచ్ఛా పథ్యం.

తుపాకివిద్య సంపూర్ణం.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత యొకతీరుగానున్నది. తప్పులున్నవి. శైథిల్యము లేదు.

ఇందు, తుపాకిప్రేల్చుటకు సాధకబాధకములగు మందులు మంత్రాలు పెకుర్కొలిందున్నవి. కడపట వాతాదిరోగములకుఁగొన్ని మూలికల క్రియలు వ్రాయఁబడియున్నవి.

---

## R. No. 518.

**Paper. 10¾ × 9¾ inches. Foll. 37. Lines, 20 on a page Mode of writing, good but not correct. In good condition.**

Transcribed in the year 1918–19 from a Ms. of M.R Ry. S. Vēnkaṭasubrahmaṇyam Gāru of Dvārakatirumala, Ellore, Kistna district

గుత్తెనదీవిరామాయణము.

GUTTENADĪVIRĀMĀYAṆAMU.

The story of the Rāmāyaṇa is herein described in the form of songs. The author's name is not known. This was dedicated to Āñjanēya (monkey warrior) worshipped in the shrine at Guttenadīvi.

Complete.

**Beginning:**

కాంభోజి రాగము—ఆదితాళము.

శరణుశరణుదేవా మహానుభావా శరణు.

పరమాత్మా ఓ పరమదయాకర కరుణించవేమమ్మ
కారుణ్యసాగర ॥ శరణు ॥

౧ జనలోకమునకును వే చనుదెంచిమీరు ఘనుఁడౌ దశరథుని గర్భ మానందు జనియించి మీకోరిక జయమందఁగాను చనియారావణుని జంపుదునన్న మీకు ॥ శరణు

౨ రావణ కుంభకర్ణాదులు మించి దేవతలనుబట్టి తెచ్చి బంధించి వేవేలవిధముల వేఁడిన మించి ఆ విధమున సురలకానతిచ్చినమీకు ॥ శరణు

౩ అని యిట్లు దివిజులు అందఱు మీరు వనచారులై రావలెనన్నారు పరఁగ శేషుని సోదరుఁ గమ్మన్నారు హరుని గుత్తైనదీవి హనుమంతుఁ గమ్మన్న మీకు ॥ శరణు శరణు ॥

**End:**

శంకరాభరణము.

౧ దశకంఠుఁడనిలోన ధరనుగూలఁగఁజూచి దిశలెల్లఁ గొనియాడఁగా—దశరథతనయుఁడు ధనువు ఎక్కుడించి విశదంబుగా నిలిచెఁగా.

౨ హత శేషులైన దానవులెల్ల రావణుని సతిఁగాంచి రా వేళను—చతురుఁడైన రాఘవులచే నీపతి మృతినొందె నీవేళనూ.

* * * *

౪౯ తెగువతో అగ్నిహోత్రుఁడు వచ్చి స్వామితో
తగదయ్య రఘునాయకా!
ముదితేశూ దగ్నిలో మంతురాకృప లేక (?)
ముందు వెనుక చూడకా.

౫౦ అతివేగమున దశరథుఁడొగి సుతునితో
హితవుగా దనిపలెక్కనూ!
వెతబొందుచున్న భూసుత నేలుకొ ‑ మ్మేను
హితవుమాకనిపలెక్కను.

౫౧ అంతావుప్పక మెక్కి అవనిజతో స్వామి
యెంతో వేడుక గాను

అంతా గుత్తెనదీవి హనుమంతుగొలువగా
సంతోషమూనఁ దగ్లెను.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత చక్కనిది. తప్పులున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

గేయరూపముగా నిందు రామాయణకథ యెల్ల వర్ణింపఁబడినది. కర్తపేరు తెలియదు. ఈ గ్రంథము గుత్తెనదీవి హనుమంతునకంకితము సేయఁబడినది.

---

## R. No. 519.

Paper. 11 × 10⅛ inches. Foll. 187. Lines, 20 on a page. Mode of writing, fair but incorrect. In good condition.

Transcribed in the year 1918-19 from a MS. of M.R.Ry. Koṭikalapūḍi Cina Kōdaṇḍarāmayya Gāru, Bobbili, Vizagapatam district.

శ్రీరంగమహాత్మ్యము.

ŚRĪRAṄGAMĀHĀTMYAMU.

This is the same work as the one described under R. No. 418 *ante*. By Katta Varadarājakavi.

Complete.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత చెడ్డదికాదు. తప్పులున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు

ఇది ఆర్. నెం 418 రున వర్ణితమైన గ్రంథమే.

---

## R. No 520.

Paper. 8 × 6¼ inches. Foll. 158. Lines, 21 on a page. Mode of writing, good but not correct. In good condition.

Presented in the year 1918-19 by M.R.Ry. A. Raṅgasvāmi sarasvati Gāru, Triplicane, Madras.

(*a*) శకుంతలాపరిణయము.

ŚAKUNTALĀPARIṆAYAMU.

Foll. 1*a*-76*b*.

This is the same work as the one described under R. No. 140 *ante*. By Rēvaṇūri Vēṅkaṭārya.

Complete.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత చక్కనిది. తప్పులున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

ఇది ట్రై. క్యా. ఆర్. నె 140 రున వర్ణితమగు గ్రంథమే.

(b) హరిశ్చంద్రోపాఖ్యానము.

HARIŚCANDRŌPĀKHYĀNAMU

Foll. 77a—158b.

This is a Prabandha in five Āśvāsas describing the story of Hariścandra, who became famous for his adherence to truth in spite of severe trials. The author is Śankarakavi, son of Rēcanāmātya of Kauṇḍinyagōtra. As the work here is imperfect, extract will be given in the Des. Cat. of Tel. MSS

Complete.

Except without the few stanzas in the prefatory portion.

(వి-వి.)—

గ్రంథారంభపద్యములు కొన్ని కొఱతగా గ్రంథమెల్లఁగలదు. వ్రాఁత మంచిది. తప్పులున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

ఇది శంకరకవి రచియించిన హరిశ్చంద్రోపాఖ్యానము.

---

R. No. 521.

Palm-leaf. $14\frac{5}{8} \times 1\frac{3}{8}$ inches. Foll 77. Lines, 7 on a page. Mode of writing, good and correct. In good condition.

Purchased in the year 1918-19 from M R Ry. Ballamūḍi Dakṣiṇāmūrti Śāstri Gāru, Chicacole, Ganjam district.

కవిజనాంజనము.

KAVIJANĀÑJANAMU.

This is a commentary on the grammatical treatise Āndhraśabdacintāmaṇi of Nannayabhaṭṭāraka. The author is Kimmūri Narasiṁharāju, son of Buccirāju and Sannamāmba of Parāśaragōtra. The commentator states that Bālasarasvati's commentary is brief and proposes to write exhaustive comments. He also refers to Ahōbalapaṇḍita, another commentator on the Āndhraśabdacintāmaṇi.

Complete.

**Beginning:**

శా. శ్రీసీతాసతివామభాగమున సంశ్లేషించి యుండంగఁదా
నాసాకేతపురీవరంబునను బ్రాసాదాచలాగ్రంబు పై
నాసీనుండయి చంచలాసహిత కాలాంభోధరం బోయనన్
భాసిల్లుం బతినావయిన్ ఘనకృపావర్షక్రియంజూపుతన్.

శా. శ్రీకిష్టూరికులాబ్ధిచంద్రుఁడను బుచ్చిత్క్ష్మేంద్రపుత్త్రుండ వా
ణీకారుణ్యకటాక్షలబ్ధ కవితానిర్యత్ప్రకాశుండ న
స్తోకాంధ్రామర వాగ్విదుండ సరసశ్రేణీశుఁడన్ సన్నమాం
బాకుక్షిప్రభవుండ రాఘవపదాబ్జాతార్చనాసక్తుఁడన్.

* * * *

గీ. వ్రాస్యముగఁ డీక బాలసారస్వతుండు
చేసెదానికి నేను విశేషముగను
గవిజనోక్తులు లక్ష్యము ల్గాఁగఁ జేతుఁ
గవిజనాంజన మనెడి వ్యాఖ్యానమొకటి.

* * * *

శ్లో. విశ్వశ్రేయః కావ్యం తదదోషా పరిష్కృతా చ। వాగర్థా
సా వాగ్యా రసవృత్తిః సాధ్యోహి రసోయథాతథం కవిభిః॥

టీక. కావ్యమ్. కావ్యము, విశ్వశ్రేయః = సర్వధర్మములలో శ్రేష్ఠము, 'నానృషిః కురుతే కావ్య' మన్నాఁడుగనుక, 'యతేర్ద్రష్టిః కవేర్వచః' అన్నాఁడు గనుకనున్ను పవిత్రమును.

**End:**

శ్లో. అత్వాదితత్సమానామివ దేశ్యానాం క్రియాపదానాం స్యాత్।
వర్ణాగమో విశేషః పురుషేష్వశేషు చాపి వచనేషు॥

టీక దేశ్యానాం = దేశ్యములైనటువంటి, క్రియాపదానాం = క్రియాపదములకు, తత్సమానామివ, తత్సమక్రియలకువలెను, అత్వాది = అత్వము మొదలయిన కార్యము, స్యాత్ = అవును, ప్రోచుచున్నాఁడు ప్రోవఁగలఁడు ప్రోచెన్—చూచెను, చూడఁడు, చూచును ఇత్యాది బహు వచనములయందును విశేషవర్ణాగమము చూచేది.

**Colophon.**

ఇది శ్రీరామచంద్రపాదారవిందపూజాపవిత్ర శ్రీమత్పరాశర గోత్ర శ్రీసన్నమాంబా బుచ్చిధరాధిపపుత్త్రి కిలారిగజ సింహ శ్రీనరసిం

హ రాజసింహ విరచితంబైన కవిజనాంజనంబను నాంధ్రశబ్దచింతామణి వ్యాఖ్యానంబునందు క్రియాపరిచ్ఛేదము సంపూర్ణము.

గ్రంథాంతమునందిట్లున్నది :—

“ ఈ యాంధ్ర వ్యాకరణము కాళయుక్తి సం॥ శ్రావణ బహుళ బుధవారం సరికి వల్లముడివెంకన్న ఆత్మార్థం వ్రాసికొనెను ”

(వి-వి.)——

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పులు లేవు. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

కవిజనాంజనమను పేరుగల యీ యాంధ్రశబ్దచింతామణి వ్యాఖ్యానమునకుఁ గర్త కిమ్మూరి నరసింహరాజు. బుచ్చిరాజు కొడుకు. బాల సరస్వతి కృత వ్యాఖ్యానము చిన్నదిగానున్నదని యీతఁడీ వ్యాఖ్యను విరివిగా రచించెనట! ఈతఁడహోబల పండితునిఁ బేర్కొనుచున్నాఁడు.

---

R. No. **522.**

Paper. 11½ × 1½ inches. Foll 63. Lines, 20 on a page. Mode of writing, fair but in correct In good condition.

Transcribed in the year 1918–19 from a MS. of M.R.Ry. C. Subrahmaṇya Śāstri Gāru of Vizagapatam.

గౌతమీమాహాత్మ్యము.

GAUTAMĪMĀHĀTMYAMU.

This Prabandha describing the religious importance and holiness of the river Gōdāvarī is a Telugu rendering of the six Adhyāyas of the Sanskrit Gautamīmāhātmya occurring in the Brahmāṇḍa Purāna. The author is Tādūri Kṛṣṇa Śāstri, son of Rāmacandrārya of Parāśaragōtra. The work was dedicated to Pālatēṭi Appayamantri.

Complete in three Āśvāsās.

**Beginning :**

ఉ. శ్రీరమణీపతిప్రియుఁడు శీతధరాధరకన్యకోరు వ
క్షోరుహమండలీమహితకుంకుమయుక్తభుజాంతరుండు నీ
హారకరావతంసుఁడఖిలామరసన్నుతుఁడీశుఁ డెప్పుడుం
గూరిమి పాలతేటికులకోవిదునప్పయమంత్రి నేలుతన్.

* * * *

సీ. గీ. సరసచెలువొంద వైశాఖపురమునంద
మితధిషణుఁడు మద్గురుఁడు సన్నుతబుధుండు
మంగళగిరివంశాబ్ధిహిమాంశుఁడైన
నారసింహాచార్యునకు వందనములొనర్తు.

గీ. సంస్కృతాంధ్రప్రబంధాదిసరసకవిత
రచితభవ్యహృదయుఁడురురమ్యశిష్య
నలినలేశుఁడు (?) కవిదాజ్జనార్దనాఖ్యు
డౌమదగ్రజునకు వంగనము లొనర్తు.

*   *   *   *

సీ. శ్రీపరాశరగోత్ర సింధుసుధాకర
సర్వవిద్యాపారచారుహార
చిత్రగుప్తకుల పవిత్రత్రయార్షి ప్ర
వరహారమందారశరశరచ్ఛ
రదదరతారతారకపురందరకరి
వరయశస్సారభూవరసభాని
రంకుశ తాడూరి రామచంద్రార్య స
త్పుత్త్రి పండితకవి మిత్రభాను
రాంధ్రగీర్వాణభాషారహస్యవేద్య
సకలవిద్వత్కవీశ్వరస్వాంతరంజ
నైకకవనాఢ్య శ్రీరమణాంఘ్రిపద్మ
మధుకరా కృష్ణశాస్త్రి విబుధవరేణ్య !

*   *   *   *

సీ. శ్రీరాజసింహుల శీతాంశువంశ్యుల
సఖ్యము చేసెనే సత్యసంధు
డభవవంశస్థులై యలరుశ్రీవిక్రమ
దేవుకార్యములలోఁ దేజరిల్లె
నేమంత్రి శేఖరుండెన లేని భాగ్యభో
గ్యాయుతుండయ్యె నేఘనగుణుండు
శ్రీబెలగాంపురీ క్షితినాథునకు జమీ
దెచ్చియిచ్చిన మంత్రిధీరుఁడెవ్వఁ

ఁడతఁడు సద్వంశఖ్యాతతి హితవిధుండు
వీరవిశ్వంభరావనీవిభునిమంత్రి
వఱఁడూ ఘనతరపార్వతీపురనివాసుఁ
డలరెనప్పయమంత్రీంద్రుఁడనఁగ మఱియు.

*     *     *     *

క. అలఘాయమాంబవలన స
లలితతనూజులను ముప్పురను గనకుతుకం
బలరవిలసిల్లెనప్పయ
ఫలితంబగు కల్పతరువు భంగిధరిత్రిన్.

**End :**

సీ. గౌతమీజననము గౌతమాహల్యావి
లాసము చంద్రకల్మషహరణము
శ్రమణికి మోక్షప్రదమహత్త్వము గశ్య
ప బ్రహ్మచరితము బ్రాహ్మణుఁడగు
వృద్ధుని సుతుఁడయి వెలయుసువిత్రుని
మాతృసంగమనాథు మండలహార
మునఁజదివించిన వినిన వ్రాసిఁజది
వినజనులకు మహావృజినహరము
గౌతమీస్నాన ఫలము స్వర్గానుభవము
కల్గుహరిహరబ్రహ్మలోకములు గల్గు
దివ్యమణిమయ సౌధముల్ దీవ్యమాన
మైన భాగ్యముల్ గలును మానిచంద్ర !

**Colophon :**

ఇది శ్రీమద్భ్రీవాక్త్రస్త్రిబగళాముఖీకరుణానిరీక్షణసంలబ్ధ సంగ కవితాసామ్రాజ్యధురంధర ఘనయశోబంధుర గీర్వాణాంధ్రాద్యష్ట భాషాకవిత్వమందిర పరాశరగోత్రపవిత్ర తాడూరు రామచంద్రార్య పుత్త్రి బుధజనమిత్ర కృష్ణశాస్త్రినామధేయ ప్రణీతంబైన గౌతమీమాహాత్మ్యంబను పుణ్యచరిత్రంబునందుఁ దృతీయాశ్వాసము.

సీ. భాసుగశ్రీకంచిభట్ల శేషయహస్త
కమలదత్త మహిత గౌతమీమ
హత్త్వసంహిత విధాత్త్రిండపురాణ సం
స్రుతసారభాషాల సితవిశేష

ఫలితషడధ్యాయములు ధన కనకాప్త
వైశాఖపట్టణ పరమునందు
సారస్వతులు వరుసగఁ గాన్యకుబ్జులు
మైథిలులుత్కళుల్ మఱియు గౌడు
లనెడి గౌడద్విజులలో విలసితచిత్ర
గుప్తకుఁ జాఁడు పాల్తేటికులపవిత్రుఁ
డప్పయామాత్యుఁడొసఁగిన నాంధ్రకృతిని
జేసెఁదాడూరు కృష్ణశాస్త్రి కవిచంద్ర (?)

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁతయంత మంచిదికాదు. తప్పులున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

గౌతమీ మాహాత్మ్యమను పేరుగల మూఁడాశ్వాసముల యీ ప్రబంధమున గంగయే గౌతమియనియు, భాగీరథియనియు ద్విధావిభాగముఁ జెందుటయునందు మొదటి భాగమగు గౌతమీగంగ గౌతమమునిమూలమున భూమిపయిఁ బాఱుటయు మొదలగు వృత్తాంతమును, దన్మాహాత్మ్యమును నిందువర్ణింపఁబడినవి. ఇది బ్రహ్మాండపురాణమందలి యాఱధ్యాయముల సంస్కృతగ్రంథమునకుఁ దెలుఁగుసేఁత. కర్త తాడూరి కృష్ణశాస్త్రికవి. కృతిపతి శిష్టు కరణమగు పాలతేటి యప్పయమంత్రి. ఉదాహృత గ్రంథ భాగముఁ జూచునది.

---

## R. No. 523.

Paper. $10\frac{3}{8} \times 9\frac{1}{4}$ inches. Foll. 24. Lines, 20 on a page. Mode of writing, good and correct. In good condition.

Transcribed in the year 1918–19 from the printed book obtained through M.R.Ry. A. Raṅgaswāmi Sarasvati Gāru of Triplicane, Madras.

సోమదేవరాజీయము.

ŚOMADĒVARĀJĪYAMU.

A historical poem describing the incidents relating to the kings of the Kākatīya dynasty including Pratāparudra. The author is Kūcimañci Jagga kavi, the brother of Timmakavi. This was composed and

dedicated to God Śrī Kṛṣṇa at the instance of Mandapāṭi Nārāyaṇarāju who is stated in the work to be a descendant of Pratāparudra. The author's other works are Candrarēkhāvilāpa and Subhadrāpariṇaya.

Breaks off in the 2nd Āśvāsa and wants the prefatory portion

**Beginning:**

సీ. శ్రీశైలమునకుదీచీప్రదేశమునఁ గృ
ష్ణాగౌతమీమధ్యభాగమునను
దండకారణ్యంబు దనరు నప్పుణ్యవ
నాభ్యంతరమున మహర్షి సేవి
తంబై హిడింబాశ్రయంబు గన్పట్టు న
కరుడికి నీశాన్యభాగంబునందు
హనుమద్గిరియనంగ నచలేంద్ర మొకటి
తనరారు దేవగంధర్వయుతము
సిద్ధవిద్యాధరాది ప్రసిద్ధదివిజ
గణవిహారస్థలంబై యఖర్వలీలఁ
జెలఁగి తన్మధ్యమున సిద్ధసేవ్యుఁడగుచు
నెలమి నలరొందు సిద్ధేశ్వరేశ్వరుండు.

**Colophon:**

మండపాటి నా
రాయణధారుణీవర నిరంతరపూజిత పాదపంకజా!

* * * *

ఇది శ్రీమజ్జగన్నాథదేవ దివ్యకృపాలబ్ధ సారసారస్వతవైభవ కూచిమంచి గంగనామాత్యతనూభవ సమగ్రకవితాకళామేదుర తిమ్మకవీంద్ర సోదర నిఖిలవిద్వజ్జనవిధేయ జగన్నాథనామధేయ ప్రణీతంబైన సోమదేవరాజీయంబను మహారాజచరిత్రంబునందుఁ బ్రథమాశ్వాసము సమాప్తము.

**Beginning:** (of the second Aśvāsa.)

క. శ్రీకాకతిరుద్రాన్వయ
నాకాధిప మండపాటి నారాయణ భూ
శ్రీకాంత హృదయకమల
ప్రాకారనివేశ సత్యభామాధీశా.

**End:**

మ. అని వారించిన రాజపుత్త్రిలపుడత్యంతత్వరంబోయి యా
జననాథాగ్రణిఁ గాంచి యిట్టులనిరో సర్వంసహాధీశ! చో
రుని రానీయక వెన్కఁ జేసికొని ధీరుల్ గుండ్రబ్రహ్మయ్యగా
రనివార్యస్థితినున్నవార లివు డాహా సాహసప్రక్రియన్.

వ. అని విన్నవించినవిని యారాజు గుండ్రబ్రహ్మయ్యగారని రావించి చోరునిమ్మని యడిగిన వార లా . . . . . . . .

(వి-వి.)—

అసమగ్రము. కృత్యవతరణిక లేదు. కథారంభమునుండి ద్వితీయాశ్వాసమునఁ గొంతదాఁక గలదు. వ్రాఁత చక్కనిది. తప్పులు లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

సోమదేవరాజీయమను పేరుగల యీ చరిత్రగ్రంథమునఁ గాకతిప్రతాపరుద్రవంశము వర్ణింపఁబడినది. కృతికర్త కూచిమంచి జగ్గకవి. కూచిమంచి తిమ్మకవి తమ్ముఁడు. చంద్రరేఖావిలావ సుభద్రాపరిణయములకుఁ గర్త. మందపాటి నారాయణరాజుగారి ప్రేరణమున నీకృతి కృష్ణున కంకితము చేయఁబడినది. ఆ నారాయణరాజుగారు కాకతిప్రతాపరుద్రునివంశమువాఁడుగా నిందుఁ జెప్పఁబడినాఁడు.

---

## R. No. 524

Paper. $10\frac{7}{8} \times 9\frac{1}{4}$ inches. Foll. 21. Lines, 20 on a page. Mode of writing, fair but incorrect. In good condition.

Transcribed in the year 1918–19 from a MS. of M.R.Ry. Paravastu Vēṅkaṭaraṅganāthācārya Swāmi Ayyavārlu Gāru of Vizagapatam.

సుధాతరంగము.

SUDHĀTARAṄGAMU.

Herein is contained a Telugu commentary on the last two stanzas of the Gaṇitapāda of Āryabhaṭa's mathematical work in Sanskrit, dealting with Kuṭṭikāra or proportionate division. The commentator, Koṭikalapūḍi Kōdaṇḍarāmakavi puts 24 questions and then answers them with quotations from the Līlāvati, the Bhaṭapradīpikā, etc. Probably the author commented on the whole of the Āryabhaṭīya. The date of he commentary is given as Śaka 1766.

**Beginning:**

అథద్వాత్రింశత్త్రి యత్రింశత్సూత్రాభ్యాంకుట్టీకారగణితమాహ.

ఆర్యాద్వయమ్ :—

> అధికాగ్రభాగహారం ఛింద్యాదూనాగ్రభాగహారేణ
> శేషపరస్పరభక్తంమతిగుణ మగ్రాంత రేక్షిప్తమ్
> అథఉపరిగుణమంత్య యుగూనాగ్రభాజితే శేషమ్
> అధికాగ్రఛేదగుణం ద్విచ్ఛేదాగ్రమధికాగ్రయుతమ్.

టీకా. ఈ కుట్టీకారగణితమందుఁబడ్డ ప్రశ్నలు. ౧ ప్రశ్న. యీ మూలసూత్రానకు వ్యాఖ్యానం యేలాగు! ౨ వ ప్రశ్న. యెంతోగాని అజ్ఞాతమైన విభాజ్యరాశిని ౨౯ చేత పాలుకొనంగాను అగ్ర ౧౨ ఉన్నది. ఆ విభాజ్యరాశినె 3×౨ చేత పాలుకొనంగాను అగ్ర అనగా శేషం ౧౦ ఉన్నది. ఆ యజ్ఞాతమయిన యవి భాజ్యరాశియెంతో ఆసంగతమున్ను గుణలబ్ధులప్రకారమున్ను సమవల్లీకుట్టకంమీద చెప్పవలసినది.

**End:**

౨౪ యిరవైనాలుగో ప్రశ్నకు ఉత్తరం. ఈ కుట్టీకారశబ్దానకు అర్థం యేమంటే అంటే "కుట" ధాతువకు "ఛేదనం" అర్థం కాబట్టి అటువంటి ఛేదమును చేసేది కనుక కుట్టకారమని అనిపించుకుంటుంది.

* * * *

**Colophon:**

ఇతి కొటికలపూఁడి కోదండరామ విరచితాయాం సుధాతరంగాఖ్యార్యభటీ యాంధ్రభాషాకృత వ్యాఖ్యాయాంగణిత పాదస్సంపూర్ణః.

"శాలివాహనశకం ౧౭౮౮" అని కలదు.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత యొకతీరుగానున్నది. తప్పు లున్నవి.

ఇందార్యభటీయగణితమందలి కుట్టీకారగణితమును దెలుపు రెండార్యావృత్తములకు దెనుఁగు వ్యాఖ్యానము, ఆగణితసంబంధములైన యిరువదినాల్గు ప్రశ్నములును వాని కుత్తరములును గలవు. లీలావతి, భటప్రదీపిక మున్నగు సంస్కృతగణితగ్రంథములనుండి ప్రకరణానుసారముగా నుదాహరణములు చూపఁబడినవి. దీని రచయిత కొటికలపూఁడి కోదండరామకవి. వీరినిగురించి ఆర్ నె 532,533 రులు చూచునది. ఈతఁడార్యభటీయమునకంతయునిట్లు వ్యాఖ్యానముచియుంచెనట.

## R. No. 525.

**Palm-leaf** 15¾ × 1¾ inches. Foll. 54 Lines, 8 on a page. Mode of writing, good but incorrect. slightly injured.

Presented in 1918–19 by M.R.Ry. Daṇḍemrāju Sūryabhagavānulu Pantulu Gāru, Vizianagaram.

మత్స్యపురాణము.

**MATSYAPURĀṆAMU.**

A Telugu rendering in the Prabandha form of the Viṣṇudharmōttarakhaṇḍa of the Matsyapurāna by Haribhaṭṭāraka, son of Timmamāmba and Rāmavidvānmani of Bhāradvāja gōtra. This work was dedicated to God Śrīraṅganātha. A reference may also be made to R. No. 411 regarding the poet

Breaks off in the 5th Āśvāsa.

**Beginning :**

ఉ. శ్రీకమనీయ గండయుగచిత్రిత కుంకుమపత్రవల్లికా
లోకన హర్షసంయుత విలోచను నబ్జభవాదిదేవతా
నీక కిరీటదివ్యమణినిర్మలకాంతి పరీత పాదభూ
షా కలితుఁ రమావరుని సన్నుతి సేతు ననేకభంగులన్.

*  *  *  *

తే. సకలవైష్ణవధర్మప్రశస్తమగుచు
నంధ్రభాషను విరచితంబైనయట్టి
విష్ణుధర్మోత్తరము లోకవిశ్రుతముగఁ
బ్రేమతోడుత హరికి నర్పించఁబూని.

*  *  *  *

శా. భారద్వాజసగోత్రసంభవుఁడ నాపస్తంబుఁడన్ దిమ్మమాం
బారాజద్వరగర్భసంభవుఁడ రామక్ష్మాసురానేక జ
న్మారూఢాధిక పుణ్యలబ్ధహరినామాంకాత్తసత్పుత్త్రుఁడన్
శ్రీరామావర పాదపద్మయుగళీ చింతాసమాయుక్తుఁడన్.

క. ఈరీతి గోత్రనామాం
కారూఢుఁడ నయిన యేను యత్నముతోడన్
శ్రీరంగపతిఁ గృతీశ్వరుఁ
గా రయమునఁ బాదుకొల్పి కౌతుక మొదవన్.

సీ. ఆయురారోగ్య నిత్యైశ్వర్యములు గలి
విభవంబుతో ధాత్రి వెలయుకొఱకు
ధనమునకై నరాధముల సన్నుతిసేయఁ
బొడమిన పాపముల్ చెడుటకొఱకు
హృదయంబు లక్ష్మీశు పదపంకజములందు
నిశ్చలభక్తితో నిల్చుకొఱకు
రౌరవాదులఁ బాసి రయమున వైకుంఠ
సదనంబునకు వేడ్కఁ జనెడుకొఱకు

బరమవైష్ణవజనులెల్లఁ బ్రస్తుతింప
మత్స్యకృతంబయ్యు హరికథామాన్యమగుచు
నుత్తమంబగు విష్ణుధర్మోత్తరంబు
రంగనాథున కర్పింతు రాణమెఱసి.

**Colophon:**

ఇది శ్రీహనుమత్కటాక్షలబ్ధ వరప్రసాద సహజసారస్వత చంద్రనామాంకరామ విద్వన్మణికుమార అష్టఘంటావధాన పరమేశ్వరహరిభట్టారక విరచితంబైన మత్స్యపురాణ ఖండంబగు విష్ణుధర్మోత్తరంబునందుఁ జతుర్థాశ్వాసము.

**End.**

గీ. నేఁటి కుపవసించి నీగృహంబున నిల్పి
పుండరీకనయనుఁ బూజసేసి
బారసందు వేడ్క ఫలరూపపారణ
చేసి చనెడువాఁడు క్షేమమలర ॥

వ. అని విప్రవరుండు పలికిన విని వనితాలలామ యిట్లనియె.

క. ధరణీసురేంద్ర మాకుం
గురువవు దయచేసి నీవు గోచరముగ శ్రీ
హరివాసర వ్రతక్రమ
మురవడి వినుతింపవలయు నొదవిన వేడ్కన్.

వ. అని సవినయంబుగాఁ బలికిన సుగం . . . .

(వి-వి.)—

ఆదినుండి యయిదవయాశ్వాసమునఁ గొంతదాక గలదు. వ్రాఁత మంచిది. తప్పులున్నవి. ఎలుకకొట్టుచేఁ గొంత శైథిల్యమేర్పడినది. గ్రంథపాతములు గలవు.

మత్స్యపురాణమందలి దగు విష్ణుధర్మోత్తరఖండమునకిది తెలుఁగు. కర్త హరిభట్టారకుఁడు. భారద్వాజగోత్రుడు. తిమ్మమాంబా రామవిద్వ న్మణులకుఁ గుమారుఁడు. ఈకృతి శ్రీరంగనాథస్వామి కర్పింపఁబడినది. ఈ కవినిగూర్చి ఆర్. నె 411 రు చూచునది.

---

## R. No 526.

Palm-leaf. 14½ × 1¼ inches. Foll. 36 Lines, 6 in a page Mode of writing, good and fairly correct. Slightly injured.

Purchased in 1918–19 from M.R.Ry. Tennēti Peda Sannyāsi Śarma of Nandabalaga, Vizagapatam District.

కాళిందీకళ్యాణము

**KĀILNDĪKALYĀṆAMU.**

This is the same work as the one described under R. No. 443 *ante*. By Tumurāda Pāpakavi.

Complete.

(వి-వి )——

సమగ్రము. వ్రాఁత బాగుగానున్నది. తప్పులంతగా లేవు. శైథిల్యమించుకగలదు. గ్రంథపాతములు లేవు. ఇది ఆర్. నె 443 రున వర్ణితమైన గ్రంథమే.

---

## R No. 527.

Palm-leaf. 10 × 1¼ inches. Foll. 93. Lines, 5 on a page. Mode of writing fair and fairly correct In fair condition.

Purchased in 1918--19 from M.R.Ry. Tennēti Peda Sannyāsi Śarma Gāru of Nandabalaga, Vizagapatam District.

లక్ష్మీనృసింహచరిత్రము.

**LAKṢMĪNṚSIṀHACARITRAMU.**

A Prabandha narrating the story of the incarnation of God Viṣṇu as Narasiṁha (man-lion) and the greatness of four of the shrines wherein Nṛsiṁha is worshipped, viz., Ahōbala, Haraṁpāpa, Kṛtasauca and

Simhasaila. The author is Kaṭṭamūri Kāmēśvarakavi of Kāśyapasa gōtra, son of Sāmbamūrti. The work was dedicated to God Śiva.

Breaks off in the third Āśvāsa and wants a few stanzas in the begininng of the first Āśvāsa.

**Beginning** .

. . . . . . . . . రార్థసం
హారణధురీణతా నిపుణులై ఘనవృత్తిసురీతిహీనులై
సరసవచోవిలాసగతి సంగతులేవియు లేక సత్కృతిన్
విరతులెఱుంగ కేని కుకవిప్రకరంబులఁ జెప్ప నేటికిన్.

సీ. ఎవ్వాని జనకుఁడద్రీశజాధిప పదా
లంబనాతిస్ఫూర్తి సాంబమూర్తి
ఎవ్వానిమాత వాగిందిరాగిరిసుతా
ఖండగుణాలంబ కొండమాంబ
భ్రాత లెవ్వానికి రామ లక్ష్మణసముల్
రామలక్ష్మణ లక్షణాసలాఖ్యు
లెవ్వానిఘనగోత్రమిలఁ గాశ్యపము సుప
విత్ర మాపస్తంబ సూత్రయుతము
నట్టి శంకరదివ్యపాదారవింద
వందనానంద సేవనానందవృత్తిఁ
గట్టమూరికులుండ సత్కవిహితుఁడ
మహిత కామేశ్వరాఖ్యా సమంచితుండ.

* * * *

మ హరిభక్తాగ్రణియైన ధీరమతి ప్రహ్లాదప్రకారంబు శం
కర వాణీశులు శ్రీనృసింహుని సుదీర్ఘాయుక్తిఁ బూజించుటల్
నరసింహుండిలఁ గుప్తుఁడై మరల లీలారీతిఁ గన్పట్టని
ర్జరసన్మాన్య పురూరవశ్చరిత పూజాపద్ధతుల్ సెప్పుమా

**Colophon :**

ఇది శ్రీమదుమామహేశ్వర పాదారవింద నిష్యందమాణ మరందలహరీసమాస్వాదన రోలంబాయమానమానసవైభవ సాంబశివ తనూభవ సకలసుకవీశ్వరవిధేయ కామేశ్వరనామధేయ ప్రణీతంబైన లక్ష్మీనృసింహచరిత్రంబునందు ద్వితీయాశ్వాసము.

**End :**

మ. బలినిర్మాల్యము లూడ్చి దేవనిలయాలంకారమున్ జేసి ని
ర్మలుఁడై శ్రీహరిముందటన్ నిలిచి భాస్వన్మంత్రరాజంబు ను
జ్జ్వలరీతిన్ జపియించి పంచకలశస్థాప్యంబుఁగావించి ది
క్కులబంధించి మహాపతీయుతలసత్కుంభస్థ తోయంబులన్.

(వి-వి.)—

తొలిఁపద్యములుకొన్నితప్ప మూఁడవ యాశ్వాసమునఁ గొంతదను కఁగలదు. వ్రాఁత యొకతీరుగానున్నది. తప్పులు మెండుగాలేవు. శైథిల్యగ్రంథపాతము లంతగాలేవు

ఇందు నృసింహావతారచరిత్రమును, దత్త్రేత్రమాహాత్మ్యమును వర్ణింపఁబడినది. కర్తకట్టమూరి కామేశ్వరకవి, కాశ్యపసగోత్రుఁడు. ఇతని తండ్రిసాంబమూర్తి, ఈ గ్రంథము శివాంకితము.

---

## R. No. 528.

Palm-leaf. 18⅝ × 1⅞ inches. Foll. 233. Lines, 6 on a page. Mode of writing, fair but not quite correct. In good condition.

Purchased in the year 1918-19 from M R.Ry M Sītārāma Śāstrulu Gāru of Bobbili, Vizagapatam District

అధ్యాత్మరామాయణము.

ADHYĀTMARĀMĀYANAMU.

A rendering in Telugu of the Sanskrit work of the same name which forms part of the Uttarakhanda of the Brahmāndapurāna. It narrates the story of the Rāmāyana with special attention to the Vēdānatic significance. The author of the work is Kōṭamarāju Nāgayamātya, son of Śāyamāmba and Bhāskaramantri of Kāśyapagōtra.

Contains the first 5 Kāṇdas.

**Beginning :**

శా. శ్రీవైకుంఠము రంగమందిరముగా శ్రీభూసతుల్గొల్వ న
స్తోకావేరీతటమందు శేషఫణిభోగంబూనితా యోగని
ద్రాధిభ్రాజితుఁడైన పుణ్యపురుషున్ రాజీవనేత్రున్ మహా
త్మేవాప్రీతు మహానుభావుఁ గొలుతున్ శ్రీరంగనాథున్ విభున్.

* * * *

గీ. రహిఁ జెలంగెడు కోటమరాజు భాస్క
రాఖ్యమంత్రికిఁ దద్భార్యయైన శాయ
మాంబకును గూర్మిసుతుఁడఁ గాశ్యపసగోత్ర
జనితుఁడను నాగయామాత్యుఁ డనెడువాఁడ.

క. క్షేమముగ నుభయకావే
రీమధ్యతలంబునందు శ్రీభూనీళా
భామలడుగులొత్తఁగ ని
ద్రాముద్రాకలితుఁడైన రంగేశునకున్.

చ. ఎవఁ డుధరాభరంబు హరియింప సురాళినుతింపఁ జిన్మయుం
డవనిఁ బయోరుహాప్తకులమందు జనించి దశాస్యముఖ్యదా
నవులనడంచి పావహానసంబగుకీర్తిని భూమిఁ గప్పి జెం
ది వెలుఁగు బ్రహ్మమాద్యము నుతించెద నాజనకాత్మజావిభున్.

**End:**

క. అనిశివుఁడంబికకెఱిఁగిం
చినగతి విధి నారదునకుఁ జెప్పిన వ్యాసుం
డునునాకుఁ బల్కె వినుఁడం
చనియెను సూతుండు శౌనకాదిమునులకున్.

*  *  *  *

పంచచామరము.

దిగంతసంతతప్రకీర్ణ దివ్యకీర్తిశోభితా!
ఖగేంద్రవాహసర్వలోక కంటకాసురాపహా
జగత్త్రయైకపోషణాను సార్యమానసద్గుణా
దృగంతభక్తభాగధేయ ధీరరంగనాయకా!

**Colophon:**

ఇది శ్రీ మోరుతోటముక్తీశ్వర ప్రసాదలబ్ధ కవితాపవిత్ర కోటమరాజుభాస్కరమంత్రిపుత్ర నాగయామాత్య ప్రణీతంబైన శ్రీమదధ్యాత్మ రామాయణంబను మహాకావ్యంబునందు సుందరకాండము నేకాశ్వాసము.

గ్రంథాంతమున :—

"రుధిరోద్గారి నామ సం॥ ఆ॥ శ్రావణ బ ౨ స్థిరవారంవరకు . . . చేదులకామయ్య వ్రాశెను" అనియున్నది.

(బి-బి.)—

అసమగ్రము. సుందరకాండమువఱకుఁగలదు. వ్రాతయొకతరబడిగా నున్నది. తప్పులంతగాలేవు. శైథిల్యగ్రంథపాతములులేవు.

ఇది సంస్కృతాధ్యాత్మరామాయణమునకుఁ దెలుఁగుసేఁత. కర్త కోటమరాజు నాగయామాత్యుఁడు. భాస్కరమంత్రి పుత్త్రుఁడు. కాశ్యపసగోత్రుఁడు. ఇతని తల్లి కాయమాంబ.

---

## R. No. 529.

Palm-leaf. 15¼ × 1⅛ inches. Foll. 33. Lines 5 on a page. Mode of writing bad and incorrect. In fair condition.

Presented in 1918-19 by M R.Ry. Pakīru Rāju Gāru of Pachipenta, Vizagapatam District.

గౌరీసంవాదము.

GAURĪSAṀVĀDAMU.

This is the same work as the one described under R. No. 479 *ante*.

Complete, but the leaves are not properly arranged.

(సి-బి.)—

సమగ్రము. వ్రాఁతమంచిదికాదు. తప్పులున్నవి. శైథిల్యగ్రంథపాతములంతగాలేవు. పత్రములు తారుమారుగానున్నవి.

ఇది ఆర్. నె ౪౭౯ రున వర్ణింపబడిన గ్రంథమే.

---

## R. No. 530.

Paper 10⅝ × 9¾ inches Foll. 58. Lines, 20 on a page Mode of writing, not good but correct. In good condition.

Transcribed in 1918-19 from a MS obtained from the Mahārājah's Sanskrit Library, Vizianagram.

అనంతచ్ఛందము.

ANANTACCHANDAMU.

This is the same work as the one described under R. No. 169 (e) *ante*.

Complete in four Āśvāsas.

(వి-వి.)—

సమగ్రము. నాల్గాశ్వాసములు. వ్రాంతమంచిదికాదు. తప్పులు లేవు. శైథిల్యగ్రంథపాతములు లేవు.

ఇది ఆర్. నె 169 (సి) రున వర్ణింపబడిన గ్రంథమే.

---

R. No. 531

Paper. 10¼ × 6⅜ inches. Foll. 41. Lines 26 on a page. Mode of writing not good and contains mistakes. In good condition.

Purchased in the year 1918-19 from M.R.Ry. Peṇḍyāla Vēṅkaṭasubrahmaṇya Śāstri Gāru of Masulipatam Kistna District.

రంభానలకూబరవిలాసము.

RAMBHĀNALAKŪBARAVILĀSAMU.

This is a Prabandha describing the amorous sports of Rambhā the celestial courtezan and Nalakūbara son of Kubera. By Baṇḍi Vēṅkaṭasvāmi son of Ceṅgalvarāya. The work was dedicated to God Vēṅkaṭēśa The author states that he also wrote Sundōpasundōpākhyāna.

Complete in five Āśvāsas which are in disorder.

**Beginning :**

శా. శ్రీవామాక్షికుచస్థలీమృగమదశ్రీయుక్తవత్సాంచిత
శ్రీవత్సోరునిజాంగకాంతిమహిత శ్రీకౌస్తుభాభీల శో
భావిద్యోతనాభ్రమేఘమనువిభ్రాంతిందగం జేయు రా
జీవాక్షుండగు వేంకటాద్రిపతిరక్షించుగా గృపాదృష్టిచేన్.

క. హరిపదజకులపరంపర
మురహరభక్తుండు బండిముత్యాలయనుం
పరలీలజనన మొందెను
(?)హరశరద్ధిజంద్రుడుదయమై తగుమాడ్కిన్.

* * * *

శా. ఆ ముత్యాలయరంగ మోదర మహాభాద్యద్వాద్ధిశీతాంశులై
శ్రీమద్వేంగనక్షీరుడన్న యయును జెంగల్వరాయండు న
త్యామోదంబెసగంగ బుట్టిరనసూయాదేవికిన్ గ్రమహా
మోముందమ్ములనుద్భవిల్లిన లసన్మూర్తి త్రయంబుంబలెన్.

*　　*　　*　　*

గీ. రమ్యగుణుఁడైన చెంగల్వరాయునికిని
నారణాంబకుసుతుఁడనై నయముమీఱ
వేంకటస్వామియను పేర వెలసినాఁడ
బుధజనవిధేయుఁడనుచును బుడమియందు.

*　　*　　*　　*

వ. సద్భక్తిసమర్పితంబుగా నాయొనర్పంబూనిన రంభానలకూబర విలాసంబను మహాప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన-

మ. విలసద్గోపురచుంబిగోపురములన్ విద్యావళిన్ గుట్టిమం
బులనుద్యానవనంబులన్ వనములన్ బొల్పొందు ఖేయమ్ములన్
జలసూత్రమ్ముల సౌధయూధముల మించన్ జంద్రశాలాళిచే
నలకాపట్టణ మొప్పు సంతతముఁ గల్యాణమ్ములం జెందుచున్.

**End:**

క. ఈ రంభానలకూబర
హారివిలాస ప్రబంధమశ్రాంతంబున్
గూరిమివిని మెచ్చిచదివెడి
వారికి సౌఖ్యంబులిచ్చు వసుధాస లిలోన్

పంచచామరము.

లసద్వియన్నటత్పతంగరాట్తురంగసంగభూ
వసత్కనత్తపస్విచిత్తవార్జభృంగవారిభూ
హాసన్మహార్ఘనావతంసహంససంసదర్చితా
భాసస్ఫురద్వపుఃప్రతాపభాగ్యసృట్ప్రభంజనా.

**Colophon:**

ఇది శ్రీవేంకటేశ్వర పాదారవింద సేవారత శ్రీమద్బండివంశపయః పారావారరాకాసుధాకర చెంగల్వరాయపుత్ర సుచరిత్ర సుందోపసుందోపాఖ్యాన ప్రబంధరచనాచాతుర్యధుర్య బుధజనవిధేయ వేంకటస్వామి నామధేయప్రణీతంబైన రంభానలకూబరవిలాసంబను మహాప్రబంధంబు నందుఁ బంచమాశ్వాసము.

(వి.వి.)—

సమగ్రము. ఆశ్వాసములు తార్మారుగా వ్రాయఁబడినవి. వ్రాఁత బాగుగా లేదు తప్పులున్నవి. శైథిల్యగ్రంథపాతములు లేవు.

ఐదాశ్వాసముల యీ ప్రౌఢశృంగార ప్రబంధమున రంభానలకూబ రుల శృంగారవిహారాదులు వర్ణింపఁబడినవి. కర్త బండి వేంకటస్వామి. చెంగల్వరాయనిపుత్త్రుఁడు. సుందోపసుందోపాఖ్యానమను వేఱొక ప్రబంధమునుగూడ నీతఁడురచియించెనట. ఇది వేంకటేశ్వరునకు నంకి తముసేయఁబడినది.

---

R. No 532.

Paper. $10\frac{1}{8} \times 9\frac{1}{2}$ inches. Foll. 48. Lines, 20 on a page. Mode of writing, fair and with mistakes corrected. In good condition.

Transcribed in 1918–19 from a MS. of M.R.Ry. Koṭikalapūḍi Kōdaṇḍarāmayya Gāru of Bobbili Vizagapatam district.

జానకీరామశతకము.

JĀNAKĪRĀMA ŚATAKAMU.

Three centums of stanzas in the Sīsa metre and in praise of Śri-Rāma who is addressed as Jānakīrāma in every stanza By Koṭikalapūḍi Kōdaṇḍarāmakavi of Haritasāgōtra. son of Veṅku Sōmidēvī and Vēṅkaṭakṛṣna Sōmayājī, who composed of the Śvētācala māhātmya. The author is said to have been born in the year Prabhava, Śaka 1729 (expired). It is stated that he wrote 38 Sanskrit and Telugu works.

Complete in three Aṅkas, each containing 101 stanzas.

**Beginning:**

సీ. శ్రీరామ కాకుత్స్థ సీతాపతిఖరారి
రాఘవ మనువంశ రామభద్ర
కౌసలేయదశాస్య ఖండన మారీచ
మర్దన దశరథాత్మజ మహేశ
కుంభకర్ణాంతక కుంభజవరద కో
దండపాణి సురేంద్రమథన
తాటకాంతక సప్త తంతుపాలక భర
తాగ్రజ పద్మాక్షయాంజనేయ
సేవ్యమాన కపీంద్ర సంభావ్య తాళ
సప్తకచ్ఛేది సాకేతసద్మ దండ
కాటవీపుణ్యకర లవణాబ్ధిభయద
జానకీరామ దేవతాసార్వభౌమ.

* * * *

Foll. 32 *b*.

సీ. హారితసగోత్రజుం డష్టోత్తరత్రింశ
దాంధ్రగీర్వాణకావ్యఘటకుండు
. . . . .
. . జ్యోతి
షాగమాచార్యుఁడు సర్వవేదాంతమతిసూక్తి
సిద్ధాంతవిదుఁడు సద్బుద్ధియగుచుఁ
జెలఁగుకోదండరామాఖ్యుచేత.

**End:**

సీ. కొటికలపూఁడి సత్కులముననవనేత్ర
మునిశశికవర్షములుచనంగఁ
ప్రభవసంవత్సర శ్రావణాసితహరి
దినముననదితిభాంతిమపదమునఁ
గర్కటకాఖ్యలగ్నమున వేంకటకృష్ణ
సోమయాజికి వెంకు సోమిదేవి
కినిజనియించినీ కృపఁగన్న కోదండ
రామాఖ్యభూసురప్రవరు చేత
నీవుచేయించినట్టి యీనిఖిలసీస
పద్యముల్వినువారికి భద్రమొసఁగి
వేడుకనుబ్రోతువనినిన్ను వేఁడుకొంటి
జానకీరామ దేవతాసార్వభౌమ !

(వి-వి.)——

౩౦౩ సీసపద్యములు. నూటొక్కపద్యమున కొకయంకము చొప్పున మూఁడంకములుగా విభజింపబడినవి. వ్రాఁతయంత మంచిది కాదు. తప్పులు దిద్దబడినవి. శైథిల్యము గ్రంథపాతము లేదు.

“జానకీరామ ! దేవతాసార్వభౌమ” అను మకుటముగల యీ ప్రౌఢసీసపద్యశతకమున శ్రీరామచంద్రుఁడు స్తుతింపఁబడినాఁడు. కర్త కొటికలపూఁడి కోదండరామకవి. శ్వేతాచలమాహాత్మ్య కర్తయగు వేంకటకృష్ణసోమయాజికిని, వేంకు సోమిదేవికిని బుత్త్రుఁడు. ఇతఁడు శాలివాహనశకము ౧౭౨౯ కి సరియగు ప్రభవసంవత్సరమున జన్మించె నట. మఱియు నతఁడు ౩౮ సంస్కృతాంధ్రకావ్యములను రచియించి నట్లు చెప్పుకొన్నాఁడు.

R. No. **533**.

**Paper.** $10\frac{3}{8} \times 9\frac{5}{8}$ inches. Foll. 22. Lines, 20 on a page. Mode of writing, fair and fairly correct. In good condition.

Restored in the year 1918–19 from a Ms. of the Library.

ఆనందరంగచ్ఛందస్సు.

ĀNANDARAṄGACCHANDASSU.

By Kastūriraṅgakavi. This MS. gives the preface to the work described under R. No. 159(*b*). It contains valuable historical details about the events and persons at the time of Dupleix under whom Ānanda Raṅga, the patron of this work was a Dubash. The patron is said to be a descendant of Rāmarāya of Candragiri who was the brother of Kṛṣṇadēvarāya of Vijayanagar

**Beginning :**

శా. శ్రీవత్సస్థలిముద్దుగులుకుచును ధాత్రీదేవినీలాసతుల్
గాఁగేవలనొప్పనిర్జరవధూటీకోటిసద్భక్తిచే
సేవల్సేయఁగ హార్దరీతిగొలువై చెల్వొంద లోకేశ్వరుం
డావిష్ణుండొగిఁబ్రోచుఁగాతదయతోనానందరంగాధిపున్.

క. యావనజనపావనఘన
పావన గుణశాలికి సముపార్జితభాస్వ
ద్భావిజయ శ్రీవిజయ
శ్రీవిజయానందరంగనృపచంద్రునకున్.

వ. అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నాయొనర్పింపంబూనిన లక్షణ చూడామణియైన యానందరంగచ్ఛందం బనుపేరఁ జెలువొందు లక్షణ గ్రంథఁబున గవితాలక్షణప్రకరణంబునకుం గలిగిన మార్గంబులన్నియు విశదంబుగా వించెద.

(వి-వి.)——

గ్రంథావతరిక మాత్రము. వ్రాఁత యొకతీరుగా నున్నది. తప్పు లంతగా లేవు. శైథిల్య గ్రంథపాతములు లేవు.

ఇది ఆర్. నె 159(b) రున వర్ణింపబడిన గ్రంథముయొక్క కృత్యవతరణిక. కృతిపతియగు నానందరంగరాజు శ్రీకృష్ణదేవరాయల యన్నయుఁ జంద్రగిరి దుర్గాధిపతి యునైన రామదేవరాయలవంశములోని

వాఁడట. ఇతనియొక్కయు, నితని పూర్వులయొక్కయు విజయాదికములను, విలువచారిత్రములను దెలుపు భాగమత్యధికమగుటచే నిటను దాహరింపఁబడఁడయ్యెను.

---

## R. No. 534.

Palm-leaf 15½ × 1¼ inches Foll. 51. Lines, 5 on a page. Mode of writing, good and fairly correct. In good condition.

Purchased in 1918–19 from M.R.Ry Kāsibhaṭla Kṛiṣṇarāya Śāstri Gāru of Sālur, Vizagapatam district.

రుద్రాక్షమాహాత్మ్యము.

RUDRĀKṢA MĀHĀTMYAMU.

This is the same work as the one described under R. No. 412 *ante*. By Amalāpurapu Sannyāsi kavi.

Complete.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పు లంతగా లేవు. శైథిల్య గ్రంథపాతములు లేవు.

ఇది ఆర్. నె 412 రున వర్ణింపఁబడినదే.

---

## R. No 535.

Paper. 10 × 9¾ inches Foll. 41. Lines, 20 on a page. Mode of writing, bad and incorrect. In good condition

Transcribed in 1917–18 from a MS of M.R.Ry Caduvula Rāmaliṅgayya Gāru of Narasapur, Kistna district.

కల్యాణమాహాత్మ్యము.

KALYĀṆAMĀHĀTMYAMU.

Foll. 1*a*—37*b*.

A composition written in colloquial prose describing the greatness and sanctity of a place named Kalyānapuram probably Bangalore. Every passage is here addressed to Vīrasōmaguruliṅgaprabhu.

Complete.

**Beginning :**

శ్రీశైలమునులకు కల్యాణ . . . మ అల్లమాప్రభువు చెప్పు చున్నాడు. వినరోయీ మునులారా ! స్వస్తి. సమస్తమైన కల్యాణ పురం మహిమ మేరువగిరి అద్దంలో చూచినట్లు లోకులకు సంక్షేపముగా చెప్పెదను. ద్వితీయశంభుమూర్తియైన బసవన్న ఉండే కల్యాణపురం మహిమ యెటువంటిదంటేను.

పదునాల్గు భువనములకు కు(క)లిశంవంటిది
బ్రహ్మాండాలకు ముఖదర్పణంవంటిది.

**End :**

గురువుశరణునికి తల్లిదండ్రి లింగశరణునికి బురుషుండుకాబట్టి లింగ మేశాయనలయును శరణుడు చింగమానకు ఆధారనశేశేదేధర్మం శరణు నకు.(?)

(వి-వి.)——

సమగ్రము. వ్రాంత బాగైనదికాదు. తప్పులు కుప్పలు. శైథిల్యగ్రంథపాతములు లేవు.

ఇందు బసువేశ్వరనివాసమగు కల్యాణపురమహిమ వర్ణింపబడినది. ఇది వ్యావహారికవచనములు ప్రతివచనము కడపట "వీరసోమగురులింగ ప్రభువే" యను మకుటము గలదు.

పత్రము 38-41$^{a}$ వరకు "విమలాంగ సిద్ధలింగ" యను మకుట ము గలిగి శైవమాహాత్మ్యమును బ్రతిపాదించు సీసపద్యములు ౧౦ కలవు. కర్త తెలియదు.

---

## R. No. 536.

Paper. 10$\frac{3}{4}$ × 9$\frac{1}{2}$ inches. Foll. 16. Lines, 20 on a page. Mode of writing, fair and fairly correct. In good condition.

Transcribed in 1918–19 from a MS. ot M.R.Ry. Kōṭi Rāmamūrti Śāstri Gāru of Pōtanapūḍi agraharam, Vaḍḍādi Post.

ఆంధ్రశబ్దచింతామణి సవ్యాఖ్యము.

ĀNDHRAŚABDACINTĀMAṆI WITH COMMENTARY.

The text is the same as that described under R. No. 85 *ante* and the commentary herein added is the same as what is printed under the name Ahōbalapaṇḍitīya.

Contains the first and the second Paricchēdas incomplete.

**Beginning :**

"విశ్వశ్రేయఃకావ్యమ్."

కీర్త్యాదిసమస్తశ్రేయస్సాధనం కావ్యం శుద్ధసారోపలక్షణతయాఽవ్యభిచారేణ కావ్యనిష్పాదకత్వం ధ్వన్యతే, కవయతే వర్ణయతీతి కవిః. సచ ॥

సత్కులీనశ్శుచిర్దక్ష శ్ఛందోవ్యాకరణాదివిత్,
ప్రశాంతస్సుభగాకారో దైవజ్ఞశ్శకవిద్భవేత్.

ఇత్యాదివచనోక్తగుణసంపన్నః. సచ, వివేకి, వాచిక, రౌచికా, ర్థిక శిల్పక, భూషణార్థి మార్దవానుగతాఖ్యాభిః సప్తవిధః, గుణదోష విభాగజ్ఞో వివేకీపరికీర్తితః.

**End :**

వాక్యంచాత్ర పాదఏవ, సీసాదిషు ప్రతిపాదంవాక్యమ్, వృత్తాదిషు పూర్వార్థముత్తరార్ధంచ వాక్యద్వయమ్, క్వచిత్పద్యభేదేనైవలుక్, పద్యభేదావసానేషు శిష్టతావశ్యంకథ్యత ఇతి తేనైవోక్తత్వాత్; ఏతాదృశగుణగణసంఖ్యా.

(వి-వి.)——

అసమగ్రము. మొదటి రెండు పరిచ్ఛేదములు నసమగ్రములుగ గలవు. వ్రాఁత యొకతరబడిగానున్నది. తప్పులంతగాలేవు. శైథిల్యగ్రంథపాతములు లేవు.

ఇందాంధ్రశబ్దచింతామణి సూత్రములును, వానికి వ్యాఖ్యయుఁ గలదు.

---

## R. No. 537.

Palm-leaf. 15 × 1¼ inches. Foll. 48. Lines, 5 on a page. Mode of writing, fair but fairly correct. In good condition.

Purchased in 1918-19 from M.R.Ry. Tennēṭi Pēdasannyāsi Śarma Gāru of Nandabalaga, Vizagapatam district.

(*a*) త్రిస్తబకరామశతకము.

TRISTABAKARĀMAŚATAKAMU.

**Foll. 1*a*—9*b*.**

A centum of stanzas in the Kanda metre in praise of God Śrī Rāma by Krōlēṭi Jōgayārya. Every stanza contains three rhyming attributes and this probably accounts for the name of the work.

Complete in 110 stanzas.

**Beginning :**

క. శ్రీ మత్సూర్యకులాంబుధి
సోమా! సోమాద్య శేషసురగణ్య గుణ
గ్రామా! పరభీమా! వర
భామా చరమాస్య! జగదుపాస్యా! రామా!

**End ;**

క. క్రోలేటిజోగయార్యుని
పాలింపుచు నాదరించి భరియింపు కృతిన్
శ్రీలాలితమాలా వృత
నీలాసితగాత్ర కనకనేత్రా! రామా.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత యొకతరబడిగానున్నది. తప్పులు లేవు. శైథిల్యము గ్రంథపాతములు లేవు

"రామా" యను మకుటముగలిగి ౧౧౦ కందపద్యములుగల యీ శతకము రామస్తుత్యాత్మకము. కర్త క్రోలేటి జోగయ.

(b) హైమవతీసతీపతిచత్వారింశతి.
HAIMAVATĪ SATĪPATICATVĀRIMŚATI.

Foll. 10a—15a. Foll. 15b—26b are left blank.

Forty stanzas in praise of God Śiva the husband of Pārvatī daughter of the Himālayas. The author's name is not given.

Complete.

**Beginning :**

ఉ. శ్రీకర భక్తమానస వశీకర సర్వ సుపర్వరత్న ర
త్నాకర సృష్టి రక్షణలయ ప్రముఖాఖిల సద్గుణాకరా
స్వీకృతయామినీకర నవీనకరాభరణైక శేషధ
రీకృతమస్తక స్థితసరిద్వతి హైమవతీసతీపతీ.

**End.**

చ. తనువిఁక నిత్యమానెయని తత్పరవృత్తియు మానెనతర్కథల్
విసుటకు లోనెనిన్నెపుడు వేడ్కఁదలంపుచుఁ జిత్తమానెసా
ధనమయినే నెతెత్తునమృతంబని శే ముషిభక్తిఁబూనెనే
మనినను బ్రోవరావు జగదాకృతి హైమవతీసతీపతీ.

(వి-వి.)—

నలువది పద్యములు వ్రాఁత యొక్క తీరుగనున్నది. తప్పులు మెండుగాం లేవు.

ఇందు శివస్తుతి చేయఁబడినది. కర్త తెలియరాదు.

(c) సూర్యనారాయణశతకము.

SŪRYANĀRĀYAṆA ŚATAKAMU.

Foll. *27a—42b.*

A centum of stanzas in praise of God Sūrya(Sun), by Varāhanṛsimha kavi of Bhāradvaja gōtra.

Complete in 108 stanzas.

**Beginning:**

శా. శ్రీమత్సర్వ సుపర్వసేవితములై క్షేమాంకలక్ష్యంబులై
ధామశ్వస్త సమస్తలోకనిబిడధ్వాంతంబులై మించునీ
రామాంఘ్రుల్ గొనియాడివృత్తశతకగ్రంథంబునీ కింపుగాఁ
బ్రేమన్ గూర్చెదఁ జిత్తగింపుమెలమిన్ శ్రీసూర్యనారాయణా!౧.

శా. భారద్వాజ పవిత్రగోత్రజుఁడ విప్రశ్రేష్ఠవంశ్యుండ వి
ద్యారక్తుండ వరాహవేంకటనృసింహాఖ్యుండసద్భక్తినిం
పారం గొల్చుచునీకు వృత్తశతకంబర్పింతు వాగ్దోషముల్
చేరంజూచి కృపన్ సహింపుమదిలో శ్రీసూర్యనారాయణా!

**End:**

శా. ఈమీఁదన్ భవదీయభూరిదయనేనెంతే సుఖశ్రేణిచే
నామోదించి నిరామయప్రకృతినై హర్షింపుచున్ భావచిం
తా ముక్తింగనిముక్తికాంతమదిలో స్తంభింపనీపాదముల్
వేమాతెంచి భజింపుచున్ దిరిగెదన్ శ్రీసూర్యనారాయణా!

౧౦౮.

(వి-వి.)—

౧౦౮ పద్యములు. వ్రాఁత యొక తీరునన్నది. తప్పు లంతగా లేవు.

ఇది సూర్యస్తుత్యాత్మకమయిన వృత్తశతకము. కర్త వరాహ వేంకట నృసింహకవి. భారద్వాజగోత్రుఁడు.

---

R. No. **538.**

Paper. 10⅜ × 10 inches. Foll. 127. Lines, 20 on a page. Mode of writing, fair but incorrect. In good condition.

Transcribed in 1918-19 from a MS. of Vāsireḍḍi Candra Mauḷīśvaraprasāda Bahadur, Zamindar, Muktyāla, Kistna district.

శివరాత్రిమాహాత్మ్యము.

ŚIVARĀTRIMĀHĀTMYAMU.

A Prabandha in five Āśvāsas describing the sacredness of the Śivarātri day. By Akkanārya son of Mṛtyuñjayabrahma of Viśvajña-gōtra. The author belongs to the Viśvakarma caste and dedicates the work to God Mallikārjuna worshipped at Śrīśaila.

Complete without the colophon of the last Āśvāsa.

**Beginning:**

శా. శ్రీభూభృత్తనయావివాహవసరశ్రీ శ్రీభారతుల్ యెత్తుకో
శోభావ్యక్తిగ జీరకఱ్ఱగుడవిస్ఫూర్తి న్విమర్దింపఁగా
నాభాగీరథి తోయమంచు నిజబింబాలోకన వ్యాంగనం
చుఁ భావించఁగఁ జంద్రమండనముఁ బూన్చుఁ శంభుమంబ్రోవు
[తఁ.

* * * *

క. ఆదంపతులకు నీశ్వరు
నాదరకరుణా కటాక్షణాలోకనచే
గాదిలి తనయులమైయా
హ్లాదముగానకఱ్ఱపల్లి రాముఁడనంతుల్.

వ. అందునగ్రజుండనైనయేనును ఆకఱ్ఱపల్లినామధే
యుండనంబరఁగి . . .

ఉ. లాలిత మోక్షదీక్ష శివరాత్రి మహత్త్వముఁ జెప్పఁబూని శ్రీ
శైలపు మల్లికార్జున విశాలయశస్స్వవిశేషవైభవో
ద్వేలిత శ్రీమహామహిమ దివ్యము విశ్రుతమొప్పనాదిగన్
వైళమె చెప్పఁగావలయుఁ వచ్చుఁబునర్జన నంబుదప్పగన్.

**Colophon :**

శ్రీమత్పరబ్రహ్మప్రతిభ నిశ్శంక నిరంకుశ శ్లిష్టయిష్టప్రాణభావైక ప్రసాదనిష్ఠాగరిష్ఠ లబ్ధకవితా విశేష విశ్వజ్ఞ గోత్రపవిత్ర మృత్యుంజయ బ్రహ్మసత్పుత్ర అకలనార్య ప్రణీతంబైన శివరాత్రి మాహాత్మ్యంబను పురాణకథయందుఁ . . . .

అన్నది చతుర్థాశ్వాసము.

**End :**

(?) క. దుర్జనహృదయవివర్జన
గర్జితరిపు ఘోరపాప భర్జితచరణా
నిర్జరవరసురపూజిత
సజ్జన శ్రీశైల (నిలయ?) మల్లికార్జునరామా.

(వి-వి.)—

సమగ్రమే కాని గ్రంథాంత గద్యము మాత్రము లేదు. అయిదాశ్వాసములు. వ్రాఁత యంత మంచిదికాదు. తప్పులకుప్ప. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

ఈ ప్రబంధమున శివరాత్రి మాహాత్మ్యము వర్ణింపఁబడినది. రచయిత అకలనార్యుఁడు. మృత్యుంజయ బ్రహ్మకుమారుఁడు. విశ్వజ్ఞగోత్రుఁడు. విశ్వకర్మ కులజుఁడు. ఇది శ్రీశైల మల్లికార్జునస్వామికిఁ గృతి యీఁబడినది.

---

**R. No. 539.**

Paper. 11⅞ × 10 inches. Foll. 190 Lines, 20 on a page Mode of writing, fair and not correct. In good condition.

Transcribed in 1918-19 from a Ms. of Vāsireḍḍi Candramaulīśvaraprasāda Bahadur, Zamindar of Muktyāla, Kistna district.

శరభరాజీయము.

## ŚARABHARĀJĪYAMU.

A treatise in medicine describing the nature of various diseases, their diagnosis, the manner of treatment, and the preparation of medicines, etc.

The first fourteen Paddhatis comprising, three Āśvāsas were written by Tuḻḻūri Śarabharājakavi, son of Vīranārya of Śrivatsagōtra. He is said to have been a descendant of Śivadēvaya, the chief minister in the court of Pratāparudramahārāja and a resident of Orugallu warangal. The author dedicated the work to God Āñjanēya worshipped in the shrine at Kumarapūdi. His other works are noted in the Telugu remarks below. The remaining Paddhatis were written by his son Mādhava at the instance of his father and were dedicated to God Kōṭīśvara.

Contains 29 Paddhatis.

**Beginning :**

శా. శ్రీకరమైన మద్హృదయ సీమనొకప్పుడుఁ బాయకుండి వి
ద్యాకలితావిభూతు లనయంబును నిచ్చి కృతార్థుఁ జేయునా
లీకభవాచ్యుతాది సురలీలలఁ గల్పనమాటి మాటికిన్
జేకొను శంభుపాదసరసీజము లేను నుతింతు వేడుకన్.

* * * *

గీ. కరము ప్రత్యక్షమయ్యు ముందఱను నిలిచి
మృదులహస్తము సాచి నా మేను నివిరి
శరభరాజాహ్వయని పిల్చి సరభసమునఁ
బటుదయాశక్తి నిట్లని పలికె నతఁడు.

సీ. శయ్యాచమత్కార సరసతఁ గూర్చితి
మహిని శృంగారసుధార్ణవంబు
పాకభేదముల నేర్పడఁ గలిగింతి వినుతి
పేయఁ బ్రజ్ఞావతీ గాయభార
మవలీలరచియించి తౌనన లవలీవి
వాహంబు కవిరాజవర్ణితముగ
సరసులు పొంగఁగా సమకూర్చ్య లేదె భా
గవతాభ్యుదయ మను కావ్య మొకటి

వలికితివి వేడ్కఁ గాళిందిపరిణయంబు
పార్వతీనాథ విష్ణులఁబ్రస్తుతించి
శతకముల్పెక్కుఁ గూర్చితి శరభరాజ.
యెన్నసామాన్య కవివెకవీంద్రమౌళి

*    *    *    *

సీ. కార్మణభేషజకల్ప ఖాహాటాది
వైద్యశాస్త్రములు గీర్వాణభాష
నార్యులు చెప్పిరి అందులనర్థంబుఁ
బ్రాకృతులకు బోధపడదుగాన
పద్యంబులు తెలుంగుబాస నేర్పఱచిన
కలజనులకు మోదకరముగాఁగ
సర్వవైద్య గ్రంథసారంబుదీసిభవ ?
తాక్కావ్యంబులోనుంచి శ్రావ్యముగను
శరభరాజీయమను పేరశాస్త్రమొకటి
కల్పనముఁ జేసి మత్కృతి గాఁగదలఁచి
యొసఁగు శుభములునీకగునుర్విలోన
సాధుసంతాన శరభరాజప్రధాన!

*    *    *    *

సీ. శ్రీమదష్టాంగ ప్రసిద్ధయోగాభ్యాసి
ధరనోరుగంటి సత్పురవాసి

*    *    *    *

అమల శ్రీవత్ససంయమి గోత్రపావని

*    *    *    *

అనఁగనుతి కెక్కు శివదేవుఁడ నెడుయోగి
నాయకుండు సదా మోక్షదాయకుండు.

చ. అతఁడు ప్రతాపరుద్ర వసుధాధిపుచేత నవాగ్రహారముల్
హితమతి నందినిత్యసచివేశ్వర సంతతికెల్ల మేటియై
యతులిత సంస్కృతాంధ్రకవితా వలికెల్లఁబితామహుండనన్
సతతము వన్నెకెక్కె బుధసంఘములోన మహాప్రసిద్ధుఁడై.

క. ఆ విభువంశంబునఁ గుల
పావనుఁడై పుట్టెసర్వపార్యుఁడు బుధసం

సేవితుఁడై నుతికెక్కెను
భావజ సంహారుని కృపను బ్రభువుల సభలన్.

క. అరసి కామాత్యుఁడు తు
ష్టూరు మిరాసిగనుఁ గొనుట సుర్వీస్థలిఁ దు
ష్టూరు వారనుచుఁ గొందఱు
సూరు లనిరి నాఁటనుండి శుభమిగురింపన్.

* * * *

గీ. అగ్రజుఁడ నేను శరభరాజాహ్వయుండ
తమ్ముఁడమ్మయ్య విజ్ఞాన తత్త్వవేది
తదనుజన్ముఁడు బుచ్చయ్య ధర్మమూర్తి
పిన్నతమ్ముని వియ్యన్న నెన్నఁదరమె.

సీ. . . . . . . .
శివదేవకుల సుధార్ణవహిమాంశుండను
వీరనార్యసుతుండ విమలమతిని
సతతలింగార్చనా సక్తచారుహృదయు
. . . . . . .
నధిక కవితను శరభలింగాహ్వయుఁడ

క. శ్రీమంతున కరిసంహార
ధీమంతున కనుపమాన దీపితహరిరాట్
సామంతునకును శుభవిభ
వామిత శ్రీకొమిరపూఁడి హనుమంతునకున్

* * * *

గ్రంథావతారిక :—

సీ. నాడీనిదానమెన్నఁగ ద్రవ్యశుద్ధులు
భస్మసింధూరముల్ బహువిధంబు
లైన రసంబులు నఖిలరోగములకు
ఘృతరసాయన లేహ్యతతులు వటిక
చూర్ణతైలములు సంపూర్ణమా నేత్ర్యాట
యాఁబదియాఱు రోగాహ్వయములు
జననలక్షణ చికిత్సలు కషాయంబులు
పదిరెండు పద్ధతులఁదెరుపఱిచి

రమణబాహాట సారసంగ్రహములాది
గావిమర్శించి పద్యముల్గానొనర్తు
బుధులుగణుతింపఁ గడుబాలబోధగాను
అవనినాచంద్ర తారార్కమగుచువెలయ.

**Colophon :**

**Foll. 81(*a*).**

ఇది శ్రీవేణుగోపాలవరప్రసాదలబ్ధ కవిత్వవైభవ విరాజతుల్జారుశరభరాజ ప్రణీతంబైన శరభరాజీయంబను వైద్యశాస్త్రంబునందు వాతప్రకరణంబును, దోషజ్వరప్రకరణంబును, సన్నిపాతప్రకరణంబును, జ్వరప్రకరణంబును గలతృతీయాశ్వాసము.

**Fol. 82*a*.**

శా. శ్రీమన్నారదజైమినిప్రముఖసంసేవ్యుండు వేదాంతవి
ద్యామాధుర్యరసానుభావగణరాట్ప్రాత్పర్యసంధానని
త్యానందస్మిత చారువాఙ్మపుణుఁడా త్మానందముప్పొంగఁగా
హేమాద్రీశ్వరచాపధారుఁడగు కోటీశుండునన్ బ్రోవుతన్.

* * * *

సీ. మామకజనకుండు మదనారిసదృశుఁడౌ
శరభాహ్వయుండు నీశాస్త్రమందు
పదునాల్గు పద్ధతుల్బాగుగావిరచించి
యొకనాఁడు నన్నుఁజూచియోరిపుత్ర
మాధవాహ్వయిక మర్త్యసుఖంబొల్ల
భూతేశుఁజేరఁగాఁ బోదునీవు
కడమపద్ధతులను నుడువుకోటీశ్వరు
కరుణచే నీకబ్బుకవితఁజెప్ప
శక్తియనుచు నతఁలసతర్పపబోధించి
కాలకాల ధృతకపాల శర్వ
శివ మహేశ శూలి శ్రీకంఠ యనుచును!
దనువువిడిచి శివపదంబుఁజేరె.

* * * *

క. గిరిజారమణుని పలుకులు
వరకావ్య శ్రేణిమృదుల వాక్యంబులనే

నరయనొకటయ్యెఁ గావున
విరచింతును వైద్యశాస్త్రవిషయములనుచుణ్ణ.

* * * *

**End:**

భావనహరీతకీప్రకరణము.

సీ. కలిలోను సేనాఁటుకరకకాయలుపోసి
యారంగ మున్నాళ్లకొక్కసారి.

* * * *

కరమరుత్తృష్ణ హీనాకములగొట్టి
క్రమమునడిపించు భావనకరకకాయ.

* * * *

ఇది శ్రీశరభరాజీయంబను వైద్యశాస్త్రమునందు భావనక్రియా విశేషములన్నది యిరువదితొమ్మిదవ పద్ధతి.

(వి-వి.)—

౨౯ పద్ధతులుకలవు. వ్రాఁత యంత మంచిదికాదు. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములు లేవు.

ఇది యొక వైద్యగ్రంథము. ఇందు రోగములు వానిని గుర్తించు పద్ధతులు, తత్తద్రోగ నివారణౌషధములు, తత్తదౌషధయోగములు, తత్ఫలములు మున్నగు విషయములుకలవు. ఆశ్వాసత్రయపరిమితములైన పదునాల్గుపద్ధతుల గ్రంథమునకుఁగర్త తుళ్లూరిశరభరాజకవి. వీరనార్యుఁని పుత్త్రుఁడు. శ్రీవత్సగోత్రుఁడు. ఓరుగంటినివాసియు, ప్రతాపరుద్ర మహారాజునకు మంత్రియై యతనిచేతనవాగ్రహారము బడసినశివదేవయ్యయను మహామహునివంశములోనివాఁడు. తక్కిన ౧౫ పద్ధతులకుఁగర్త యితనిపుత్త్రుఁడగుమాధవకవి. శరభరాజకవి తనమరణసమయమునఁబుత్త్రుఁడగుతన్నుమిగిలిన భాగమునురచింపఁగోరఁగా నితఁడు రచియించెనట. తండ్రి తానురచించినభాగమును గొమిరెపూఁడియందలియాంజనేయస్వామికిని, పుత్త్రుఁడు తానుజెప్పినభాగమును గోటీశ్వరస్వామికిని కృతినిచ్చిరి. శరభరాజకవియితరకృతులు: శృంగారసుధార్ణవము, ప్రజ్ఞావతీ రాయభారము, లవలీవివాహము, భాగవతాభ్యుదయము కాళిందీ పరిణయము. హరి, హరస్తుత్యాత్మకములగు ననేకశతకములు.

పే. 1 మొదలు 34 వఱకు నీగ్రంథభాగమే పెక్కు-పాతములతోఁ గలదు. గ్రంథాంతమున పే. 331 మొదలు చివరవఱకు విషయసూచి వ్రాయఁబడియున్నది

---

## R. No. 540.

Paper. 11 × 7¾ inches. Foll. 35. Lines, 4 on a page. Mode of writing, fair and correct. In good condition.

Presented in 1918-19 by M.R.Ry. Daṇṇemrāju Sūrya-bhagavānuḍu Pantulu Gāru, Vizianagaram, Vizagapatam district.

రాజారాణీవిలాసము.

RĀJĀRAṆĪVILĀSAMU.

A musical composition with songs written in Sanskrit, Telugu and Hindi languages and describing the love scenes of a king and his queen. Every song contains at the end the name of Narasiṁha Appala Vijaya Rāmabhūpati (probably of Vizianagaram). The author's name is not known.

Incomplete.

**Beginning** :

శ్రీరాగము-మటితాళము.

శ్రీ హిమశైలతనుజే సార్వభౌమే-ఉమే గిరీశరమణి జగజ్జనని-శంకర హృదయాంబుజాత మకరందరసానుభవనానుకంగమదభృంగమణి, శ్రీ

జంభశాసన జృంభవిదళన శుంభమహిష నిశుంభను దంభావనిజ మదకు భి శర్వాణి, ఘనవేణి. శుకవాణి, మృదుపాణి శ్రీ.

పల్లవారుణ సల్లలితసంఫుల్లవనజ సముల్లసదంఘ్రిసమాశ్రిత మనో-వరకల్పతరువ . . . వమల్లికుసుమాంగీ ౨. శ్రీ.

శ్రోతృజనసంభూత దురితవిధూత సంకురుమాత రనంతసు తాయ(?) రైశ్వర్యమారోగ్య సౌభాగ్యపరిపాలనం గౌరి ౩. శ్రీ.

జనరసింహాప్పలవిజయ రామభూపకృపాహృదయే సతి పాలయాస్మా నవం తాయురైశ్వర్యసుఖభాగినీదేవి ౪. శ్రీ.

దీనిలో స్వరము.

నీసనిప । పానిపమ । మాపమరి । రిగరిసా । ససరిర్రిరిమ । మ్మమప । ప్పపని । మరిమప । నిసారి । నిసపని । షపమ । పనిమపమ । మపరి గరి । సరిస । సనిపమ । రిగరిస । రిరిమ.

భజనశహానారాగ్ త్రితాళ్.

దేవికళ్యాణి జయదుర్గభవాని మాతేబుద్ధిసిద్ధిసఖదేతభవానీ.

. . నశెఖరదానికళ్యాణిమాతే అం.

సజలజలదరు . . . వేణి శంకరకెమహారాణి శర్వాణి ।

జలజవిలోచనకె నిజసోదరితులసిదాసబరదాని కల్యాణిమాతే. దేవి.

**End:**

మంగళకౌశిక—ఆదితాళం.

జగదీశ్వరికిని మంగళం-శంకరురాణికి మంగళం నలువమొదలుదివిజులు పదజలజము లలముచు వినతులుసలుపఁగను-చెలఁగి మునులు నుతిసే యఁగ భాసిల్లు లలితాంబకు జయమంగళమ్.

* * * *

వేయువిధంబిది వెలయఁగఁజేసిన
విదితుఁకును వినువారికి
ఆయురారోగ్య పుత్రాదిసంపద
లందఁజేయుజగదంబకు
శంకరురాణికి మంగళమ్

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత యంత తిన్నగది కాదు. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములు లేవు.

ఇది యొకటి యక్షగానప్రబంధము. ఇందు శృంగార గేయములు సంస్కృతమునను తెనుఁగునను, హిందిభాషనుగలవు. ప్రతిగేయముయొక్క-యంత చరణమున శ్రీనరసింహాప్పల విజయరామ భూపతి ప్రశంసకలదు. కర్త ఎవ్వరో తెలియదు.

---

## R. No. 541.

Paper. $10\frac{5}{8} \times 9\frac{3}{4}$ inches. Foll. 23. Lines, 20 on a page. Mode of writing, good and fairly correct. In good condition.

Transcribed in 1918-19 from a MS. of M.R.Ry M. Rāmacandra Śāstri Gāru of Vizagapatam.

(*a*) హనుమచ్ఛతకము.

HANUMACCHATAKAMU

Foll. 1*a*—21*b*.

This is the same work as the one described under R. No. 298 *ante*. It is stated to have been composed by Sistu Kṛṣṇamūrti Śāstri at the instance of Kākarlapūḍi Vijaya Nṛsiṁhabhūvibhu.

Contains 101 stanzas.

సీ. శ్రీకవితోత్తమ కాఁకర్లపూఁడిగో
    త్రతటీరవారిధిదానచంద్ర
రామచంద్రావనీరమణ జగన్నాథ
    రాజన్య నీలాద్రిరాజ పద్మ
నాభః సుంధరానాయకానుజుఁడగు
    విజయనృసింహ భూవిభుఁడు శిష్ట
గోత్రసర్వజ్ఞసత్పుత్త్రిరిఁ గృష్ణమూ
    ర్తి సమాహ్వయుని నన్ను సరళోక్తి

బహుమతియుతంబుగా జగత్ప్రాణనంద
నాహ్వయాంకిత శతక మత్యనుపమముగఁ
గూర్పుమనఁ గూర్చినాఁడ నా నేర్చినట్లు
వారిరుహబంధుసుతమిత్ర వాయుపుత్ర.

(వి-వి.)—

౧౦౧ పద్యములు. వ్రాఁత తిన్ననిది. తప్పులంతగా లేవు. శైథిల్య గ్రంథపాతములు లేవు.

శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి దీనిని గాఁకర్లపూఁడి విజయనృసింహ భూవిభుని ప్రోత్సాహమున రచియించినట్లు చెప్పుకొన్నాఁడు. ఇది ఆర్. నె 298 రున వర్ణింపఁబడినదే.

(b) హనుమద్దండకము.

HANUMADDAṆḌAKAMU.

Foll. 22 *a*—23 and Fol. 23 *b* is left blank.

Similar to the above. This is written in the Daṇḍaka metre. The author may be the same as that of the previous work.

Complete.

**Beginning :**

శ్లో. శ్రీమద్విజయనృసింహ
    క్షితిపతి మతికర్ణవర్ణితవితీర్ణి
ఉభ్యర్ణమేత్య హనుమా
    న్పూర్ణం స్వర్ణాదిభిః క్రియాత్పూర్ణమ్.

శ్రీవాయుసూనో ! ప్రతాపప్రభానిర్జితోద్యద్బృహద్భానుభానో !—

**End:**

త్వదన్యం సమస్తార్థవిస్తారయుక్పాండితీభోగభాగ్యాతియోగ్య త్వ సంధాయినం నైవపశ్యామ్యహశ్యాం తదద్యైవ మాంపాహి మాంపాహి మాంపాహి.

(వి-వి).—

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పులంతగా లేవు. శైథిల్య గ్రంథపాతములు లేవు.

హనూమత్సుత్యాత్మకమగు నీదండకమును శిష్టు కృష్ణమూర్తి శాస్త్రియే రచియించియుండవచ్చును.

---

R. No. **542**.

Paper. 10¼ × 9⅝ inches. Foll. 9. Lines, 20 on a page. Mode of writing, good and fairly correct. In good condition.

Transcribed in 1918-19 from a Ms. of M.R.Ry Kōṭi Rāmamūrti Śāstrulu Gāru of Pātanapūḍi Agrahāram, Vīravalli taluk, Vizagapatam district.

దశావతార పద్యములు—సటీకములు.

DAŚĀVATĀRAPADYAMULU—SAṬĪKAMULU.

Ten stanzas in praise of the ten incarnations of God Viṣṇu, each stanza describing one Avatāra. These stanzas form part of the Pāṇḍuraṅgavijaya composed by Tenāli Rāmaliṅgakavi. The text is accompanied by a commentary written by Kṛṣṇamācārya, son of Kōdaṇḍarāmācārya of Śrīvatsagōtra and a disciple of Raghunāthabhaṭṭarācārya.

Complete.

**Beginning:**

శా. సాధీయోముఖపూరితోద్వమిత తా సత్వోర్ధ్వగోదన్వద
ర్ణోధారాంత నటత్తిమింగిలగిలప్రోద్ధాననిధ్యానల
ద్ధాధీశ ప్రభుతాప్రభాగహరణార్థాయాయినాథానుజ
శ్రాధాన్యాతివిలోల వాగ్ధృగబటబ్రహ్మాంస్తుమంస్త్వామనుః.

టీక. సాధీయ ఇతి. సర్వాణిపద్యాన్యేకైక సమసా నీతిప్రత్యేకం వేదితవ్యం.

సాధీయః సాధుతరమైనహువంటి, ముఖ = ముఖముచేతను, పూరితోద్వమితతా = పూరించి వెళ్లగాయఁబడుటచేత.

**End:**

తాత్పర్యము—

తనయొక్క దీర్ఘబాహులయందున్న రెండుపట్టాకత్తులచేతను త్రుంచివేయఁబడ్డ కంఠముగల తురుష్కసైనికులచేతను, ఊర్ధ్వలోకానకు లేచిపోయేటప్పుడు చేయఁబడ్డ సూర్యమండలమధ్యరంధ్రాకాశమే హేతువుగాఁ గనపడడం కలిగినటువంటి బహువిధరక్తోదక ప్రవాహముచేతను కొట్టబడి భూమికి నాకాశగంగయన్నభ్రమను జేయుచున్న భూమిగలవాఁడా! అత్రభ్రాంతిమదలంకారః. స్ఫుటమ్.

ఇతి శ్రీవత్సగోత్రపవిత్ర శ్రీమదాపస్తంబసూత్ర శ్రీమద్రఘునాథభట్టరాచార్య కృపాపాత్ర శ్రీమత్కోదండరామాచార్యవర్యపుత్త్ర దుర్వాదిగర్వలతాలవిత్ర, శ్రీమద్భాష్యాదిగ్రంథప్రబంధాధ్యయనాధ్యాపనవిచిత కృష్ణమాచార్యగోత్ర విరచితాఖండపండితమండలదుర్విజేయ తాత్పర్యపర్యాయపిచండిల పాండురంగవిజయప్రబంధమధ్యనిధేయ హృద్యతమ దశావతారపద్యమాలికా టీకా నిగూఢార్థచంద్రికా శరద్రాకాసమాప్తా.

(వి-వి.)—

సమగ్రము వ్రాఁత తిన్ననిదే. తప్పులంతగా లేవు. శైథిల్య గ్రంథపాతములు లేవు.

ఇందు తెనాలి రామలింగకవి కృత పాండురంగ విజయమందలి దశావతారపద్యములు, వానికి కృష్ణమాచార్యకృత ప్రతిపదార్థ టీకా తాత్పర్యములు గలవు. ఈ వ్యాఖ్యాత కోదండరామాచార్యుని పుత్త్రుఁడు. శ్రీవత్ససగోత్రుడు. రఘునాథభట్టరాచార్యుని శిష్యుఁడు.

---

## R. No. 543.

Paper 10¾ × 10 inches. Foll 227. Lines, 20 on a page. Mode of writing, good and fairly correct. In good condition.

Transcribed in 1918-19 from a MS. of M.R.Ry. V. A. G. Sūryanārāyanaswāmi Gāru of Pāltēru, Kistna district.

సేతుఖండము.

**SĒTUKHAṆḌAMU.**

This Prabandha is a Telugu rendering of the Sanskrit Sētukhaṇḍa of the Skānda Purāṇa and explains the sanctity of the shrine at

Rāmēśwaram and the holy waters in that place. The author is Dāmera Vēṅkaṭarāyakavi, son of Pāpāmba and Veṅkāya of Inakāla-gōtra and belonging to the Padmanāyaka caste. He was the disciple of Niḍādūr Śrīnivasācārya and was honoured by Rao Śvētācalapati Raṅga Rao, the chieftain of Bobbili. The work was dedicated to God Kṛṣṇa.

Complete in 5 Āśvāsas.

**Beginning:**

ఉ. శ్రీవెలయంగ భోజనృపశేఖరపుత్త్రి వివాహవేళ ము
క్తావిసరంబుఁదోయిటను గైకొని యాదలనింపుచుండ వ
ర్ణావసరోద్గతాచ్ఛకరకావళిచేఁదగు నీలశైలమో
నా విలసిల్లుచున్న యదునాథుఁడు మాకు శుభంబులీవుతన్.

* * * *

ఉ. సారతరాగమాంతముఖశాస్త్రవిచక్షణు భవ్యవైష్ణవా
చారవిధిజ్ఞు విష్ణుపదసారససక్తమనస్కు శ్రీనిళా
ధూరికులామృతాంబుధివిధుం బుధవర్ణితచర్యు సద్యశ
శ్శ్రీరతు శ్రీనివాసగురుశేఖరుఁ బ్రస్తుతిఁజేతు వేడుకన్.

* * * *

వ. . . . . . శ్రీమద్రాజాధిరాజరాజబిడౌజమహారాజ శ్రీ
రాజా శ్వేతాచలపతి రంగారాయ ప్రతిష్ఠితుండును బొబ్బిలిపుర ని
వాసుండును నగు గోపాలదేవుం దర్శించి.

సీ. గీ. మాతృపితృభక్తి బాంధవమైత్రి గలిగి
ధరఁ బ్రసిద్ధి వహింపుచుఁ దనరితీవ
దామెరాన్వయజలధిచంద్రము సుగుణని
కాయ వేంకటరాయసత్కవివిధేయ.

క. భువి సమస్తపురాణముల్ పూర్వకవుల
చేతఁ దెనిఁగింపఁబడియెను సేతుఖండ
మొకటి మాపుణ్యవశముననుండె దాని
మృదువచోరీతిఁ దెనిఁగింపు మిద్ధచరిత.

* * *

సీ. గీ అట్టి॥ రావు శ్వేతాచలపతి భూరమణవరుని
బాల్యమాదిగ ననుఁదన భవనమందు

గలిపి సంపదలిచ్చి మన్నించినఘను
నిఁ దగురీతిని దర్శించి నెమ్మిమీఱ.

*  *  *  *

సీ. విమలాత్ముఁడైన యా వెంకయ్యా పాపమాం
బికయందుఁ . . . . . .
. . . భూసురభక్తిసంపన్ను వేం
కటరాయనామవిఖ్యాతు నన్ను
. . . గనుఁగొని . . జెలఁగ.

*  *  *  *

గీ. రామసేతుపవిత్రితమై మహీస్థ
లమున రామేశ్వరాభిధానమునఁ బరగి
క్షేత్రమొకకోటి చెన్నారు శ్రేష్ఠమగుచు
సుమహితక్షేత్ర తీర్థసంఘములలోన.

**End:**

క. అని యతఁడు వారిపీడ్కొని
చనె రాజితగిరికిఁ బిదప శౌనకముఖ్యుల్
దినదినముఁ జదువఁదొడఁగిరి
మనముల హర్షించి సేతుమాహాత్మ్యంబున్.

స్రగ్విణీవృత్తము —

సుందరాకార ! భూసుందరీరత్నహృ
న్మందిరా గోపికామందహాసప్రదా !
నందజాసంతతానంద యుక్మానసా
నందితాశేష్ఛతానందముఖ్యామరా !

**Colophon:**

ఇది శ్రీవేణుగోపాల కృపాలబ్ధ మేధామంథానమథితసాహితీవాహినీశసముద్భూతసరసకవితామృతతోషితవిబుధాంతఃకరణ, నిఖిలసుగుణగణాభరణ రణాంగణవిహారణచణ వైరిభూరమణ ప్రాణహరణధురీణ, దామెరాన్వయ పరిపూర్ణసుధాకిరణ, శ్రీమదినకాలగోత్రపవిత్రానూనయశోనిధాన, తిమ్మయాభిధాన పౌత్రసకలజనవినుతవినయ వేంకయాహ్వయపుత్త్రబుధజనవిధేయ వేంకటరాయనామధేయ పద్మనాయకమౌళి ప్రణీతంబైన స్కాందపురాణస్థంబగు సేతుమాహాత్మ్యంబునందు సర్వంబును బంచమాశ్వాసము.

(ఖ.ఖ.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పులంతగా లేవు. శైథిల్య గ్రంథపాతములు లేవు.

అయిదాశ్వాసములుగల యీ గ్రంథము స్కాందపురాణమునందలి సేతుఖండమునకుఁ దెలుఁగు. రామేశ్వర, సేతుమాహాత్మ్యము లిందువర్ణింపఁబడినవి. కర్త దామెర వేంకటరాయకవి. వేంకయ పాపాంబలకుఁ బుత్త్రుఁడు. ఇనఁకొల గోత్రజుఁడు. పద్మనాయకుఁడు. బొబ్బిలి సంస్థానాధిపతియగు రావు శ్వేతాచలపతి రంగారావుచే సన్మానింపఁబడినవాఁడు. నిడాదూరి శ్రీనిసాచార్యుల శిష్యుఁడు.

---

## R. No. 544.

Paper. 10¼ × 10 inches. Foll. 107. Lines, 20 on a page. Mode of writing, good and fairly correct. In good condition.

Transcribed in 1918-19 from a MS. of M.R Ry. Dāmera Vēṅkaṭa rāja Gōpāla Sūryanārāyaṇaswāmi Gāru, Pālteru, Vizagapatam.

వేంకటాచలమాహాత్మ్యము.

**VĒṄKAṬĀCALAMĀHĀTMYAMU.**

A Prabandha in three Āśvāsas being a Telugu rendering of the sanskrit Vēṅkaṭācalamāhātmya found in the Varāhapurāṇa; by Dāmera Cina Vēṅkaṭarāya, brother of Dāmera Vēṅkaṭarāya (author of the Sētukhaṇḍa R. No. 543), and disciple of Māḍabhūsi Jagannāthācārya.

Complete.

**Beginning:**

శా. శ్రీభోజాత్మజ కేశపాశమున నాశీర్వాదసంయుక్తవా
ణీభద్రాత్మజ దత్తకల్పకముఁ బాణిం జేర్చి సంధించి త
చ్ఛోభోద్భూత విశేషసుందరతకున్ జోడైనిజామోదమెం
తో భాతిన్ మొగ మందుఁదోఁపరస సిద్ధుండౌ హరింగొల్చెదన్.

*　　*　　*　　*

క. అభినవ రామానుజుఁడన
సభలం గొనియాడఁబడిన సారగుణాఢ్యున్
శుభమాడభూషివంశ
ప్రభవు జగన్నాథగురుని భక్తిం దలఁతున్.

క పరమగురు నుభయవేదాం
తరహస్యజ్ఞానసార తాత్త్వికవరు శ్రీ
నరసింహార్యునిసాహి
త్యరసోత్కర వాక్యధుర్యు నాత్మం దలంతున్.

క. శిశుకు సకలకళౌఘ
ప్రక్షాళిత చిత్తమండ సాకకులజుఖా
రిక్షాంతి నిధిని గామా
ఖ్యక్షితిసుర గురుం దలంతు దృఢతరభక్తిన్.

* * * *

సీ. ఒకనాఁడుకర్ణ వేధోత్సవకాలసం
    దర్శనాసక్తుఁడై దయితతోడఁ
జనుదెంచియుత్సవం బనువొప్పఁగావించి
    యిష్టగోష్ఠివినో దేచ్ఛనుండి
నాయభిప్రాయంబు నయమొప్ప వినిపింప
    వినిదామెరాన్వయ వనధిపూర్ణ
సోముండుసద్గుణ స్తోముండువేంకట
    రాయండుమధ్వాశ్రిత రమణుఁ బిలిచె
సేతుమహాత్మ్యమేనున్ జెప్పుచుంటి
నీవు శ్రీవేంకటాచల దేవుమహిమ
నావలెను దేవకీసుతు నాథుఁ జేసి
యాంధ్రభాషను గద్య పద్యములు సేయు.

* * * *

గీ. సర్వభూతిప్రదంబును సర్వవిష్ణ
యాఖ్యము పవిత్రమా యుష్యమతులపుణ్య
దంబగు వరాహకల్ప వృత్తమువి శేష
శేషగిర్యాశ్రయంబు నేఁ జెప్పువాఁడ !

End :

క. పారాశర్య కృపన్నా
కారయ సర్వంబుఁ దెలిసి నంతియ కానీ
భూరిగిరి మహిమఁ దెలుపం
గారాదహి విభుసహాస్ర కంబున నైనన్.

* * * *

మాలిని. ఖలరిపుమణినీలా పాలితాజాండగోళా
ఖలవిమతవిశాలా కాంతిమద్ధ్వర్మ్యచేలా
కలుషహరణశీలా కంసదైత్యేంద్రకాలా
సలలితగుణజాలా సత్యభామానుకూలా.

**Colophon:**

ఇది శ్రీ సకలసుకవినికరాంగీకృత కవితాపాత్ర దామెరాన్వయ పయః పారావార రాకావిభావరీ కళత్ర, తిమ్మరాయపౌత్ర పెదవేంకయాఖ్యపుత్ర, సుజనవినుత చారిత్ర శ్రీ మాడభూషి జగన్నాథాచార్య ఛాత్ర, శ్రీ రామానుజ మతపూతగాత్ర నిరతహృదయ స్థిత శ్రీ కృష్ణ భాగధేయ, ధరామరవిధేయ చిన వేంకటరాయనామ ప్రణీతంబైన శ్రీ. వరాహపురాణ క్షేత్రకాండస్థ వేంకటాచలమాహాత్మ్యంబునందు సర్వంబును దృతీయాశ్వాసము.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంతతిన్ననిది. తప్పులంతగాలేవు. శైథిల్య గ్రంథపాతములు లేవు.

మూఁడాశ్వాసముల యీ ప్రబంధము సంస్కృత పురాణాంతర్గత వేంకటాచల మాహాత్మ్యమునకు దామెరచిన వేంకటరాయకవి తెలుఁగు సేఁత. ఇతడు సేతు ఖండ (ఆర్. నె 543 రు) కర్తకుఁ దమ్ముఁడు. మాడభూషి జగన్నాథాచార్యుల శిష్యుడు. విశేషాంశములకుదాహృత భాగమును జూచునది.

---

### R. No. 545.

Paper. $10\frac{1}{8} \times 10$ inches. Foll. 84. Lines, 20 on a page. Mode of writing, fair but not quite correct. In good condition.

Transcribed in 1918--19 from a MS of M.R.Ry. Bahadur Mṛtyuñjaya Niśśaṅka, Zamindar. Mrutyunjayanagaram Parvatipuram Post.

తారకబ్రహ్మమంత్ర మాహాత్మ్యము.

TĀRAKABRAHMAMANTRAMĀHĀTMYAMU.

This Prabandha narrates the story of Rāma and describes the greatness of the Tārakamantra The author is Anumañci Jagannādhakavi, son of Subbayāmātya and grandson of Narasiṁhārya of Agastya gōtra and disciple of Mantripragaḍa Subbayāmātya.

Complete in 3 Āśvāsas.

**Beginning :**

శా. శ్రీమద్భూతనుజాత మంగళమహః శ్రీవేళతత్రత్యది
వ్యామేయస్ఫుట రత్నవేదిక నిజాస్యాలోకముం జేయుత
ద్రామాస్వాంత మెఱింగిమంగళవిధిం దత్ప్రుషపీఠస్థుఁడౌ
రామస్వామి కృపాసముద్రుఁడునను౯ రక్షించునెల్లప్పుడు౯.

* * * *

సీ. గీ. అట్టిమంత్రిప్రగడ సత్కులాంబురాశి
సత్కులీనుని సతతవిస్తుత్యచరితు
నమలగుణఖని మద్దేశికాగ్రగణ్యు
సుబ్బయామాత్యునెపుడు సంస్తుతియొనర్తు.

* * * *

ఉ. శౌనక ! తెల్పెదన్వినుము చక్కఁగఁదారక మంత్రరూపకుం
డైనమహాత్మసచ్చరిత మంతయునైహిక పారలౌకికా
నూనఫలప్రదంబనుచు నొప్పఁగధర్మజుతోడనారదుం
డానతి యిచ్చులాగు మును వ్యాసులచేతను విన్నదంతయు౯.

**End :**

గీ పరమభక్తితోడఁ బఠియించెనేనియు
విన్ననేనివారు విగతపాపు
లగుచునంతమందు నా రాము సాయుజ్య
మందఁగలరునిర్మ లాత్ములగుచు.

* * * *

మాలిని. జలధరనిభ గాత్రా సంయమిస్తోత్రపాత్రా
జలజదళనిభాక్షా సర్వగీర్వాణపక్షా
లలితవిమలశీలా రమ్యసౌవర్ణచేలా
జలధిసమగభీరా క్ష్మాసుతాచిత్తచోరా.

**Colophon :**

ఇది శ్రీ సీతారామచంద్ర కరుణాకటాక్ష లబ్ధకవిత్వ వైభవాగస్త్యస
గోత్రపవిత్రానుమంచి వంశపయః పారావారరాకానిశాకళత్ర, నర
సింహార్య పౌత్ర సుబ్బయామాత్య పుత్ర సకలసుకవిజన విధేయ జగ
న్నాథనామధేయ ప్రణీతంబైన తారకబ్రహ్మమంత్ర మాహాత్మ్యంబునందు
సర్వంబును. తృతీయాశ్వాసము.

(వి-వి.)——

సమగ్రము. వ్రాఁతమంచిదే. తప్పులు గలవు. శైథిల్య గ్రంథపాతములు లేవు.

ఇందుఁ దారక బ్రహ్మమంత్ర మాహాత్మ్యకథ వర్ణింపఁబడినది. అనుమంచి సుబ్బయామాత్యుని పుత్త్రుఁడు జగన్నాథకవి మూఁడాశ్వాసముల ప్రబంధముగ దీనిని రచియించెను. ఇతఁడు అగస్త్యసగోత్రుఁడు. మంత్రిప్రగడ సుబ్బయామాత్యుని శిష్యుఁడు. నరసింహార్యుఁడితని తాత.

---

R. No. **546**.

Paper. $10\frac{3}{8}$ × 10 inches. Foll. 182. Lines, 20 on a page. Mode of writing, fair and contains mistakes. In good condition.

Transcribed in 1918-19 from a MS. of H.H. Sītārāni Saheb of Wadhvan, Vizagapatam district.

This was compared with a MS. of M.R.Ry. Vajjhala Cina Sītārāmaswami Śāstri Gāru of Vizianagaram, Vizagapatam district.

నలచరిత్రము.

NALACARITRAMU.

This Prabandha describes the story of the marriage of Nala and his adventures. The author is Behara Rāmakṛṣṇakavi. For further particulars regarding the author see. R. No. 435 *ante*.

Complete in two parts.

**Beginning:**

శా. శ్రీవిభుఁగొల్చి శంకరు భజించి పితామహు సంస్మరించి త
ద్దేవులనిందిరాశివసతీధవళాంగుల మ్రొక్కి సత్కవీం
ద్రావళులన్ బురాతనుల నాధుని కాంధ్ర నిబంధనక్రియా
కోవిదులం దలంతు సమకూరిన భక్తి విశేషసంపదన్.

* * * *

సీ. గీ. అఖిలశాస్త్రపురాణేతిహాసభాస
మానమానవజనముఖ్య మాననీయ
ఘనుఁడు కుప్పిలికృష్ణ సత్కవియనుజ్ఞఁ
గొనిరచించెద సుకవీంద్రు లనుమతింప.

* * * *

క. శ్రీరామ కటాక్ష సుధా
సారమునవ(ర)చింతు నలునిచారిత్రములా
నూరమ్ము గాంకముగాఁ గవి
వారసభా స్థలములందు వర్ధిలుచుండఁగా.

**End:**

మాలినీ. వవిధరనుతలీలా భక్ర కార్యానుకూలా
యవిరళగుణజాలా యాశ్రితాత్మానుశీలా
ప్రవిమలశ్రుతిమూలా పాపసంహారలోలా
సవినయజనపాలా సత్యసంకల్పశీలా!

**Colophon:**

ఆర్. నెం. 435 రు చూచునది.

(వి-వి.)—

సమగ్రము. పూర్వోత్తర భాగములు. వ్రాఁత తిన్ననిదే. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములు లేవు.

ఇది బెహారా రామకృష్ణకవి విరచితమైన నలచరిత్రము. ఈ కవిని గూర్చి ఆర్. నెం. 435 రున జూచునది.

---

## R. No. 547.

Paper $10\frac{3}{4} \times 9\frac{3}{4}$ inches. Foll. 378 Lines, 20 on a page. Mode of writing, fair and fairly correct. In good condition. Bound in two volumes

Transcribed in 1918–19 from a MS. obtained from the Maharajāh's Sanskrit Library, Bobbili.

నారదీయపురాణము

NĀRADĪYA PURĀṆAMU.

This is the same work as that described under R. No. 416 *ante*.

Complete.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిదే. తప్పులంతగా లేవు. శైథిల్య గ్రంథపాతము లేవు.

ఇది ఆర్. నెం. 416 రున వర్ణింపఁబడిన గ్రంథమే.

R. No. **549.**

Paper. $107\frac{7}{8} \times 9\frac{7}{8}$ inches. Foll 94 Lines, 20 on a page. Mode of writing, fair and fairly correct. In g od condition.

Transcribed in the year 1918–19 from a MS. of M.R.Ry. Bulusu Pāpayya Śāstri Gāru, Anakapalli, Vizagapatam district.

రుక్మవతీపరిణయము.

RUKMAVATĪPARIṆAYAMU.

A Prabandha in five Āśvāsas narrating the story relating to the marriage of Rukmavatī with Pradyumna, son of Śrī-Kṛṣṇa, by Rēkapalli Sōmanātha, son of Sūryanārāyanakavi. He praises God Rāma worshipped at Puspagiri, near Lakkavaram. The work is dedicated to Kākarlapūḍi Gōpālarāya, son of Jagannātharāju of Vāsiṣṭhagōtra and a descendant of the solar race of kings. One ot the ancestors of the patron named Rāmabhadrarāja is said to have composed Padminīpārinaya, Nīlagirināthaśataka, etc.

Ccmolete, but a small portion at the end of the preface and in the beginning of the work proper is wanting.

**Beginning.**

శా. శ్రీవైదేహీశుభావహాలకభరశ్రీకృష్ణవేణీ ఘన
ప్రావీణ్యాత్మకరారవిందకలనన్ బద్ధాభ్యఁగాఁ జేసి సం
భావోల్లాసముపూను పుష్పగిరిరామబ్రహ్మముద్వేల శో
భావిద్యావిభవంబు లీవుతను గోపాలక్ష్మాజానికిన్.

* * * *

వ. . . . . . . . వసబిరుకురగండాకుండును,
శ్రీసాతోడా, బేహరా, మహాప్రతవిఖ్యాతజైత్రబిరుదవినుతచరిత్రుం
డును, శ్రీవసిష్ఠగోత్రపవిత్ర కాకర్లపూఁడివంశాంబుధికైరవమిత్రుం
డును, శ్రీకృష్ణలీలాసుధారససరసకృతిప్రముఖసప్తసంతాననిరంతరీ
కృతసంతోషస్వాంతుండును . . . శ్రీ జగన్నాథరాజసమం
చితపుంజీకృతానేకపుణ్యఫలుండును, ఇంద్రమాంబాగర్భశుక్తిముక్తాఫలుం
డును నగు శ్రీ గోపాలరాయమహీమండలాఖండలుం డొకనాఁడు.
. . . . . అనవద్యహృద్యప్రబంధకథాప్రసంగ సంగతి నంగీ
కరించుచు.

మ. తనకత్యంతము నవ్యసారకృతిసందర్భా వాంఛ డెందంబునన్
దనరన్మామక సాహితీరససముద్యత్ప్రౌఢవాగ్గుంభనం
బుని రాఘాటముగా నెఱింగి నను సామ్ముఖ్యంబునం జేరరా
నను మోదించుచు సోమనాథసుకవీంద్రా రమ్మటంచున్ వెసన్.

*    *    *    *

సీ. వద్మినీపరిణయప్రథితసత్కృతిఁ జేసెఁ
ప్రతిభానుభావసమ్మతముగాఁగ
రతినీలగిరినాథశతకంబుఁగావించె
సుప్రసాదమహత్త్వదీప్రముగను
నవలేఖినీ లేఖ్యకవితానవద్యత
వెలయించె ననురూపవృత్తిఁదనర
సతతచాటునిబంధసరసోక్తులలరించె
సహృదయహృదయైకసరణిమీఱ.
ననుచుఁగవులు నుతింతు రెవ్వని నతండు
సంగరాఖీలశరజాలశమితవిమత
దవహుతాశుఁడు రామభద్రక్షితీశ
ఘనుఁడు భువనధురంధరఖ్యాతిఁ దనరె.

End:

క. శ్రీమెఱయు నిఖిలవిబుధ
గ్రామాభీష్టధనదానరాజితరైయు
ద్దామశుచివర్ణకీర్తిన్
మామకకృతికల్పవల్లి మహిమఁదనర్చున్.

*    *    *    *

మాలిని. సదయశుభకటాక్షా సాధులోకైకరక్షా
విదళితరిపుజాలా విశ్వవిఖ్యాతలీలా
మదనలలితరూపా మాన్యవిద్యాకలాపా
సదమలగుణచర్యా సర్వసామ్రాజ్యధుర్యా.

Colophon:

ఇది శ్రీలకవరసుమనోగిరిధామ రామచంద్రచరణారవింద మరందాస్వాదసమాసాదితనిరవద్యసాహితీరస విభావి కవితాతిరేక రేకపల్లి సూర్యనారాయణతనూభవ, సకలవిద్వత్కవిజనానుగ్రహసనాథ సోమనాథ ప్రణీతంబైన రుక్మవతీపరిణయాభిధాన ప్రబంధంబునందు సర్వంబును బంచమాశ్వాసము.

(వి-వి.)—

సమగ్రము. ఇందు కృతిపతి వంశవృత్తాంతమునఁ గొంతభాగము నుండి కథాప్రారంభమునఁ బట్టణవర్ణనమువఱకు లేదు. వ్రాఁత తిన్ననిదే. తప్పు లంతగా లేవు. శైథిల్యము లేదు.

ఇది రుక్మికూఁతురగురుక్మవతియను కన్యకను, శ్రీకృష్ణుని కుమారుఁడగు ప్రద్యుమ్ననకునునైన వివాహవృత్తాంతముగల యైదాశ్వాసముల ప్రబంధము. కర్త రేకపల్లి సూర్యనారాయణకవి పుత్త్రుఁడగు సోమనాథకవి. ఇందు లక్ష్మీవరపు పుష్పగిరి రామచంద్రస్వామి ప్రశంస కలదు. ఇది కాకర్లపూఁడి గోపాలరాయప్రభువున కంకితముగా రచియింపఁబడినది. ఇతఁడు జగన్నాథరాజు పుత్త్రుఁడు. వాసిష్ఠగోత్రుఁడు. సూర్యవంశపు సంతతివాఁడట. ఇతని పూర్వులలో నొకఁడగు రామభద్రక్షితీశుఁడు పద్మినీపరిణయము, నీలగిరినాథశతకము మున్నగు గ్రంథములను రచియించినాఁడఁట.

---

## R. No. 550.

Paper. $10\frac{7}{8} \times 9\frac{7}{8}$ inches. Foll. 106. Lines, 20 on a page. Mode of writing, fair but not quite correct. In good condition.

Transcribed in the year 1918–19 from a MS. of M.R.Ry. Nidamatti Basavarāju Gāru of Chicacole, Ganjām.

శైవసిద్ధాంతశిఖామణి.

ŚAIVASIDDHĀNTAŚIKHĀMAṆI.

A treatise dealing with the principles of the Vīra-Śaiva religion: by Cennapragaḍa Nāgēśvarakavi, son of Vīrabhadra of Ātrēyagōtra and disciple of Mallamapalli Rāmaliṅgārādhya.

Complete in four Āśvāsas.

**Beginning:**

శ్రీగురుమల్లేశ చిన్మయోల్లాస
యోగిమానసపూర యుక్తవిచార
అకలంకగుణధుర్య యమితసౌందర్య
ప్రకటితోదార సద్భక్తమందార.

* * * *

వరచెన్నప్రగ్గడాన్వయపయోరాశి
హరిణాంకుఁడగు గోపనార్యుండు గంగ

* * * *

అట్టి పుత్త్రులలోన నధిక తేజస్వి
పట్టన . . . వీరభద్రుఁడాతనికి
. . . . . . . . .
ధర్మపత్నియనంగఁదగు గురువాంబ
వారికిద్దఱకను వరనందనుఁడును
ఆరూఢి నాగేశ్వరాభిధానుండు
గురుతరాత్రేయసద్గోత్రసంభవుడు
వీరశైవాచారవిస్తారమార్గంబు; (?)
కలిత సిద్ధాంతశిఖామణియనఁగ,
గలదది తెలిఁగించగలవేని

* * *

శ్రీరామ లింగదేశిక సార్వభౌమ

* * * *

అవధారు దేవసిద్ధాంత శైవంబు
వివరించి తెనుఁగున విన్నవించెదను

**End:**

అసమానమగు నిమ్మహాశివజ్ఞాన
రసపూర్ణమైన శాస్త్రము భక్తివలన
నెవ్వరుచదివిన నెవ్వరువిన్న
నెవ్వరువ్రాసిన నీప్సితార్థములు
సమకూరు భవరోగసంతాపముడుగు
విమలజీవన్ముక్తివిభవంబు గాంచు

* * * *

. . చెన్నప్రగడ నాగేశ్వరరచిత
సదమల శ్రీ వీరశైవసిద్ధాంత
ఘనతరతంత్రశిఖామణియందు,

* * * *

నంతయునది చతుర్థాశ్వాసమయ్యె.

(వి-వి.)——

సమగ్రము. నాల్గాశ్వాసములు. వ్రాఁత యొక తరబడిగానున్నది. తప్పు లంతగా లేవు. [illegible] శైథిల్యంథపాములు లేవు.

ఇది యొక శైవమత వేదాంత ప్రతిపాదకమైన ద్విపదగ్రంథము.

కర్త చెన్నప్రగడ నాగేశ్వరకవి. ఆత్రేయగోత్రుఁడు. మల్లమపల్లి రామలింగారాధ్యుల శిష్యుఁడు. విశేషములను మాతృకయందే చూచునది.

---

## R. No. 551.

Paper. 11 × 10 inches. Foll. 114. Lines, 20 on a page. Mode of writing, fair and containing mistakes. In good condition.

Transcribed in the year 1918–19 from MS. of a M.R.Ry. Vajjala Cinasītārāmāsvāmi Śāstrulu Gāru of Vizayanagaram.

శతకంఠరామాయణము.

ŚATAKAṆṬHARĀMĀYAṆAMU.

This Prabandha narrates the story of the conquest of the hundred-headed Rāvaṇa by Sīta, as narrated in the work described under R. No. 70 *ante*. The author is Liṅgakavi, son of Dharmanārya of Ātrēya-gōtra.

Complete in four Āśvāsas.

**Beginning :**

క. శ్రీకల్యాణగుణాకర
ప్రాకటవిభవాభిరామభార్గవరామా
మీకారుణ్యముతోడుతఁ
జేకొని రక్షింపవయ్య శ్రీరఘురామా.

**End :**

వ. ఈమాహాత్మ్యంబు శంకరుం డెఱింగించిన శాంకరీదేవి మహాద్భుతంబునొంది మహాత్మా! యిట్టి చమత్కారకథావిధానం బెన్నఁడు విని యెఱుంగము, నేఁడు శ్రవణానందముగా వినఁగలిగి కృతార్థురాలనైతినని యానందింపుచుండెనంత.

* * * *

మాలినీ. ప్రవిమలగుణహారా! బంధురాఘౌఘహారా!
వివిధశుభవిచారా! విశ్వకాంతాశధీరా!
కవిజనుమహాశూరా! గర్వదుర్వారశూరా!
భువనహితగభీరా! పోచమశ్రీవిహారా!

**Colophon :**

ఇతి శ్రీ (దురితనివాస?) లక్ష్మీనృసింహకరుణాకటాక్ష వీక్షణ సంప్రాప్తమహాకవిత్వ విద్యాపారీణ సుమహేంద్రగీర్వాణభాషా

ప్రవీణ సంఘా (గీ)? తలక్షణసకలవిద్వన్మిత్రాత్రేయగోత్రపవిత్ర ధ__
నార్యపుత్త్రి యఖిలమహీసురాశీర్వాదప్రవర్ధమానభాగధేయ సకలనృపగే
(య) వినయవిధేయ లింగనామధేయ ప్రణీతంబైన సీతావిజయంబను
మహాకావ్యంబునందు శతకంఠునకు . . . . నను కథలుం
గల శతకంఠరామాయణమునందుఁ జతుర్థాశ్వాసము.

(వి-వి.)—

సమగ్రము. నాల్గాశ్వాసములు. వ్రాఁత యొక తరబడిగాను న్నది. తప్పులు కలవు శైథిల్య గ్రంథపాతములు లేవు.

ఇందు ఆర్. నె 70 రున వర్ణింపఁబడినకథయే వర్ణింపఁబడినది. కర్త లింగకవి. ధర్మనార్యుని పుత్త్రుఁడు. ఆత్రేయగోత్రుఁడు.

---

## R. No. 552.

Paper. $10\frac{7}{8} \times 9\frac{3}{8}$ inches. Foll. 40. Lines, 20 on a page. Mode of writing, fair and fairly correct. In good condition.

Transcribed in the year 1918-19 from a MS. of M.R.Ry. Gurujāda Vēṅkatarāmadās Pāntulu Gāru of Vizianagram, Vizagapatam district.

సకలలక్షణసారము.

SAKALALAKṢAṆASĀRAMU.

A treatise in prosody by Addanūri Rāmadāsu, son of Śrīnivāsa. It gives the distinguishing characteristics of the different kinds of metres with illustrative stanzas. The poet states that he adds his own stanzas to those extracted from other works on prosody.

Incomplete.

**Beginning :**

క. శ్రీమనుకులాబ్ధిసోమా
సామజవరవరద నీలజలదశ్యామా
కామారివినుతనామా
శ్రీమందిరరామతీర్థ సీతారామా !

గీ. అద్దనూరికులసుధాబ్ధీందుఁడగు శ్రీని
వాససుతుఁడ రామదాసనామ
ధేయుఁడను సుజనవిధేయుండ నీపాద
జలజసేవకుఁడను జానకీశ !

గీ. సకలలక్షణములను వెదకిన మంచి
పద్యసమితియు నాకవిత్వవిసుమంత
కూరిచి సకలలక్షణసారమనెడి
నామమిడి లిఖించెదను శ్రీరామచంద్ర.

**End:**

క. అష్టోత్తరశతపద్యము
లష్టోత్తరశతకమనఁగ న మరుఁగవీంద్రుల్
స్పష్టముగ సంఖ్యఁజెప్పినఁ
దుష్టముగాఁదదియుఁ గర్ణతుష్టికసేయుఁ.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత యంత తిన్ననిదికాదు. తప్పు లంతగా లేవు. శైథిల్యగ్రంథపాతములు లేవు.

ఛందశ్శాస్త్రవిషయములగు లక్ష్యలక్షణములు పెక్కు లక్షణగ్రంథములనుండి యేర్చి యిందుఁబొందుఁగింపఁబడినవి. కర్త అద్దమూరి రామదాసు. శ్రీనివాసుని పుత్త్రుఁడు. కవి స్వంతపద్యములును గలవు.

---

R. No. **553**.

Paper. 10¼ × 10 inches. Foll. 92. Lines, 20 on a page. Mode of writing, fair but contains mistakes. In good condition.

Transcribed in the year 1918-19 from a MS. of M.R.Ry. Siṅgaram Vēṅkaṭācarlu Gāru, Śanivarapeta, Ellore post, Kistna district.

వైద్యశాస్త్రార్థసారసంగ్రహము.

VAIDYAŚĀSTRĀRTHASĀRA SAṄGRAHAMU.

A treatise in medicine dealing with materia medica and written in the form of a Prabandha by Tāḍēpalli Pānakālrāyakavi, son of Vēṅkanāmātya of Śrīvatsagōtra and Āpastambasūtra.

Contains the Āśvāsas 3 (only from the end), 4 and **5** complete, and 6 incomplete.

**Beginning:**

నవాసారోత్పత్తి గుణవిశేషలక్షణము.

సీ. వినుసవాసారంబు జనియించురీతినీ
తెలిఁగింతు మునివర్య సరసమైన
యొరగొమ్మలనుజాల మృదువుగాభస్మముల్
గావించి నీళ్లను గలిపివండి
క్షారముల్చేసియా క్షారముల్పసుపుచే
నేడేడుమాఱులు గూడవండి
పొలుపొంద నది లోహములకు సూతములకు
ద్రావకంబును జారణంబొనర్చు
బచ్చ గుల్మంబులాగాచు శోభలనదల్చు
నర్మశోషల గెల్చు ప్లీహోదులణఁచు
నస్య విధులకుఁజాల విన్నాణ మొసఁగు
సారమైయుండు వినుసవాసారమనుచు.

**Colophon:**

గద్య. ఇది శ్రీవేణుగోపాల వరప్రసాదలబ్ధ శశ్వద్విశ్వైశ్వర్య శాశ్వత వైభవవిలాస సకలక్షోణీ మండలాధిప మార్తాండమండల మండిత వచోజేగీయ మానానూనఘటనాఘటనకరణీయ నిర్వహణ చాతుర్య ధుర్యశక్తి త్రయచతురు పాయషడ్గుణౌ దార్యాద్యఖిలరాజయోగలక్షణ విచక్షణ గర్విత ప్రతిపక్షక్ష్మాధినాథ దుష్ప్రధాననికర మనోభయంకర చతురచమత్కారరస గుంభితామేయ మధురవచన రచనానల్ప ప్రవీణ దశవిధప్రాణ గణితప్రముఖవిద్యాధుంధరనయ యుగంధర భిషగ్విద్యాపితామహ పితా మహాన్వయపయఃపారావార రాకాసుధాకర శ్రీవత్స సగోత్రతిలక, ఆపస్తంబసూత్ర పవిత్ర తాడేపల్లి వేంకనామాత్యపుత్త్రి సకలసుకవిజనవిధేయ పానకాల్రాయ నామధేయ ప్రణీతంబైన సమస్త వైద్యశాస్త్రార్థసారసంగ్రహంబను వైద్యశాస్త్రంబునందు రసౌషధ ప్రకరణంబన్నది పంచమాశ్వాసు.

**End:**

ఉ. హారతి కప్పురంబు వినుమందపు దాచిని చెక్కచెక్కలున్.
తీరగు చిల్లగింజలును దెల్లనికాచును వేఁపచెక్కయున్
కోరిసమాంశ చూర్ణముగఁ గొట్టుచు శర్కరగూర్చియిచ్చినన్
వారక నంటుమోహా పరివారము మాను రమామనోహరా !

(బి-బి.)—

అసమగ్రము. మూఁడవ యాశ్వాసాంతమునఁ గొంచెము ౪, ౫ ఆశ్వాసములు పూర్ణముగను, ౬ వ యాశ్వాసమునఁ గొంత వఱకును గలదు. వ్రాఁత యొకతరఁబడిగానున్నది. తప్పులున్నవి. శైథిల్యగ్రంథపాతములు లేవు.

పెక్కు వైద్యశాస్త్రగ్రంథములనుండి వస్తుశుద్ధి, తల్లక్షణములు, తద్గుణములు, ఔషధములు, వానిసేవచే నశించు రోగములు, మున్నగు విషయములు గైకొని తాడేపల్లి పానకాల్రాయకవి యిట్లు ప్రబంధ రూపమున రచియించెను గ్రంథ పరిమాణమెంతో తెలియరాదు. శ్రీవత్సగోత్రుఁడును, ఆపస్తంబసూత్రుఁడును నగు వేంకనామాత్యుఁడీ గ్రంథకర్త తండ్రి.

---

## R. No. 554.

Paper. 10¾ × 9¾ inches. Foll. 40. Lines, 20 on a page. Mode of writing, good and fairly correct. In good condition.

Transcribed in the year 1918–19 from the MS. of M.R.Ry. Mānēpalli Rāmacandra Śāstri Gāru of Vizagapatam.

హైమవతీపరిణయము.

### HAIMAVATĪPARIṆAYAMU.

A Prabandha in three Āśvāsas describing the events that led to the birth of Pārvatī as the daughter of Himavān (the Himālayas) and to her marriage with God Śiva. The author is Cāganṭi Vēṇkaṭakṛṣṇakavi, son of Rāmayāmātya of Ātrēyagōtra and disciple of Karra Ayappa Śāstri. He refers to Śiṣṭu Kṛṣṇamūrti Śāstri in terms of praise.

Complete.

**Beginning :**

శా. శ్రీలావణ్యతనూవిలాసమహిమశ్రీతుల్యగోపాలు స
ల్లోలాక్షీసతతోపగూహనభవోల్లోలస్తనాకీర్ణగం
ధాలంకారవివర్ధమానవనమాలాలంకృతోరస్కు గో
పాలస్వామిని గొల్తుఁ జిత్తమున మద్భావార్థసంసిద్ధికిన్.

* * * *

మ. రసికాధీశుని నాటకాదివరశాస్త్రప్రోక్తనానార్థభా
వసదాశిష్యనికాయబోధకుని సర్వ . . సంస్తుత్యునా

యసమానోజ్జ్వలశేముషీఘనుని విద్యాపూర్ణుఁ గత్తాన్వయా
బ్ధిసరోజారి నయప్పశాస్త్రి గురునిఁ బ్రీతిన్నుతిం జేసెదన్.

ఉ. అష్టకకుబ్మహీశ్వరసభాంతరసన్నుతకీర్తిశాలి భూ
శిష్టజనోపకారకరసేవితపాదసరోజునిత్య స
ద్గోష్ఠిని వైభవేంద్రుఁ గవికోటిశిఖామణిఁ గృష్ణమూర్తినిన్
ఇష్టుని శిష్టువంశజలధీశకళానిధి నాశ్రయించెదన్.

* * * *

సీ. గీ. . . . . . . .
లీలనోదూరివేణుగోపాలమూర్తి
స్వప్నమునఁ బల్కెనను గాంచి సదయుఁడగుచు.

సీ. నీప్రపితామహుండీ ప్రపంచద్విజ
వంశరత్నము భగవత్ప్రధాని
నీపితామహుఁ డిద్ధనిరతాన్నదాన వ
ర్ణితకీర్తి వేంకటకృష్ణమంత్రి
నీతండ్రి సర్వవిద్యా తంత్రమంత్ర ర
హాస్యేంద్రమంత్రి రామయ్యమంత్రి
నీపెదతండ్రి కాశీపురసేత్వంత
రద్విజనుతుఁడు తిరపతిమంత్రి
నీ పినతండ్రెన్న భూపసభాంతరా
వార్యశౌర్యుఁడు భగవత్ప్రధాని
నీపిన పినతండ్రి భూచక్రబంధు చిం
తామణి యనఁదగు కామమంత్రి
నీపిన్న పినతండ్రి మాచరణాబ్జభ
క్త్యున్నత తేజుఁ డుమ్మన్నమంత్రి
నీమాతవనితాశిరోమణి సుచరిత్ర
వరగుణనికురుంబ నరసమాంబ
నీయగ్రజన్ముండు నిరుపమకవితాప్ర
సిద్ధుఁడు లక్ష్మీనృసింహామంత్రి
నీవుమత్పాదభక్తి సందీపితార్య
జనదయోదిత కవితా ప్రశస్తమతివి

అవనినాత్రేయగోత్రసంభవప్రసిద్ధ
కీర్తి చాగంటి వేంకటకృష్ణమంత్రి.

**End:**

క. హైమవతీపరిణయకథ
నేమనుజులు వినినఁగని లిఖించి చదివినఁ
హైమవతీ దయఁబడయుదు
రామనుజులు సంపదాయురారోగ్యములుఁ.

* * * *

మాలినీ. సరసిజదళ నేత్రా శైలజాధీశమిత్రా
సరసనుత చరిత్రా సత్యభామాకళత్రా !
సురయదు జనజీవా శుంభదాత్మస్వభావా !
విరచిత గుణభావా వేణుగోపాలదేవా !

**Colophon:**

గద్య. ఇతి శ్రీమత్పూర్వ నారాయణ కరుణాకటాక్ష వీక్షణామృత ధారాసముద్భూతకవితాప్రసిద్ధాత్రేయగోత్రపవిత్ర వేంకటకృష్ణ పౌత్ర రామయామాత్యపుత్ర సకల సుకవినికర విధేయ చాగంటి వేంకట కృ నామధేయ ప్రణీతంబైన హైమవతీ పరిణయంబను మహాప్రబంధంబు నందుఁ దృతీయాశ్వాసము.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పు లంతగా లేవు. శైథిల్య గ్రంథపాతములు లేవు.

మూఁడాశ్వాసముల యీ శృంగారప్రబంధమునఁ బార్వతి హిమ వంతునకు హైమవతియను కన్యకగాఁ బుట్టుట, ఆమెకును శివునకును నైన వివాహాదికముమున్నగు కథ యిందు వర్ణింపఁబడినది. కర్త చాగంటి వేంకటకృష్ణకవి. రామయామాత్యుని పుత్త్రుఁడు, ఆత్రేయ గోత్ర జుఁడు. కర్త ఆయప్పశాస్త్రి శిష్యుఁడు. శిష్టు కృష్ణమూర్తికవి యిం దుఁ బ్రశంసింపఁబడినాఁడు.

---

R. No. 555.

Paper. 11 × 10 inches. Foll. 176. Lines, 20 on a page. Mode of writing, fair but incorrect. In good condition.

Transcribed in the year 1918–19 from a MS. of M.R.Ry. Koṭikalapūḍi China Kōdaṇḍarāmayya Gāru of Bobbili, Vizagapatam district.

నృసింహపురాణము.

NṚSIṀHAPURĀṆAMU.

This is a Telugu rendering of the Sanskrit Nṛsiṁhapurāṇa by Koṭikalapūḍi Kōdanda Rāmakavi. For further particulars about the author see R. Nos. 532 and 533 *ante*.

Complete in six Āśvāsas.

**Beginning:**

శా. శ్రీరమ్యంబగు బొబ్బిలీపురమునన్ శ్వేతాచలాధీశరం
గారాయాగ్రణిగొల్వఁ బార్శ్వములవేడ్కన్ రుక్మిణీసత్యభా
మారత్నంబులు నిల్వ భక్తజనులం బాలించుగోపాలకా
ధీరగ్రామణి పాదపద్మములు సంప్రీతిన్ భజింతున్ మదిన్.

**End:**

క. నరసింహపురాణకథల్
పరమప్రియమునను విన్న భవ్యులకిహమున్
బరముందొరకుఁ ద్రివేణ్యాం
తరమున మాఘమునమును తపసిఫలమగున్.

*　*　*　*

పంచచామరము.—

సరోజనేత్ర మంజకేశ చక్రపాణి మాధవా
సురారిమర్దనా ముకుంద శూరవర్యసన్నుతా !
హరీ జనార్దనా మురారి యాదవాన్వయాగ్రణీ
నరప్రియా సనాతనా ఘనాఘనాంగ శాశ్వతా !

**Colophon.**

ఇది శ్రీమదుభయవిధకవిత్వరచనా నల్పచాతుర్య కొటికలపూఁడి వంశకమలవనసూర్య హరితసగోత్ర ధుర్య జ్యోతిషాగమాచార్య సకల వేదాంత మతసిద్ధాంతా నివార్య వేంకటకృష్ణమ సోమయాజికుమార వర్య కోదండ రామయార్య కార్యంబైన నృసింహ పురాణంబునందు సర్వంబును షష్ఠాశ్వాసము.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత కొంచెము కతరబడిగానున్నది. తప్పులు గలవు. శైథిల్య గ్రంథపాతములు లేవు.

ఇది సంస్కృత నృసింహ పురాణమునకుఁ గొటికలపూఁడి కోదండరామకవి తెలుఁగుసేఁత. ఇతనినిగుఱించి ఆర్. నెం 532, 533 రులు గాంచునది.

## R. No. 556.

Paper. 11 × 9⅛ inches. Foll. 112. Lines, 20 in a page. Mode of writing, fair and fairly correct. In good condition.

Transcribed in the year 1918–19 from a MS. of M.R.Ry. Niḍamarti Basavarāju Gāru of Chicacole, Ganjam district.

మఱిబసవపురాణము.

MARIBASAVAPURĀṆAMU.

A Dvipada poem in five Aśvāsas giving an account of the life of Maṛi Basava (probably later Basava) of Kalyāṇapuram and other Vīraśaiva devotees by Baccu Siddhakavi, disciple of Caraliṅgamardala Parvatārya. The author seems to have been initiated into the Śaiva religion by Śirupuri Vīrasaṅgaya. The work was dedicated to Saṅgaya, and mentions Pālakuriki Sōmanātha. For further particulars see the extracts below.

Complete.

**Beginning:**

శ్రీగురుమూర్తి నంచిత దయాస్ఫూర్తి
యాగమార్గంబుల గలరు సత్కీర్తి
యాదికి నాదియై యఖిలలోకముల
కాదరంబునఁ గర్తయైన సన్మూర్తి

*　　　*　　　*　　　*

కొలఁదిమీఱిన పాలకురికి సోమేశు
సలలిత శ్రీపాదజలజముల్ దలఁచి

*　　　*　　　*　　　*

అనువొంద మఱి బసవయ్య సచ్చరిత
తెనుఁగున ద్విపదగాఁ దెల్లమిపఱతు

*　　　*　　　*　　　*

తలకొని భక్తుల తలఁగావ శివుఁడు
ఇలఁ గురుమూర్తియై విలసిల్లినట్టి
విరివిగా సిరిపురి వీరసింగయ్య
కరగర్భజనిత శ్రీకరభక్తియుతుఁడు

*　　　*　　　*　　　*

బచ్చు సిద్ధుండనఁ బ్రబలినవాఁడు (ఈ)

నా నేర్పు కొలఁదివిన్నప మాచరింతుఁ
బూనిక వినరయా బుధవరులార !

* * * *

ఘనశీలుఁడితఁడని గారవింపంగఁ
జనుశీలవంతుల సంగాఖ్యుఁడయ్యె
అలరంగనట్టి సంగాఖ్యునిఁజూచి
తలకొని సంప్రీతి దనరఁగ నేను
నిట్టిశీలవ్రతి యీ మహాకృతికి
నెట్టనశ్రోతగా నెఱినొప్పఁగనుచు

* * * *

వరకీర్తి మఱిబసవ పురాణమునకు
నరయుంగ శ్రోతగా నర్హుండవీవ
యని బహువిధముల నలరంగ నేను
వినయోక్తి శ్రోతగావించి సద్భక్తి
తప్పకుండఁగ నీకథా సూత్రమంత
నొప్పుగా వినిపింప నొగిఁబూని మహిని
ధరచరలింగమర్తుల పర్వతార్య
చరకృపాకార్య సుస్థిరవరంబునను
రహిమహి (ఱి) బసవపురాణంబుఁ జేతు

* * * *

వినయంబు దనరంగ వినుము సంగాఖ్య

**End :**

మఱి బసవేశ శ్రీ మన్మహామూర్తి
సరవితో నీయొక్క చారిత్రయన్న
హరిముఖ్య సురులకు నలవియెమఱియు
శిరములు వేలల శేషునకైనఁ
దరమె వర్ణింపఁగా ధరలోన ననుచు
నారూఢ చిక్కవీరాచార్య ఘనుఁడు
శ్రీరమ్యమతితోడఁ జెప్పినయట్లు
నాటకాలంకారచారుశబ్దార్థ
. . . . . సమ్మతిని

ఇలఁ బాలకురికి సోమేశుండు మున్ను
దొలఁగక ప్రాస ఘటిల్లు ద్విపదందు
లలి రచించుట యది లక్ష్యంబుగాను
అలఘు రేఫల కారములు శివకావ్య
ములయందుఁ జెల్లుఁ దప్పులుగావుగాన
ఆ పాలుకురికి సోముననుమతి నేను
దీపిత ప్రాసయతిచ్ఛందసరణి
నామహాగురుదేవు నానతియట్ల
శ్రీమెఱయంగ రచించితి నిపుడు
శోభిల్లు తత్కథాసూత్ర మంతయును

**Colophon:**

* * * *

ఇది సర్వవీర మాహేశ్వరనికర
సదమల ఘనపాద జలజసౌరభ్య
సానుభవోత్తమ షట్పదీకరణ
లీనాత్మనిత్య శివానందయుతుఁడు
ప్రకటితగురు కరోద్భవ బచ్చుసిద్ధ
సుకవిప్రణీతమై శోభితంబగుచు
చరలింగమర్దల సత్పర్వతార్య
వరకృపోన్నతికవిత్వ ప్రౌఢి చేర్చి
వరకీర్తి మడిబసవ పురాణమునను
హరభక్తకథ పంచమాశ్వాసము సమాప్తము.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత యొకతరబడిగానున్నది. తప్పులు నంతగా లేవు. శైథిల్యగ్రంథపాతములు లేవు.

ఈ యైదాశ్వాసముల ద్విపదగ్రంథమునఁ గల్యాణ పురనివాసి యోగి మడి బసవనియొక్కయు, నింకను బెక్కు శైవులయొక్కయుఁ జారిత్రము వర్ణింపఁబడినది. గ్రంథకర్త బచ్చు సిద్ధుఁడు. చరలింగ మర్దల పర్వతార్యుని శిష్యుఁడు. సిరిపురి వీరసింగయ్య యితనికి శైవ దీక్షాగురుఁడు కానోపును. ఇది సంగయ్యయను నాతనికిఁ గృతి యీయఁబడినది. విశేషములకుదాహృతభాగముఁ గాంచునది.

## R. No. 557.

Paper. $10\frac{7}{8} \times 9\frac{3}{4}$ inches. Foll. 42. Lines, 20 on a page. Mode of writing, fair and incorrect. In good condition, with slight omissions here and there.

Transcribed in the year 1918–19 from a MS. of M.R.Ry. Vajjala, Cina Sītārāmasvāmi Śāstrulu Gāru of Vizianagram, Vizagapatam district.

గంగావివాహము.

### GAṄGĀVIVĀHAMU.

A literary composition set to music and dealing with the birth of Gaṅgā (the Ganges) as the daughter of Cakramma and Śaṁbhudēvaya, a fisherman of Ellore, and with her marriage with God Śiva and the subsequent disputes between Gaṅgā and Gaurī. The name of the author is not given.

Probably almost complete.

**Beginning:**

తొలుత శుభమస్తనుచు ధూర్జటినందనా
దైవగణనాథ నినుఁదలఁచి పాడుదును
బ్రహ్మాపట్టపురాణి . . . .
. . . .
శ్రీరామ ! రఘురామ ! శ్రీమహాగుణధామ !

* * * *

శ్రీగంగపరిణయము చెలువుగా వినుపింతు
వినరయ్య సభవారు వేడుకలుమీఱ.

* * * *

**End:**

చిఱునవ్వు మోముతో శ్రీమహాదేవుండు
నంతఃపురంబులో కరిగెనవ్వేళ
. . టను జూచి యా దేవులిద్దఱు
వచ్చి పదములపైని వ్రాలి మ్రొక్కిరిగ
పాదములపైఁబడ్డ భామలను లేవనెత్తి
వర్ధిల్లుఁడనుచు దీవనలిచ్చిరపుడు

వాదభేదములేక యొకతీరునుండుడీ

. . . .

(వి-వి.)—

సమగ్రమే యగును. వ్రాఁత యొకతరఁబడిగానున్నది ; తప్పులు నున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములు గలవు.

ఇందు గంగ యీశ్వరశాపమున నెలూరుపట్టణవాసియగు జాలరి శంభుదేవయ్య చక్రస్త్వులకుఁ బుట్టుటయు, నామెను మఱల నీశ్వరుఁడే వివాహమాడుటయు, గంగాగౌరుల సంవాదము మున్నగు కథలు వర్ణింపఁబడినవి. ఇది పదరూపమున వ్రాయఁబడినది. కర్త యెవ్వరో తెలియదు.

---

## R. No. 558.

Paper. $10\frac{3}{4} \times 9\frac{1}{4}$ inches. Foll. 46. Lines, 20 on a page. Mode of writing, fair and fairly correct. In good condition.

Transcribed in the year 1918-19 from a MS. of M.R.Ry. Bhadram Vēṅkaṭappalācāryulu Gāru of Srīkūrmam, Ganjām district.

జాంబవతీపరిణయము.

JĀMBAVATĪPARIṆAYAMU.

A Prabandha in five Āśvāsas narrating the story of the marriage of Jāmbavatī with Śrī Kṛṣṇa and of the Syamantaka gem: by Pulakhaṇḍa Vēṅkaṭakṛṣṇamakavi, son of Kṛṣṇama of Paurukutsagōtra.

Complete.

**Beginning:**

శా. శ్రీమన్మౌక్తికరంగవల్లికలచేఁ జెన్నొందుకల్యాణవే
దీమధ్యంబున హారకౌస్తుభమణిం దేదీప్యమైతోఁచుప
ద్మాముగ్ధంగని చొక్కి పేరెదఁదదాద్యంబామహాదేవినెం
తేమోదంబునఁబూను శౌరికరుణాదృష్టిన్ మముంబ్రోచుతన్.

* * * *

క. మునుపౌరుకుత్సగోత్రుం
డనఁబరఁగిన భూసురాన్వయగ్రామణిభూ
వినుతుఁడు వేంకటభట్టన
ఘనుఁడొకఁడుదయించెనవనికమలాసనుఁడై

సీ. ఆవేంకటార్యున కతిగుణాన్వితయైన
సింగాంబికకు జనించెను విశాల
భవ్యచరిత్రుఁ డప్పయనామధేయుండు
సతనికి ననుకూలవతియనంగఁ
బరగెడి పాపమాంబకుఁ గల్గె మువ్వురు
తనయులు కృష్ణమా (మ్మ) యనఁగ వేంక
టార్యుఁడనంగను హనుమదాహ్వయుఁడన
నందులోనగ్రజుం డైనయట్టి

గీ. కృష్ణమాభిఖ్యునకు సముత్కృష్టశీల
బుచ్చమాంబావధూటికద్భుతచరిత్రు
లప్పనయ శంగరాయప్పయనఁగ మఱియుఁ
బ్రబలచరితుండు వేంకటరాముఁ డనఁగ.

ఉ. వారికి సోదరుండనఁగ వర్ణనకెక్కి జగంబునందుఁ బెం
పారయసాధుబాంధవ బుధావళిమిత్రుఁడ సచ్చరిత్రుఁడన్
సాగసపత్రనేత్రపదసారస మోహనమాధురీసుధా
సారమిళిందమూర్తియనఁ జాలిన వేంకటకృష్ణమాఖ్యుఁడన్.

**End :**

క. అనికృష్ణుని చారిత్రము
ఘనుఁడగుసూతుండు చెప్పఁగావిని మోదం
బునఁబొదలి శౌనకాదులు
గొనియాడిరి తద్విశేషగుణపద్ధతులన్.

* * * *

పంచచామరము.

ఘనాఘనప్రకార దేహకాంతిసుందరా మహా
ఘనాశనప్రకాశనామ కామితార్థకల్పితా
దినాధిరాట్సుధాకరప్రదీప్తనేత్రవైభవా
సనాతనైకపూరుషా నిశాటయుద్ధపౌరుషా !

**Colophon :**

ఇది శ్రీ బాలగోపాల చరణారవింద కరుణాసుధాధునీ జనితకవిత్వ రసవైభవ నిఖిల విద్వజ్జన మిత్ర పౌరుకుత్ససగోత్రపవిత్ర

కృష్ణమాహ్వయపుత్త్రి పులఖండమాన్వయ దుగ్ధాంభోరాశిపూర్ణ శశాంక వేంకటకృష్ణమాభిధాన ప్రణీతంబైన జాంబవతీపరిణయంబను శృంగార ప్రబంధంబునందు సర్వంబును బంచమాశ్వాసము.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత యొకతీరుగానున్నది. తప్పులంతగా లేవు. శైథిల్యగ్రంథపాతములు లేవు.

ఇందు శ్రీ కృష్ణునకును జాంబవతికి నైన వివాహము వర్ణింపఁబడినది. కర్త పులఖండ వేంకటకృష్ణమకవి. కృష్ణమయను నాతని పుత్త్రుఁడు. పౌరుకుత్సనగోత్రుఁడు.

---

## R. No. 559.

Paper. $10\frac{7}{8} \times 10$ inches. Foll. 58. Lines, 20 on a page. Mode of writing, not good and not correct, In good condition.

Transcribed in the year 1917–18 from a MS. of M.R.Ry. Tammanna Vīrēśaliṅgam Nāyuḍu Gāru, Bhadrapēṭa (Batusupet), Masulipatam, Kistna district.

లక్షణగ్రంథము.

LAKṢAṆAGRANTHAMU.

A treatise in prosody and poetics. It is dedicated to God Śrī-kāṇṭha as worshipped in the shrine at Garaḷapuri. The names of the work and of the author are not known.

Complete.

**Beginning:**

క. శ్రీరజితశైలమందిర
సారసభవదివిజముఖ్యసన్నుత విశ్వా
ధారనిరామయ భవశుభ
కారణవేదప్రకాశ గరళపురీశా !

గీ. అవధరింపుము దేవ నిజాంకితముగ
లక్షణగ్రంథ మొనరింతు లలితలక్ష
ణప్రతిపాదితలక్ష్యములతోడ నవ్యకావ్య (?)
రచనమిగవందబుధులు వర్ణనలు సేయ.

క. యతులును గణములు ప్రాసము
లతులంబుగ సంధివిధము లక్షణఫలముల్

వితతాంధ్రమహిమ లెల్లన్
జతురత వివరింతు సుకవిజాలము మెచ్చన్.

క. కొందఱు యతు లైదందురు
కొందఱు పదియందు రవియుఁ గొనకొనఁగ మదిన్
బొందుగఁ బంచాదశవళు
లందముగ ఘటింతు సుకవు లౌనని పొగడన్.

**End :**

(?) సీ. యతిగణప్రాసంబు లతులితాంధ్రస్ఫూర్తి
వర్ణఫలంబులు వరుసఁ దత్త
దుచితగ్రహంబులు ప్రచురమౌసంధులు
తెలియ సంస్కృతమును దెనుఁగుఁ జేయు
విధములు గణకూట భేదంబులును భావ
దోషాళంబును దశదోషములును
కలితప్రబంధముల్ ఘటియించు శుభకాల
మును మాతృకార్చనంబును విచిత్ర
కవనలు ప్రత్యయములనలంకారగతుల
చందములు తత్ప్రభవ వృత్తజాలములును
జాతులుద్ధరమాలికా జాతివృత్త
లక్షణము లేర్పరించితి దక్షవైరి.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిది కాదు. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములు లేవు.

ఇదియొక లక్షణగ్రంథము. ఇందలి విషయవివరణము పై సీసపద్యమువలనఁ దెలియనగును. ఇది గరళపురీశ్వరున కంకితమొసఁగఁబడినది. "ఈ గరళపురి" యెచ్చటనున్నదో తెలియరాదు.

---

R. No. **1977** (of the Sanskrit part).

**Paper. 15¼ × 1½ inches. Foll. 57. Lines, 6 on a page. Mode of writing, fair and correct. In good condition.**

**Presented in the year 1916-17 by Naṇḍūri Śēṣācārlu of Kanumōlu, Gōdāvari district.**

(*b*) యతిరాజదండకము.

YATIRĀJADAṆḌAKAMU.

Foll. 55*a*—57*a*. Fol. 57*b* is left blank.

A poem composed in the Daṇḍaka metre in praise of Rāmānuja, the founder of the Śrī Vaiṣṇava religion.

Incomplete.

**Beginning:**

శ్రీమన్మహాభూతసత్పట్టణాధీశ ! యోగీశ్వరా ! సిద్ధధర్మప్రభావప్రకారప్రకాశప్రభూతప్రసిద్ధప్రవీణప్రధానస్వకీయస్వభావస్వరూపా ! మహాశారదాశారదాంభోరుహాంభోజదంభోళిశంభూజ్జ్వలతాకారయ పాటీరకర్పూరఖర్జూరధారాధరక్షీరనీరాకరాసారకాశాళిడిండిరకుందౌఘ మందారమందాకినీహారనీహారగోత్రామరాహారతారాదిసద్వర్ణ సంపత్తిరసాకారధౌరంధరీధుర్యపర్యాయితౌదార్యగాంభీర్యశౌర్యాతులస్థైర్యచాతుర్యమాధుర్యవీర్యామితైశ్వర్య.

**End:**

మాయప్ప మీమంజులాజ్ఞంబనే దివ్యకైంకర్యమందుండి నేదండిగాఁ జేతునన్నంత నే చాల సంతోషముం జెంది నేవారినన్మూర్తి ముద్దాడి మత్స్వామి వీరేయటంచుం దలంచి విభూతిద్వయంబిచ్చి బల్ పట్టముం గట్టితిర్.

(వి-వి.)—

అసమగ్రము ప్రాంత మొకరీతిగానున్నది. తప్పులంతగా లేవు.

ఇది రామానుజస్తుత్యాత్మకమైన దండకము. కర్త ఎవ్వరో తెలియదు.

---

R. No. **2078** (of the Sanskrit part).

Paper. 6⅞ × 4⅜ inches. Foll. 10. Lines, 12 on a page. Mode of writing, not good. In good condition.

Presented in 1916–17 by M.R.Ry. N. Kuppusāmi Ayya Gāru, B.A., Pleader, Tirupati.

(*d*) మంత్రవిషయాలు.

MANTRAVIṢAYĀLU.

Foll. 7*a*—10*a*. Fol. 10*b* is left blank.

Contains certain Mantras in Telugu, Sanskrit and Kanarese languages and gives the purposes for which these Mantras may be used and the manner of using them.

**Beginning.**

విడిచిపొయ్యేది ఓంనమశ్శివాయ సైతనీప . . నవదావచారచతు మహాశిదరు పూలుగర్భకట్టినక్షత్రం చారుచతు రవా. అబన్న లంకాపురి హనుమంత అంజనీహనుమంత అంజనీపుత్ర శ్రీవీరహనుమంత బందు బందు ఆవేశయఆవేశయ హ్రీంఫట్స్వాహా యీ మంత్రాన విభూతి మంత్రించివేస్తే గ్రహం ఆవేశానకువచ్చి మాట్లాడును.

**End:**

నివారణ అంగన్యాసః అని యీమంత్రాన వుదకం యిరువైవగసారి మంత్రించి యిచ్చేది. సర్వశూన్యాలు మానును. ఇదే మంత్రవిభూతితో మంత్రించివేస్తే గ్రహం విడుచును.

(వి-వి.)—

వ్రాంత బాగుగా లేదు. తప్పులున్నవి. శైథిల్యగ్రంథపాతములు లేవు.

ఇందు సంస్కృతాంధ్రకర్ణాటకాదిభాషల గ్రహోచ్చాటనాదిక మంత్రములు కొన్ని గలవు.

— —

R. No. 2454 (of the Sanskrit part).

Paper. $10\frac{7}{8} \times 9$ inches. Foll. 116. Lines, 20 on a page. Mode of writing, good. In good condition.

Transcribed in 1917–18 from a MS. of M.R.Ry. Jayanti Jōganna Gāru of Hamsavaram, Tuni division, Gōdavāri district.

(*d*) చరపాతలకుటీక.

CARAPĀTALAKUṬĪKA.

Foll. 31*b*—37*a*.

Notes connected with the calculation of the movements of planets, etc, as based on the Tithicakra of Narasimha and useful for the preparation of calendars

**Beginning:**

నృసింహగణితతిథిచక్రద్యుగణము పెట్టుకొని ౩ ట గుణించి ౭౮౮ ట పాలుగొన్నలబ్ధము నక్షత్రములు. ఆ శేషము నఱువదింట గుణించి ౭౮౮ ట పాలుగొన్నలబ్ధము గడియలు.

ఈ నృసింహగణితతిథిచక్రమందు తిథివారనక్షత్రయోగకరణవర్జ్యములున్ను పూర్జ్యదినప్రమాణమున్ను సూర్యుని రాశినక్షత్రపాదాయనప్రవేశమును షడశీతిముఖములునగస్త్యోదయాగస్త్యాస్తమయములును వ్యాపనిర్గమములును రాహుకేతుప్రవేశములును యీ నృసింహగణితమందే తెచ్చుకొనునది.

(ఐ-ఐ.)—

ఇది పంచాంగగణితమున నొకభాగము. నృసింహగణితము ననుసరించి వ్రాయఁబడినది.

(*f*) ప్రతిభాగపదకాలు.

PRATIBHĀGAPADAKĀLU.

Foll. 59*a*—64*b*.

Same work as the one described under R. No. 1042 (b) of the Sanskrit part appearing on page 827 of Part 3 of Volume II of the Triennial Catalogue of MSS.

(*g*) ప్రతిభాగగ్రహస్ఫుటపదకాలు.

PRATIBHĀGAGRAHASPHUṬAPADAKĀLU.

Foll. 64*b*—80*a*.

Same work as the one described under R. No. 1042 (c) of the part appearing on page 827, of Part 3 of Volume II of the Triennial Catalogue of MSS.

---

R. No. **2456** (of the Sanskrit part).

Paper. $10\frac{7}{8} \times 9\frac{1}{2}$ inches. Foll. 20. Lines, 20 on a page. Mode of writing, fair. In good condition.

Transcribed in the year 1917–18 from a MS. obtained through the Sub-Magistrate of Kovvūru, Kistna district.

(*c*) కణ్వచరిత్రము (యక్షగానము).

KAṆVACARITRAMU (YAKṢAGĀNAMU).

A literary composition in the Yakṣagāna form describing the incidents that led to the pronouncement of curses on Indra and other deities by Kaṇva. Songs in Sanskrit, Tamil, etc., are also included in this work.

Apparently complete.

**Beginning:**

ద్విపద

వైకుంఠపురమధ్య విబుధసభలోను
మకుటతటమాణిక్యమణులెల్ల మెఱయ
మందారసురమహీమాలికలుబూని
బృందారకస్త్రీలుపాగఁ నాకవంక.

**End:**

ఇ. మహాభాగ్యమాయనయాస్వామి
క. నేను ఆశ్రమానికి పోయివచ్చెనోయి
ఇ. శరణు శరణమయ్యా ఆలాగే మే చేయిరయ్యాస్వామి.

(వి-వి.)—

ఇందు కణ్వమహర్షి యింద్రాదులకు శాపమొసంగుగాథ వర్ణింపఁబడినది. కొన్ని ద్రావిడసంస్కృతగీతములును గలవు.

---

R. No. **2583** (of the Sanskrit part.

**Palm-leaf.** 14½ × 1¼ inches. Foll. 130. Lines, 5 on a page. Mode of writing, not good and not quite correct. In good condition.

Purchased in the year 1917–18 from M.R Ry. Sundaram Pantulu Gāru of Vizagapatam.

రసప్రదీపిక.

**RASAPRADĪPIKA.**

**Foll. 115*a*—130*b*.**

This is the same work as the one described under R. No. 175 (a) of the Telugu part, *ante*

Contains one to three Āśvāsas all incomplete

(వి-వి.)—

మూఁడాశ్వాసములు నసమగ్రములే వ్రాఁత తిన్ననిది కాదు. తప్పులున్నవి. శైథిల్యము గ్రంథపాతము లేదు.

ఇది ఆర్. నెం 175(a)లోన వర్ణింపఁబడిన గ్రంథమే.

---

R. No. **2602** (of the Sanskrit part.)

**Palm-leaf.** 15 × 1½ inches. Foll. 80. Lines, 7 on a page. Mode of writing, fair but not correct. In good condition.

Presented in the year 1917–18 by M.R.Ry. U. Rāmayya Garu of Cintalapūḍi, Kistna district.

(c) సూర్యచంద్రగ్రహణానయనము.

SŪRYACANDRAGRAHAṆĀNAYANAMU.

Foll. 18*a*—39*b*.

Deals with the calculation of the time of occurrence of lunar and solar eclipses. The name of the author is not given.

**Beginning :**

సకలసంవత్సరమందుల శకవర్షములు ౧౮౭౯ (ఖఖశశివిధుమితశాకే) అని శకాబ్దాలలోపలను ౧౧౦౦ ఉంచఁగానైనను మానసకరణాబ్దాలు ౩౭౯ ద్యుగణందేవలసి "ధ్రువాద్యబ్దగణోరిఙ్ఘా" అనిధ్రువాబ్దాలు ౧౦ ట గుణించిన ప్రతి ౩౭౯౦ . . .

**End :**

మునుపటి ప్రతివ్యాసముచేతను పాలుగొంటే ఘడియవిఘడియలు వచ్చును. ఇది స్పర్శకాలములో కూడితేను శుద్ధస్పర్శమైన స్పర్శకాలమౌను. గ్రంథాంతరే—

చంద్రగ్రహే తు పర్వాంతే నాడికాద్వయసంయుతమ్।
సర్వగ్రాసేతు ఖండం స్యాదేకనాడిసదాయుతమ్॥
రాహుబింబచంద్రబింబయుక్తమధ్యత్రిభిర్హతమ్।
బింబార్ధం ద్విగుణేనాంతం పర్వాంతే నాడికాయుతమ్॥
చంద్రగ్రహే తు పర్వాంతే సార్ధనాడిసదాయుతమ్।
సర్వగ్రాసే తు కర్తవ్యం న తు ఖండం గ్రహాని చ॥
పంచసు సర్వగ్రాసం సప్తసు పాతోనితం నవమర్ధః।
ఏకాదశేషు పాదం నాస్తి గ్రహణం త్రయోదశే భాగే.॥

(వి-వి.)—

ప్రాఁత యొక తరఁబడిగానున్నది తప్పులున్నవి. శైథిల్యగ్రంథపాతములు లేవు.

ఇందు గ్రహణాదులఁ దెలియఁజేయుటకుఁగావలసిన గణితసారము గలదు. కర్త ఎవ్వరో తెలియరాదు.

(*d*) గణితార్ణవము.

GAṆITĀRṆAVAMU.

Foll. 40*a*—57*b*.

Contains the Telugu meaning word for word of the Adhikāras, Pāta and Grahana of the Sanskrit work of this name described under R. No. 2602 (e) in the Sanskrit part.

**Beginning :**

ధ్రువాబ్దాః దశఘ్నాః - దశ ౧౦ చేతను - ఘ్నా - గుణింపబడ్డవి వంటి ధ్రువాబ్దాః కరణాబ్దాలను- స్వమతివాఖ ప్రతిపెట్టుకొని నాగైః ౮ చేతను భజేత్ పాలుగొనేది.

**End :**

తాత్కాలికమందు రాహూను చేసే ప్రకారం
ద్యుగణం త్రిగుణాదాప్తం భాజ్యం బాణశరాద్రిభిః।
రాహుబాస్తు రబ్దనిచయే భాగ్నిచంద్రాప్తనాడియుక్॥
వామాంకెలు.॥

సర్వగ్రహసమాయోజ్యం రాహుమేకం విశోధయేత్
అర్కప్రవేశో యేతిభ్యాం గతవర్షభవేద్యది॥
రుద్రం చంద్రాదంతాన్యేతాన్యనుక్రమాత్.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత యొక తరఁబడిగానున్నది. తప్పులున్నవి.

ఇది ఆర్. నె 2602(e)రున వర్ణింపఁబడిన గణితార్ణవమందలి గ్రహణ, పాతాధ్యాయములకుఁ దెలుఁగు టీక. కర్త యెవ్వరో.

---

R. No. **2645** (of the Sanskrit part).

**Palm-leaf.** 17 × 1½ inches. Foll. 34. Lines, 8 on a page. Mode of writing, fair but incorrect. In good condition.

Presented in the year 1917–18 by M.R.Ry. Sōmanci Subbarāya Śāstrulu Gāru of Pēkēru, Tanuku taluk, Kistna district.

(*e*) యోగవిషయము.

YŌGAVIṢAYAMU.

Contains songs set to music and dealing with Yōga and Vēdānta topics.

**Beginning:**

ఘనరేచకపూరకము ద్వితీయార్తిగఁజేసి
కణగి సంకల్పవికల్పములను
నాసరఘ్రుతముగఁజేసి నాగమారుతమునాయ
లను చెలఁగజేసి మీకర్పింతును.
జయమంగళము నిత్యశుభమంగళం.

**End:**

భక్తురాల యిటురమ్మనినను చే
పట్టిపిలుచుకొనె నే
రక్తినైన సంసారమువిడిచి వి
రక్తిబొందుమనునే - భక్తి

. . . . . . .

జలజనయనయిదిశాంభవిముద్రకు
జనన స్థలమను నే
కలికిరోయున్నదియనుముద్రకుసం
కలితభూమియనునే॥ భక్తు॥
ఎల్లలోకములనిండి చెలంగెడు
మెరుకేనీవనునే
సలలితవ్యాతృమలాంతరంగమున
సౌఖ్యమొందుమనునే॥ భక్తు॥

(వి-వి.)—

ఇందు. యోగ, వేదాంతవిషయికములగు గీతములు గలవు. రచయిత ఎవ్వరో తెలియదు.

---

R. No. **2850** (of the Sanskrit part).

Palm-leaf. 6½ × 1¼ inches. Foll. 33. Lines, 7 on a page. Mode of writing, good but not quite correct.

Presented in the year 1918–19 by M.R.Ry. T. Rāmānuja Rao of Triplicane, Madras.

(*b*) స్వరచింతామణి.

SVARACINTĀMAṆI.

Apparently a Telugu translation in colloquial language of a Sanskrit work dealing with the principal blood vessels, humours, etc., of the body

and with the nature and characteristics of the breath at various times with a view to the prediction of future events.

**Beginning :**

ఈశ్వరఉవాచ.—

ఈశ్వరుఁడు పార్వతీదేవికి ఉపదేశంచేసిన లక్షణము.

ఓ దేవీ యీ ప్రాణులకు యీదేహమందు డెబ్బయిరెండువేల నాడులుండును. అందులోను విశదంగా కానవచ్చే నాడులు ౧౦. అవి యేవిఅంటెను. ఇడా ౧, పింగళా ౨, సుషుమ్నా ౩, గాంధారి ౪, అసి ౫, అలంబకా ౬, శంకిణీ ౭, కుశా ౮, కూహూకా ౯, వాహాకా ౧౦, యీ పదిన్ని దశనాడులు.

**End :**

చంద్రుని వారంనాడు సూర్యస్వరం నడిస్తేను సూర్యుని దిక్కు యెదురుగా నిలిచి కడిపాదంముందుగా బెట్టి మూఁడు అడుగులునడిస్తేను ఆ దోషపరిహారం అయి సూర్యుని బలం యిచ్చును. ఇతి స్వర ప్రకరణం సమాప్తం.

ఇంక ఇడాపింగళాది నాడీలక్షణములు, నాగాదివాయువులు, పృథివ్యాదితత్త్వములు, సూర్యచంద్రస్వరములు, వానిలక్షణములు. వాని ఫలములు మున్నగునవి చెప్పఁబడినవి. వ్యావహారికవచనము. కర్త ఎవ్వరో తెలియదు.

(c) పంచభూతతత్త్వాలు.

PAÑCABHŪTATATTVĀLU.

A treatise in Telugu colloquial prose explaining the nature of the five elemental principles with a view to the determination of the auspicious times and the foretelling of future events.

**Beginning :**

పృథివీతత్త్వం శుభప్రయోజనాలకు ఉత్తమం. ఆపోతత్త్వం ఉద్యోగకార్యాలకు ఉత్తమం. తేజోతత్త్వం యుద్ధానకు ఉత్తమం. వాయుతత్త్వం వ్యాపారాలకు ఉత్తమం. ఆకాశతత్త్వము యోగాభ్యాసన దేవతాకార్యాలకు ఉత్తమం.

**End:**

కలియుగమందు మానవులు మోక్షసాధకులవుదురు. దరిబొందుదురు. అష్టాంగయోగాలకు ప్రమాణంఅయిన అర్థం సంశయం లేదు.

(వి పి.)—

ఇందుఁబంచభూతతత్త్వముల శుభాశుభలక్షణములననుసరించి ప్రశ్నలకు ఫలములు చెప్పఁబడియున్నవి. వ్యావహారికవచనము. రచయిత ఎవ్వరో

# GENERAL INDEX.

(స.రా.—అడుగున గీత గీయఁబడిన పేళ్లుగల గ్రంథము లీ క్యాటులాగున వర్ణింపఁబడినవి.)

పేజి



పేజి

# TELUGU TRIENNIAL CATALOGUE, VOL. III, PART III.

## ADDENDA.

శా. శ్రీ లక్ష్మీశుభపారిజాతకలికాశ్లిష్టోరువక్షుండు దే
వాళీమౌళిమణిప్రభారుచిరపాదాంభోజుఁ డుద్యద్దయా
శీలన్ ధర్మపురీశ్వరుండు గుణశాలిన్ మాధవాంభోనిధి
ప్రాలేయద్యుతిఁ బెద్దనప్రభు సమగ్రశ్రీయుతుం జేయుతన్.

చ. మనసిజుఁగన్నతల్లి నెఱిమాటల తొయ్యలియత్తగారు చం
ద్రుని సయిదోడు శంకరునితోయజలోచనతోడి జోడు క
న్గొనలసిరుల్ తొలంకువారి కోమలి యెప్పుడు నిల్చుఁగాత శ్రీ
యెనుములపల్లిమాదసచివేశ్వరు పెద్దసమందిరంబునన్.

మ. దినముల్ పర్వతజాతమీఁదియనురక్తిన్ బాయఁగాఁజాలకే
తనగేహంబుననాకృపాలొసఁగి తత్తచ్ఛ్రీలచేతం దన
ర్చినలోకంబులకెల్లఁదల్లియను దండ్రిం దాసయాదేవుఁడిం
పునశ్రీయెమ్మలపల్లి పెదకభునిన్ బ్రోచున్ దయాయుక్తుఁడై

చ. పొలుపుగవేల్పురాణినునుబోకిలి తామరపువ్వు ముద్దుఁగో
డలి చెలువంబుఁజూచి పొగడన్ ముఖపంకజ మొకటిట్లు నా
కలవడదందు మోములు నయంబున నాలుగు దాల్చి మెచ్చునా
నలినజుఁడిచ్చుఁగాతఁ గృతినాథునకర్థిఁజిరాయురున్నతుల్.

ఉ. సారససంభవుండు సరసంబుగనాఁడు రహస్యభాషఁద
ద్ద్వారనిబద్ధకీరము భ్రుశంబుగనందఱ బ్రేమలఁబలుకఁగా
దూరమునందు సంతసము దూర్కొనవొయ్యనబుజ్జగించునా
భారతినిల్చుఁగావుత శుభస్థితి నెప్పుడు మన్ముఖంబునన్.

క. చిట్టెలుక నెక్కియాడెడు
అట్టడికొడుకునకుఁ జిలువలా జన్నిదముల్
గట్టికొని మెఱయు శంకరు
పట్టికి నత్యంతభక్తిఁ బ్రణుతు లొనర్తున్.

వ. తదనంతరంబ.

సీ. వాల్మీకిమునికభివందనం బొనరించి
బాదరాయణునకుఁ బ్రణుతి చేసి
బాణమయూరుల పాదంబులకు మ్రొక్కి
కాళిదాసునకుఁ గేల్దోయి మొగిచి
మామల్లదేవీకుమార భారవిమాఘ
జయదేవులకు నమస్కారమొనఁగి
ఘను నన్నపార్యుఁదిక్కన సోమయాజుల
వర్ణించి వేములవాడ భీము

గీ. నాచనామాత్యుసోము శ్రీనాథుఁ జిమ్మ
పూఁడియమరేశు బమ్మెరపోతరాజు
శంభుదాసు పాల్కురికి భాస్కరులనాది
యైన సుకవుల కెల్ల నెయ్యమున నెరఁగి.

వ. ఇవ్విధంబున నభిమత దేవతా ప్రార్థనంబును పురాతనమహాకవి కీర్తనంబునుం జేసి యొక్క మహాప్రబంధరచనాకుతూహలాయత్తచిత్తుండనై యున్న సమయంబున.

సీ. అక్షయత్ర్యాభారదక్ష దక్షిణభుజా
కార్త్స్యేయకక్షత్రరక్షితంబు
కూటకోటీశాతకుంభకుంభ ప్రభా
మండితాంభోజాప్త మండలంబు
విశ్వవిశ్వంభరాజినశ్వరైశ్వర్య ప్ర
దాశ్వరత్నవ్రాత శాశ్వతంబు
గంధసింధురదాన గంధాంధమత్తపు
ష్పంధయఝుంకార బంధురంబు
సంతతోత్సవతోషితశంభులింగ
సమ్ముఖేందుశిలానందచారుమంట
పస్థలీనృత్యదంగనాపాదరణిత
నూపురంబగు నేకశిలాపురంబు.

సీ. చలివేఁడివెలుఁగులై కలువదమ్ముల నేలు
కనుదోయి నెప్రొద్దుఁ గరుణఁజిలుక
మేలైనతామర మేడనాడెడు కిన్య
కిరవైనయురము కెంపగిది మెఱప

తొలుచూలుబాపన దొరనింపుతోఁగన్న
పాకిరాలిపురుటాలి ప్రాపుచెలఁగ
పదియాఱువన్నెల పసిమిమీఱెడువింత
చెఱఁగుదుప్పటిమేనఁ జౌకళింప.

గీ. పోఁజదువు గుంపుప్రోఁతలు పరిఢవిల్ల
మేటిజగములనాఁడు మిన్నేటిపావ
పుట్టినిల్లైనయడుగులఁ బోల్చెనెపుడు
సంతసంబున వెలయు పాంచాలివిభుఁడు.

ఆ. ఆ జగన్నాథపరమదయాప్తి మత్స్య
మకుమాండలుండు శ్రీమత్ప్రతాప
ఖండపరశుండు వైభవాఖండలుండు
భోగివంశాబ్ధిచంద్రుండు భూరిబలుఁడు.

సీ. అనువత్సరంబు బ్రాహ్మణులకు గోసహ
స్రములిచ్చు నృగనరేశ్వరునిరీతి
జలధుల కెనఁగఁబాకాల చెర్వాదిగాఁ
జెరువులునిలుపుసగరునికరణి
దివ్యప్రతాపుఁడై దిగ్విజయంబుగా
వించుమాంధాతృ భూవిభుని లీల
దేవభూదేవతాద్రిశ్రేణి కగ్రహా
రములిచ్చు భార్గవరాము పగిది.

గీ. ఇందుశేఖరపాదారవిందయుగళ
భావనాపరుఁడంగనాపంచబాణుఁ
డతులధైర్యాభిభూతవామాచలుండు
మానభూపాలుచిత్తాంబు ఘనఘనుఁడు.

# TELUGU TRIENNIAL CATALOGUE, VOL. III, PART III.

## ADDENDA AND CORRIGENDA.

| పుట | పంక్తి. | తప్పు | ఒప్పు. |
|---|---|---|---|
| 838 | 3 | కావు | కాదు. |
| 846 | 22 | చాతుర్వర్ణోత్పత్తి. | చాతుర్వర్ణ్యోత్పత్తి. |
| 847 | 23 | అది భర్తింప. | అవి భరింప |
| 848 | 3 | దేవతలందటి కార్యంబు. | దేవతలందఱికార్యంబు. |
| ,, | 29 | పె దోటపురాధిపతి. | పెందోటపురాధిపతి. |
| ,, | 32 | — | complete. |
| 894 | 16 | అకీణదయాసంయుత. | అక్షీణదయాసంయుత |
| ,, | 25 | కావు కృప. | కావవే. |
| 906 | 13 | యూద్ధుమశక్యా. | యోద్ధుమశక్యః. |
| 907 | 7 | రామకృష్టా. | రామకృష్ణో. |
| 918 | 3 | తురారాజ. | తుర్గారాజ. |
| 940 | 8 | చిన్న బసవపురాణ. | బసవపురాణ |
| 973 | 3 | వి తేఖకు. | వితేఖకుడు. |
| 981 | 14 | విభుడు. | విధుడు. |
| 999 | 6 | పంతిమట్టుడ 17-వ పంక్తిరాక. | 998 పుట 24-వ పంక్తి క్రిందికి చేర్చుకొనవలెను. |
| 1001 | 9 | శ్రీతేటగుంట | శ్రీతోటగుంట. |
| ,, | 14 | గోత్రాగ్బవు. | గోత్రోద్భవు. |
| 1044 | 25 | Chandramaḷu Īśvara. | Chandramauḷīśvara. |
| 1048 | 12 | పాప్యముక్. | ప్రాప్యముక్. |
| ,, | 13 | గుణపుంజ్మంబైన. | గుణపుంజంబైన. |
| 1049 | 17 | Founded. | found. |
| 1052 | 10 | కోప్పర్తివంశాబి. | కొప్పర్తివంశాబ్ధి. |
| 1054 | 4 | ప్రతిష్టచేని. | ప్రతిష్ఠచేసి. |
| 1066 | 12 | Preēpa Lakṣmanārya. | Prerēpa Lakṣmaṇārya. |
| 1067 | 32 | ప్రారనపై. | ప్రార్థనపై. |
| 1096 | 7 | Virūpāksa. | Pōlayāmātya. |
| 1097 | 27 | విరూపాతుని. | పోలయార్యుని. |
| 1115 | 18 | describe. | describes. |
| 1116 | 26 | పయాగనారసింహ. | ప్రయాగనారసింహ |
| 149 | 17 | ర్మగోచరిత్రము. | ధర్మగోచరిత్రము. |
| 1166 | 4 | Rāmayāmātyuḍu. | Dāmayāmātyuḍu. |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
| --- | --- | --- | --- |
| 1166 | 25 | రామయామాత్యుడు. | దామయామాత్యుడు. |
| 1167 | 22 | ,, | ,, |
| 1231 | 30 | శైథిల. | శైథిల్య. |
| 1254 | 32 | వీరభద్రవ్రతంబైన | వీరభద్రప్రణీతంబైన. |
| 1257 | 11 | వైఖవంబలగ. | వైభవంబలర. |
| 1281 | 9 | సంస్కృతబ్రహ్మాణ్డపురాణ. | బ్రహ్మాణ్డపురాణ |
| 1295 | 23 | పాళిక. | పాలిక. |
| 1302 | 45 | సిద్ధనాథసమాఖ్య జెంది నేనిరతంబు షట్సథలదర్పణం బనంగ. | సిద్ధనాథసమాఖ్య జెందిన నేనిర తంబు షట్స్థలదర్పణం బనఁగ. |
| 1321 | 15 | ృపకాసుభములకు. | నృపకాస్తుభములకు. |
| 1335 | 30 | date of he commentary. | date of the commentary |
| 1352 | 20 | హైమవతీసతీపతిచత్వారింశతి. | హైమవతీసతీపతిచత్వారింశత్ |
| ,, | 21 | Haimavatīsatīpaticatvārimśati. | Haimavatīsatīpaticatvārimśat. |
| 1370 | 29 | Jagannādhakavi. | Jagannāthakavi. |
| 1373 | 7 | R. No. 547. | R. Nos. 547 and 548. |
| 1388 | 28 | చరలింగమర్దల. | Omit "చరలింగ" |

## TABLE OF TRANSLITERATION.

| — | Consonants. | Semi-vowels, sibilants and aspirate. | Vowel. | Diphthong. |
|---|---|---|---|---|
| Gutturals ... ... | k, kh, g, gh, ṅ ... | h, ḥ ... | a, ā ... | e, ē, ai. |
| Palatals ... ... | c, ch, j, jh, ñ ... | y, ś ... | i, ī ... | |
| Linguals .. ... | ṭ, ṭh, ḍ, ḍh, ṇ ... | r, ṛ, ḷ, ṣ ... | | |
| Dentals ... ... | t, th, d, dh, n . | l, ḻ, s ... | | |
| Labials ... | p, ph, b, bh, m .. | v ... | u, ū ... | o, ō, au. |

Numbers of the Telugu works described herein grouped according to the form of their literary composition.

Prabandha. 293, 294, 296(b), 297(b), 299, 300(a), 301, 302(a), 303, 305(b), 306(a), 308(a), 309, 311–313, 316, 318, 320(a), (b), 323, 325—327(a), (b), 328, 330, 334, 336, 338(a), 339(a, b), 340, 341(a, b), 342—344(a), 345—350(a), (c), 351(a) (c), 352 (a, b, c, d, e), 353—356, 358—360(a), 361, 365(a), 369(a, c), 370—373 (a, b), 374, 375, 377 (a, b), 378—391, 393 (a, b), 395, 399(a, b), 400, 405, 407, 409, 411(a, b), 412, 413, 415, 416, 418, 421, 423—425, 428, 430 (a, b, c), 431(b), 432, 435—437, 441(a, b), 443—447 (a, e, f), 449, 450, 455, 456 (a, b, c), 459, 461(a), 462, 463, 465—468(a), 468(b), Sanskrit Part, 469, 471, 472, 473(a), 473(b), Sanskrit Part, 474(a, b), 475, 476(a), 476(b), Sanskrit Part, 477 (a, b), 479, 480 (a, b), 482, 484, 486(c), Sanskrit Part, 486(f), 491, 492, 495, 496, 498, 499, 500(b), 502, 504—509 (b, c), 510, 511(b), 513, 514(a), 515, 516, 519, 520 (a b), 522, 523, 525—531, 533, 534, 537(b), 538, 539, 543—555, 558, 559, 2583(c), Sanskrit Part.

Śataka. 295, 297(c), 298, 300(c), 304, 305(a), 307(a, b, c), 322, 332, 333, 365(b), 367, 369(b), 394, 396(a, b), 397, 398, 401—404, 406, 408, 410, 419, 420, 433, 439, 461(b), 477(c), 480(c), 500(a), 501, 511(a), 514(b, c, d), 532, 537 (a, c), 541(a).

Vacana. 300(b), 306(b), 310, 314, 362, 368, 427, 442, 447(d), 448, 460, 486(a), (b) and (g), 489, 490, 503, 509(d), 512(b), 535, 1977(b) of the Sanskrit Part, 2087(b) and 2850(c) of the Sanskrit Part.

Dvipada. 315, 317, 338(b), 364, 366, 422, 451, 453(b), 454(b), 493, 556.

Yakṣagāna. 417, 426, 438, 440, 457, 458, 464, 497, 2456(c) of the Sanskrit Part.

Vyākhyā. 296(a), 297(a), 303(b), 321, 329, 337(b, c, e), 363, 376, 414, 452, 486 (d), (e), 488(c), 494, 509a), of the Sanskrit Part, 512(a), 521, 524, 536, 542, 2454(d) of the Sanskrit Part.

Gēya. 331, 357, 429, 431(a), 453(a), 454(a), 478, 481, 485, 487, 488(a, b), 518, 540, 557 and 2645(c) of the Sanskrit Part.

Miscellaneous. 302(b), 319, 324, 335, 337 (a and d), 344 (b and c), 350(b), 351(b and d), 360(b), 392, 393(c), 434(a, b and c), 447(b and c), 454(c), 470, 517, 541(b) and 2454(f and g), 2602(c and d), 2850(b) of the Sanskrit Part.